పురాణవైర గ్రంథమాల

# ధూమరేఖ

గ్రంథకర్త
కవిసమ్రాట్
విశ్వనాథ సత్యనారాయణ



పబ్లిషర్సు:
ఉషా పబ్లిషర్సు
విజయవాడ-1.

1

# పురాణ వైర గ్రంథమాలా పీఠిక.

ఇవి పురాణవైరమను శీర్షికతో వ్రాయఁబడుచున్న పదునాలు <u>నవలలు.</u> ఏనవల కానవలే. పదునాలింటను కలిపి ఒకటే కథ యుండదు. ఒకదానితో నొకదానికి సంబంధ ముండదు. కొన్నింటియందు సంబంధమున్నను. అది ప్రధానము కాదు. కాని ఈనవల లన్నింటికి కలిపి పురాణవైర మన్న శీర్షిక యెందులకు? పురాణ వైరమన్న పే రెందులకు?

ఈ విషయము ఈనవలలో నచ్చటచ్చట పరామర్శింపఁ బడును. మనకు వేదశాస్త్రపురాణేతిహాసములు గలవు. వానిలో పురాణ మున్నది. పురాణఁ మనఁగా నేమి? "పురాణం పంచలక్షణం" అని మనవా రన్నారు. పురాణ మైదు లక్షణములు కలది. సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, రాజవంశములు, అనువంశములు, అని ఈ అయిదు లక్షణములు పురాణములయం దుండును. సర్గమనఁగా మొదట జరిగిన సృష్టి లక్షణము, మహాప్రళయము జరిగిన తరువాత తొలిసారి సృష్టియొక్క స్వరూప మెట్లుండునో అది సర్గము. తరువాత కొన్ని కొన్ని ప్రళయములు జరుగును. అప్పుడు మరల సృష్టి జరుగును. దానిపేరు ప్రతిసర్గము. మన పురాణములలో ఒక మనువు చెఱువునకు స్నానమునకు పోయినట్లు, ఒక చేప తన్ను రక్షించుమని అడుగఁగా, దానిని తన చెంబులో తీసికొనివచ్చెను. అది చెంబునకు పెద్దదై నాకు ఈచెంబు చాలుట లే దనఁగా పెద్దపాత్రలో వేసెను. అట్లు పెరిగి పెరిగి సముద్రములోఁ బడవేయఁదగినంత దయ్యెను. ఆచేప ఆ మనువుతో కొలఁది దినములలో సముద్రములు పొంగి భూమి మునిఁగి పోవును. లోకములో నున్న జీవరాశులలో ఒక్కొక్క జీవ

రాశి కొక్కొక్క వ్యక్తిగా తీసికొనివచ్చి నావపైన నెక్కుము. ప్రళయానంతరమున మఱల సృష్టిని నిలుపుదువుగాని. అని చెప్పఁగా నతఁడట్లు చేసెను. ఇది ప్రతిసర్గము. అనఁగా మహత్తు అహంకారము మొదలగు వాటినుండి మఱల సృష్టి జరుగ తీరు. మహదహంకారాదులనుండి జరిగెడు సృష్టి సర్గము. తత్పూర్వసర్గమందున్న జీవరాసులయొక్క ప్రతులు మిగిల్చి వానినుండి మఱల సృష్టి సాగుట ప్రతిసర్గము. బైబిలులో 'నోవాస్ ఆర్క్' అని యున్నది. నోవా అనువాడు ఒక యోడలో జీవరాసులయొక్క ప్రతులను తీసికొనివచ్చినట్లు దాని వలన మఱల సృష్టి ప్రారంభమైనట్లు చెప్పఁబడినది. అది ప్రతిసర్గము. సర్వవిద్యలు సర్వజ్ఞానము ఇతరదేశములకు భారతదేశమునుండియే వెళ్ళినవి. అట్లు వెళ్ళిన జ్ఞానములో బైబిలు నోవా కథ యొకభాగము. మూఁడవది మన్వంతరములు. కృత త్రేతా ద్వాపర కలియుగములు నాల్గు కలిసినచో నొక మహాయుగము. ఇట్టి మహాయుగములు 71 జరిగినచో నొక మన్వంతరము. అట్టి పదునాల్గు మన్వంతరములు జరిగినచో నప్పుడు మహాప్రళయము వచ్చును. ఈ లెక్క ఎక్కడ? పాశ్చాత్యులు మనకు నేర్పెడు చరిత్రలోని లెక్క ఎక్కడ? అల్పమైన యూహగల వారి మార్గమును మన మనుసరించుచున్నాము. నాల్గవది రాజవంశము. సృష్ట్యాదియందుఁ గల సూర్య చంద్రవంశ రాజుల చరిత్రములు మన పురాణములలో నున్నవి. అనువంశములనఁగా వారినుండి కలియుగములో వచ్చిన బహు రాజవంశముల చరిత్రము. ఇవి నేఁడు చరిత్ర యను పేరున కళాశాలలలో పాఠశాలలలో బోధింపఁబడు

విషయము. దానిని పాశ్చాత్య చరిత్రకారులు పలువిధము లుగా మార్చి పాడుచేసి వారి యిష్టమువచ్చినవి బోధించు చున్నారు. మన పెద్దలు వాని ననుసరించుచున్నారు. మనకు చరిత్ర జ్ఞానములేదని పాశ్చాత్య పండితులు నేర్పిరి. వారి చదువు చదివిన మన ఇంగ్లీషు పండితులు దానిని ప్రతిధ్వనము చేయుచుందురు. కొందఱు నిజమే యనుకొనుచుండిరి. ఏ గూటిచిలుక ఆగూటిపలుకే పలుకునని యీ ఇంగ్లీషు చదువే చదివి పాశ్చాత్య సంప్రదాయమునందే తగుల్కొన్న బుద్ధులు వారి మాటలే విశ్వసించుటలో దప్పేమియులేదు.

ఇంతకు చెప్పవచ్చిన దేమనఁగా మన పురాణములు చరిత్రయే. మన ఋషులకు చరిత్ర జ్ఞానములేదనుట, మన పూర్వ నాగరికతను ఎంత తక్కువ పఱచినచో వారి ఏలుబడి అంత గొప్పగా సాగునని పాశ్చాత్యులు పన్నిన సన్నాహము.

ఇంగ్లీషువారు క్రైస్తవులు. బైబిలునందు విశ్వాసము కలవారు. పాశ్చాత్యదేశములన్నియు నింతే. వారి బైబిలులో సృష్టిక్రీస్తుపూర్వము రెండువేలఏండ్లక్రింద జరిగినది. నూట తొంబదియైదుకోట్ల సంవత్సరములపూర్వము మనసృష్టి జరిగిన దని మనవారు చెప్పుచున్నారు. ప్రతి సంవత్సరములో పంచాంగ మును తీసి చూడుడు సృష్ట్యాది గతాబ్దాః సృష్టి మొదలు పెట్టిన తరువాత కడచిన సంవత్సరములు. అవి ఎన్ని? నూట తొంబదియైదుకోట్ల పైచిల్లర. కలిగతాబ్దాః కలిలో గడచిన సంవత్సరములు, అవి ఎన్ని? అయిదు వేల అరువది. ఇట్లు మన జ్యోతిష్కులు సంవత్సరము సంవత్సరము లెక్కపెట్టుకొని వచ్చుచున్నారు. దానిని కాదనుట యెట్లు? పాశ్చాత్యుల

బుద్ధి ప్రమాణ మెట్లు? క్రీస్తుశకము 1960. మఱి పదిలక్షల సంవత్సరములు జరిగిన తరువాత క్రీస్తుశకము నెట్లు లెక్కపెట్టుదురు? వేలమీఁదనున్నప్పుడు లెక్కపెట్టవచ్చును. లక్షలు, కోట్లైనప్పుడెట్లు? క్రీస్తు పూర్వమున లెక్కవేసినను, కోట్లమీఁదనున్న సంఖ్య వారి నెమరునకురాదు.

మన కలియుగము ప్రవేశించినప్పటికే వారికి లెక్కకుదురలేదాయె. వారి సృష్టి అప్పుడు జరిగినట్లాయెను. ఇది ఏమి లెక్క! అయిదువేల అరువది సంవత్సరముల క్రింద కలి ప్రవేశించెనని పంచాంగములు చెప్పుచున్నవి. భారతయుద్ధమప్పుడు జరిగినదని భాగతములో దాఖలా లున్నవి. ఆర్యభట్టు మొదలైన మనపూర్వ ఖగోళ శాస్త్రజ్ఞులు వ్రాసిపెట్టినారు. వాని నన్నింటిని పాశ్చాత్యులు కాదన్నారు. ఇంగ్లీషు నేర్చిన మన పెద్దలు వారినే విశ్వసించుచున్నారు. మనవాండ్రకు పురాణములయందు చెప్పఁబడిన సర్గ ప్రతిసర్గములయందు విశ్వాసములేదు. డార్విను సిద్ధాంతమునందు విశ్వాసము.

మన దేశములో కొందఱు పెద్ద లీవిషయమును చాల పరిశ్రమచేసి పాశ్చాత్యుల సిద్ధాంతములు తప్పులని ఋజువు పరచినారు టి. యస్. నారాయణశాస్త్రిగారు శంకరుని కాలము నిర్ణయించుచు ఈ విషయములను సమగ్రముగా చర్చించి మహాభారతయుద్ధము సుమారు అయిదువేలవండ్ల క్రింద జరిగినట్లు నిరూపించిరి. తరువాత నడింపల్లి జగన్నాధరావుగారు నిరూపించిరి. తరువాత కోట వెంకటాచలముగారు మన సర్వచరిత్రము విస్పష్టముగా విలిఖించినారు.

గ్రీకుల రచనలలో సాండ్రకోటస్ అన్న మాట యున్నది. దానిని పాశ్చాత్యులు మౌర్యచంద్రగుప్తుడని యర్థము చెప్పినారు. దానిలో పురాణములలోని కలిరాజవంశ మంతయు తాఱుమాఱైనది. ఈయన గుప్తచంద్రగుప్తుడు గాని మౌర్యచంద్రగుప్తుడు గాఁడు. మనకు మగధరాజవంశ చరిత్ర యున్నది. కల్హణపండితుఁడు తన రాజతరంగిణిలో కాశ్మీర రాజ చరిత్రము పూర్తిగా వ్రాసినాఁడు. నేపాళరాజవంశ చరిత్రము సమగ్రముగ గలదు. గుప్తచంద్రగుప్తుని వదలి పెట్టి మౌర్యచంద్రగుప్తుఁ డనుటలో సర్వము నాశనమై పోయినది. పాశ్చాత్య చరిత్రకారులు. ఈ సిద్ధాంతము అకాండ తాండవము చేసినారు మనచరిత్రను వారియిష్టము వచ్చినట్లు మలఁచిరి. మన పండితు లదియే చదువుచున్నారు. విద్యార్థులచేత అదియే చదివించుచున్నారు.

ఈ విషయము సమగ్రమముగ నెఱుఁగఁ గోరువారు భారతచరిత్రభాస్కర బిరుదాంకితులైన పండిత కోట వెంకటాచలముగారి గ్రంథములను చదువ వలయును. భారత యుద్ధము అయిదు వేల ఏండ్లక్రితము జరిగినదని తెలిసికొనఁగోరు వారు, నడింపల్లి జగన్నాథరావుగారు వ్రాసిన మహాభారత యుద్ధకాలనిర్ణయమును టి. యస్. నారాయణశాస్త్రిగారు వ్రాసిన శంకరాచార్యకాల నిర్ణయములను చదువవలయును. ఈ రెండు గ్రంథములు ఇంగ్లీషు భాషలో వ్రాయఁబడి యున్నవి. ఆ గ్రంథములు గ్రహములయొక్క చారము, వాని లెక్కలు మొదలైన వానితో నిండియుండును.

ఈ చరిత్రను పలుమంది పాశ్చాత్యులు దిద్ది పాడు చేసిరి. పంక్తులు తప్పుచదివి దుర్వ్యాఖ్యానములుచేసి హిందువుల యొక్కయు, బౌద్ధులయొక్కయు వ్రాతలను పరిహసించి దుర్మార్గములు చేసిరి. ఈ దౌర్మార్గ్యమును ప్రారంభించినవాఁడు సర్ విలియమ్ జోన్సు. తరువాత చాలమంది పాశ్చాత్య చరిత్రకారులు వారి ననుసరించిరి. మన వేదాంతములందం దభిమానముగల మాక్సుముల్లరుకూడ చరిత్ర విషయములో దుష్టముగానే వ్రాసెను. ఇంగ్లీషులో నొక సామెత యున్నది. Blood is thicker than Water.

ఇంతకు సప్తర్షి మండలముయొక్క గమనముమీఁద మహాభారత యుద్ధకాల నిర్ణయము చేయఁబడవలయును. ఇది పెద్ద కథ. పోనిండు. పురాణముల ప్రకారము చూచినచో సప్తర్షి మండల చారమునుబట్టి లెక్కకట్టినచో సాంద్రకోటస్ గుప్తచంద్రగుప్తుఁడని అంగీకరించినచో, నన్నియు సరిపోవును. సరిపోయెడు నీ లెక్కయుండఁగా, సరిపోని లెక్కకట్టి పురాణములు తప్పనుటలోని తెలివి ఏమి? అందులోని న్యాయమేమి? దానియందలి విశ్వాస మిట్టిది.

ఆ లెక్క ప్రకారము కలి ప్రవేశము మొదలు సంయుక్త పృథ్వీరాజుల కథ దనుక పాశ్చాత్యులు తాఱుమాఱు చేసిరి. ఆ కాలము అనఁగా సుమారు మూఁడువేలయేండ్ల కాలము. మహమ్మదు గోరీ వచ్చువఱకు మన చరిత్రలో పాశ్చాత్యులు చేసిన యవక తవకలు కాదని నవలల రూపమున నిరూపించుటకు చేసెడి ప్రయత్న మిది.

అందుచేత దీనికి 'పురాణవైర' మని శీర్షిక యేర్పఱుపఁబడినది.

# పీఠిక.

ఇది పురాణావైర గ్రంథమాలలో మూఁడవ నవల. మన సర్వపురాణములయందు భారతయుద్ధానంతరమున మగధ రాజ్యముయొక్క చారిత్రము క్రమణికగా సంగరముల నిర్ణయములతోఁ జెప్పఁబడినది. అది మనదేశములోని పండితుల వ్రాఁతలవలన నార్యభటుఁడు మొదలైన ఖగోళశాస్త్రవేత్తల వలన యథార్థగుణనను చేసి నిర్ణయింపఁబడినది. జరాసంధుని మనుమఁడైన మార్జారి గిరివ్రజపురమున మగధరాజ్యమేలుచుండెను. అతనివంశము 1006 సంగలు పాలించెను. తరువాత ప్రద్యోతవంశము రాజ్యమునకు వచ్చెను. ఆ వంశము 138 ఏండ్లు పాలించెను. మొదటివంశపు కథ భగవంతుని మీఁది ? లో చెప్పఁబడెను. ఈ ప్రద్యోతవంశపుకథ సమ్మోహనాస్త్రములోఁ జెప్పఁబడెను. ఇది మూఁడవ నవల. ప్రద్యోతవంశమైన తరువాత గిరివ్రజపురము రాజధానిగా మగధరాజ్యమును శిశునాగవంశము క్రీస్తు పూర్వము 1994 మొదలు 1634 వరకు రాజ్యము చేసెను. శిశునాగవంశము 360 ఏండ్లు రాజ్యము చేసెను. ఈ రాజులు పదిమంది. చివరివాఁడు మహానంది. మొదటివాఁడు శిశునాగుఁడు, ఈ శిశునాగవంశములో 5 వ వాఁడు బింబిసారుఁడు, 6 వ వాఁడజాతశత్రువు. పాశ్చాత్యులు వ్రాసిన చరిత్రలో మౌర్యవంశములోనున్న యజాతశత్రువునకు నీ యజాతశత్రువునకు భేదములేనట్లు వ్రాయఁబడినది. ఆ పాశ్చాత్యులు వ్రాసిన చరిత్ర అది యొక తలయు తోఁకయు లేని వ్యవహారము. గౌతమబుద్ధుఁడు శిశునాగవంశములోని యజాతశత్రువు రాజ్యము చేయుచుండఁగా అతని రాజ్యము యొక్క 8 వ ఏట బుద్ధుని 80 వ ఏట నిర్వాణము పొందెను

బౌద్ధగ్రంథములయందు వ్రాయఁబడియున్నది. ఈ బిందు సారుఁడు క్రీ పూ. 1852 మొదలు 1814 వఱకు రాజ్యము చేసెను. అజాతశత్రుఁడు, క్రీ. పూ. 1814 మొదలు 17?7 వఱకు రాజ్యము చేసెను. బౌద్ధ కథలయందు బౌద్ధ సారస్వతమునందు మగధరాజ్యము బౌద్ధుల కాటపట్టుగా చెప్పఁబడుచు వచ్చెను. ఈ నవలలో మొదటి అధ్యాయమునకు, తరువాత నవలకు సంబంధము లేదు. మొదటి అధ్యాయమునందు సిద్ధలు యువతుల యొక్క మనఃప్రవృత్తి వర్ణింపఁబడి యున్నది. మాయా యన్న స్త్రీ బుద్ధుని తల్లి.

ఇట్టి ప్రవృత్తికి హేతువుగా తొలుతటి 2 నవలలలోని యొక భగవద్విరోధభావ లక్షణమును చెప్పటకుఁ గల్పింప బడిన యొకే సన్నివేశమును తీగగాలాగి దానియందు నిరూపింపఁబడినది. ఈ నవలలో బుద్ధునికథ లేదు. కాని సూచన యున్నది. దానికిపునాదిగా ఈ నవలలోని కథ వ్రాయఁబడినది.

ఈ పురాణాంతరమన్న పేరుతో వ్రాయబడుచున్న 16 నవలలలో మొదటి ఈ 3 నవలలు ప్రత్యేకమైన లక్షణములు గలవి. దీనియందు నాధునికసాహిత్య విమర్శకులు చెప్పెడి అభౌమకత (Supernatural) విషయము వర్ణింపఁబడినది. తక్కిన నవలలో ఈ ప్రసక్తిరాదు. వచ్చిన నిట్లు ననుస్యూతముగా రాదు. సృష్టియందే భావమును దైవతముగా దైత్యముగా తొలుతనే విభక్తమై యున్నది. అవి రెండర్ధగోళములు. సృష్టి లక్షణమే యది. దానినే ఈ 3 నవలలయందు విస్తరింపచేయుట యయినది. ధర్మము సమృద్ధముగా నున్నప్పుడధర్మమునుగూర్చి

చెప్పవలయును. అధర్మము ప్రబలముగా నున్నపుడు ధర్మము ప్రత్యేకముగా చెప్పఁబడును. అందుచేత ఈ 3 నవలలయందు భగవద్విరోధ భావమునకు ప్రాధాన్య మీయఁబడినది. భారత యుద్ధము జరిగిన తరువాత 36 ఏండ్లకు కలికాలము ప్రవేశించినది. ఆ తరువాత సుమారు 2000 ఏండ్లవఱకు ధర్మము చెడిపోలేదు. కనుక నానాఁటి చరిత్రనుఁగూర్చి వ్రాయుచున్నపుడు ధర్మమునకు భగవంతునకు నవినాభావ సంబంధ మగుటవలన భగవద్విరోధభావము ఏయే త్రోవల విజృంభించినదో చెప్పుటయే ప్రధానము. అందుకని ఈ 3 నవలలు తద్విషయమును పురస్కరించుకొని వ్రాయఁబడినవి.

నవల వ్రాసెడివాడు గారడివాని వంటివాడు. ఒక టెంకెను చూపించి, మామిడిచెట్టును నిర్మించునట్లు శిశునాగ శబ్దములోనుండి యొక అర్థము తీసికొని మగధరాజ్యము పెద్దది, కాశీ రాజ్యము చిన్నది యగుటచేత నొక చిన్న రాజ్యపురాజు పెద్ద రాజ్యమును గెలుచుటకు కృత్రిమోపాయములో లేక యారాజ్యము నీరాజ్యమునందుఁగల వ్యక్తులకుఁగల పరస్పరమైన కొన్ని సంబంధములో యాధారము తీసి పసి కథాకల్పనము చేయును. అట్లే చేయఁబడినది. నవలయు నొక కావ్యమే. కావ్యముయొక్క యాత్మపాఠకునియొక్క మనస్సును సృష్టిలో జరుగు సంశములయందు వ్యక్తమగుచున్న మానవ హృదయమునందలి భావములయొక్క సంఘర్షణల వలన ననుభూతమగు నొక హృదయానుభూతియో, చిత్తవృత్తియో అగును. అట్టి హృదయానుభూతియో చిత్త

వృత్తియో కలుగుటకు కథయాలంబము. కథాంశములు దానికి రూపము. ఆ రూపమున కాధారము మన పురాణ ములయందున్న యల్పములైన విషయములు. ఈ కథయందు మొదటి యధ్యాయమున బుద్ధుని యవతారము సూచింపఁ బడినది. ఆ సూచన పరిపుష్టము కాలేదనికూడ రచయితకు తెలియును. అంత పరిపుష్టముగా నా సూచన చేయఁబడక పోవు టకు హేతువులు గలవు. ఈ రచయితకు మన పురాణముల యందున్న యథార్థమైన చరిత్రమునందలి భిన్న రాజ వంశములయొక్క రాజ్య పరిమితి చెప్పుటయు, దానినిసూచిం చుటయు తగిన మనసులలో పాశ్చాత్య చరిత్రకారులు చేసిన యబద్ధపు కాలనిర్ణయమును తొలఁగించుటయు ప్రధానముగాని మత విషయములైన యభిప్రాయములు వెల్లడించుట ప్రధా నముగాదు. ఇంకొక నవలలో మతవిషయమునకు ప్రాధా న్యము చెప్పవలసి వచ్చుచోఁ జెప్పఁబడ వచ్చును. ఈ 16 నవలల పదకములోఁ బ్రధాన విషయ మది కాదు.

# ధూమరేఖ

## ౧

అమావాస్య. సూర్యాస్తమయమై రెండు గడియలు కావచ్చును. అంధకారము క్రమ్మినది. పశ్చిమదిశయందు చిక్కని నల్లనిమబ్బులు వ్యాపించినవి. ఆ మబ్బులలోఁ గొంత యెత్తున చారగా నొక యెడ మున్నది. ఆ ప్రదేశము మిక్కిలి తెల్లగా నున్నది. వెనుక తెల్లమబ్బులుండి యీ తెలుపు కనిపించవచ్చును. తెల్లమబ్బులకు తెల్లఁదనము సహజముకాదు గదా? అస్తమించి భూపరిధికి చాల దిగువపోయిన సూర్యదేవుని దూరకిరణములు మింటిలో నంతదూరము వ్యాపించి యీ తెల్లమబ్బును తెల్లమబ్బును చేసినవి. ఆ నల్లమబ్బులు లేనిచో నీ తెల్లమబ్బు తెల్లమబ్బుగా కనిపించునా? ఈ నల్లమబ్బులచేత నా తెల్లమబ్బులయొక్క తెల్లఁదనము దూరగుఁడైన సూర్యదేవుని కాంతి ప్రసారమని తెలియఁజేయుచున్నది. నల్లమబ్బులు లేవు. అది తెల్లమబ్బని తెలియదు. దానిపైన సూర్యకాంతి ప్రసారము జరిగినదని తెలియదు. ఒకానొక వెలుఁగు తానొక ప్రదేశమునం దభివ్యాప్తమై యుండును. ఆ వెలుఁ గభివ్యాప్తమై యున్నదన్న యూహ కలుగనే కలుగదు. ఆ వెలుఁగుయొక్క పలుచని తనముచేత నా వెలుఁగు లేదనియే యనుకొనుచుందుము. కాని యీ వెలుఁగుయొక్క యునికి యొక చీఁకటిరేక వచ్చి దానిని తొలఁగించి మనకు

విస్పష్టపఱచును. సర్వసృష్టియు నిట్టి పరిస్థితుల మీఁదనే నడచుచున్నది. అచ్చముగా వెలుఁగు లేదు. అచ్చముగా చీఁకటి లేదు. ఒకదాని యపేక్షచేత రెండవదాని స్థితి భాసించుచుండును. చిక్కన - పలుచనలు స్థితికి నష్టికి హేతువు లనిపించును. మరియును వెలుఁగు - చీఁకట్లలో వెలుఁగభిమతమైనది; చీఁకటి యనభిమతమైనది. ఒకానొక చీఁకటియొక్క యొత్తిడిచేత నొకానొక వెలుఁగు కూడ నస్వీకార్యమన్నట్లుండును. ఆ యాకాశములో నా రెండు నల్లమబ్బుల నడిమి తెల్లచార దృష్టికి సుఖాపాదకమా? సంతోష హేతువా? నేత్రోన్మీలన హేతువా? ఒక దృష్టితో చూచినచో నా తెల్లని చార మింటిలో నెగ టనిపించును. కాని దానియందొకానొక సౌందర్యము భాసించుచుండును. ఒక శిల్పి తన వర్ణసామరస్యరచనా సామర్థ్య నిరూపణము కొఱకు త దాకాశమును స్వీకరించవచ్చును. ఎవఁడా యాకాశమును చూచి యా తెల్లని మబ్బు లేక బాగుగా లేదనుకొనునో వాఁడే శిల్పి చిత్రమును చూచి పరమ రమణీయముగా నున్న దనుకొనవచ్చును. ఆ రమణీయత వస్తుగతము కాక శిల్పిచాతుర్య జనిత మనవలసివచ్చును. లేదా యథార్థవస్తువునకును; తత్ప్రతిబింబమునకును చాలభేద ముండును. ప్రతిబింబమునందుఁ గల రామణీయకము బింబమునందు భాసింపక పోవచ్చును. భాసించదు. బింబమునందలి రామణీయకము చూచుటకు నొక విలక్షణమైన జీవగత యాథార్థ్యముండవలయును. ప్రతిబింబగత రామణీయకము చూచుటకు జీవుఁడు ప్రతిబింబించిన మనోవీథులయందు గల యొక సౌకుమార్యము చాలును.

జీవలక్షణము వేరు. మనోలక్షణము వేరు. జీవునకుఁ గల శక్తి తానైన యచ్ఛమైన సర్వభూతాంతర్వ్యాప్తమైన సర్వసృష్టికి మూలహేతుకమైన ఈ సర్వము యదుద్భూతమో తల్లక్షణమైన యొక మూలభూత జ్ఞానమునకు సంబంధించినది; మనస్సునకు గలశక్తి తచ్చైతన్యముయొక్క యల్పాంశ సంక్రమించిన మనస్సు, లోకమునందలి భిన్న విషయములు పరిశీలించి, బహు విషయములయొక్క కించిత్కించిత్పరిజ్ఞానమువలన నొక జ్ఞానముగా నేర్పడి, ఆ జ్ఞానమను ముద్ద ప్రతిబింబశీలమై పలువిషయములను తెలిసికొని, మరల వానియందు రమించునట్టి లక్షణము కలది. ఇందుకనియే మనస్సునకు రెండు భాగములు కలవని చెప్పవచ్చును. ఒకటి యూర్ధ్వభాగము, రెండవది యధోభాగము, ఊర్ధ్వభాగము మూలచైతన్యస్పృశ్యముగా నుండును. అధోభాగము ప్రపంచకగత బహువిషయస్పృశముగా నుండును. మానవుఁడు మనస్సుయొక్క యీ యధోభాగమునం దుండును. ఆ యూర్ధ్వభాగము పొంతఁబోఁడు. ఇవి రెండు నొకదాని రెండు సగములైనను రెండును కలిసియే యున్నను నొకదాని కొకఁడు సంబంధము లేనట్లుండును. ఈ రెండవ రకమైన మనస్సు సృష్టియొక్క విలాసము; సృష్టియొక్క వికాసము! దాని యందది రమించుచుండును. దీనిలో బహ్వంశలు కలవు. ఒక యంశయందు రెండవయంశ రమించుచుండును. దాని రమణముయొక్క స్వరూపము దానికే తెలియును. ఈ రెండవ రకమైన మనస్సులో బహువిధములైన భేదములు కలవు. ఈ భేదములు దేనికది యన్నట్లు భాసించుచుండును. ఒక

యంశలో సర్వము లౌకికమై రేఖామాత్రముగా నొక పార లౌకికత్వము భాసింపఁ జేసికొనుచు తానొక విలక్షణత్వము కలిగినయొక వ్యక్తివలె నుండుచుండును. పాఠలౌకిక లక్షణము కొంచెముగా దానియందు సంక్రమించుటచేత దానికొక నిగూఢత్వ మున్నట్లు ప్రకాశించును. అది నూరుపాళ్ళ మనోంము. అందులో తొంబదిపాళ్ళు లౌకికము. పదిపాళ్ళే పార లౌకికము. అయినను సంపూర్ణముగా పారలౌకిక మన్నట్లు మెరపించుచుండును. నిజమునకు దానిపోషణ యంతయు లౌకికమైన దానిచేతనే జరుగుచుండును. ఇదియొక విలక్షణమైన సృష్టిరేఖ. దీనివలన పరలోకములు పోషింపఁబడునా ?

ఆనాఁ డాకాశ మట్లున్నది. మింటిలో నా తెల్లరేక గనిపించుచున్నది. ఆ రాజ్యమునకు రాజధానీనగరమున నదీ తీరముననున్న యుత్తాలమైన రాజభవనశేఖరమున నిద్ద అక్కాసెల్లెండ్రు తదంధకారతరంగ సముపలాలిత హేమతనూయష్టులై విహరించుచుండిరి. వారిదద్దరు రాజకూతుండ్రు. ఇద్దరు యౌవనవతులు. ఇద్దరు హేమశలాకలు. ఇద్దరు నంధకార ప్రియలు. చెల్లెలుమాత్ర మా తెల్లని మబ్బు బాగాగానున్నదనెను. అక్క బాగుగా లేదనెను. చెల్లెలుపేరు మాయాదేవి. అక్కపేరు నీలాంబరి. వారొకరితో నొకరు పోరాడుకొనరు. వారియందు రాచపట్టింపులులేవు. ఇద్దరు మధుర ప్రకృతులు. ఒక రన్నమాట మరొకరు కాదన్నచో రెండవవారు వివదించరు. ఆమె యిష్టమామె దని యూరకుండును. కాని యెప్పుడైన సుంత వివాదాభిముఖముగా ప్రసంగము నడచినచో మూఁడవమాటలోననే నెవ్వతెయో యొక్కతె రెండవయామె

ననుసరించును. మాయ ఆ తెల్లనిమబ్బు చాల రమ్యముగా నున్నదనెను. నీలాంబరి కాదన లేదు. కాదన్నచో శతవిధ ముల మాయ యూరకుండును. మాయ యూరకుండక 'కాదు, నిస్సంశయముగా రమణీయముగా నున్నదన్న'దను కొందము. వెంటనే నీలాంబరి నిజమే యనును. ఊరకుండి నంతమాత్రమునంగాని, నిజమే యన్నంత మాత్రమునగాని యీమె యభిప్రాయము నీమె యంగీకరించినట్లుగాని, యీమె యభిప్రాయము నామె యంగీకరించినట్లుగాని కానేకాదు. ఆ యక్కాచెల్లెం డ్రట్టివారు. తమ యభిప్రాయములతో సంబంధము లేకుండ వారొకరి నొకర ననుసరింతురు. ఇంతకును వారి యభిప్రాయములలో దాత్కాలికముగ నుపాధ్యాశ్రయమై భేదములు భాషించుచున్నట్లు కనిపించినను వారి జీవలక్షణములు రెండు నొక్కటియే కావలయును. వారి యందున్న జీవులుకూడ తల్లక్షణ పరిజ్ఞాతలు కావలయును. జీవలక్షణ పరిజ్ఞానము విచిత్రముగా నుండును. ఆ పరిజ్ఞానము కలవారు యోగులు కానక్కఱలేదు. ఆ పరిజ్ఞానము తమకు కలదని వారికి వారికే తెలియదు. వారి మాటలచేత వారి క్రియలచేత వారికాపరిజ్ఞానము కలిగినట్లు తెలియును. మానవులలో నెట్టిపరిస్థితులలోనైన నొకా నొకండు సద్దుకొని పోవును. ఒకండు ప్రతి చిన్నవిషయమునందు వివాదము పెంచుకొనును. ఆసద్దుకొనిపోయెడివానిని సత్పురుషుండందుము. సత్పురుషుండనగా జీవలక్షణ పరిజ్ఞానము కలవాండని యర్థము. జీవలక్షణమనగా నిత్యమైన వస్తువుయొక్క వస్తుత్వము. ఇట్టి జీవలక్షణ పరిజ్ఞానములో నీ యక్కా చెల్లెండ్ర జీవలక్షణ

పరిజ్ఞానము భిన్నమైనది. వారి జీవలక్షణ పరిజ్ఞానము సత్వదార్థాభిజ్ఞానము కలదియో కాదో తమ యిద్దరియొక్క జీవలక్షణములందున్న సామాన్యధర్మము నెఱింగియున్నది. అది వారి విశిష్టత.

ఆ యిద్దఱక్కసెల్లెండ్రయందు మరియొక సామ్యమున్నది. నీలాంబరి కిరువదియేండ్లు. మాయాదేవికి పదునెనిమిదేండ్లు. వారిద్దరకు చిన్నప్పటినుండియు నెప్పుడును స్వప్నములు వచ్చుచుండును. వారిద్దరి సౌహార్దమునకు పరస్పర స్వప్నకథన మొక పునాదివంటిది. ఆ కలలు చిత్ర చిత్రములుగా నుండును. వారొకరికల లొకరికి చెప్పుకొనుటయే కాని వానిలోని యర్థములను వారెప్పుడును విచారించరు. మాయాదేవికి తిరిగి తిరిగి యొకవిధమైన స్వప్నము వచ్చుచుండును. పరిస్థితులు మారినను చివరకు పర్యవసాన మొకరీతిగానే యుండును. మాయ యొక తోటలో తిరుగుచున్నది. ఆమెతో కొందరు చెలికత్తెలుకలరు. అదియొక పర్వతము. దానిచుట్టును పెద్దయడవి. ఆ యడవిలో వారందరును విహరించుచుండిరి. ఇంతలో నొక మహాభయంకరధ్వని వినిపించెను. అందరును బెదరిపోయిరి. ఏమిచేయవలయునో తోచలేదు. గుబ్బిసలాడిపోయిరి. ఇంతలో నొక సింహము దంష్ట్రాకరాళవదన గహ్వరముతో విదారిత గజకుంభరక్తసంలగ్న సవారుణ నఖరసంతానముతో చీకిరి - బీకిరిగానున్న జూలుతో వారికి కొంచెము దవ్వున నిలుచుండి వారివంక నిరీక్షింప నారంభించెను. వారందరు నిలుచున్నవారు నిలుచున్నట్లు నీఱైపోయిరి. పారిపోవుదమన్న యూహకూడ వారికి పుట్టలేదు. ఇంతలో

నా పంచాస్యము మరల గర్జించి వారిమీఁదికి దూకఁబోయెను. వారప్పుడు పారిపో నారంభించిరి. ఆ కంఠీరవము తక్కిన చెలికత్తె లందరను వదలిపెట్టి మాయ వెంటఁబడెను. మాయ పరుగెత్త నారంభించెను. సింహము తరుముచుండెను సింహమున కందకుండ మాయ కొంతదవ్వు పరుగెత్తఁగా ఇంతలో సింహము సమీపించినట్లు తోఁచెను. ఆమె సింహ మాకాశమునందు సంచరించలేదుగదా నేనెగిరిపోదమనుకొన్నది. ఆమె యీ పాటున మింటలేచి గాలిలో పారిపో నారంభించెను. కొంత సేపటికి సింహము కనిపించలేదు. తా నాకాశములో చాల దవ్వు ప్రయాణించి మరల దిగివచ్చెను — ఇదియొక స్వప్నము. మరియొకస్వప్న మిట్లేయుండును. ఒకప్పుడు మహావాయువు వీవ నారంభించెను. వృక్షములు కదలిపో నారంభించెను. ఏవృక్షముక్రింద నిలుచుండ నేశాఖవిరిగిపడి తల పగిలిపోవునో యన్నట్లుండెను. ఈ మహాప్రళయమునకు భయపడి పట్టణములోని ప్రజలందరు నొకచోట గుమికూడిరి. ఒక స్థలము భద్రము మఱియొకఁ డభద్రమన్న యూహ కలుగుటకు వీలులేని పరిస్థితిగా నుండెను. నదీజలములు పొంగివచ్చి నేల నాక్రమించుచుండెను. జలములు జలములుగా లేవు. ఒక్కొక్క బిందువు దానిలోపల గాలి యెట్లు ప్రవేశించెనో బుడగలై యట్టి బుడగలు శంఖములు, స్వచ్ఛదములు రోదసీకటాహము నంతయు నావరించెను. కనుచూ పాగుటలేదు. కాని యాకాశము కనిపించుచునేయున్నది వా రున్నప్రదేశ ముయ్యాలవలె నూగ నారంభించెను. పట్టరానంతమంది జనమెక్కిన పడవ వరదల మీఁదనున్న నదిలో ప్రయాణముచేయుచుండఁగా కెరటముల

తాకిడికి పడవ యొక దెస కొడ్డిగిలగా జనము భయపడి మరి యొక దెసకు చేరి పడవ నుయ్యాలలూపి మునింగించుకొన్న ప్పటివలె తత్పురీధానుని యంతయు నెడ్డగెడవుగా లేచి నదిలో మునింగిపోవునో యన్నట్లుండెను. ఇంతలో పటపటాత్కార ముతో నొక మహాధ్వని భూగర్భమునుండి వినవచ్చెను. ఇంకేమున్నది! భూమి పగిలిపోవుచున్నది. ఆ పగులుటలో జనమందరు పడి యిరుకుకొనిపోయి యడక త్తెరలోని పోకలవలె నలిగిపోదుమని భయపడజొచ్చిరి. అనుకున్నట్లే భూమి తూర్పు దెసనుండి బీటీయ నారంభించెను. ఆబీటు మాయ నిలుచున్న స్థలమువరకు వచ్చెను. మాయ యంటనే యాకాశమున కెగి రెను. ఆ రోదసీకుహరమునందు నభివ్యాప్తమైయున్న నదీ మహాప్రవాహ జలబుద్బుద సహస్రములలోని కెగిరిపోయెను. ఆమె యొడలు చల్లబడెను. చెమ్మగిల్లెను. శరీరము సుఖ ముగా నుండెను. మనసులోనున్న భయముమాత్ర మట్లే యుండెను. ఆ బుద్బుద ప్రతిశీకరమున తానెచ్చటనుండెనో మాయకు తెలియలేదు. భూగర్భమున మృత్స్నాణువుల యందు తగుల్కొనుటకు బదులు రోదసీగర్భమున పాథో మయాణువులయందు తగుల్కొన్నట్లుండెను. కొంతసేపటికి భూమి కనిపించెను. పట్టణము పట్టణముగానే యుండెను. నది పొంగలేదు. భూమి బీటీయలేదు. ఆమె నెమ్మదిగా దిగివచ్చెను.

మరి యింకొక స్వప్నము. ఒక నిశావేళ. అది ప్రళయ కాలము. సముద్రములు పొంగి వచ్చెను. సర్వధాత్రియు జలమయ మైపోయెను. తా నొక చిన్న ద్వీపముమీఁద

నిలుచుండెను. ఆ ద్వీపముమాత్రము మునుఁగలేదు. ఆకాశ మంతయు చిత్ర చిత్రములైన వర్ణములతో వర్ణ రమ్యమైన చిత్రములతో బహు పురాణ కథా సంతాన గత చమత్కార సన్నివేశ రచనా మనోహర దృశ్యములతో నలంకరింపఁబడి యుండెను. ఇంత యాకాశము చిత్రపటము. దానిలోని చిత్రములు అపరిమేయ ప్రమాణములు. ఆ బొమ్మ యింత యెత్తున్నదని చెప్పుటకు వీలులేదు. అది రచించినవాఁడు గగన ప్రమాణ దేహుఁడై యుండవలెను. ఆ చిత్రము పై భాగమున వర్ణ సామరస్యము కలిగించుటకు పైకి పోవలయునన్న నిచ్చెన కావలయునుగదా! ఆ నిచ్చెన వంద తాళ్ల యెత్తున నుండవలయును. నిచ్చెనకు రెండు కఱ్ఱ లుండును. అట్లే రెండు తాళ్లు కావలయును. అట్టి తాళవృక్షములు సహస్రములైన గాని యీ యెత్తు కుదరదు. ఇంతకు నా నిచ్చెన దేని కానించవలయును? వట్టి నిచ్చెన యాకాశమున నట్టే నిలఁబడి యుండునా? ఈ బొమ్మలు గీసినదెవరు? ఎట్లు గీసిరి? దేనిమీఁద గీసిరి? ఆ బొమ్మలన్నియు నేవో కథలను చెప్పుచున్నట్లుండెను. ఆ కథ లివియని స్ఫురించుట లేదు. పురాణ కథలవలె నున్నవి. కాదన్న ట్లున్నవి. తానొక్కర్తెకయు నా ద్వీపమునందు నిలుచున్నది. ఇంతలో నెవఁడో యొక పసిపాప కేకలు పెట్టిన ట్లుండెను. ఆ పసిపాప కనుపించలేదు. వాఁడు తన బిడ్డయేమో యనిపించెను. తా నవివాహిత. తాను గర్భము ధరించలేదు. తనకు బిడ్డ యెట్లు పుట్టును? తన బిడ్డ యైనచో తనకు కనిపించఁడా? ఈ మహా ప్రళయ సముద్రమునందు నొక పసిపాప యున్నట్లు పురాణములలో

వినికిడి. వాఁ డేమ్చుచున్నాఁడా? వాఁ డెవఁడు? ఏ తల్లి కొడుకు? తానే ఆ తల్లియా? తాను తల్లియేమిటి? ఇట్లుండఁగా నాకాశము పెళ పెళలాడి సముద్రములు కళపెడలాడి తాను నిలుచున్న ద్వీపముకూడ మునిఁగిపో నారంభించెను. ఇంతలో నాకాశమంతయు స్వచ్ఛమయ్యెను. ఏ బొమ్మలును లేవు. సముద్రముమీఁద తా నెగిరిపోవుచుండెను. ఆ యెగిరిపోవుట యెంతవరకు రమణీయముగా నుండెను! సముద్రపు కెరటము తాడి యెత్తున నున్నచో నా కెరటముపైన తాను పది గజముల యెత్తున పోవుచుండును. అంత యెత్తు కెరటము లేనిచో వట్టి సముద్రము మీఁదనే పది గజముల యెత్తుననే యెగిరిపోవుచుండును. ఆమెకు వచ్చిన వందల స్వప్నములలో నామె యెప్పు డెగిరిపోవుచునే యుండును. ఆ యెగిరిపోవుట యెప్పుడును భూమికి పది పదేను గజముల పైననే యుండును. ఆకాశముయొక్క డొక్కలోనికి చొచ్చుకొని పోవుట యెప్పుడును లేదు. పర్వత మడ్డము వచ్చినది. ఆ పర్వతముపైన పదేనుగజము లెగురుచుండును. పులి తరుముకొని వచ్చినది. ఆ పులికి పైన పదేనుగజము లెగురుచుండును. ఏనుగ వెంటపడి తరుముచున్నది. ఆ యేనుగపైన పదేను గజముల యెత్తు గగనమునందు తా నెగురుచుండును. ఇట్టి వామె స్వప్నములు.

నీలాంబరికి స్వప్నములు వచ్చుచుండును. ఆమె స్వప్నములు వీనికంటె భిన్నములుగా నుండును. ఒక స్వప్నమిది. ఆమె యొకనాఁడు తన తండ్రి యిల్లు వదలి నేను తపస్సు చేయుదునని లేచిపోయెను. ఒక యడవిలో కూర్చుం

డెను. తెల్లని చీర గట్టెను. ఆ చీరకు నల్లని యంచుండెను. ఒడల నగ లేమియు లేవు. ఆ కూర్చున్న స్థలము పెద్ద బండ. ఆ బండ యచ్చటికెట్లు వచ్చినది? అట్టి ఖండలు మహా పర్వతములయం దుండునుగాని నట్టిచోట నుండవే. ఆ బండ నానుకొని యొక నది ప్రవహించుచుండెను. ఆ నది పొంగి యీ బండను ముంచవలయునని చెప్పరాని ప్రయత్నములు చేయుచుండెను. నదియు జలములును కెరటములవలె పొంగి వచ్చుటయుఁగాఁ గనిపించునేగాని యధార్థమునకు భయంకర దంష్ట్రా నఖర జటాలమైనయొక మూర్తి పైకివచ్చి యీ బండను జలములలోనికి లాగికొనఁ బోవుచున్నట్లుగా నామెకుఁ గనిపించెను. ఈ మహాశిలమీఁద నా మహానది కెందుకో అంత విరోధము? ఈ మహాశిలయొక్క ప్రతిఘటన కూడ చాల విచిత్రముగా నుండెను. ఈ బండకుఁగూడ చేతులు వచ్చినట్లు కోరలు మొలిచినట్లు అవి యన్నియు ఖడ్గములవలె యీ నదీ దంష్ట్రా నఖములను చీల్చి చెండాడుచున్నట్లు నామెకు కనిపించెను. నిరాభరణ తనూసితచ్ఛవి తా నచ్చట తచ్ఛిలాకృతిగా నున్నట్లు తనకు నా శిలకు నభేద ప్రతిపత్తి యైనట్లు తా నానదితో పోరాడుచున్నట్లు తోచినగాని యీ నదీ సర్వ ప్రవాహ జలమును శిలామూర్తియైన తనలో నింకించుకొనుటకు తానొక ప్రయత్నము చేయుచున్నట్లు నామె యనుకొనుచుండెను. తా నెవరు? ఆ శిల యేమి? ఈ నదియేమి? ఆ నదితో తనకు విరోధమెందుకు? ఆమె కేమియు తెలియలేదు.— ఈ స్వప్నమె యామెకు పలుసారులు వచ్చుచుండును. వచ్చిన ప్రతిసారియు మాయతో చెప్పు

చుండును. మాయు నవ్వుచుండును. అదే అదే స్వప్నము వచ్చుచున్నట్లు కనిపించును గాని యా స్వప్నములో భేదములు లేకపోలేదు. ఒకప్పు డాశిల బహూత్తాల భూజ సంతాన పరివేష్టితమై భాసించును. ఒకప్పుడా శిల యేకాకిగా కని పించును. ఒకసారి మాత్రము తన్మహాప్రస్తరము నదీ జల మును త్రాగివేసినట్లు కనిపించెను. నీలాంబరికి భయము వేసెను. అయ్యో! ఈ నదిని త్రాగివేసితినే? నే నెంత దుర్మార్గమైన శిలను. నాకీ నదితో విరోధమెందుకు? పాప మీ నది నన్నేమి చేసినది? వర్షాకాలమునందు వానలు కురిసి వరదలు వచ్చుట సహజముకదా? ఆ వరదలు వచ్చినపుడు నదులు పొంగును. రాళ్ళను ముంచును. ఆ నదికొక రాతి మీద విరోధము కలదా? ఒకరాయి తన్ను ముంచెనని నదితో విరోధము పెట్టుకొనవచ్చునా? ఇది సృష్టి సహజమైన లక్షణము కాదే? అది వట్టి రాయి. నది పొంగినప్పుడు మునిగిపోవును. పొంగనపుడు కనిపించును. ఆ రాతి దాక నెందులకు? ఈ మహానదియే లోకాతీత ప్రభావవంతముగా కనిపించుచున్నదిగదా! వానకాలములో పొంగును. వేసవిలో క్రుంగును. ఏ నదియైనను స్వీయోత్తాల తరంగ సంతాన శిఖర డిండీరవళక్ష ప్రభా కబళితాకాశమని చెప్పినచో నది వర్షాకాలపుమాట. వేసంగినాటి మాట కాదు. ఆ నదికూడ తన ధర్మమునే తా నవలంబించుచున్నది. అది యవలంబించిన ధర్మము మహోచ్ఛ్రితిని ప్రాపించి నప్పుడు దానిని వర్ణించి ఆ ధర్మము దానికి నిత్యమన్నట్లు లోకము చెప్పును. దోషము లోకమునందలిది. ఆ నదిది కాదు. ఆ నదితో విరోధించిన

శిలయందు దోష మున్నదేమో కాని యీ నదియందు కని
పించుట లేదు. అయ్యో! ఈ నదినంతయు నేను త్రాగివేసి
తినే. ఇక నీ నది ప్రవహించదు కాబోలు, అని నీలాంబరి
యనుకొనుచుండగా దూరాన నా నది శారదికహంసీ గరు
దంతాస్ఫాలద సుషమా మనోహరమైన యొక నీటి పాయగాఁ
గనిపించెను. నీలాంబరి యెడఁదలో నొక్క యానంద రేఖ పొడ
సూపెను. నది యింకిపోలేదు. అదుగో! దూరమునుండి
ఇంతలో మరల మహానది మహోన్నత తరంగ వాస్సుంచిత
విఘత్కటాహయై తనమీఁదికి వచ్చినది. నీలాంబరి యెడఁద
లోని జాలి నిముసములో మాత్సర్యముగా మారినది. ఈ నది
నెంత చంపఁదలచుకొన్నను చచ్చుట లేదు. ఎంత యింకింప
దలచుకొన్న నింకుట లేదు. తాను వట్టి శిలమైనది. తానొక
సీమసుద్ద పర్వత మైనచో సులభముగా నీ నదీజలమును పీల్చి
యుండును. కాని సీమసుద్ద యైనచో తడిసిపోయి విడిలిపోవును.
తాను శిలగానే యుండవలయును. ఈ స్పర్థ స్పర్థగానే యుండ
వలయును. కాని దానికి మంచిరోజులు వచ్చినపు డది విజృం
భించును. నాకు మంచిరోజులు వచ్చినపుడు నేను విజృం
భింతును. చిట్ట చివరి కెవరు గెలుతురో చూతును – అను
కొను చుండగా నీలాంబరికి మెలకువ వచ్చెను. ఆ మెలకువ
వచ్చినవేళ నీలాంబరికి మెలకువ వచ్చెనో రాలేదో యన్న
ట్లుండెను. అట్లుండుటకు కారణము మెలకువ వచ్చినదని
నీలాంబరికి తెలియును; కాని శిలా తాదాత్మ్యము తన్నిమే
షము నందు నీలాంబరికి పోలేదు. ఆమె యిట్లూహింప
నారంభించెను. చిట్టచివరి కెవరు గెలుతురో చూచెదను.

చిట్టచివరికనగా నెప్పుడు, దేనికి చిట్టచివర? దానికి మొట్ట మొదలేది? దేనికైన మొట్టమొదలు చిట్టచివర యుండును గదా? ఈ నేలయం దీ శిలయున్నది. దానిప్రక్క నీ నది ప్రవహించుచున్నది. ఈ రెండును శాశ్వతములు. ఈ ధరా ఖండమునకు చిట్టచివరయున్నమాట. ధరాఖండమునకు చిట్టచివరయేమి? ఈ ధరాఖండముయొక్క స్థితికి నస్థితి కలుగుట. ఇది చమత్కారముగా నున్నది. ఒక శిల అచ్చట నున్న నదితో విరోధము పెట్టుకొనుటయేమి? ఆ విరోధము కొఱకు ధరాఖండమే నశించిపోవుటయేమి! ఏమి స్వార్థము? స్వార్థము కానిచో శిల యెందుకున్నది? నది యెందుకున్నది? ఎందు కుండవలయును? ఉండుటతోడనే స్వార్థమున్నది. — నీలాంబరికి జాగ్రదవస్థ సంపూర్ణముగా వచ్చినది. కనులు తెఱచినది. ఒత్తిగిలి పండుకొన్నది. కాలుసేతు లాడించినది. తాను శిలకాదే. స్వప్నములో తాను శిలయగుటయేమి? ఛీ! ఛీ! మాయతో చెప్పిన మరల నవ్వెను. ఈసారి చెప్ప వలదు — కాని చెప్పెను.

ఆ యిద్దరొకరిస్వప్నము లొకరికి చెప్పుకొనుచుందురు. లోకములో జనులకు స్వప్నములు వచ్చుట పరులతో చెప్పు టయు నున్నవే. కాని అన్ని స్వప్నములను చెప్పుదురా యని ప్రశ్న. స్వప్నములలో రహస్యము లుండవా. మనుజులు జీవితములోనున్న కొన్ని రహస్యము లెట్లు దాచికొందురో స్వప్నములలోని రహస్యములు నట్లే దాచికొందురు. తానొక యబద్ధ మాడెను. తా నెవరినో యన్యాయము చేసెను. తనకొక పరాభవము జరిగెను. తానొక యధర్మమైన కావ్య

మును చేసెను. లోకము వీనిని పరులతో చెప్పును. తన ప్రతిభ యొకచోట ప్రకాశించును. తానొక ధర్మమును చేసెను. తన కొక గౌరవము జరిగెను. తనవలన నెవరికో యుపకారము జరిగెను. వీనిని లోకము పరులతో చెప్పును. స్వప్నములో నొక పరాభవము జరిగెను. తానొక యధర్మ కార్యమును జేసెను. వీనినికూడ లోకము పరులతో చెప్పునా? పురుషుఁడు స్వప్నములోఁ దనకొక పరస్త్రీ సంగమము కలిగినట్లు భావించెను. దానిని మరునాఁడు పరులతో చెప్పునా? ఆప్తులైన మిత్రులతో చెప్పవచ్చును. పరస్త్రీ సంగమము తన జీవితములో నొక మహాభాగ్యమైన విషయముగా భావించువాఁడు మరల నట్లే భావించు చెలికానితోఁ జెప్పవచ్చును. స్త్రీకి స్వప్నమునందు నిట్టిది కలుగును. తన చెలికత్తియలతోఁ జెప్పునా? ఇద్దఱు చెలికత్తెలు జారిణులైనచో, జారిణులు కానక్కఱలేదు తాదృశమైన భావ పరంపర యందు రమించెడి వారైనచో వారట్లు చెప్పికొనవచ్చును. ఇది సకృత్తైన విషయము. వీనిమాట యట్లుంచి స్వప్నములలో జరిగిన కొన్ని విషయములు తామట్లు జరిగెనని పరులతో చెప్పుటకు నెవ్వరైన లజ్జపడుదురా? తనకు పరాభవ హేతువులైనచో లజ్జపడవచ్చును. కలలో జరిగిన పరాభవమునైనను పరులు వెక్కిరింతురుగదా! ఆ యథార్థమైన విషయము కూడ నీకు సంబంధించిన యొక యగౌరవమునకు హేతువుగానో సంబంధిగానో కనిపించుటకూడ కొందరు మైత్రీ విరహిత భావనా బుద్ధులకు పరిహాసాస్పదము కావచ్చును. అదియుఁగాక ఒక్కఁడేవిధమైనస్వప్నము మంచిదో చెడ్డదో

తిరిగి తిరిగి నీకు వచ్చుచుండును. దానిని చెప్పకుండ నుండ లేవు. వినెడివారికి విసుగు నీయందున్న ప్రేమచేతనో గౌరవము చేతనో నీవు దాని నెన్నిసార్లు చెప్పినను వారు వినుచుందురు. వారికి విసుగుగా నున్నదని నీకు తెలియును. దానిని నీవు చెప్పకుండ నుండలేవు. అప్పుడు నీవు లజ్జింతువా? లజ్జింపవా? లజ్జకాని యొకానొక లజ్జ నీయెడందయందు దడి పొదుకొని యుండును. ఆదృశ్యమైన లజ్జాభావము మాయా నీలాంబరుల హృదయములయందు కలదు. అదేకల. అదేకల. వారియందీలజ్జాభావ ముదయించియు గుప్తమైయున్నది. ఆ లజ్జనుమీరి యొక ధైర్యము వారి హృదయములయందు సమాక్రమించి యుండును. ఏలయనగా ఇద్దరికిని వచ్చెడు స్వప్నములట్టివే. ఆమె స్వప్నములామె చెప్పుచున్నది. ఈమె స్వప్నములీమె చెప్పుచున్నదీ. అందుచేత లజ్జపడనక్కర లేదు. బెరుకు పొందనక్కఱలేదు. కాని యిందులో నొకం డున్నది. ఆస్వప్నములు చేప్పినచో చెప్పవచ్చును. మరల నట్టిదే స్వప్నము వచ్చినదియని నవ్వి తేల్చివేయవచ్చును. కాని వారు తమస్వప్నములనుగూర్చి తేల్చివేయు నభిప్రాయములులేనివారు. ఇద్దరును వచ్చిన స్వప్నములే వచ్చుచున్నను చెప్పినవే చెప్పుచున్నను వానినిగూర్చి తేలికగా భావించుట లేదు. తేలికగా భావించక వానియందెదో యర్థములను కల్పించుకొని వానియందొక మమకారము కలిగి యీ మమకారము యొక్క హేతు విదియనికూడ నిర్ణయించుకొనలేక వారి యెదలొక బరువును మోయుచుండెను. ఆబరువు మోయుటలో నొక సుఖమనుభవించుచుండిరి. ఆబరువు యొక స్వరూప

మిదియని వారికి తెలియదు. ఒక చెరకుగడలమోపు మోసి కొనిపోవుచున్నావు. బరువుగానే యున్నది. మెడనరాలు నొప్పి పెట్టుచున్నవి. ఇంటికిపోయిన తరువాత పిల్లలు వాని తిందురనియో నీవుకూడ వాని నాస్వాదింతువనియో లేదా వానినమ్మి కొంతడబ్బు చేయుదువనియో ఏదైన భావముతో లోకమునందు బరువు మోయుటకలదు. బరువును సహించుటకలదు. ఆభారసహనమునకు తత్ఫలితము హేతువు. ఆ చెరకుగడలు నీవనుభవించునవి కావు. కూలికి మోయు చున్నావు. దానివలన కూలివచ్చుట యనునది యాబరువు యొక్క స్వభావపరిజ్ఞానము. ఊరకే బరువుమోయుదువు. ఎవ్వరును మోయరందుమా? లోకమున నందరును మోయు దురు ఎవఁడో యొక వస్తువును తెచ్చిపెట్టుమనును. దాని వలన నీకేమియు ప్రయోజనములేదు. కాని వానియందలి మొగమోటముచేతనో అతనియందలి గౌరవము చేతనో ఉప కారబుద్ధిచేతనో దానిని చేయుదువు. ఆ మనోభావమే యాభారమును నీవు సహించినప్పుడు తద్భారస్వభావ పరిజ్ఞా నముక్రింద జమకట్టబడును. ఈయిద్దరక్కసెల్లెండ్రు మోయు చున్న ఈస్వప్నవృత్తాంత మహాభారము వీనిలేని క్రిందికిని రాదు. ఇది చాల విలక్షణముగానున్నది. నది ప్రవహించు చున్నది. దానినెవ్వరును త్రవ్వలేదు. ఇరువైపుల నొత్తుగా నున్నది. పైనుంచి వచ్చిన జలము లీపల్లమును తమ ప్రవా హమున కుపయోగించుకొన్నవి. అదియంతయు కలిసి యొక నదిగా భాసించుచున్నది. ఆ రెండుమిట్టల నడిమి ఈపల్లము పైనుంచివచ్చు నా మహాప్రవాహమును వహించుచున్నది.

ఆనీసు వర్షాకాలమున బోలెడంత బురదను తీసికొనివచ్చి ఇంతపొడుగు పల్లపుమేర చేయుచున్నది. నత్తగుల్లలు మొదలైనవి ప్రవాహ మచటనుండుటచేత పుట్టుచున్నవి. నీ రెండిపోయినపుడు ప్రవాహపతితములైన సర్వమత్స్యాదులు పేరికొని యున్న బురదలో బొరియలలో నుండుచున్నవి. ఆ వట్టి నేలకు నీబరువు సహేతుకమైన భారవహనగుణమును సంక్రమింపఁజేయునా? ప్రవాహ విరహితమైన యొకో భావము తత్ప్రదేశమునకుఁగలదా? ఆ ప్రదేశమే తాను చైతన్యవంతమైనచో నట్లూహించునేమో! అవి నదియని అది నదియొక్క కడుపని పరజనేరితమైన విషయముగాని తత్ప్రదేశకృత స్వయంభావనా విషయముకాదు. ఆయక్కాసెల్లెండ్రు తా మట్టి నది కడుపుల మనుకొనుచుండిరా? అనుకొనినచో నదీవేణికల కంటె భిన్నమైన ప్రకృతికలవారగుదురు. ఏలయన 'నదీవేణికల కాయూహ లుండవు. వీరికున్నవి. కనుక వీరి మనస్సులు వీరియాత్మలు వీరి జీవితములు నదీవేణికా సదృశములై వీరు చైతన్య లక్షణములు కలవారగుటచేత తద్భిన్నత భాసించుచున్నది; గాని లేనిచో భిన్నత్వములేదు. అహో! స్త్రీయొక్క లక్షణమేయిది నదీప్రవాహమును సాగించు పల్లపునేలవలె నా నదికంటె భిన్నతలేని యాప్రదేశమువలె నా ప్రవాహము ప్రవహించుటచేతనే యా రెండొడ్డు లనిపించుకొన్న మెట్ట ప్రదేశముల నడిమి దీర్ఘమైన యీపల్లపు ప్రదేశము వాహినీనామక వస్త్వైకదేశముగా నుండిపోయినట్లు, అట్లుండుట తత్ప్రదేశ చరితార్థతాహేతువైనట్లు, దానికొక పావిత్ర్యము వచ్చినట్లు, లోకమునందు స్త్రీ ఈసర్వజగత్సంసార భావనా

మహావాహినీ వేణికాభూతమై ప్రకాశించుచున్నది. ఆ ప్రవాహములందు భిన్నత్వములు కలవు. గంగ యొకచోట ప్రవహించుచున్నది. యమున యొకచోట ప్రవహించుచున్నది. లోకమునందలి సర్వనదులును ప్రవహించుచునే యున్నవి. ఒకనేలమీఁదనే ప్రవహించును. ఆ ప్రవాహమునకు నా వేణికాభూతమైన నేలకును నవినాభావ సంబంధము. మింట మందాకిని ప్రవహించుచున్నది. దాని కొడ్డుకలవా? వేణిక కలదా? ఆ ప్రవాహమునకు హద్దు లెవ రేర్పరచిరి? ఇది చమత్కారమైన విషయము. వట్టియాకాశమునందు మందాకిని ప్రవహించుచుండగా నామె కొడ్డులు లేక వేణిక లేక ప్రవాహము ప్రవాహముగా సాగుచున్నదే. అందుచేత లోకమునందలి నదులుకూడ వేణికయని యొడ్డులని పెట్టిగాని ప్రవహించుచున్న వేకాని వాని ప్రవాహమునకు వీనికిని సంబంధములేదన్న మాట. లేదన్నమాట యెంతయో నిజము. ఈ నిజమును లోకము గ్రహింపలేదు. ఒక్కొక్కప్పుడా ప్రవాహములే దాని నిజమును ఋజువుచేయును. ఒకకొండ సెలయే రున్నది. ఒక వాగున్నది. ఒక యేరున్నది. సామాన్యముగా నవి కొన్ని హద్దులలో ప్రవహించుచుండును. వరదలు వచ్చును. ఆ యొడ్లులేవు. ఆ హద్దులులేవు. అవి యెంత మేర యాక్రమించునో యెవరికిని తెలియదు. వరదలు వచ్చినపుడా యేళ్లు పొంగిన మేరయంతయు వాని కడుపులు కావుగదా? కాని అది ప్రవాహమే. ఆప్రవాహమునకు హద్దులుకలవు. ఈ దృష్టితో చూచినచో మందాకినీ స్వరూపము బోధపడగలదు. అది రాత్రికనుక దానియందు ప్రవాహము ప్రవహించినదే

కాని ధాత్రికి సంబంధములేని ప్రవాహము తనయంతట తా నొకటి డున్నదని యర్థము. తాదృశమైన యేనో రెండు ప్రవాహములు మాయా నీలాంబరీ జీవలక్షణములయందు ప్రవహించుచుండెను. వా రాబరువును మోయుచుండిరి. మోయుచున్నామనుకొను చుండిరి. అనుకొనుచుండుటయులేదు. లజ్జాభారమనుభవించుచుండిరి. అనుభవించుచుండుటయులేదు. తాదృగ్విశిష్టమైన స్థితిలో నాయకాౘెస్లెంద్రుడు స్వచ్ఛభావలు,పరమేశ్వర నిర్మితలు, సంజనిష్యమాణ వికారానభిజ్ఞాత చిత్తవృత్తులు,కన్యాత్వరమణీయభావనా ప్రవిష్టకలుషితైతాదృక్స్వప్నపరంపరాపరిస్పృష్టా పరిస్పృష్టహృదయలు, వారిద్దరు రెండు నదులవలె ప్రవహించుచుండిరి. మాయ మందాకినివలె నున్నది. నీలాంబరి భాగీరథివలె నున్న దందమా? యమునవలె నున్న దందమా? కాళియసర్పము నివాసముగా నేర్పరచుకొనన పెద్దమడుగుగా నున్న దందమా? నీలాంబరి ప్రవాహముకాదా? తన జలములను మాయయందు నిక్షేపించి తానొడ్డిగిలునా? ఒక మహాప్రవాహము వరదలెత్తి వెనుకకు తీసినపుడు తానొక యగాధమైన స్థలమునందునిలిచి యొకపెద్ద మడువుకట్టును. కొన్ని మహాసరస్సులలోని నీళ్లు పొంగి వాగులుకట్టి మహానదులలో ప్రవేశించును. పుష్కలావర్తకాభ మహాపయోధరములు వర్షమును కురియును. కురిసినవాన సూటిగా వాగులుగా మహానదులలోనికి ప్రవహించుట కలదు. కొన్నివర్షములు మహాసరస్సులలో నిండియుండి యా చెరువులు పొంగినపుడు వానిజలములు వాగులుకట్టి నదీజలములను ప్రాపించుట కలదు. నీలాంబరి అట్టి మహాసరస్సు కానచ్చును. మాయ

మాత్రము నిస్సందేహముగా మహాప్రవాహమే యగును. వారి స్వప్నముల లక్షణము లట్టివి.

ఆనాఁడు పశ్చిమమునం దావరించిన నల్లమబ్బుల నడిమి తెల్లచార రమణీయముగా నున్నదని యీమె లేదని యామెయు ననుకొన్న యీరాత్రి నీలాంబరి యొక్క బయ్యైన గుండెలో నిదురపోయెను. ఆమెకొక స్వప్నము వచ్చెను. ఆ స్వప్నము తొల్లింటి స్వప్నములతో నేమియు సంబంధము లేనిది. ఆ స్వప్నములో మేలుకొన్నప్పుడువలెనే తానును మాయయు మేడమీఁద నిలుచుండిరి. ఆ నల్లమబ్బుల నడిమి తెల్లచారను చూచుచుండిరి. తానా తెల్లచారను భావించుచుండెను. అది తెల్లచారకాదు, అస్తమించిన సూర్యదేవుని భూపరిధి రేఖాదూరార్ధో దేశమునుండి విదిలింపబడిన సూర్యకిరణ ప్రసారముకాదు. ఆమెకొక యూహతోఁచెను. ఆ వెనుక నదో యొక మహాశ్మశాన మున్నది. అశ్మశానములో నొక శవము దహింపఁబడుచున్నది. ఆశవదహన కార్య కృచ్ఛితా సముద్గతమైన యొక మహాధూమము చెలరేఁగుచున్నది. అధూమము రేఖగా ప్రయాణించుచున్నది. అది వచ్చి యీ రెండు మబ్బుల నడుమ దూరినది. ఈ భావమామెకు కలిగెను. ఈ భావమామె యంతట నామెకు కలిగెనా? కాదు, ఎవరో కలిగించినట్లున్నది. ఆ ఎవరో తన గుండెలోనికెట్లు చొచ్చిరి? ఆమెకు తెలియలేదు. మరల నాలోచించెను. తన చిన్ననాఁటి నుండియు వచ్చుచున్న యీ స్వప్నములు తనలో నున్నట్లు ఆ స్వప్నములయొక్క మూలహేతువు తనలోనే యొక పురుషుఁడుగా నున్నట్లు, వాఁడే యీ స్వప్నములు కలిగించు

చున్నట్లు, వాఁడే యీ యూహ కలిగించినట్లు నామెకు తోచెను. ఇన్నాళ్లును వాఁడు తనలో నుండెనా? లేదా? యీ స్వప్నముల నాధారము చేసికొని వాఁడు తనలో ప్రవేశించెనా? వాఁడొక భావనా మూర్తియా? ఆమె గుండెలో నొక భయ మంకురించెను. ఇంతలో నా ధూమరేఖ మింటి నుండి సన్నసన్నగా లేత రెబ్బలు గాలిలోనికి చొప్పించుచున్న యొక తీగవలె తన వైపునకు ప్రయాణించుచుండెను. ఆ తీవ యొక్క సన్నని చివర మెలికలు తిరిగికొనుచు వట్టి యాకాశ మున యాశ్రయమునకు వెదకుచుండును. అట్లు వెదకికొంచు నీ ధూమరేఖ మొగము కనిపించని యొకానొక స్త్రీ యొక్క ముంగురులవలె చివళ్లు వంకరలు తిరిగి లతా శేఖర పరమ సుకుమార తంతురూప రజ్జువువలె వచ్చుచుండెను. ఆ స్త్రీ ముఖము కనిపించుట లేదు. ఆమె దేవతయో? పిశాచమో? ముంగురులచేత నామె స్వరూపము నిర్ణయించుటకు వీలు లేకుండ నున్నది. ఆ ముంగురులు తైల సంస్కృతములై పరి మళ భరితములై యున్నట్లుండెను. పిశాచ కేశములు మాత్రము తైల సంస్కృతము లేల కాకూడదు? సహజ సౌందర్యవంతము లేల కాకూడదు? ఆ ధూమరేఖ వచ్చి వచ్చి తన మనస్సులో చొచ్చెను. తన గుండెలో చొచ్చెను. అది తనలో ప్రవేశించినంతనే నీలాంబరికి భయము పోయెను. ఒకానొక సుఖభావము కలిగెను. సుఖభావమని చెప్పుటకు వీలులేదు. భయము పోవుటచేత సుఖ మనిపించెను. భయ రాహిత్యము సుఖమా? సుఖమను వస్తువు ప్రవాహమువలె నిరుపాధికమై యున్నదా?

## ౨

మహాభారతయుద్ధమైన తరువాత ధర్మరాజు ముప్పది యారేండ్లు రాజ్యముచేసెను. అప్పుడు కలియుగము ప్రారంభించెను. గిరివ్రజపురమున సహదేవుని కుమారుడైన సోమాధి మహాభారతయుద్ధమైన తరువాత రాజయ్యెను. అతఁడు బదియెనిమిదేండ్లు రాజ్యము చేసెను. అనఁగా కలి ప్రవేశించిన తరువాత నిరువది రెండేండ్లు రాజ్యము చేసెనని యర్థము. జరాసంధుఁడు, వాని కుమారుఁడు సహదేవుఁడు, వాని కుమారుఁడు సోమాధి, వీరివంశమునకు బార్హద్రథ వంశమని పేరు. ఈ బార్హద్రథ వంశమువారు యుధిష్ఠిరుని తరువాత వేయిపైన నారేండ్లవరకు రాజ్యము చేసిరి. అప్పుడు ప్రద్యోతవంశము మగధసింహాసనముపై ప్రతిష్ఠింపఁ బడెను. ఆ వంశము కలియుగమున పదునొకండు వందల నలుబది నాలుగేండ్లవరకు గిరివ్రజపురమున రాజ్యము చేసెను. అప్పటి నుండి పదునేను వందల నాల్గువరకు శిశునాగవంశము రాజ్యము చేసెను. ప్రద్యోతులలో చివరివాఁడు నందివర్ధనుఁడు. శిశునాగులలో మొదటివాఁడు శిశునాగుఁడు. ప్రద్యోతులైదుగురు. శిశునాగవంశము కలిలో పదునొకఁడు వందల నలుబదినాల్గు మొదలు పదునేను వందల నాల్గువరకు రాజ్యము చేసెను. అనఁగా క్రీ. పూ. పందొమ్మిదివందల తొంబది నాల్గు మొదలు పదునారువందల ముప్పది నాలుగువరకు ఈ శిశునాగవంశమున పదిమంది రాజులు కలరు. వారిలో

మూఁడవరాజు పేరు క్షేమవర్మ. నాల్గవవాఁడు క్షేమజిత్తు. ఐదవవాఁడు బింబిసారుఁడు. ఆరవవాఁ డజాతశత్రువు. బింబిసా రాజాత శత్రువుల నామములు నేటి చరిత్రయందు ప్రసిద్ధములే. బింబిసారుఁడు గౌతమబుద్ధునికంటె నైదేండ్లు చిన్నవాఁడు. అనఁగా సిద్ధార్థుఁడును బింబిసారుఁడును సమకాలికు లగుటయే కాదు; కొంచెము వ్యత్యాసముగా సవయస్కులు. ఈ బింబిసారుఁడు కలియుగము పండ్రెండు వందల యెనుబది యారు మొదలు పదమూఁడు వందల యిరువది నాల్గువరకు రాజ్యము చేసెను. అనఁగా క్రీ. పూ. పదునెనిమిది వందల యేఁబది రెండు మొదలు పదునెనిమిది వందల పదునాల్గు వరకు. పాశ్చాత్యులు వ్రాసిన చరిత్ర ప్రకారము గౌతమ బుద్ధుఁడు క్రీ. పూ. ఆరువందల యేండ్ల క్రింద నున్నట్లు నేటి చరిత్రలలో వ్రాయఁబడుచున్నది. మన పురాణములలోనున్న లెక్కలకును పాశ్చాత్య చరిత్రకారుల లెక్కలకును పండ్రెండు వందలయేండ్ల వారడి కనిపించుచున్నది. పాశ్చాత్యుల లెక్క న్యాయమైనది కాదు. వారు బుద్ధిపూర్వకముగ మన పూర్వ కాల చరిత్రమునందలి సంవత్సరముల లెక్కను తారుమారు చేసిరి. వారి ప్రయోజనము వారిది. తదనుయాయుల వివేకము తదనుయాయులది.

శిశునాగవంశము మగధరాజ్యము నాక్రమించుకొనుటకు పెద్ద కారణమున్నది. శిశునాగుఁడు కాశీరాజు. ప్రద్యోతవంశములోని చివరిరాజు నందివర్ధనుఁడు. నందివర్ధనుఁడును శిశునాగుఁడును పినతల్లి పెదతల్లి బిడ్డలు. నందివర్ధనునకు పురుషసంతానము లేదు. ఆతని కొక్కతె

యే కుమార్తె. ఆమెపేరు వేదమరీచి. వేదమరీచి చిన్ననాఁటినుండి విచిత్రమైన మనఃప్రవృత్తికలది. ఆమె యొక్కవభాగము గిరివ్రజపురమున పెరిగెను. వేదమరీచి జన్మించినంతనే యామెతల్లి చనిపోయెను. ఆమెను కాశీరాజు తల్లిదుఃఖమును మఱచిపోవుటకు తీసికొనిపోయెను. అప్పటికి శిశునాగుఁడు కొంతచిన్నవాఁడు. శిశునాగుఁడును వేదమరీచియుఁగలసి యాడుకొనిరి. వయస్తారతమ్యమున్నను క్రీడాసాహచర్యముచేత వారొకరి నొకరు మిక్కిలిగా ప్రేమించికొనిరి. తొలుత నా ప్రేమ పినతండ్రికి నన్నగారి కూతునకు నడుమగలిగిన తండ్రికూతుఁర్ల ప్రేమయే. శిశునాగుఁడు నామముచేతనేకాక ప్రకృతిచేతఁగూడ శిశునాగుఁడు. కాశీరాజ్యము చిన్నది. మగధరాజ్యము పెద్దది. మగధరాజ్యము భారతయుద్ధమునాఁటినుండి ప్రసిద్ధమైనది. అప్పటికి సుమారు రెండువేల యేండ్లు గడచినప్పటికి బార్హద్రథవంశ మంతరించినప్పటికి జరాసంధుని మర్యాద గిరివ్రజపురమున మఱచిపోఁబడలేదు. ఈ భారతదేశము విలక్షణమైనదేశము. వేలయేండ్లు గడచును; లక్షలు గడచును. తత్పూర్వమందున్న మహాపురుషుని కథలు నిన్న మొన్నటివానివలె చెప్పికొనుచుందురు. మాంధాత యేనాఁటివాఁడు. రాముఁ డేనాఁటివాఁడు. ధర్మరాజాదు లేనాటివారు. మహాభారతయుద్ధముజరిగి యైదువేల యేండ్లు గడచినవి. నేఁటికిని భారతదేశములో నాకథలు దైనందినముగా గృహకృత్యములయందు సామాన్యవ్యవహారములయందు వాడుకొనుచునేయుందురు. పురాణకథలలోని బహువిషయములు నిత్యవ్యవహారములయందు ప్రాసంగిక

ముగా వ్యవహారానుకూలముగా ఉదాహరణ ప్రాయముగా సామ్యముకొరకుగా చెప్పికొంచునే యుందురు. పరదేశము లకు నీ దేశమునకు నిదియే భేదము. పరదేశములలో వర్తమాన మున కున్న ప్రాధాన్యము భూతమునకు లేదు. ఈ దేశములో భూతమునకున్న ప్రాధాన్యము వర్తమానమునకు లేదు. ఎంత అసన్నిహిత భూతమైనను సన్నిహిత భూతమువలెంగాదు, వర్తమానమువలెనే భారతీయులు వ్యవహరింతురు. దీనిలోని రహస్యమేమనగా భారతీయులకు జీవితమునందలి సారభూత మైన విషయము ప్రధానముకాని కాలము ప్రధానముకాదనన్న మాట. లక్షయేండ్లపూర్వము జరిగినదైనను వారును మను ష్యులే. వారికిని కోపతాపములు కలవు. వారికి నాలుబిడ్డలు కలరు. ఆలుబిడ్డలు కోపతాపములు కలిగియుండుట సార్వ కాలికముగా మానవజాతి లక్షణము. వ్యక్తులు భిన్నులగుట మానవుల యాయుస్సులయొక్క యల్పతమీఁద నాధారపడి యున్నది. జనన మరణము లంతనిత్యములో ధర్మాధర్మము లంతనిత్యములు. జనన మరణములు జీవులయొక్క తత్త్వాధ మత్వమునకు సంబంధించినవి. జనన మరణములకు ప్రాధాన్య మిచ్చినచో నెప్పటికప్పటికి వర్తమానమునకు ప్రాధాన్యము వచ్చును. ధర్మాధర్మములకు ప్రాధాన్యమిచ్చినచో భగవంతు నకు ప్రాధాన్యము వచ్చును. జీవునియొక్క నిత్యత్వమునకు ప్రాధాన్యము వచ్చును. అనంత శరీరములయందనుస్యూతమై ప్రయాణించుచున్న జీవునియొక్క జీవత్వమునకు ప్రాధాన్యమా? కాలకర్మవశమున తత్కాల సమాసన్న శరీరమునకు ప్రాధా న్యమా? శరీరప్రాధాన్య వివక్ష భారతదేశమునందు లేదు.

లేదనగా నధికమైన ధర్మబుద్ధిచేతనే లేదని యర్థము. అన్నాది సంగ్రహణమునందు తత్తత్కాలానుకూల సుఖసాధన సామగ్రీ సంయోజనమునందు లేదన్న యర్థమే లేదు. కృతక బుద్ధులు దుర్వ్యాఖ్యాజుష్టమతులు తద్వ్యాఖ్యాపరిణతబుద్ధులై ప్రతారణపరులై చెప్పవచ్చును. ప్రాధాన్యా ప్రాధాన్యములు రెండు నొకటి. అదియొక కక్ష. అప్రాధాన్యమును స్వీకరించి నప్పుడు దానియందే కొంతభాగము ప్రధానమైనది. తక్కిన భాగ మప్రధానమైనది. దానియంతటునది పరిశీలింపఁబడినపుడు తద్గతప్రధాన విషయములయందు శ్రద్ధచూపింపఁబడకపోవుట మానవుని స్వభావములో లేదు. మానవస్వభావగత తత్కాల గాఢత్వము పరామర్శించని బుద్ధిదుర్వ్యాఖ్యా పేశలముగా నుండును. కనుక సర్వపురాణములు భారతీయుని బుద్ధికి దైనందిన వ్యవహార సముపేతములై నిన్న మొన్నటివానివలె భాసించుచు తద్గతధర్మబోధక సామగ్రీభారముగా నుండుచున్నవి. ఇతరదేశస్థుల చారిత్రక బుద్ధికి భారతీయుల చారిత్రిక బుద్ధికిగల వ్యత్యాసము దీనియం దున్నది. అనఁగా భారతదేశమునందు జీవించుచున్న మానవులయొక్క జీవగతమైన విశిష్టతమీఁద నాధారపడియున్నది. జీవుఁడు నిత్యుఁడన్న భావము భారతదేశ నివసత్సర్వమానవ హృదయ పరిస్థా రమణీయమైన విషయము.

అందుచేత నాఁటి భారతదేశము నందలి యల్పరాజ్యములకు మగధ రాజ్యముమీఁద కన్ను. ఎవఁడు మగధరాజ్యమును పాలించునో వాఁ డధికుఁడు. మహాభారత యుద్ధానంతరమున పాండవులయొక్క ప్రశస్తి వందయేండ్లకు దాటి

లేదు. పరీక్షిత్తు జనమేజయుఁడు వారితో నించుమించుగా నంతరించెను. జనమేజయుని కొడుకు శతానీకుఁడు. యుధిష్ఠిరుని తరువాత శతానీకుఁడు నాల్గవరాజు. ఇరువదియైదవ రాజు జుదయనుఁడు. అతని కొడుకు కిన్నరుఁడు. శతానీకుడే హస్తినాపురమును వదలిపోయెను. నాటినుండి పాండవుల ప్రశస్తి తగ్గిపోయెను. సృష్టిలో నిదియొక రహస్యము. సృష్టి ఒక మహానది వంటిది. ఈ యేడాది వరదలు వచ్చెను. వరదలు పూర్వమున్న లంకను ముంచివేసి యా యిసుక నెత్తిపోసి మరియొకచోట వేస్చెను. రాజ్యముల లక్షణమిట్టిది. రాజ్యపాలనము రాజ్యముల స్థితియు లంకలోని వ్యవసాయము వంటివి. ఏఁటి కడుపులో పొలముదున్ని నాటుదురు. ఏరు పొంగి రాలేదు. పంట కోసికొని యనుభవింతురు. ఏరు పొంగి వచ్చి యూడ్చిన యూడుపంతయుఁ గుద్దాలించి యెక్కడిదాని నక్కడ నేల పట్టము చేయును. ఈ స్థితి కృత యుగాదుల నాటికంటె కలియుగ రాజవంశ చరిత్రలయందు మరియు సువ్యక్తమైన విషయము. ఒక దేశము మరియొక దేశమును జయించి యాచంద్ర తారముగ తా నచటఁ బీట నెట్టికొని కూర్చుందుమనని మేరుపర్వతములవంటి సౌధములను నిర్మించును. తాను రాజ్యము చేయుచున్న వందయో రెండు వందలో యేండ్లలో తన రాజ్య మస్థిరమని యెవనినో వచ్చి నను వాని నోట కరకకాయ కొట్టును. భగవంతుఁడా రాజ్యము నోటనే తుదకు దానిని కొట్టును ఈ రీతిగా ఏఁటి కడుపులోని వ్యవసాయమువంటి రాజ్యములు బెరుగుచుండును. కాని మగధరాజ్యము భారతయుద్ధమునాఁటినుండి మూడువేల

యేండ్లవరకు స్థిరముగానున్న రాజ్యము. తక్కినవాని కింత స్థిరత్వము లేదు. అందుచేత పురాణములలో కలియుగము నందలి భారతదేశ చరిత్ర చెప్పఁబడునపుడు మగధరాజ్య చరిత్ర యను సూత్రముగా చెప్పఁబడినది. కలి ప్రవేశించిన తరువాత మూఁడువేల యేండ్లు మగధరాజ్య మవ్యవచ్ఛిన్న ముగా సాగినది. ఇతరరాజులందరు మగధరాజ్యము నాక్ర మించిననే భారతదేశమున చక్రవర్తుల మగుదు మనుకొను చుండిరి. బార్హద్రథవంశ మంతరించిన తరువాత ప్రద్యోత వంశము వచ్చెను. ప్రద్యోతుని తండ్రి బార్హద్రథవంశపు తుదిరాజైన రిపుంజయునికి సేనాధిపతియునై యుండెను. అతని పేరు మునీకుఁడు. ఆ మునీకుఁడు తన కుమారుఁడైన ప్రద్యోతునకు మగధరాజ్యమును సంక్రమింపఁ జేసెను. వంశము భేదమైనను రాజ్య వ్యవస్థ మారలేదు. రాజ్యాధి పత్యము మారలేదు. బార్హద్రథవంశ మర్యాద చెడలేదు. ప్రద్యోతవంశము బార్హద్రథవంశము కాదన్నమాట లేదు. కలి యారంభించి యప్పటికి వేయియేండ్లు గడచెను. ప్రద్యోత వంశము నూటముప్పదియెనిమిదేండ్లు రాజ్యము చేసెను. శిశునాగుని నాఁటికి మగధరాజ్యము పరహస్తగత మైనదని చెప్పవలయును. శిశునాగుఁడు తా నాక్రమించి నప్పుడుగూడ మగధరాజ్య సింహాసనము పరహస్తగతము కాలేదని యాశ పడెను. కలియుగములో పదమూఁడువేండ్లు గడచునప్పటికి కలిపురుషుఁడు కొంత కొంత శక్తి సంపాదించికొన నారం భించెను. అతఁడు తన విలాసమును చూపింప నారంభించెను. నాల్గు యుగము లున్నవిగదా! యుగపురుషు లున్నారు.

వారు ధర్మాధర్మ స్వరూపులు. వారు నిత్యులు. వారు కాలాకృతులు ఎవనికి వీలైనప్పుడు వాఁడు విజృంభించును. కాలాకృతులు తేజోరూపధరులైన దేవతాత్మలు పాంచభౌతిక శరీరములుగా మానవుల నాశ్రయించి తమ లక్షణములను లోకమునందు వెలయింతురు. కలిపురుషుఁడు జరాసంధునియందు తాను తొలుత సంక్రమించెను. తాను విస్తరించుటకు నాఁడు కాల మనుకూలముగా లేదు. పదు మూఁడు వందల యేండ్లు తాను నిష్క్రియుఁడుగా నుండిపో వలసి వచ్చెను. శిశునాగుని నాఁటికి వానికిఁ గొంతబలము సమకూరెను. వింధ్యగిరిస్వామి తన శరీరమును వింధ్యగిరి పర్వత గుహా సమీపమున దగ్ధముచేసి వెలార్చిన ధూమ సంతానమునందు కలి విడంబించెను. ఆ ధూమ రేఖలతో కలి తాదాత్మ్యమును పొందెను. మేఘములు ధూమజ్యోతి స్సలిల మరుత్తుల సన్నిపాతములుగదా! భారత దేశమునందు గగనమునందుఁ గ్రమ్ముకొనిన వర్షామేఘములయం దీ ధూమా కృతియైన కలి ప్రవేశించెను. ఆ మేఘములు వర్షించును. అవి సస్యములగును. అవి యన్నమగును. ఆ యన్నమును భుజించి మానవు లగుదురు. ఆ మానవులయందు నీ ధూమ రేఖా లక్షణము నిస్సందేహముగా భాసించునుగదా! వింధ్య గిరిస్వామి శరీర నిర్గత మహాధూమ సంతానమున ప్రవేశించిన కలి వర్షారూపమున మేఘద్వారమున భారత దేశ జంతువుల యందుఁ బ్రవేశింప నారంభించెను, ఇట్లు ప్రయాణము చేయుచున్న ధూమమువంటి వస్తువు సహజముగా నొక చోట గుమ్ముగా నుండదు. ఒకచోట పలుచగా నుండును.

ఎక్కడ నెందు కెట్లుండునో మనకు తెలియదు. పొల ములో నెరువు తోలుదురు. తోలిన యెరువు పారలతో రైతు పొలములో సమముగానే విరజిమ్మును. దున్ని యూడ్చిన తరువాత సస్యమొకచోట పెద్ద దుబ్బు కట్టును. మరియొకచోట సస్యపు మొక్క బలముగా నుండదు. అట్లే యీ ధూమమును కొన్నిచోట్ల నధికముగా ఫలించి కొన్ని చోట్ల ఫలించదు. శిశునాగునియందు నధికముగా ఫలించెను. శిశునాగుడును వేదమరీచియును పినతండ్రియు కుమార్తె యును. తండ్రికి కుమార్తెకు వయస్తారతమ్య ముండును. పిన తండ్రికిని కుమార్తెయైన యొక స్త్రీకిని వయస్తారతమ్యముండక పోవచ్చును. లేకపోయినను వయస్సు ముదిరిన కొలది లోకమునందు వారు వారు తమయొక్క యీ రక్తసంబంధ మైన మర్యాదలు పాటించుకొందురు. జీవుడు జన్మించినపుడు వాని కేమియుఁ దెలియదు. గర్భమునందున్న జీవునకు తెలియు నందురు. అయ్యో! నే నీ గర్భనరకము ననుభవించుచుంటి నని వాఁడనుకొను చుండునట. తల్లి గర్భమునుండి వెలికి వచ్చినంతనే - భూపతనము జరిగినంతనే వానికి పూర్వస్మృతి పోవునని చెప్పుదురు. వాఁడీభూలోకయాత్ర తత్క్షణము ప్రారంభించును. అప్పుడు వానికున్న తెలివి యెట్టిది? వానికి లోకమేమియుఁ దెలియదు. పూర్వస్మృతి లేదు. ఉన్న దేమి? దేనికిని సంబంధించని వట్టి తెలివి. నిర్విషయకమైన యీ తెలివి తెలివిగా మాత్రమే యుండును. లోకమునం దొకఁడు వివేకి యందుము. అనఁగా భిన్న పరిస్థితులయందు భిన్న సంవిధాన ములయందు భిన్న విషయములందు సంయోజింపఁజేసి పరా

మర్శించి తాను చేయు నొక కార్యమునకు నధికాభిముఖ్యము, నధికాను కూలతయు నా పరిస్థితులయందు కలుగునట్లుగా వాఁడు వ్యవహరించును. వానిని వివేకియందుము. అనగా లోకమునందలి యొక పురుషుని వివేకము బహిస్సన్ని వేశముల బహిర్విషయముల నాశ్రయించి యుండును. తత్సన్ని వేశ తద్విషయ విరహితమైన వాని బుద్ధిలో నీ వివేకమున్నది గదా! కనుక వివేకమునకు దానిస్థితి దానికున్నది. అది బహిర్విషయ సంపర్కము చేత లోకమునకు భాసించుచున్నది. అట్లే మానవుఁడు జన్మించుటచేతనే వానికి స్ఫురణ యన్న వస్తువున్నది. దీనిని స్ఫురత్తయందము. ఈ స్ఫురత్త పరమేశ్వరుని చైతన్యము. ఈ స్ఫురత్తకు మూలభూతమైన చైతన్యము జన్మించకముందు బహు పూర్వజన్మగత విషయ సంబంధకమై యుండి జన్మించుటతోడనే నది యంతయు విస్మృతి పథమున బడి యప్పటినుండి యీ లోకమునకు సంబంధించిన విషయములను సంగ్రహించికొనుచు క్రమ క్రమముగా పెద్దవాఁడగు వరకు నీ సంగ్రహణము పరిణతిబొంది యప్పటికి వివేకవంతుఁడని చెప్పఁబడుటకు తగిన స్థితికి వచ్చును. ఇది మానవుని చరిత్రము. కాని జీవుని లక్షణమెట్టిదనగా వివేకము వచ్చియు రాకముందటి సమయమునందుండియు తానైన చైతన్యము నందుగల యొక సంస్కారమును భద్రపరచికొని వచ్చుచునే యుండును. లోకపరిజ్ఞానము సరిగా లేని చిన్నపిల్లలయందు కూడ బాలురయందుకూడ ధర్మవ్యక్తి మనకుఁ గనిపించుచుండును. ఆ పిల్లవానికది యనుభూతిలోనున్న విషయము కాదు. వాఁడు దానిని చెప్పను. తలిదండ్రులును బంధువు

లును వీనికిది యెట్లు తెలిసినదని యాశ్చర్యపడుదురు. వాఁడు తెలివిగలవాఁడని సంతోషింతురు. అట్టి ప్రకాశ మాపిల్లవాని కెచ్చటినుంచి వచ్చినది? అది వాని జీవసంపుటి యందలి యొక విశేషలక్షణము. ఒక ధర్మము బాలుఁడైనవాఁడు తగిన వయస్సులేక యనుభూతి లేక భాసింపఁ జేసికొని చెప్పఁగలిగి నచో నది వాని జీవసంపుటిగత పురాసంస్కృతి కలితమని వ్యాఖ్యానించినచో మరి యొక జీవునియందు నధర్మము కూడ నిట్లు భాసింపవచ్చును. అట్టి యధర్మము శిశునాగుని జీవసంపుటి యందు కలదు. దానికి హేతువు వింధ్యగిరిస్వామియొక్క దగ్ధశరీర సంగత ధూమసంతానవాహినీ సమాక్రాంత కలి పురుష లక్షణోపహితమైన యొక గుమ్మువాని తత్పూర్వ జన్మకృతాభ్యవహార భూతాన్నాదిక ద్రవ్యసంపన్నమైన యా ధూమరేఖ. లేదా వానితల్లి వానిని గర్భమునందు వహించి నపు డభ్యవహరించిన యన్నాదికములకు హేతువులైన సస్య మునందు సంక్రమించిన మేఘజలాంతర్గత తత్కలిపురుష మహస్సంతానము. ఈ శిశునాగుఁడు చిన్నప్పటినుండియు పెడతలవాఁడు. ఈ మాటకు వాచ్యార్థముకాదు.

వేదమరీచి యొక్క తండ్రియైన నందివర్ధనునకు తల్లి లేని బిడ్డను తన కూతును వదలియుండుట యిష్టమైన పని కాదు. కాని యతని వదినగారైన కాశీరాజు భార్య పిల్ల మగ పెంపకములో నెదిగినచో చెడిపోవునని ముఖవేళ వచ్చినపుడు పరామర్శ చేసినట్లుగాఁ గూడ నుండునని బాలికను తన వెంటఁ గొనిపోయెను. ఆమెను పంపించుట నందివర్ధనున కేమియు నిష్టములేదు. అతనికి పురుష సంతానము లేదు. రాజ్యమున

క్కొక యధికారియని యున్నచో వేదమరీచియే కావలెను. వేదమరీచి నాఁటికి పసిపిల్ల యనియే చెప్పవలెను. సర్వజనులును వేదమరీచిని నందివర్ధనుఁడు పంపించుటలో నందివర్ధనుఁడు మరల పెండ్లిచేసికొనునని భావించిరి. సహజమే కదా! నందివర్ధనుఁడు వయఃసుమీరినవాఁడు కాఁడు. అతఁడు తన భార్యను మొగలులోని మెఱపుతీఁగనువలె, గంగానదియొడ్డున విరియపూచిన తమ్మిమొగ్గనువలె, రసాలతరుశాఖాకిసాలయాగ్రమున పొడుచుకొని వచ్చిన చిగుపూఁతవలె, వర్షాసాయంసంధ్యా ప్రాచీదిశా సమావృతారుణ జలదరేఖాంతర్లీన సితకాంతి రేఖనువలె, తానము పాడుచున్న గాయకుని కంఠమునుండి సముద్గతమైన తీవ్ర పంచమస్వరమువలె ప్రేమించెను. భార్య బ్రతికియుండఁగా నతఁడు రాజకార్యములే చూడలేదు. ప్రద్యోతవంశము నందివర్ధనునితో మగధరాజ్య సింహాసనముసం దుండుట పూర్తియగునని కార్తాంతికుల మాట. భార్యయందు లగ్నమనస్కుఁడైన నందివర్ధనుఁడు జ్యోతిషము నిలబెట్టునన్నట్లుండెను. రాజు భార్యామనస్కుఁడై రాజ్యమునందు విమనస్కుఁడై యిట్లుండఁగా నెవరో పరరాజులు వచ్చి రాజ్యము నాక్రమింతురని ప్రకృతులు తలఁచిరి. ప్రజలు నట్లే యూహించిరి. కాని వేయి యేండ్లనుండి మగధరాజ్య సైన్యము భారతదేశమున తన పరాక్రమమునకు ప్రసిద్ధికెక్కినది. మంత్రులు సర్వదా నీతిశాస్త్ర నిపుణులు. రాజు స్త్రీలంపటుఁడైనంతమాత్రమున రాజ్యమునకు సేఁగి లేదు. ఆ జ్యోతిషము ఫలించు మార్గ మిట్లుండునని యెవ్వరికిని తెలియదు. మంత్రులుమాత్రము రాజ్యము పరహస్తగతము

కాదనియే యనుకొనుచుండిరి. అంతియేకాదు; పరహస్త గతము కానీయ మనియే యనుకొనుచుండిరి. భార్యావిముక్తుఁ డైన నందివర్ధనుని దుఃఖమునకు బడ భాగ్ని యెంతకలదో, ఆ సముద్రము చాలలేదు. దనుజగ్రస్తమైన ఇంద్రపరాక్రమ రేఖ చాలలేదు. అతఁడు బ్రతుకునని యెవ్వరు ననుకొనలేదు. అతఁడా సముద్రమును నిస్తరించెను. అతఁడు మరల పెండ్లి యాడు ననుకొనిరి. పెండ్లియాడలేదు. రాజ్యమునకు వేద మరీచియే యధికారిణి కావలసిన స్థితి కలిగెను. స్త్రీ రాజ్యాధి కారము పొందవలయునా? వలదా? యన్న ఇట్టి సందర్భము లలో ప్రజ లెట్టి యూహలు కలిగియుందురో యట్టియూహ లే మగధరాజ్య ప్రజలును పొందిరి. సులభముగా మేము స్త్రీ పాలితులము కాఁజాలమని చెప్పవచ్చును. కాని మానవ ప్రకృతియం దొక విలక్షణమైన రేఖ యున్నది. రాజును రాజుభార్యయు నొకరి నొక రంతగా ప్రేమించి యొకరిలో నొకరు చొచ్చికొని పోయిననాఁటి లంపటత్వ మెంత ప్రజల కనంగీకారముగా నుండెనో వారియొక్క పరస్పర ప్రేమ భావము నూహించిన ప్రజలకు దాని యందలి యనురాగము నభిమానము నంత మిక్కుటముగా నుండెను. అట్టి ప్రేమగల దంపతులకు సముద్భవించిన సంతాన మెంతటి యుదారమో, యెంతటి దివ్యభావనా సమన్వితమో, యెంతటి మధుర లక్ష ణమో యన్న భావము ప్రజలయందును ప్రకృతులయందును నిగూఢముగా నున్నది. పై మాటకు వేదమరీచి యాఁడుది. ఆమె రాజ్యమున కధికారిణి యెట్లగును? అని యందర నుచుండిరి. అనుచునే చిరునవ్వులు నవ్వుదురు. అన్నవాఁడును

విన్నవాఁడును దానిని నమ్మినవాఁడు కాఁడు. వేదమరీచి కాశీ పట్టణమున పెరుగుచున్నది. వారణాసీనగరము ప్రళయము నందైనను మునిఁగిపోనిది. శివ జటాజూటికా నర్తకియైన భాగీరథి త న్నగరసౌధ పార్శ్వముల నొరసికొని పావిత్ర్యము విరిసికొని సద్గుణములు మెరసికొని దేవతాలోకము లొరసికొని ప్రవహించుచున్నదికదా! అచట పెరిగిన వేదమరీచి యెంత పరమోదాత్త ప్రకృతి కావలయును? తల్లి గర్భమున నెన్నాళ్లుందురో అన్నాళ్లు వారణాసీ నివాసము చేసినచో మరణవేళ నెడమకు తిరిగి పండుకొనియున్న మానవుని చెవిలో పరమేశ్వరుఁడు వచ్చి తారకోపదేశము చేయునట. తొమ్మిది నెలలు కాదు. తొమ్మిదేండ్లున్నచో? పందొమ్మిదేండ్లున్నచో? ఆ జీవి చరితార్థమైనది. వేదమరీచి పందొమ్మిదేండ్లు వచ్చువరకు కాశీ నగరముననే యున్నది. నడుమ నడుమ గిరివ్రజపురమునకు వచ్చుచుండును; పోవుచుండును. ఒకసారి యేడాదికి వచ్చును. మరియొకసారి రెండుమూఁడేండ్లాగి వచ్చును. ఆమె వచ్చుట యాలస్యమైనచో గిరివ్రజ పౌరసంతానము తన్నుఁదాఁ బట్టుకొనలేక పోయెడిది. మా రాణి మము వచ్చి చూచి పోవలయును. ఆమెను దర్శించకుండ మేము మనఁజాలము. ఇంకెన్నాళ్ళు మా రాణి వారణాసీనగరమునం దుండును. ఆమెకు పందొమ్మిదేండ్లు వచ్చినవి. ఆమె వచ్చి తన రాజ్యమును తాను పాలించుకొనవలయును మొదలుగా శిశునాగునివద్దకు తత్పౌర ప్రజానాయకులు పోయి చెప్పికొన నారంభించిరి. ఈ ప్రజల యొత్తిడి పడలేక వేదమరీచి యప్పుడప్పుడు గిరివ్రజపురము

నకుఁ బోవును. ఆ పోయినప్పుడు గిరివ్రజము సుమస్రజము. పటవాస సముదయ బాలారుణ ప్రభామిళిత ప్రాతస్సూర్యాతప రమణీయచ్ఛవి సంతాన దంతురిత వాయువీచీ సమీచీన పరిమళ సంభార రంభాద్యప్సరోనాట్య ప్రాకట్య విముగ్ధ మనస్కులై, తత్పురీప్రజ నూతనవస్త్రాద్యాభరణాలంకృతులై, సెలవులను మీరిపోయిన నవ్వులతోడి మొగములు చేటలంత చేసికొనినవారై రథముమీఁద వచ్చుచున్న రాణిని బలవంతముగా దింపి పల్లకీ లెక్కించి బుజాలు మార్చి మోసికొంచు పండిముగ్గి మధుస్రావముగల పండ్లతో నిండిన మాకంద వనమునందు క్రొత్తగా ప్రవేశించిన వానర సమూహము చేసిన కిలకిలా రవముల యార్భాటము కలుగునట్లు విడంబించు చుండిరి. ఈదృశోత్సవముల దర్శనముచే నందివర్ధనుని మనస్సు శాంతి పొందెను. తనకు పురుష సంతానము లేక పోయినను తన కుమార్తెయే రాజ్యమున కుత్తరాధికారిణి యగును. ఆమె పెండ్లియాడును. తానే పెండ్లిచేయును. ఆమె కడుపున నొక కాయ కాచును. అతఁడు రాజ్యమునకు వచ్చును. ఇదియే కార్తాంతికుల వాక్యములకు ఫలము. తన దౌహిత్రుఁడు రాజ్యమునకు వచ్చినచో వానిది ప్రద్యోత వంశము కానక్కఱలేదు. అతనిది మరియొక వంశము. జ్యోతిషమిట్లు ఫలించును. అని నందివర్ధనుఁడు మనసులో నూహించుకొను చుండెను.

ఇట్లుండగా నెప్పటికప్పుడు వేదమరీచి తన రాజ్యమునకుఁ దా వచ్చి తన యధికారము తాను స్వీకరించవలయునని మగధరాజ్య మంత్రులయు ప్రకృతులయు ప్రజలయు విన్నప

ములు ప్రబలమయ్యెను. ఆమెకును తన రాజ్యమునకు తాను పోవలయునని యే యనిపించెను. కాని శిశునాగుని వదలి పోలేకున్నది. ప్రజల యొత్తిడి యెక్కువైన కొలది వేదమరీచీ శిశునాగులు పరస్పరము వేయి యాలోచనలు చేయ నారంభించిరి. వేదమరీచి యాలోచనకంటె శిశునాగుని యాలోచనయే యధికమయ్యెను.

ఒకనాఁడు మగధరాజ్య మంత్రులలో వృద్ధులైన యిద్దరు వారణాసీపురమునకు వచ్చి మేము వృద్ధులమై పోయితిమి. మహారాజైన నందివర్ధనుఁడు భార్యా విరహముచేత కుమారికా విరహముచేత చిక్కి శల్యమైనాఁడు. కూతురు వచ్చి రాజ్యము నాక్రమించి నంతటనే యాయన వైరాగ్యమును పొంది సన్న్యసింప నెంచినాఁడు. మహారాణీ! నీవు రాక తప్పదని బతిమాలి బలవంతము చేసి నేను వత్తునని యామెచేత ననిపించుకొని వెళ్ళిరి. వారు వేదమరీచితో మాటాడినంతసేపు శిశునాగుఁ డచ్చటనే యుండెను. ఇట్టి సమావేశములు జరిగినప్పుడెల్ల శిశునాగుఁడు కూడ నుండును. అతఁడెప్పుడును మాటాడఁడు. ఇది న్యాయమా? కాదా? మీరే చెప్పుడని శిశునాగుని వా రడుగుదురు. అతఁడు శిరము పంకించి యూరకుండును గాని నోటితో నవునని యనఁడు. ఆ మగధరాజ్య మంత్రులో ప్రజలో వెడలిపోయిన తరువాత శిశునాగుఁడును వేదమరీచియు కాశీరాజ సౌధాంతర్భాగమున నున్న యొక ప్రత్యేకపు గదిలో వేదమరీచి గిరివ్రజపురమునకు పోవుటను గూర్చి విచారించుటకు కలసికొందురు. వారిద్దరు నొక రెండు గడియలో మూఁడు గడియలో యొకరితో

నొకరు మాటాడకుండఁ గూర్చుండును. చివర కామెదారి నామెబోవును. ఇతనిదారి నితఁడు బోవును. అది వారి చర్చా సారాంశము. ఇట్లు పూర్వమెన్నియో సారులు జరిగినది. ఈసారి మరలఁ గలిసికొనిరి. సామాన్యముగా శిశునాళఁడేదియో చెప్పునని యామె యూరకుండును. ఆమె చెప్పునని యతఁ డూరకుండును. 'వేదమరీచీ! వ్యవహార మిట్లున్నదిగదా నీ వెందుకుపోరాదు?' అని యతఁ డనునని యామె ప్రతీక్షించు చుండును. అతఁ డననే యనఁడు. ఎందుకనఁడు? ఎందుకనఁడో తనకు తెలి యదా? తనకు తెలియును. అందుచేత తాను బలవంతము చేయదు. తా నేమాటయన్నచో నతఁడేమాటయనునో? తుదకది విరసముగాఁ బరిణమించునేమో. ఈ సందర్భము కాని పెరసందర్భములయందు వారిద్దరొకరి నొకమాటాడు కొనుట యుండనే యున్నది. ఒకరి నొక రాక్షేపించుకొనుట యున్నది. ఒకరి నొకరు నిందించుకొనుట యున్నది. తన జీవితము నతఁడు పాడుసేసెనని యామె యాతని నుపాలంభించి ఏడ్చి తుద కతనిచేత నొకవిధమైన లాలనముపొంది తృప్తి యని చెప్పుటకు వీలులేని యొక తూష్ణీంభావము నవలంబించి వెడలిపోవుట కలదు. అట్టి పరిస్థితి గిరివ్రజపురమునకు పోవు టకు సంబంధించిన సమయములం దెప్పుడును జరుగలేదు. ఇపు డామెకు పందొమ్మిదేండ్లు వచ్చినవి. ఆమెకుఁగూడ నెదలోఁ దానుపోయి తన రాజ్యమును దాను సంబాళించు కొనవలయునని యున్నది పోవలదని యున్నది. పోయి లాభము లేదని యున్నది. అచ్చటికిఁ బోవుటకంటె తా నాత్మ

హత్య యేల చేసికొనరాదు? ఆత్మహత్య చేసికొన్నచో జను లేమనుకొందురు? దానికి హేతు వేమని చెప్పికొందును? దీనికి శిశునాగుఁడు హేతు వనుకొందు రేమో! మగధరాజ్యము పెద్దది. కాశీరాజ్యము చిన్నది. మగధసైన్యమువచ్చి కాశీ రాజ్యము నాక్రమించుకొనునేమో! శిశునాగుని సంహరింతు రేమో! సంహరించినచో సంహరింపనిమ్ము. అతఁడు నిజ ముగా సంహరింపఁబడఁ దగినవాఁడే. అచ్చెముగా దోషమత నిదా? తనది మాత్రముకాదా! ఆ మహాపాపములో తాను తక్కువచేసినదా? తక్కువే చేసినది. యథార్థముగాఁ దనచేత నా పాపమతఁడు చేయించెను. తాను చేసెనా? లేదా? తన యంగీకారమున్నదా లేదా? తత్కాలమున సుఖాశ తన్నుఁ బట్టుకొన్నదా? లేదా? అతఁడెంతపాపియో తాను నంతపాపిని. అందుచేత మగధసేనలువచ్చి కాశీరాజ్యము నాక్రమించరాదు. ఈ మహాపాపము బహిర్గతముకాకుండుటకు తాను గిరి వ్రజ మునకుఁ బోవలయును. రాజ్యాధికారమును స్వీకరించ వల యును. తాను వెళ్ళినచో శిశునాగుఁడు బ్రతుకఁగలఁడా? శిశునాగుని యూహ లెట్టివో తనకు తెలియవు. అతఁడు చెప్పఁడు. ఇందులో మరియొక యాపద గలదు. తాను గిరి వ్రజపురమునకుఁ బోవును. తన తండ్రియు, తన మంత్రులును తన కిదివరకే యెన్నో సంబంధములు మాటాడి యుంచిరి. వారిలో నెవరినో యొకరిని తాను పెండ్లియాడక తప్పదు. తాను పెండ్లియాడుట శిశునాగుఁ డంగీకరించఁడు. తాను పెండ్లి యాడినచో శిశునాగుఁడు విసముత్రావి చచ్చును, లేదా కత్తితో పొడిచికొని చచ్చును. లేదా యేదో సాకుపెట్టి

తాను గిరి వ్రజపురమునకువచ్చి తన్ను కత్తితోఁ పొడిచి చంపి తాను పొడిచికొని చచ్చును. ఇంతకును దానే పెండ్లియాడుట కిష్టపడుటలేదు? తా నెందుకు పెండ్లియాడవలయును? ఇది రెండవ పాపము. తాను పెండ్లియాడదు. పెండ్లియాడక యేమిచేయును? తండ్రికేమి సమాధానము చెప్పును? ప్రజల కేమి సమాధానము చెప్పును? తన యంతరాత్మలోఁ దనకుఁ దానేమి సమాధానముఁ జెప్పికొనుచున్నది? ఏమైననుసరే. ఈనారి కవురిద్దరు నా సౌధాంతర్భాగమున నీసంగతినిగూర్చి చర్చించుటకు సమావేశమై యుందురు. పూర్వమువలెకాదు. తానే మాటాడును. ఏదో తేల్చికోకపోయినచో మరల మగధ రాజ్యమంత్రులు పూర్వమువలెకాదు. నాల్గైదు దినములలో మరల వత్తుమని చెప్పిపోయిరి. వారు రాకముందే నిర్ణయ మేదో జరిగితీరవలెను. కనుక తానే మాటాడును అనుకొన్నది. కాని గుండె దిటవు చాలలేదు. ఇద్దరును చాలసేపు నిర్వాక్కులై కూరుచుండిరి. అది యలవాటే. కొంతసేపటికి శిశునాగుఁడే ముందు లేచిపోవును. అతఁడు లేచిపోవుననగా నొక యరగడియకు మున్ను వాని శరీరచలనము వాఁడులేచి పోవుట కుత్సహించుచునాఁ డన్న విషయమును చెప్పును. అట్లు జరిగినది. వేదమరీచి మేల్కొన్నది. మాటాడినది. 'శిశు నాగా! నేను మగధరాజ్యమునకు పోవలయును.' అన్నది. శిశునాగుఁడు "నీ యిష్టము" అని వెడలిపోవుటకు లేచి నిలుచుండెను. నిలుచుండుటయు బయలుదేరుటయు రెండు కార్యములు కాకుండ నిలుచుండుటయే బయలుదేరుటగాఁ జూచి

యామె యతని చేయిపట్టుకొని నిలఁబెట్టెను. "ఇది న్యాయము కాదుకదా! నేను పోకపోయినచో మరల నాల్గు దినములలో వారు వత్తురు. ఇది యప్రతిష్ఠకు హేతు వగును. నాకు పం దొమ్మిదేండ్లు వచ్చినవి. నా తండ్రికి ముద్దు ముచిపెములు దీర్చిన దాననుగాను. రాజ్యమున కుత్తరాధికారిని సమ కూర్చిన దాననుగాను. ప్రజలను సంతోషపెట్టిన దానను గాను. జరాసంధుఁడు పాలించిన ధరాఖండమునకు సప్రతిష్ఠను తెచ్చిన దాననుగాని ప్రతిష్ఠను తెచ్చిన దాననుగాను. నీ వేమందువో నాకు తెలియును? నీవు జరాసంధుని సంతాన మవుకావు. ప్రద్యోతుని సంతానమవు: ప్రద్యోతుఁడు బార్హద్రథ వంశస్థుఁడు కాఁడు. వాఁడు మునీకుని కొడుకు. మునీకుఁడు సామాన్యుఁడు. ప్రద్యోతుఁడు రిపుంజయుని కూతును బెండ్లియాడెనే కాని వాని కొడుకైన పాలకుఁడు రిపుంజయుని దౌహిత్రుఁడు గాఁడు. బార్హద్రథ వంశము నకును నీకును సంబంధము లేదు. మఱిల నట్లే కానిమ్ము? నీవిట్లు వాదింతువు. నాకుఁ దెలియును. మరల నట్లే యీ మగధరాజ్యమున నేల సంభవింపవలయును? ఎట్లు జరుగునో! ఎట్లు జరుగదో మనకెందుకు? నీదొక వేదాంతము. మన యిద్దరి బ్రతుకులకుఁ దోడు మనకు వేదాంత మెందులకు? మనము చెడిపోయితిమి. నీవు నన్ను బాగుచేసితివని నేనన్నచో నీకు గిరివ్రజపురమునకు చుట్టున నెన్ని పర్వతములున్నవో యంత కోపము వచ్చును. నే నామాట యనఁబోవుట లేదు. అని ప్రయోజనము లేదు. నీవు నన్నాక్షేపింతువు. నాది కూడ దోషమందువు. దోషము నాయందు లేనేలేదని

నేనను. ఓయీ! ఒక నది ప్రవహించుచున్నది. దారిలో నొక పర్వతమున్నది. ఆనది వచ్చి పర్వతమును కొట్టుకొన్నది. అచట పర్వతముండుట దోషమా! ఆ పర్వత మచ్చట నుండ వలయునని తాను గూర్చున్నదా? ఈ పర్వతమున కెదురుగా నేను పోదునని యీనది సంకల్పించినదా? ఇది మన యిద్దరి పాప బుద్ధ్యనుకూల స్వభావ చర్చ. వాని నన్నింటి నట్లు బెట్టుము. నేను మగధరాజ్యమునకుఁ బోదును. వెళ్ళిన తరు వాతి నక్కడి వ్యవహారము లెట్లుండునో నాకుఁ దెలియును. నీకును దెలియును. మన యిద్దరి రహస్యమునకు నెప్పుడో నెక్కడో యొక చివరయని యుండవలయును. ఆ చివర దాని యంతట నది సంభవించదు. దానికి మనమే తుది నేర్పరచ వలయును. అది యెట్లు పరిణమించునో మనకు దెలియదు. పరిణామ ఫలమేదైనఁ గానిమ్ము. నే నిప్పుడు పోక తప్పదు. నీవు వల దనరాదు. ఏదియైనచో నది గానిమ్ము. నేను దానికి సిద్ధము. నీవును సిద్ధము కమ్ము."

## 3

"ఆరాజ్యముమీఁద నంత ప్రేమయెందులకు? శరీర మున్నది. మనస్సున్నది. శరీరముతో నొక భోగమనుభవించ వచ్చును. మనస్సుతో వేయి భోగము లనుభవించనవచ్చును. ఈ శరీరము లేనిచో మనస్సు లేదు. శరీరముతో వచ్చిన మనస్సు నకు శరీరమునకంటె నెక్కువ ప్రాముఖ్యమెందులకు? నిజ

ముగా సుఖమన్నచో శరీరమునకు సంబంధించినదే సుఖమగును. మనస్సులేనిచో శరీరముతోడి సుఖము మాత్రమెట్లనుభవించఁగలఁడని కొందరందురు. శరీరమునంటికొని మనస్సున్నది. శరీరమును మనస్సును రెండుకావు. ఒక్కొక్కపుడు మనస్సులేకుండకూడ శరీర ముండవచ్చును. ఉన్మత్తులున్నారు. వ్యాధిగ్రస్తులున్నారు. వారిశరీరములు మనస్సునకు సంబంధములేకుండ పనిచేయవచ్చును. అందుచేత నవి రెండును విడి విడివని చెప్పుటలో తర్కపుగడుసుఁదనముండ వచ్చునుగాని యథార్థ్య ముండనక్కరలేదు. ఈ శరీరములో నెవఁడో యొకఁడున్నాఁడందము. వానికే శరీరముకలదు గాన వానిని 'శరీరి' యందము. వాని తొలుతటిపేరు శరీరి. శరీరము కలిగియుండుట వానికి ప్రధానలక్షణము. ఉన్న యీశరీరముతో వాఁడు సౌఖ్యమును సంపాదించును. ఈ శరీరముతోడనే వాని మనుగడ. అట్టిశరీరమునుండి ఏసుఖము ననుభవించుచున్నాఁడో ఆ సుఖముకంటె మనోజన్యమైన సుఖమధికమనుట శరీరి యన్నశబ్దముయొక్క యర్థమును సరిగా భావించకపోవుట. వేదమరీచి నాకంటె తనరాజ్యమెక్కువదనుకొన్నది. మంత్రులువచ్చి నీవే మారాణివి. నీవులేకుండ మగధరాజ్యములేదు. ప్రజలు నీకోస మత్తెత్తి చూచుచున్నారు మొదలైన మాటలుచెప్పిరి. ఆరాజ్యము, ఆభోగము, ఆ మాటలలోని వ్యామోహము తన శరీర సుఖముకంటె నెక్కువని యనిపించినది. ఇది శరీరికి శరీరముయొక్క ప్రాధాన్యమెరుఁగనితనము. ఆరాజ్యమంత తీపియా? ఆ రాజ్యముపోయినచో నేమిచేయును ? ఎన్నిరాజ్యములు పోవుటలేదు ? రాజ్య

ములు స్థిరములా ? మరియు మగధరాజ్యము నందివర్ధనునితో ప్రద్యోత వంశాంతమగుననని పెరరాజుల గొడుగుక్రిందికి పోవునని కార్తాంతికులు చెప్పుచునేయుండిరి. ఇది పంద్రెండు వందల యేండ్లనాటినుండి వచ్చుచున్న ప్రథ. దానియందవిశ్వాసము నెరవుదమన్నను నూట యిరువదియేండ్లక్రింద బార్హద్రథ వంశముపోయి ప్రద్యోతవంశము మగధరాజ్య సింహాసనము నాక్రమించుకొనెనని చెప్పఁబడినమాట యథార్థమైనది. దాని బలము దీనికిని గలదు. ఈ వేదమరీచి తా నాడుది. క్రొత్తగా మురిపెముకొలది మాగధు లీమెను రాజ్ఞిగా నంగీకరింతు రనుకొందము. ఈమె వివాహమాడదు. ఎందుకాడవని ప్రశ్నింతురు. ఏమి సమాధానము చెప్పును ? వివాహమాడనిచో నీమెకు సంతానము కలుగదు. రాజ్యమునకు వారసులెవ్వరు? ఎవ్వనినైన పెంచికొనునా? మంత్రు లీమెను దత్తత చేసికొమ్మందురా? ఇప్పుడీమె పందొమ్మిదియేండ్లది. ఇంక కనీసము ముప్పదియేండ్లైన దాటకుండ దత్తతప్రసక్తిరాదు. ఈ ముప్పదియేండ్లలో దినదినము వివాహము చేసికొమ్మని ప్రకృతు లీమెను బలవంతపెట్టుదురు. ముప్పది మూఁడువందల యఱువది దినము లీమె యీ యొత్తిడికి తట్టుకొనఁగలదా? అప్పుడప్పుడు వచ్చి నన్నుచూచి పోవుచుండునా? కాక నేనే పోయి యీమెను చూచి వచ్చుచుండవలయునా ? ఆమె యెవనినో పెండ్లి యాడక తప్పదు. గరళము మ్రింగించినట్లు వేదమరీచి చేతఁ బెండ్లియాడింతురు. ఆడి యేమిచేయును ? ఎట్లాడును ? నా కర్థమగుటలేదు. మా యిద్దరి పరిస్థితి యెట్టిది ? మా ప్రమాణము లెట్టివి ? మా పాపమెట్టిది ? ఈ పాప

ములో మే మొక గట్టిముడి కట్టితిమి. ఆ ముడి త్రెంచరానిది. సర్వ పాపములకు మూలభూతమైన ముడి. ఈ పాపమును మేము సమర్థించుకొనవలయును. ఈ పాపమునందు మేము జీవశక్తులను మహాంధకారమునందు మునిగించవలయును. ఈ పాపము మహాంజనముగా నిర్మించి మా యొడళ్ళం బులిమికొని మేము పిశాచతాండవము సేయవలెను. మా తాండవము మాకే తెలియును. పరులకు తెలియదు. అచ్చరవోని వేదమరీచి యొక్క దేహ ధావళ్యమునందు, రాజకుమారుడైన శిశునాగుని రాజవంశ మర్యాదానుకూల మైన వేషభాషణాదులయందు, లోకమా యంజన ప్రభలను చూడలేదు. ఆ యంజనప్రభలు మా యిద్దరికే కనిపించును. పెద్ద శిలలుగా నేర్పడిన యా కాటుక తెరళ్ళ నడిమి భాగ ములో మేము దూరి యుంటిమి. అది మా త్రెంచరాని సంబంధము. జ్ఞానముతో కూడిన సంబంధములో పుణ్యముతో కూడిన సంబంధములో నెడ ముండును. పాపసంబంధములో నెడముండదు. అది యంతటి చిక్కన. నాల్గుదెసల నదుము కొని క్రిక్కిరియునట్లుగా ప్రతిక్షణ సముపజాయమాన మహా భయ విచిత్రానుభూతిమయమైన యొక పాపసంబంధము లోకములోని సర్వమైన యజ్ఞానమునకు మూలకంబమువంటిది. దానిని మే మిరువురము కౌగిలించుకొన్నాము. ఆ పాపము మా యిరువురి శరీరములయందు ప్రత్యణువునందు బహిరంతః ప్రదేశముల నత్తుకొని విడదీయరానిదిగా నున్నది. వేదమరీచి వెడలిపోవునని నే ననుకొనలేదు. ఆమెకుం దన తండ్రియొక్క రాజ్యము నంతటి మమకార మెందులకు? ఈ మహాపాప

మునకు నా మమకారమున కేమి సంబంధము? ఈ పాపము శరీరము నంటుకొని యున్నదాయెను. ఇది యిచ్చటి నిచ్చటనే బుగులుకొని రగులుకొని తెగులుకొన్న వహ్నిచేత తెగులుకొన్న చిత్తముచేత తెమల్చుకోరాని యొక పరిస్థితి. రాజ్యమనుభవించవలయునన్న భోగాశ దీనితో సంబంధము లేనిది. శరీరముయొక్క యచ్ఛమైన పాశవమైన, పాపభూయిష్ఠమైన సృష్ట్యధోగతమైన యొక భావమునకును, మనస్సునందొక తెరపి గలిగి బహు ప్రజా సుఖసమ్మిళితమైన భావనతో కూడుకొనిన పుణ్యసంస్పర్శ కలిగిన ధర్మసంబంధమైన రాజ్యాధికార వాంఛకు నెంతటి దవ్వు? అది యెచ్చటనో స్వర్గలోకపు పొలిమేరలలోనిది. ఇది నరకలోకపు నడిమి ప్రదేశమునఁ గల మూల సౌధములోని యంతఃపుర ప్రదేశమువంటిది.

"నేను వలదనలేదు. అందుకని వెళ్ళినదా? నేను వెళ్ళుమనలేదు. అందుచేత వెళ్ళరాదు.' ఇదివర కెన్నిసార్లు మగధరాజ్య మంత్రులు వచ్చి మే మిద్దర మా ప్రసంగము చేయుటకు నేకాంతముగా కూర్చుండెడివారము? ఏమియు పలికెడివారము కాదు. పలుకుట కేమియున్నది? మాయిద్దరి మనస్సులకును మా ప్రమాణములయు, నస్మదనుబంధములయు, అస్మత్సంబంధముయొక్క పరమార్థలోక నివసన స్థితియు, గట్టిగా తెలియును, మాటాడుట కేమి యున్నది? అట్లే మొన్నను జరిగినది. తానేదో యుపన్యాసము చెప్పినది. పోదునన్నది. అట్లా పూర్వ మెన్నడు ననలేదు. నాకాశ్చర్యమైనది. బహిః పరిస్థితుల యొత్తిడిచేతఁ దాత్కాలికముగా చీఁకటి యొత్తిగిలవచ్చు ననుకొంటిని. అరే! ఈ చీఁకటి

వెలుఁగు రేకలచేత తాడితమై విశ్లథము కాఁదగినది కాదే. అచ్చటికి వెలుఁగు రేకలు రానే రాఁగూడదు. ఆ యంచులందు వెలుఁగు రేకలు తాకినను తక్కిన చీఁకటివలె నీ చీఁకటి చెదరి పోవునది కాదు. ఇది శిలాభూతమైన యాంధ్యము. చీఁకటి కొండమీఁద సూర్యుఁడు పడి యేమిచేయును. ఆ నల్లఁదనమును మరింత నల్లఁదనముగా ప్రకాశింపఁ జేయఁగలఁడేమో కాని కొండయొక్క నల్లఁదనమును విరువలేఁడు. కొండగా కట్టిన మా పాపపు చీఁకటి యిట్లు వేదమరీచి యొక్క రాజ్యాధికార వాంఛచేత బెళ్ళు యూడిపడునని నే ననుకొనలేదు.

"నాలు గెల్లని గుఱ్ఱములు కట్టిన రథము. సహదేవుఁడు పార్థునిమీఁది విరోధముతో నతఁడు శ్వేతవాహనుఁడగుటచేత తా నరుణవాహనుఁ డనిపించుకొనుటకు తన బండి గుఱ్ఱము లెఱ్ఱవానిని జేసెను. నాఁడు మొదలు బార్హద్రథ వంశమునందే గాక ప్రద్యోతులుకూడ నా సంప్రదాయమునే పాటించుచు వచ్చిరి. ఆ యెఱ్ఱని గుఱ్ఱములు కట్టిన తేరిమీఁద మంత్రులు వేదమరీచిని తీసికొనిపోయిరి. అది రాజరథము. చండీపతాకాభిరామమైనది. రథము ముందర నేన్గుమీఁద రాజఖడ్గము నడిపించిరి. ఆ యేనుఁగు పరంపరాప్రాప్తమైనది. అది సుప్రతీక సంతానము. మరియు నెన్నియో మగధరాజ్య మర్యాదలతోడి భోగములతో నా మెను తీసికొనిపోయిరి. ఆ యెఱ్ఱని గుఱ్ఱములు కట్టిన రథముమీఁద, పరంపరగా వచ్చుచున్న బార్హద్రథ పూర్వరాజ చరిత కథా చిత్రములచేత నలంకరింపఁబడిన తిరిగి తిరిగి మణులతో బంగారముతో నానా చిత్రములను నిత్య ప్రత్యగ్రములుగా సంతరించుటచేత కనులు

మిరుమిట్లు గొలుపుచున్న రథముమీఁద, నిత్యపరిపోషణచేత నీగకాలు జారెడి నునుపు గలిగి బహుమణి విచిత్రమైన బహువర్ణ రమణీయ పీతాంబర మనోజ్ఞమైన గుఱ్ఱాలు కట్టిన రథముమీఁదఁ దా నెక్కి వెడలుటకు వేదమరీచియొక్క మనస్సులోని వ్యామోహ మెట్టిది? ఆ రథముమీఁద నెక్కి పోవలయునని యాశపడినది. పూర్వము జరాసంధుఁడు భూమియందుకల సర్వరాజులను జయించి వారిని దెచ్చి బందీ చేసి దిన దిన మొక్కొక్కని చండీదేవికి బలి యిచ్చుచు నేక త్రితో నరకెడివాఁడో ఆ కత్తి మగధరాజుల రథము పోవు చుండగా ముందు చనుచున్న యేన్గుమీఁద బార్హద్రథ వంశ మహా ప్రతాప పతాకగా ముందు సాగింపఁజేయుట మఱియొక మహాభోగమని మహా మగధరాజ్య సింహాసనస్థుల యభిప్రా యము. ఆ యభిప్రాయమే వేదమరీచికి కలిగినది. నందివర్ధ నుఁడు ముసలివాఁడైనాఁడు. ఆయన యింకెన్నాళ్ళు బ్రతు కునో తెలియదు. వేదమరీచి గిరివ్రజము చేరినంతనే యాతఁడు వానప్రస్థాశ్రమము స్వీకరించునేమో! ఈ వేదమరీచికి రాజ నీతి తెలియునా? నా మర్యాదలు తెలియునా? అంతఃపుర మర్యాదలు తెలియునా? నాతో నాడుకొనినది. ఉద్యాన వనములోని వంద పుష్పముల పేర్లు తెలియును. చల్లని గాలి కెరటముల తాకులలోని భిన్న భిన్న స్పర్శ లక్షణములు తెలియును. కోకిలల కూఁతలోని మాదక లక్షణము తెలి యును. సీలమండల లోతు సికతా ప్రవాహముల సంచరించు చిరు చేపల సన్నని మీనాల తళ తళలు తెలియును మేమిరు పురము పోయి గంగానది నెప్పుడును స్పృశించలేము. గంగలో

నుండి చెడునీళ్ళుకూడ బుద్ధిపూర్వకముగా త్రాగలేదు. ఎప్పుడో ముప్పదియో నలుబదియో యేండ్లు దాటినతరువాత నిద్దరము కలిసి పాదములయందు మమ్ము నీళ్లు పైకి తేలించ కుండ రాళ్ళు గట్టికొని గంగలోనికి దిగి నడచి పోవుద మను కొంటిమి. గంగ మమ్ము తేల్చలేదు. అందుచేత మేము తేల్చఁబడ నెంచలేదు. అంతవరకు గంగానదిని తాకవలదని ప్రతినలు చేసికొంటిమి.

"వేదమరీచికి రాజ్యాశయెందులకు? మంత్రులు వచ్చి బలవంతము చేసినారని తాను మెత్తఁబడినదా? మెత్తపడెడు లక్షణమే సన్నిహితము కాకుండ నుండిన యొక విచిత్ర పరిస్థితి యందున్న జీవి యెట్లు మెత్తఁబడును? అది యసంభవమైన విషయము సంభవమైనది. అనఁగా వేదమరీచి మా నడుమఁ గల పరిస్థితులచేత నెట్టి రూపు కట్టవలయునో అట్లు కట్ట లేదని యర్థము. ఈ పాపము నాయందు సాధించినంత ద్రఢిమ యామెయందు సాధించలేదనియా? అధిక పాపము నాది. నా పాపపు టూహల యొత్తిడిచేత నామె మనసు మృదూ కృతమైనదనియా? ఆ దోషము నాయం దధికముగా నారో పించుటయా?"

ఇట్లూహించుచు శిశునాగుఁడు సాయంకాల ప్రతీచీ దిశా సమావృత నీలాంభోధరచ్ఛటా పరితాడిత పశ్చిమ దిక్పరివ్యాప్త నీలకాంతి గహ్వరములయందు చొచ్చుకొని పోవుచున్న, వానివలెఁ దద్దిశా ప్రమాతుఁ డగుచుండెను. రాజకుమారుఁడు కాలినడకన బయలుదేరుటకు సేవకులు తత్తర పడి రథము సజ్జము చేయుటకు ననుసరించి వచ్చుటకు నొకరి

నొకరు కనుసన్నలతో హెచ్చరించుటకు నాయత్తపడు చుండిరి. శిశునాగుఁడు కోటగవను దాటి నడలిపోయెను. అతని పోవుచున్న లక్షణములో తిదనుసరణమతని కసభిమత మని తెలిసెను. వారిలో వారే తాము వెనుకకు తగ్గిరి. శిశు నాగుఁడు భాగీరథి ప్రవహించని ఇతర దిశాభిముఖముగా పోవుచుండెను. రాజు కొడుకు కాల్నడఁ బురివీధులందు పోవుట పలుమంది పౌరులచేత సామీప్యమునందు శిరసులు వంచుకొనుటయు, కొంత దవ్వు పోయిన తరువాత వెను తిరిగి నిశ్చర్యపోయి చూచుటయుఁ జేయించినది. శిశునాగుఁడు పురముయొక్క చిట్టచివరి యిల్లుఁ గూడ దాటిపోయెను. దాటిపోయిన తరువాతఁ గ్రమముగా చీఁకట్లు బలియఁ జొచ్చెను. ఇంతలో తిరిగి వచ్చుననుకొన్న రాచకొడుకు ఎంతలోనను రాక పోవుటచేత ననుసరించని సేవకుల యెడఁదలు కళవళం పడెను. శిశునాగుఁడు పోవుచుండెను. చీఁకట్లు ముదురుచుండెను. ఎరువు చిక్కగా నంటుకొన్న చోటఁ బొల ములోఁ గట్టిన వరిదుబ్బు ముదిరి నలుపెక్కినట్లు తిరిగినయూచ మరునాఁటికి బిరుసెక్కి చేతులకంటి కొనునట్టి శ్యామలత్వము నకుఁ దిరిగినట్లు, పాంసులా సాయంకాలవిటప్రతీక్షా శకలి తాపాంగ సన్నిహిత గాఢాంజనరేఖ యట్లు, బ్రహ్మరంధ్రగిరిజ నూనెచేత బిరుసెక్కి నునుపెక్కి యొక మెత్తఁదనములో పొడి పొళ్లాడు మాతంగకన్యా శిరోజములట్లు, దుష్టభర్తృదత్త గాఢ చపేట విక్రుతాసృగ్ఘనీభవద్బిందు సంచయ సమాలోకిత సాధు భార్యాసితచ్ఛటా కలిత మృదుకపోల దృశ్యమాన శలాకా రేఖయట్లు, కలిపురుష వికటాట్టహాస విపరీతకాంతి

రేఖా ప్రసారమట్లు, అదర్శనీయాగ్ని సంజనిత బహు ధూమ రేఖా సమాహారభూత నీలమేఘమునట్లు, ఇదమిత్థమ్మని నిర్ణయింపరాని స్పష్టతలేని చిక్కుపడిన కలుషభావముల కలయికచేత గలిగిన యొక యూహా పటమువలెఁ జీఁకట్లు క్రమపరిణామమును పొందెను. శిశునాగున కా ప్రదేశములన్నియు పరిచితములే. నేఁ డపరిచితములవలె నున్నవి. ఆ చీఁకటిలోఁ దూలుచు లేచుచు నతఁ డట్లే పోవుచుండెను. అతఁ డేదిశగా పోవుచున్నాఁడో యతనికిఁ దెలియదు. ఎంత దవ్వుపోయినాఁడో తెలియదు. యదభిముఖముగా పోవుచున్నాఁడో తెలియదు. కొంత ప్రొద్దుపోయినది. అతనికి దవ్వున నొక చిన్న నిప్పువలె కనిపించినది. అచ్చట నెవ్వరో మనుష్యులుండవచ్చునని దానిని గూర్చి నడువ నారంభించెను. ఆ యగ్ని కొంతసేపు కనిపించుచున్నది. కొంతసేపు కనిపించుట లేదు. మరలఁ గనిపించువరకు నట్లే నిలుచుండి మరల నడచుచుండెను. ఒకచోట చిన్న నీటిపడెలోఁబడెను. ఆ నీరు స్వచ్ఛమైనదా? పంకిలమైనదా? ఎట్టిదో తెలియదు. తాను కట్టిన వసనము తడిసెను. అతనికి వెనుఁదిరికి పోవలయునన్న యూహయే రాలేదు. వెనుదిరిగి పోఁదలఁచికొన్నను నీతనికి వెనుకతట్టేదియో తెలియదు. తన దేహమునకు వెనుకతట్టు కలదు. ఆ వెనుక నేమున్నదో తెలియదు. తాను ముందరికిఁ బోవుచుండెను. అదియే వెనుకతట్టేమో? ముందర వెనుక అన్న యీ రెండుమాటలు తన శరీరమునకు సంబంధించినవి మాత్రమే యయ్యెను తా నెచ్చటనుండి వచ్చెనో తా నెచ్చటికి పోవుచుండునో తద్భావములయొక్క

స్వరూపాభిజ్ఞానము కలవానికి వెనుక ముందరలన్న శబ్దములకు లౌకికార్థము కలదు. వేరే యుద్దిష్టార్థము కలదు. తానెక్కడ నుండెనో తెలియనివానికి వెనుక ముందరలు స్వశరీర సంబంధములైనవి. అట్టి యజ్ఞానమయస్థితిలో దూరముగాఁ గనిపించుచున్న నిప్పు వెనుకనైనను ముందరనైనను నిస్సందేహముగా ముందరయే. తదభిముఖముగా పోవుటయే చేయఁదగినది. మరియొకటి లేదు. ఆ యగ్ని కొంతసేపేల కనిపించును? కొంతసేపేల కనిపించదు? ఎవఁడైనను కూర్చుండి తిరిగి తిరిగి యెండుటాకులో యెండుకసవో వేసి దానిని ప్రజ్వలింపఁ జేయుచుండెనా? వాఁడేదైన పొదలో కూర్చుండెనా? ఆ పొదను గ్రమ్మిన యాకులు గాలికి తొలఁగినపుడు కనిపించి తొలఁగనపుడు కనిపించుట లేదా? ఆ యగ్ని యొక పల్లము లోనుండి చీఁకటిలోఁ దనకు తెలియకుండ తాను మెట్టపల్లములయందు నడచుచుండుటచేత మెట్ట ప్రదేశమునందున్నప్పుడు కనిపించి పల్లమునకు దిగినప్పుడు కనిపించుటలేదా? తాను కొంతదూరము నడచెను. ఆ నిప్పు తనకుఁ గొంత దగ్గరకు రావలసియుండెను. మొదట నెంతదూరమున్నదో నిప్పుడు నంతియే దూరమున్నట్లున్నదే. దూరమనునది నడచుటచేత తగ్గవలయును. తన మనస్సులోనున్న దూరభావమునకు తగ్గుటలేదేమో! ఆ దూరభావమెప్పుడు నిట్లే యుండునేమో! ఆ దూరభావమునకట్టి లక్షణము కలిగియున్నచో దాని దూరము దూరముకాదు. అది దూరముగా నున్నట్లుండునుగాని నిజముగా దగ్గర నున్నదియే. కనుక తాను నిప్పు దగ్గరకు వచ్చియే యుండవలయును. మరియుఁ జీఁకటిలో వట్టి

బయలు ప్రదేశమున నిర్జనమైనచోట దూరముగా కనిపించు నిప్పు దగ్గరకుఁ జేరినవేళ కూడ దూరమందున్నట్లే కనిపించును. సరిగా దానిదగ్గరకు వెళ్ళేడువరకు నది దూరమునందున్నట్లే యనిపించును.

శిశునాగుఁడా యగ్నిదగ్గరకు పోయెను. అనఁగా నది దగ్గరకు వచ్చెను. ఆ యగ్ని వట్టి యగ్ని కాదు. దాని కెదురుగా నొక పురుషుఁడు కూర్చుండి యుండెను. ఆ యగ్ని యొక్క కాంతి వాని మొగముమీఁద పడుచుండెను. వాని మొగము పిశాచవదనమువలె నున్నది. శిశునాగుఁడు వీరుఁడు. అతఁడు భయపడలేదు. అతఁడు కత్తికూడ చేతిలో లేకుండ వచ్చెను. శిశునాగుఁడు యమమహిషము నైనను తన బాహువులతో దాని కొమ్ములు పట్టికొని విదలించఁగల వాఁడు. అతఁడు భయపడలేదు. ఆ పురుషుఁడు తలయెత్తి శిశునాగుని వంకఁ జూచెను. నిలుచున్న శిశునాగుని మొగము వానికిఁ గనిపించలేదు. శిశునాగుని యూరుభాగములందలి దుస్తులు మాత్రము వానికిఁ గొంత లీలగాఁ గనిపించెను. కాని తలయెత్తిన యా పురుషుని శిరోభాగమంతయు శిశునాగునకుఁ దెలిసెను. వానికొక వికృత జటాభాగమున్నది. ఆ జటలు త్రాళ్లుగాఁ జేనికొని యున్నవి. వాని గొంతు పొడుగు, మొగము కోల, చెక్కిళ్లు లోనికి త్రోసికొనిపోయి యున్నవి. కన్ను లెఱ్ఱగా నున్నవి. కనుబొమలమీఁది వెండ్రుకలు ధూసర వర్ణములై దుబ్బులు కట్టియున్నవి. కనుబొమ్మలపైని గుమ్మైన వెండ్రుకలు కనురెప్పచివర దీర్ఘములై మీసముల వలె మెలితిరిగియున్నవి. కన్నులు కనిపించుచున్నవి కనుక,

తలయెత్తినాఁడు గనుక, జడలాడుచున్నవి. కనుక, వాని యందు ప్రాణము లాడుచున్నవని తెలిసెను. లేనిచో నది యొక నత్వగస్థిపంజరము. పిశాచములకు భయపడునంత భీరుఁడు కాఁడు శిశునాగుఁడు వాఁడు పిశాచమును కాదు. వాఁడెత్తిన తల మఁగల వంచెను. అచ్చటనున్న యగ్ని చాల స్వల్పమైనది. చిమకులమంటకూడ కాదు. అదియొక కఱ్ఱ, దానినుండి యొక సన్నని ధూమరేఖ వెలువడుచున్నది. ఆ కఱ్ఱను పురుషుఁడు మరల మరల నిప్పుతో ముట్టించు చున్నాఁడు. అగ్ని దానియందు సంయోజితమైన సమయము నందును నా కాష్ఠ మొక సన్నని ధూమరేఖను వెలార్చు చుండెను. ఒకటి రెండు నిమేషము లటు నిప్పుగానుండి మరల మరల నారిపోవుచున్నది. ఆ యగ్నికి నిజముగా దీప్తి యుండ వలసిన యవసరము లేదు. ఒక కాష్ఠమునందున్న యగ్నికంత దీప్తి రాదు. ఆ దీప్తి లేనిచో వాని మొగమును శిరమును నిరూపింప బడవు. ఆ కట్టె యేమికట్టెయో? మాటి మాటి కారిపోవుట యేమి? మరల మరల వెలిఁగింపఁబడుట యేమి? నిమేష మగ్నివంతమగుట యేమి? తత్కాల నిర్వామ ధూమ రేఖా సహితమగుట యేమి? ఆ పురుషుఁడా ధూమరేఖను తా నొక గొట్టముతో పీల్చుచుండెను. వానికి తద్ధూమరేఖా పానమునం దున్నంత శ్రద్ధ యెదురుగా నిలుచున్న పురుషుఁ డెవరా యన్న విషయమునందు కలుగలేదు. వాఁడు కాక మరి యెవ్వఁడైనను నీ వెవ్వఁడవని యడుగును? వాఁడు భయపడ లేదని చెప్పవలసిన యవసరమును లేదు. త్వఙ్మాత్ర పరిశిష్టమైన యస్థిపంజరమునకు భయ మెందులకు? కాని

వానియందు ప్రాణమున్నదిగదా! ప్రాణ మున్నంతసేపు భయమున్నది. భయము బహిఃపరిస్థితుల నాశ్రయించి యుండదు. ప్రాణము నాశ్రయించి యుండును. వానియందుఁ బ్రాణమున్నది. వానికి భయమున్నది శిశునాగునియందుఁ బ్రాణమున్నది. శిశునాగునకు భయమున్నది. శిశునాగునకు భయము లేదు. వానికి భయము లేదు. భయము లేదన్న మాట కర్థమేమనగా దన బాహుబలముచేతఁ దా నెట్టి యాపద నైనను నెదుర్కొని సమర్థించుకొనగలనన్న ధైర్య మితని కుండుటయు, నాకేమి పోవునన్న యొక నైరాశ్యము, లౌకిక మైన పరమహీనస్థితియు వాని కుండుటయు అందుచేత నిద్దరు ధైర్యవంతులు, నిర్భయులు కాదు. ధైర్యము భయమును తొలఁగఁ బెట్టును. భయము నంకురించకుండ చేయలేదు. పైగా భయ మంకురించునది కాదు. నిత్యమైనది సహజమైనది. దానికి భాసాభాసములు కలవు. భాసించుట యంకురించునట్లు గన్పించును. వీఁడెవఁడు? ఈ ధూమపానమేమి? నన్ను చూచి యేల భయపడఁడు? నీ వెవ్వరవని యెందుకడుగఁడు? నేను మనుష్యుఁడను కాకపోవచ్చును. ఒక పిశాచమును కావచ్చును. ఒక భూతమో యొక పిశాచమో వచ్చి తన యెనుకగా నిచ్చట నిలుచుండుటలో నచ్చెరు వుండదు. వీఁడు పిశాచ భయములేనివాఁడు. భూతములకు బెదరని వాఁడు. ఒకవేళ భూత ప్రేత పిశాచములు వీని యదుపులో నున్నవేమో! అపుడు వీనికి వాని భయముండ నక్కరలేదు. అసలు వీఁడు మానవుఁ డేలకావలయును? వీఁడొక భూత మేమో! కాని యీ ధూమపానము ప్రేతేతరవృత్తి. పిశా

చేతర వృత్తి. పిశాచాదులు ధూమపానము చేయున ట్లెక్కడను వినికిడి లేదు. మానవులే ధూమపానము చేయుదురు. వీడు మానవుఁడు. నిస్సందేహము. అని శిశునాగుఁ డనుకొనుచుండగా నా పురుషుఁ డిట్లనుకొనెను. వీఁడు పిశాచముకాదు. అగ్నిదీప్తములై వలగల దుస్తులు కన్పించుచున్నవి. ఎవ్వఁడో గొప్ప వంశమువాఁడు. వట్టి ధనవంతుఁడుకాదు. అంగీయందింతటి జరీపని వట్టి ధనవంతుల కుండదు. వీఁడు రాజవంశీయుఁడు. రాజవంశీయుఁడీ యర్ధరాత్రమున నొంటరిగా నెందుకు వచ్చును? వాని మనస్సు చెడిపోయి యుండవలయును. వీఁడేదో యాపదలోనుండి యుండవలయును. వాఁడు ప్రేమించిన స్త్రీ మఱియొక్కని వివాహ మాడినదో, తాను సాధించలేని శత్రువు తన యింటిముంగిట వచ్చి కూర్చుండెనో. ఆ శత్రువు పరరాజు కాఁడు. పరరాజైనచో వాఁడు సేనలతో పురమును ముట్టడించును. వీఁడు రానే రాలేఁడు. వాఁ డాప్తుఁడైన పురుషుఁడు కావలయును. వానికిని వీనికిని విరోధము కావలయును. వానిని వీఁడు సాధించలేకపోయి యుండవలయును. ఇతఁ డా స్థితిలో నుండెనా? వీఁడు రాజుకాఁడు. రాజైనచో ఇట్లొంటరిగా బయలువెడలి రాఁడు. రానీయరు. వీఁ డెక్కువ వయసుకలవాఁడు కాకపోవచ్చును. ఎందుకు వచ్చినట్లు? చీఁకటిలో నెందుకు తిరుగుచున్నట్లు? ఎవరు నీవని యెందుకడుగఁడు? అని యా పురుషుఁ డనుకొనుచుండెను.

దూరముగా నొక నక్క ఊళవేసెను. ఆ యూళనందుకొని పదినక్కలు మొఱసెను. ఆ సవ్వడితో నా నిర్జన ప్రదేశమునందు పరివ్యాప్తమైన తదగ్నిచేత, ప్రతిష్ఠాపితమైన

తత్పురుషాకృతిచేత, వివృద్ధమైన భయానకరస దేవతకు వాగ్వ్యవహారము ప్రాపించి నట్లుండెను. శిశునాగుఁడు వానిని పలుకరించవలె ననుకొనెను. ఇంతలో నొక నక్క- గోడేలు వంటి మొగముగలది, బలసి ప్రక్క-టెముకలు కనిపించరానిది, కుచ్చువంటి తోఁక తద్భయానకరసదేవతా చామరమువలె భాసించునది వారి యిద్దరి కెలనికివచ్చి వెంటనే భయపడి పారిపోయెను. అది పారిపోవుటకు హేతువేమి ? అచట నగ్ని యుండుటయా ? లేనిచో నా పురుషుని రొమ్ముపై కట్టె మోపని శవముకూర్చున్నట్లుగా భాసించి దంతములతో ,పీడించ ప్రయత్నించవచ్చునే ? వానినిచూచి భయపడుట యెందు లకు ? తాను నిలుచున్నాఁడు. తనకు దుస్తులున్నవి. చీఁక టిలో నక్కలు చూడఁగలవు. తనమీఁదికి వచ్చుటకు భయ పడవచ్చును. శతవిధాల నితఁడు దిగంబరుఁడు. బొమికల ప్రోవు. వికృతారుణ జటావిహీఁడైనను శరీరము కనిపించుచు నే యున్నది. ఈయగ్ని యెంతటియగ్ని ? శ్మశానములలో నగ్నియు శవములును సహస్థితములయే యుండును. ఈ మాత్రము నిప్పునకు నాజంబుకము భయపడవలసిన యవ సరము లేదు. ఆ జంబుక మెట్లు భయపడినది. ఒక పెద్దపులికి మిక్కిలి దగ్గరగా వచ్చినట్లు భయపడినది. కసిక్కున మెడ యందు లంకించుకొని నెత్తురు పీల్చికొను సివంగినిచూచి భయ పడినట్లు భయపడినది. కొరడాతో ఛడేలునఁ గొట్టఁగా చురు క్కుమనిన దెబ్బకు వెనుతిరిగినట్లు తిరిగినది. హఠాత్తుగా దూరమునకు దూకినది. అది పారిపోయినట్లు తనకు కనిపించ లేదుగాని తెలిసెను. దాని పాదములు పారిపోవుచుండఁగా

నేలయందుకలిగిన చిన్నచిన్న సవ్వడుల దగ్గరితనముచేత గాలి లేని వట్టియాకాశమున నది పరుగెత్తుచుండఁగా వేగముచేత దాని శరీరాంచలములయందు సముద్భవించిన యొకవాయువు యొక్క సన్నని సవ్వడిచేత నది పరుగెత్తుట తనబుద్ధికి భాసించెను. ఆ పరుగెత్తుటలో దాని భయము ప్రతీయమానమగుచుండెను. ఈ త్వగస్థిపంజరమునకు నది యంత భయపడనేల? వీఁడు పిశాచముకాదు సరికదా వీఁడెవ్వఁడో మాంత్రికుఁడై యుండనలెను. మాంత్రికులనుచూచి జంతువు లిట్లు భయపడును. వీఁడు మాంత్రికుఁడైనచో తానెవ్వరో వీనికి తెలిసియుండునేమో? అచటఁ గూర్చుండి తనకోసము ప్రతీక్షఁ జేయుచుండెనేమో! వేదమరీచియుఁ దానును గలిసి కట్టిన పాఁపుచెట్టుబోద వీని కభిజ్ఞలోనున్నదేమో! వాఁడు తిరిగి తిరిగి వెలిఁగించుచున్న కాష్ఠమాబోదలోని ముక్కకాదుగదా! అందులోని ధూమమును వీఁడు పీల్చుచున్నాఁడా? వీఁడు తనకు తన యిప్పటి స్థితినుండి వెలివడఁదగిన యుపాయము చెప్పదగినవాఁడు. వానియందులేని గుణములు తాను వానియం దారోపించుటలేదుకదా? వాఁడు మాంత్రికుఁడగుట సిద్ధము. వాఁడు పిశాచభయ రహితుఁడగుటయు, త జ్జంబుకము తద్భయ సహితమగుటయు సాక్ష్యములు. శిశునాగుఁడు "ఓయీ! యెవరునీవు" అనెను. వాఁడు తలయెత్తకుండ "కూర్చుండుము" అనెను. రాజకుమారుఁడైన శిశునాగుఁడచ్చట నెట్లుకూర్చుండును? అది యెట్టిప్రదేశము? ఇంతవరకతనికి తన యంగీ తడిసినదన్న గుర్తులేదు. కూర్చుండవలయునన్నయూహ పుట్టినయంతనే తడిసిన యంగీ గుర్తుకు

వచ్చెను. కూర్చుండక యేమిచేయును? తన కాళ్ళక్రింద రాళ్ళున్నట్లతనికి తెలిసెను. ఆ పురుషుఁడు "కాళ్ళక్రింది రాళ్ళటు నిటు త్రోసి కూర్చుండుము" అనెను. దానితో శిశునాగుని పైప్రాణములు పైనపోయెను. వీఁడెవ్వఁడో మాంత్రికుఁడు. వానికిఁ దా నెవ్వరో తెలియును. వాఁడు తన్నుచ్చటికి రప్పించెనేమో! శిశునాగునకు భయమువేసెను. శిశునాగుఁడు ధైర్యవంతుఁడే. ఆధైర్యమెట్టిది? శత్రువు మీఁదికి వచ్చినచో, నొకజంతువు తనపైకి వచ్చినచోఁ దేలికగాఁ దాను వారించుకోఁగలశక్తి తనకున్నదన్నధైర్యము. వీఁడు శత్రువుకాఁడు. వీఁడు పెద్దపులికాఁడు. సింహముకాఁడు. కాలిక్రింద రాళ్ళున్నవని సామాన్యముగా గ్రహించవచ్చును. తాను రాళ్ళు తొలఁగించుకొనియే తొలుతనచోట కూర్చుండి యుండును. దీనివలన వాని కతీంద్రియజ్ఞానము కట్టబెట్ట నక్కరలేదు. శిశునాగుఁడు రాళ్ళు తొలఁగించి కూర్చుండెను. కూర్చున్న తన మొగము వాఁడు తలయెత్తి చూచినచోఁ గని పించును. వాఁడు తలయెత్తి చూడలేదు. తొందరయేమి? సావకాశముగా చూడవచ్చునని యూరకున్నాఁడేమో! మరల నిప్పారిపోయెను. ఆరిపోయిన నిప్పును వాఁడుమరల వెలిఁగించ వలయునుగదా! ఏమి పెట్టి వెలిఁగించును? ఇనుప ముక్కతో రాతినికొట్టి దూది నంటించి వెలిఁగించవల యును? అచట నినుపముక్క లేదు. రాయిలేదు. దూది లేదు. మరల నా కాష్ఠ మంటుకొన్నది. ఎట్లంటుకొనదది? వీఁడెట్లు వెలిగించెను? శిశునాగునకుఁ దెలియలేదు. ఆ కాష్ఠమే కొంచెముసేపు వెలిగి కొంచెము సేపారిపోవునా? వానిచేతు

లాడినట్లుండెను. వాఁడు దాసిని వెలిఁగించిన ట్లుండెను. అరే! వానికి ధూమపానమునం దున్నంత శ్రద్ధ మరిదేని యందును లేదే. శిశునాగుఁడు "ఓయీ! నీ వెవరవు? నేనెవరనో నీకెట్లు తెలియును? నన్ను చూచి యేల భయపడవు? ఆ నక్క నిన్ను చూచి యెందుకంత భయపడినది? ఈ కాష్ఠాగ్ని ఏమి? ఈ ధూమపానమేమి?" అని యాగి యాగి ఈ ప్రశ్నలు వేయ నారంభించెను. వాఁడు దేనికిని సమాధానము చెప్పలేదు. మరల శిశునాగుఁ డిట్లనెను. "నీ వెవ్వఁడవో మాంత్రికుఁడవు కావలయును. ఆసృగాలము పొందిన చెట్ట భయమువలన నాకుఁ దెలిసినది. నేనొక యాపదలో నున్నాను. నాయాపద యెట్టిదియో నీవు చెప్పఁగలిగినచో నీవు నాకు సాయపడఁగలవో లేవో నేను తెలిసికొందును." అనెను. ఆ పురుషుఁడు మాటాడలేదు. శిశునాగుఁడు లేచి నిలుచుండి తాను పోవుచున్నాననెను. ఆ పురుషుఁడు "నీ ప్రేమ విఘటితమైనదని యేడ్చుచున్నావు." అనెను. శిశునాగుఁడు తలక్రిందు లయ్యెను. వాఁడు సర్వజ్ఞుఁడనుకొనెను. వాఁడో శిశునాగుని గురించి తనకు వచ్చిన పది యూహాలలో మొదటి దానిని చెప్పెను. అది ఘుణాక్షరమయ్యెను. శిశునాగుఁడు మరలఁ గూర్చుండెను. ఇట్లనెను "గురూ! నేను నీకు వశుఁడను. నీవు నన్ను సముద్ధరింపుము. నా భాగ్యరేఖ గొప్పది. ఈనాఁడే నా కాదెబ్బ తగిలినది. ఈనాఁడే నాకు తత్ప్రతిక్రియా మార్గము లభించినది. ఈ ప్రక్కనున్నది వారణాసీ నగరము. నే నారాజు కొడుకును నేనే యువరాజను. ఈ రాజ్యమున కుత్తరాధికారిని నేను. నేను నీ యాశ్రయమును

చొచ్చితిని. నన్నీయాపదనుండి రక్షించుము." అనెను. పురుషుండు కొంతసేపు మౌనమవలంబించి మరల నిట్లనెను. "కాశీపుర మిచ్చటికి నే దిశయందున్నదో నీకు తెలియునా! చీఁకటిలో నడచివచ్చి యుందువు. ప్రొద్దుపోయినది. పురమునందలి దీపము లార్పివేయఁ బడినవి. నీకు దిశ తెలియదు. మరికొంత సేపటిలో దివ్వటీలు తీసికొని రాజభటులు నీకొఱకు వెదకుచు వత్తురు. నీ విచ్చటనే యుండుము. వారు నిన్నుఁ దీసికొని పోదురు." శిశునాగుఁడు "స్వామీ! నేను నిన్ను వదలిపోను నేను నీతోడనే యుండెదను. నన్నీయాపదనుండి సముద్ధరింపుము." అనెను. ఆ పురుషుఁడు "ఓయీ! నీయాపద హృదయమునకు సంబంధించినది. నీవు బైరాగివై పోదువా? ఏల పోవలయును? నీయెడఁదమీఁద నాఘాతము తగిలినది. ఆస్త్రీ నీయందుఁ దనకున్న ప్రేమకంటె మరి యింకొకచోట నెక్కువ ప్రేమను కలిగించుకొన్నది. దానికి ప్రతిక్రియ చేయుట యెట్లనగా నే యితరమైన స్థానము తత్ప్రేమ భాజనమైనదో ఆ స్థానమును నీవు నశింపఁజేయుట, దానిమీఁద నీవధికారివగుట. అప్పుడు ఆస్త్రీ తాను చేసిన దోషము తెలిసికొనును. అట్లు చేయవలయునన్నచో బైరాగివికారాదు. పోయిన రాజ్యమునందు నీవుండవలయును." అనెను. శిశునాగుఁడు "స్వామీ! అది యేమైనను సరే, నేను నిన్ను వదలిపోను." అనెను, మరల పురుషుఁ డిట్లనెను. "నన్ను వదలకుండ నుండుటకు నాకొక యిల్లున్నదా! నేనొకచోట నుందునా! నావలె నీవగుదువా? రేపు తెల్లవారిన తరువాత నీవు నా వెంటబడి వచ్చుచున్నచోఁ జూచిన జను లేమను

కొందును. ఓయి యవివేకీ! నీ రాజధానికి నీవు పొమ్ము. నేను నిన్ను చూచుటకు వత్తును. నన్ను నీ కోటలోననే యుండిపొమ్మన్నచో నేనే యుండిపోదును. అంతకుమున్ను నీవు నా శిష్యుఁడవు కావలయును. శిష్యుఁడవైనచోఁ గదా నాకచ్చటికి రావలసిన యవసరమున్నది" యనఁగా శిశునాగుఁడు "స్వామీ! నేను నీకు శిష్యుఁడనే. నీ వేమి చేయుమందువో చెప్పుము, చేసెదను." అనెను. ఆ పురుషుఁడు తన చేతిలో నుండుచున్న యాకట్టెను శిశునాగుని చేతికిచ్చి ఈ ధూమపానము చేయు మనెను. శిశునాగున కంతలో నొక సందియము కలిగెను. ఆ ధూమపానము చేసినచోఁ దా నేమగునో? ఇది యేమి సందేహము? ఇది యేమి భయము? అతఁ డిట్లనెను. "నేను నీ శిష్యుఁడనగుటకీ ధూమపానము చేయవలయునా? ఇది యేమి యుపదేశము?" అనఁగా పురుషుఁడు "సరే! ఇష్టము లేనిచో వెళ్ళిపొమ్ము" అనెను. "కాదు స్వామీ! కాదిటు తెమ్ము" అని శిశునాగుఁడు చేయి చాచుటయు నతఁడీయకపోవుటయు రెండు మూఁడుసార్లు శిశునాగుఁ డభ్యర్థించుటయు, నతఁ డనుగ్రహించి యిచ్చినట్లు నటించుటయు, శిశునాగుఁ డా కాష్ఠమునుఁ జేతఁబూని నోటిలో ముక్కులలో నా ధూమరేఖను బోసికొనుటయు జరిగెను.

ఆ ధూమము తొలుత నీ వాసన యిదియని చెప్పరాని యొక వాసన వేసెను. బల్లిపెట్టినగ్రుడ్లను గేదెమూఁడ త్రొక్కఁగా నారసినుండి యొకకంపు వచ్చును. అది యాకంపువలె నున్నదా? అడవికడుపులో వేసంగిలో నొక నీటిపడియ యెండిపోయిన దెండిపోఁగా మిగిలినదానిలో రాలినయాకులు

తడియుచు నెండుచు పండుచు నీళ్ళకొక యెఱ్ఱని రంగుదెచ్చి యొకగాలు పుట్టించును. ఆ గాలువలె నున్నదా? శిష్యుఁడు వెంటనే కాష్ఠమును ముక్కునద్దనుండి తీసివేయుదమను కొన్నాఁడు. గురువు కోపించునేమో! తాను శిష్యుఁడు కాకపోవునేమో! ఆకాష్ఠము నట్లే యుంచినాఁడు. ఆకంపులో నుండి ఆగాలులోనుండి యొకసహ్యాతి భాసించెను. ఇప్ప పూవులు కొండలపైనుండి కోసి తెచ్చి కుంకుమములో నారఁ బెట్టగా నవియెండి దట్టమై యొకమాగువాసన దేలును. ఆ వాసన యిప్పపూవునందు భాసించదు. ఆ యిప్పపూవులను నమలినపుడు ఘ్రాణేంద్రియమునందా తావిభాసించును. అది యెట్లుండుననఁగాఁ గంచెలవెంట విషముష్టిఫలములు, పుల్లరేఁగుబండ్లు, రేఁగుబండ్లు, రక్కెసపండ్లు మొదలైనవి పడి, చితికి కొన్నాళ్ళు మాగి యొకవాసనను వెలార్చును. ఆవాసన యసహ్యామనుటకు వీలులేదు. ఆవాసన ఘ్రాణేంద్రియమున కొక మాదకశక్తిని సంపాదించును. ఘ్రాణేంద్రియము మదించును. మదించుట యనగా తదింద్రియజ్ఞానము పోదు. దానికితరమైన సూక్ష్మవిషయ పరిజ్ఞాన ముండదు. వాడు మదించినాఁడనఁగా వానికొక దెబ్బకొట్టము. వానికి తగులును. కాని వాని మదించిన శరీర మాదెబ్బను లెక్కచేయదు. మొద్దుబారిన యొక శరీరైకదేశమందు కత్తితో కోసినచోఁ గోసినట్లు తెలియును. బాధయుండదు. కాలిమడమయందుగాని కాలివ్రేళ్ళచివరలందుకాని చర్మము బిరుసెక్కి ఆనుకట్టును. ఆ యానును గత్తితోఁ గోయుదుము. కత్తికోయుచున్న యనుభవ ముండును. బాధలేదు. మదముయొక్క లక్షణమిట్టిది.

ఆ కాష్ఠనిర్గతధూమము వాని ఘ్రాణేంద్రియమున కట్టి లక్షణమును సంపాదించెను. అది యంతటితో నూరకుండలేదు. మెదడులోనికిఁ జొచ్చెను. శిశునాగున కొకయూహవచ్చెను. తనయు వేదమరీచియు సంబంధము పాపమునుకొన్నాఁడేమి? అది సహజమైనది.

౪

దివ్వటీలతో తనకొరకు వెదకుచున్న రాజభటులను భిన్న దూర ప్రదేశములనుండి శిశునాగుఁడు చూచుచున్నను తా నచ్చట నుంటినని వారిని పిలిచి చెప్పలేదు. తాను వారిని కలిసికొనుటకు ప్రయత్నించనులేదు. వారికైనను పురుషుఁడు ధూమపానము చేయు నగ్ని కాష్ఠము కనిపించినచో నది యేదో యగ్ని, ఎవ్వరైన నచట నుండవచ్చునని శిశునాగునివలె దలఁచి రాఁదగినదే. కాని రాజభటుల దూరపు దివ్వటీల వెలుఁగు తోఁచినంతనే యా కాష్ఠాగ్ని యారిపోయెను. శిశునాగుఁడా ధూమరేఖాపానమును చేసిన తరువాత కాష్ఠమును మరల నా పురుషున కందించెను. కాష్ఠము మరల వెలుఁగలేదు. కొంతసేపటికిఁ బురుషుఁడచ్చట లేకపోవుట శిశునాగుఁడు తెలిసికొనెను. తెలిసికొనెనే కాని పురుషుఁ డచ్చట లేమికై విచారించలేదు. అతని మనస్సు తా నొక మంకుగొండితనము నవలంబించెను. అది తాత్కాలికమో నిత్యముగా నుండునదియో యతనికే తెలియలేదు.

తెలిసికోవలయునని ప్రయత్నముకూడ చేయలేదు. అతని కాయూహాయే రాలేదు. శిలా ప్రతిమవలె నచ్చట కూర్చుండి యుండెను. మిక్కిలి యాయాసముతోఁ జేసిన యన్వేషణము పెక్కు గడియలు గడచిన తరువాత నుషోరేఖలు సన్న సన్నములైన చిత్ర చిత్రములైన వెలుఁగు కణములను జగము నావరించిన చీఁకటి భాండములో కనిపించకుండఁ దెలియకుండ గ్రుచ్చి యెత్తి నడుకాకిబంగారపు గనులుగల దేశములో ఁ జ తళుకు రేకుల సన్న సన్నని ముక్కలు నేలమీఁద నున్న మట్టిలో కలిసియుండి హఠాత్తుగా తళుక్కున్నట్లు తదాషః కాలపు చీఁకటిలో నుషోరేఖలు చిత్రముగా వ్యాపించి యుండును. వానికి కాంతి కలదు, లేదు. అవి యంధకార మును తొలఁగించును. తొలఁగించవు. చీఁకటియొక్క దట్టపు తనము కొంచెమైనను శిథిలీకృతము కాదు. కాని యేదో కనిపించెడులక్షణము లేఁతగా భాసించును. కనిపించ దనియే చెప్పవచ్చును. కనిపించును. అవి గ్రుడ్డి చీఁకటు లనుటకు వీలులేదు. నిజమునకు గాఢాంధకారమే. కాని లీలగా నేదియో భాసించుచుండును. అట్టి భాసమునందు దూరముగా నెవ్వరో కూర్చున్నట్లు దివ్వెటీల వెలుఁగునకు దూరముగా సంచరించుచున్న రాజభటులకు గోచరించెను. దివ్వెటీలు చేఁబూనినవారికిఁగాని తత్కాంతికి సమీపమునందున్నవారికిఁ గాని దూరములు భాసించనే భాసించవు. అంధకారములో దూరములు భాసించుట యంధకారములోనున్న వానికే జరుగును. వెలుఁగులో నున్నవానికి చీఁకటిలోనున్న వస్తువు కనిపించనే కనిపించదు. అంధకారలోకములు వేరు. జ్యోతిర్లోక

ములు వేరు. అంధకారములలో నున్నవారికి జ్యోతిర్లోకములో నున్నవారు కన్పింతురు. వారిని గురించి తెలిసికొనవచ్చును. జ్యోతిర్లోకములలో నున్నవారికి నంధతమస లోకములలో నున్నవారగుపించరు. వెలుఁగు చీఁకటిని సంహరించునుగాని చీకటిలోఁ జూడలేదు. చీఁకటి వెలుఁగు నేమియుఁ జేయలేదు. వెలుఁగులో నున్న దానిని విస్పష్టముగాఁ జూడఁజాలదు. చీఁకటిలో నున్నవారికి చీఁకటిలో నున్నవారు కన్పింతురు. అందుచేత దివ్విటీలకు దూరముగా సంచరించుచున్న రాజభటులు శిశునాగుని గుర్తుబట్టిరి. ఎవ్వరో యచట కూర్చున్నట్లు వారికి భాసించి యతని దుస్తులమీఁది హేమమణి కిరణ సంతానము చేత కలిగిన గుర్తు విస్పష్టముగా కలిగి పోయి రాజకుమారుని సందర్శించిరి. పిలుపులతో దివ్విటీ లచ్చటికి వచ్చెను. శిశునాగుఁడు మాటాడలేదు. కొంతసేపటికి వారి బహుప్రార్థనా ఫలితముగా నతఁడు లేచి వారి ననుసరించెను. అంతకును కాశీనగర ద్వారములోనికిఁ బ్రవేశించు వేళకుఁ జీఁకట్లు తూర్పు ప్రాకారపు గోడకు కాలుక మెత్తినట్లు హత్తుకొనుచుండెను. రాజసౌధము ప్రవేశించిరి. శిశునాగుని తండ్రికి తన్నిశాభాగ మంతయు నిద్దుర లేదు. కొడుకెచ్చటికో పోయెనని రాత్రి ప్రొద్దుపోయి యాయనకు తెలిసెను. ఆయన శతవృద్ధుఁ. అయినను మంచి యారోగ్యవంతుఁడు. కాలుసేతులాడుచున్నవాఁడు. అప్పటిని గుఱ్ఱముమీఁద స్వారి చేయఁగలవాఁడు. వలసినచో కత్తి చేఁబూని యుద్ధరంగమునం దవతరించి శత్రు శిరఃకర్తనము చేయఁదగిన శక్తి యొకఁడలునందు కలవాఁడు. పురుషునకు వార్ధకము పెరిగినకొలది పుత్రేషణ

మధికమచుండును. ఇది సహజ లక్షణము. మరియు శిశు నాగుఁడు జన్మించినదాదిఁ గార్తాంతికులు శిశునాగుఁడు భారత దేశ చక్రవర్తి యగునని చెప్పుచు వచ్చిరి. తదనుకూలముగా శిశునాగుఁడు మహా పరాక్రమశాలి. రాజనీతి విశారదుఁడు. ఖడ్గవిద్యా నిపుణుఁడు. మిక్కిలి సాహసుఁడు. ఈ గుణము లతో కార్తాంతికుల జోస్యమునందు విశ్వాసము తండ్రికిఁ బెరిగెను. ఆ కొడుకును వదలి నిమేషము మనలేఁడు. సర్వ ప్రాణము లతనిపైననే పెట్టికొని బ్రతుకుచుండెను. కడచిన పదియేండ్లుగా వేదమరీచియు శిశునాగుఁడును నిత్యసహ వాసము చేత బహు విహార కాలములయందుఁ దనకుఁ బ్రతి దినము నెక్కువకాలము సన్నిహితులు కాకపోయినను శిశు నాగుని యునికిని గూర్చిన ప్రత్యయము వానిని వెన్నంటియే యుండెను. అతని సుస్థితిని గురించిన భావమే యా వృద్ధ రాజును బ్రతికించు చుండెను. తెల్లవారులు వృద్ధభూపతికి నిద్దుర లేదు. రాజభటులు శిశునాగునిఁ దొట్టతొలుత రాజ దర్శనమునకుఁ దీసికొనివచ్చిరి. అది రాజాజ్ఞ. కొడుకును చూచినగాని రాజునకు మనశ్శాంతి లేదు. నిద్దుర పట్టదు. వేదమరీచి మగధరాజ్యమునకు వెడలిపోయినం తన నిత్యసాహ చర్య విముక్తిచేత శిశునాగుఁడు మనసులో డీలు పడిపోవునని తండ్రి యనుకొనుచున్నదే, అందుచేతఁ గుమారుఁ డేమై పోవు నేమో యని వృద్ధరాజు పడుచున్న యాదుర్దాకు ఫలిత ముగా శిశునాగుఁడు కడచినరాత్రి యెచటికో లేచిపోయెను. అది వృద్ధరాజునకుఁ బెద్ద దిగులయ్యెను. శిశునాగుఁడు తండ్రి దగ్గరకు వచ్చునప్పటికి బయట సూర్యరశ్మి చక్కఁగా నున్నను

రాజసౌధాంతర్భాగమున నిశాదీపికాకాంతుల సాహాయ్యము వస్తు దర్శనమునకుం గావలసియే యుండెను. శిశునాగుఁడు తండ్రిని చూచెను. తండ్రి నిన్నటి సాయంకాలమున తేజో రాశి. శక్తిమంతుఁడు. దృఢకాయుఁడు. నేత్రగతధావళ్యము చేత దుర్నిరీక్ష్యుఁడు. రాచఠీవియంతయు నొలికిపోవుచున్న మూర్తికలవాఁడు. ఈ నిముసములో నూటయిరువదియేండ్ల వయస్సు కలవానివలె నున్నాఁడు. కన్నులలో కాంతి లేదు. రాచఠీవి లేదు. వృద్ధభూపతి యెన్నడును వంగి కూర్చున్న వాఁడు కాఁడు. ఈ సమయమున నతని మేను మిక్కిలి వంగి యుండెను. ఆయన తల పూర్వము నరసియే యుండెను. ఆ నరయుట నరయుటగా నెన్నడు భాసించలేదు. ఇప్పుడు పండిన వృద్ధుయొక్క చీకిరి - బాకిరియైన సిత శిరోజ ములవలె నాతని శిరస్సు నందు కనిపించెను. అతని మొగము మీఁద ముడుతలు పడియుండెను. అట్టి తండ్రిని చూచినంతనే శిశునాగునకు జాగ్రత్త వచ్చెను. ఇంతసేపు తాను నడచుచున్నాఁడే కాని తన స్మృతి తనకు లేనట్లున్నది. శిశునాగుని మనస్సేదుచున్నదో లేదో తెలియదు. ఇప్పు డాడుచున్నది. ఆడుచున్న యిప్పటి స్థితిని బట్టి పర్యాలోచించినచో తత్పూర్వము కూడ నాడుచునే యున్నట్లు తెలియుచున్నది. అవును. ఇంతసేపు తన మనస్సు పనిచేయుచునే యున్నదన్నమాట. ఏమని యాలోచించు చున్నది? ఇట్లాలోచించుచున్నది. వేదమరీచి తన్ను తిరస్క రించి, తిరస్కరించకపోయినను తిరస్కరించినట్లుగా తన యందు కన్న తన తండ్రి రాజ్యమునందు తన కధి కాను

రాగము వెలార్చినది. ఆ పురుషుఁడు తనకొక నీతి నుపదేశించెను. ఆ నీతివాక్యార్థము సమాచరణములోనికి తీసికొని వచ్చుటకు తానిపుడు సమర్థుఁడు కాఁడు. తండ్రి బ్రతికి యున్నాఁడు. అతఁడు రాజు తాను మగధరాజ్యము మీఁదికి దండెత్తి పోవుటకు వీలులేదు. మగధరాజ్యము మీఁదఁదా నేకారణముఁ జెప్పి దండెత్తును? మగధరాజ్య మెక్కడ? కాశీరాజ్య మెక్కడ? కొండనుబోయి తగరు దాకినట్లుండును. ఈ మాట తండ్రితోఁ జెప్పినచోఁ దండ్రి తనకున్మాదము కలిగినదని భావించును. తనయు వేదమరీచియు సంబంధము మూఁడవ ప్రాణికిఁ దెలియదు. ఇపుడు దండెత్తుదు నన్నచో సందేహముయొక్క తొలుతంటి బీజనిక్షేపము చేసినట్లగును. తనకుగల మహావివేకమువలన ననూహ్యమైన జాగ్రత్తవలన, భావించరాని నేర్పువలన తమ యిద్దరి సంబంధ ముద్యానవనమునందలి పికమయూరాదులకుఁ గూడ గోచరించ నీయ లేదు. దాసదాసీజనమునకు తెలియుట యెట్లు? అంత సర్వతోభద్రముగా నిర్మించిన యీ ప్రేమను గూర్చిన సందేహమునకు తానే తన త్రిడంమ బీజావాపము చేయునా? ఆ తండ్రి బ్రతికి యున్నన్నినాళ్లు తన ప్రతిక్రియాభావమునకు బీజావాపమే జరుగదు. అంకురించుట మాట తరువాతిది. ఈ భావముతో నతడు రాజసౌధమునకు నడచి వచ్చుచుండెను. ఈ యూహాలతని మనస్సులో నాడుచున్నవని వానికిఁ దన నడచినంత నేసేపు తెలియదు. అది యొక విలక్షణమైన నిద్రావస్థకాని నిద్రావస్థగా నతఁడు నడచెను. నిద్దురపోవుచున్న వేళ నిదురపోవుచున్నట్లు తెలియదు. నిదురమేల్కొన్న తమ

వాత నంతవరకు నిదురపోయితినని తలంచును. ఇది ప్రసిద్ధమైన విషయమే. నడచి వచ్చినంతసేపటి శిశునాగుని స్థితి తత్కాలమున నతని యూహ యట్లున్నదని వానికిప్పుడు తెలిసెను. నిదుర మేల్కొంటినా యనిపించెను. నిదురలో నింత యూహ సేయుట జరుగదే యనిపించెను. ఈ నిదుర విలక్షణమైనది. నిదుర యనగా పంచేంద్రియ వ్యవహారోప సంహృతి. ఇంద్రియేతరమైన యొకానొక జ్ఞాపకరేఖ తత్కాలమున నుండనే యుండును. అట్లే ఈ నడచి వచ్చుచున్న సమయమున ఈ యొక్క భావమును పరిత్యజించి తక్కిన సర్వభావములు నిద్రాణములై యుండెను. మానవునియొక్క సుషుప్త్యవస్థ ఇంద్రియ విషయకమైన నిద్రావస్థ యైనట్లు శిశునాగుని తన నడచి వచ్చినప్పటి స్థితిలో నీ ప్రతిక్రియా భావేతరమైన సర్వ భావములయొక్క నిద్రావస్థయని చెప్పవలయును. మనస్సు చిత్రముగా నేకదేశమునందు మేల్కొని యుండి తదితర సర్వ ప్రదేశములయందు నిద్రాణమై యుండవచ్చును. అది యొక విలక్షణమైన నిద్ర. నిద్రాకాలమునందు జీవుడు మాత్రము సద్వ్యవహార యోగ్యుడై యుండును. ఇట్టి విలక్షణ నిద్రాకాలమున నొక విపరీతమైన మనోభావము మాత్రమే సద్వ్యవహార యోగ్యతా సంపన్నమై యుండును.

వృద్ధరాజుయొక్క స్థితి యాశ్చర్యముగా భాసించెను. వార్ధక్యము విచిత్రమైనయవస్థ. ఏదినమునకాడినను దాని నౌషధముచేత నియమముచేత శరీరవ్యాయామముచేత తొలగించవచ్చును. ఆనాటికి వార్ధక్యము లేదు. ఇరువదియేండ్ల కుట్టివానికెంత యుత్సాహ ముండునో అంత యుత్సాహ

ముండును. లంఘించఁగలఁడు. పరువెత్తఁగలఁడు. పరిహాసము లాడఁగలఁడు. కామవృత్తి నవలంబించఁగలఁడు. ఏనాఁడు నియమము సడలునో ఏనాఁడౌషధసేవ మానునో, ఏనాఁడు వ్యాయామముచేయఁడో, ఏనాఁడు తమచితాహారము సేవించఁడో ఆనాఁడు తత్పూర్వమెన్నాళ్ళుగానో తొలఁగఁబెట్టుచు వచ్చిన వార్ధక్యమంతయు నొక్కసారిగా హఠాత్తుగా భాసించును. ఆ భాసించుటలోఁకూడ తత్పూర్వము తొలఁగఁబెట్టిన సర్వకాలమును ప్రతినిమేషము నేనున్నా నన్నట్లు వచ్చును. ఇది సామాన్యస్థితి. దీనికంటె మించినస్థితి యింకొకటికలదు. ఈరీతిగా వార్ధక్యము ప్రతారించుచు యౌవనమును నిలఁబెట్టుకొనుచు వచ్చిన పురుషునకు మహాదుఃఖ మొక్కఁడు ప్రాపించినచో నియమౌషధ వ్యాయామములు లేనినాఁడు దాని తలమాపుటకంటె వేయిరెట్లు తలసూపును. నియమాదులు సడలినదినమున సన్నిహితమైన వార్ధక్యము మరల మరునాఁడు తన్నియమాదిపాలనముచేత తొలఁగిపోవును. దాని పదము చెడును. కాని యొక మహాదుఃఖముచేత యా వార్ధక్యము తన సహజస్వరూపమును భాసింపఁజేసికొన్నచో నది పెరదానివలె తొలఁగిపోదు. పీటవెట్టికొని కూర్చుండును. తరువాత నియమాదులచేత మరియొకస్థితి యేర్పడవచ్చునుగాని సన్నిహితమైన వార్ధక్యరేఖాతిశయమునందు లవమును తొలఁగదు. పదియేండ్లు నీ వార్ధక్యమును దిన దిన ప్రయత్నముచేత తొలఁగఁబెట్టితివనుము. ఆయొక్క దుఃఖదినమునందు నైదేండ్ల వార్ధక్యము నీయందువచ్చి కూర్చుండును. మరల నియమాదులచేతనా పదేండ్ల వార్ధక్యములో నైదేండ్ల వార్ధక్యముమాత్రమే

తొలఁగించుకొనఁగలవు. అట్లు తొలఁగించుకొనుటకు మరల ప్రయత్నము చేయవలయును. ఆ సన్నిహితమైన దుఃఖసమయమున పదియేండ్ల వార్ధక్యమును వచ్చికూర్చుండును.

శిశునాగుఁడు తండ్రివంకఁజూచినపుడు తండ్రియందిపుడు పదియేండ్ల వార్ధక్యము భాసించుచుండెను. రాజు నిన్న ప్రొద్దుగ్రుంకువేళ నుండినరాజుకాఁడు. నిన్న పగటికి ప్రొద్దుగ్రుంకిన ఇప్పుడు రాజునకు ప్రొద్దుగ్రుంకునట్లున్నది. అట్టితండ్రిని చూడగా శిశునాగునకు మనస్సాడ నారంభించెను. నిద్రాణమైయున్నమనస్సు మేల్కొన్నట్లయ్యెను. నిద్రపోవుచున్న మనస్సు మేల్కొన్నదనగా నర్థమేమి? మేల్కొన్నప్పటి బహుభావములయందు నిద్రపోవుచున్నప్పటి నిశ్చలమైన వివేకము వ్యాపించుట యని యర్థము. నిద్రావేళయందు నట్టి తెలివి యున్నది. అది తత్కాలమున నింద్రియ సముత్సారిత బహువిషయములయందు వ్యాపించదు. మేల్కొనినంతనే యా తెలివి యింద్రియసముత్సారిత బహువిషయప్రదేశమునందు వ్యాపించును. ఇదియే నిద్రకు మేల్కొనుటకుగల భేదము. ఆ భేదము శిశునాగున కిప్పుడు వాని మనోదేశమునందు తాండవింప నారంభించెను. అనఁగా నతని మనసులో మొద్దుగా నేభావమున్నదో యా భావము రెక్కలుకట్టికొని తిరుగ నారంభించెనని యర్థము. గడ్డగట్టి మొద్దుగానుండి స్థూలమై యతని మనస్సులో నింతవరకున్న భావమేది? వేదమరీచిమీద తాను పగతీర్చికొనుటకు దండెత్తిపోవలయునన్నచో తానురాజు కాఁడు. తండ్రియున్నాఁడు. అది సాధ్యముకాదు అన్న భావము. ఆభావము తనయునికిలో నీమూఁడువాక్యములలో

నున్నంత విస్పష్టతకూడ లేకుండనుండెను. తాను మగధ రాజ్యముమీఁద దండెత్తుట యసంభవమన్న విషయము మాత్రమే స్థూలముగానున్నదేమో! దానివెనుక నీర్ష్యాంశమైన భావ ముండియుండవచ్చును. తండ్రిని చూచినంతనే యుద్బుద్ధమైన యతనిమనస్సు చిత్రచిత్రముగా పనిచేయ నారంభించెను. అతనికి వచ్చిన ప్రథమోహ తండ్రి చనిపోవునని. ఆయూహ వెంట నొక సంతోషరేఖ భాసాభాసముగా నిలిచెను. వెంటనే యా సంతోషరేఖ పొడసూపగానే లేదన్నట్లు దుఃఖభార మొక్కఁడు విస్పష్టముగా భాసించెను. ఈ మనస్సు తన్నుఁ దానే ప్రతారించుకొనుటలో నిష్ణాతమైన పదార్థము. ఈ మనస్సునందు నైకకాలికముగా పదియూహలంకురించును. పూర్వాపూర్వములు బలహీనములు. ఉత్తరోత్తరములు బలిష్ఠములు. ఈ బలసహితత్వ బలరహితత్వములు వ్యత్యస్త లక్షణములుగలవి. బలహీనములైన వెనుకటి వెనుకటివాని బలాధిక్యము చర్చాలక్షణము కలదిగాదు. ఉత్తరోత్తరములైన వానిబలము చర్చాలక్షణసహితమైనది. చర్చాలక్షణ సహితత్వమే దీనిబలము. నిజముగా విచారించినచో పూర్వాపూర్వములు బలవంతములు. ఏలయనగా పూర్వాపూర్వములు జీవగతి, వాంఛాసన్నికృష్టరూపములు. ఉత్తరోత్తరములైనవి లౌకికపరిస్థితి సన్నికృష్టరూపములు. లౌకిక పరిస్థితి సన్నికర్ష చర్చాలక్షణ ప్రోద్బలకమైనది. చర్చ లౌకికము. వాంఛ జీవలక్షణము. శిశునాగునియందు స్వగత వాంఛాసంబంధి సంతోష రేఖాపనోదక దుఃఖభావోల్బణము లౌకిక పరిస్థితి సముద్దీపకమయ్యెను. అతనికి దుఃఖము పొంగి

వచ్చెను. నిన్నటివరకు దృఢకాయుఁడు. జితేంద్రియుఁడు, బలవంతుఁడు, ఆరోగ్యవంతుఁడు తండ్రి నేఁడు తెల్లవారక మున్ను వశప్రాయుఁడైనట్లు కన్పించుచుండెను. ఈయూహ యుదయించినంతనే, దుఃఖము పొంగివచ్చినంతనే, మనస్సాడినంతనే శిశునాగుని శరీరమునందలి శిలాత్వ మంతరించెను. మనస్సునందలి జడత్వము లోపించెను. ధూమపానముచేయుట వలన నతనిమనస్సు సంపాదించుకొన్న యొక మాంద్యము ప్రక్కకు తొలఁగెను. అతఁడు తండ్రివద్దకుపోయి మోకరించి "నాయనా! యిట్లుంటివేమి?" యని గోల్లుమనియెను. ఆ కొడుకునుచూచిన తండ్రికి నాకొడుకు మనస్సులోపలి మనస్సులో తన యీస్థితి యొకానొక సంతోషరేఖ యుదయింపఁ జేసెనని యెట్లు తెలియును? చూడెడివారికేమి తెలియును? ఆ సంతోషరేఖ యెట్టిదనగా నిజముగా శిశునాగుఁడు తండ్రి యొక్క యీస్థితికి మహాదుఃఖము ననుభవించుచున్నాఁడు. ఆసంతోషరేఖ అచ్చట నిలచియేయున్నది. అది యచ్చట నిలచియున్నదని లీలగా శిశునాగునకును తెలియుచునే యున్నది.

వృద్ధభూపతి కనులెత్తి కొడుకువంకఁ జూచెను. ఆ చూచిన సమయములో శిశునాగుఁడు "అయ్యో! తండ్రీ" యనుట తటస్థించెను. అతని నోటినెంట వెడలిన శబ్దమును వాయుసహితమై వెడలెను ఆ వాయువు కాష్ఠగత ధూమరేఖా పరమ సూక్ష్మపరిమళ భరితమై యుండెను. అవిదితమైన యీ పరిమళము వృద్ధరాజు నాసారంధ్రములలోనికిఁ జొరఁబారెను. వృద్ధరాజు కొడుకువంక నిర్వోరపోయి

చూచెను. కొడుకును కౌఁగిలించుకొని 'నాయనా! వచ్చితివా!' యని పరామర్శించెను. తన దిగులంతయు మరచిపోయి లిప్తకాలములో పునరుజ్జీవితుఁడు కావలసిన రాజు నిస్తబ్ధుఁడై యుండిపోయెను. కొడుకును కౌఁగిలించికొనలేదు. నాయనా! వచ్చితివా యని పరామర్శించలేదు. ఆ వృద్ధరాజు యొక్క గొంతులోనుండి సముద్భవింపఁ బోయిన యొక యానంద భావ తరంగిత వాగారంభ మతనికన్నులలోనుండి వెలారింపఁ బడఁబోయిన యొక సముత్సాహ రేఖా శబలిత నయన దీప్తి రెండును తిర్యక్ప్రసారితములైనట్లు నడుమ ఖండితములైనట్లు తోఁచెను. ఖండితమైనను రెండవ సగము తత్పూర్వార్ధ గత ద్రవ్యమయమే మైయుండును. తిర్యక్ప్రసారితమైనప్పుడు రెండవ సగము శూన్యమై భాసించును. వృద్ధరాజుమాట శూన్యమై భాసించెను. కంటికాంతి శూన్యమై భాసించలేదు. తిరిగిపోయిన స్థలమునుండి యా కన్నుల కాంతిలో మరియొక భావము సముద్దీపించెను. ఆ భావ మెప్పుడు సముద్భవించెను? ఎక్కడ సముద్భవించెను? ఎట్లు సముద్భవించెను? మానవునియందు దృశ్యమానములగుచున్న సర్వభావములంత ర్జ్యోతిర్వి నిర్గత ములై యుండును. ఇప్పటి రాజుకంటె కాంతియొక్క యాభా సము బాహిరమైన యేదియో ద్రవ్యమో భావమో దాని చేత నిక్షేపింపబడినట్లు భాసించెను. ఏ వాయువు శిశునాగుని వాగ్వ్యాపార సమున్మీలన హేతువయ్యెనో యా వాయువు వట్టి వాయువుకాక దానియం దొక శక్తి యున్నట్లు కనిపించెను. ఆశక్తి సామాన్యమైనది కాదే. అంతర్జ్యోతిర్వి నిర్గత మైన శక్తి సర్వచైతన్య మూలహేతువై భాగశః సర్వమానవ

కోటి హృదయ నిక్షిప్తమైన, సర్వత్ర సమాన శక్తిమంతమై యుండును. అది యొక్కటియే సర్వ సృష్టిచాలన హేతువు. ఆశక్తి సర్వ జీవకోటియొక్క హృదయాంతరాళములయందే యుండును. అది శిశునాగో దీరితి వాగ్గత వాయునిహితమై యెట్లుండును? దాని శక్తి పరసంక్రాంతమై సంక్రాంతమైన స్థితిలో కూడ మూలశక్తివంటిశక్తి కలదియై యుండునా? కాదయేని ఏ మహాచైతన్యము సర్వ సృష్టియందు జీవచైతన్యమున సమారబ్ధమై యుండెనో యాశక్తి సూక్ష్మతో విభక్తమై పంచభూతములయందు కూడ నున్నదా? ఆశక్తి పంచభూతములకు ప్రేరకమైనది. ప్రేర్యప్రేరక సంబంధమునందు ప్రేర్యమైన దానికి ప్రేరకగతమైన శక్తి యెంతయో కొంత సంక్రమించునా? సంక్రమింపక కూడ సంక్రమించినప్పటి యొకానొక వికారము భాసించినట్లు భ్రాంతి కల్గునా? అది యేమైనను వృద్ధరాజు కన్నులలోని కాంతి క్రొత్తగా నంతశ్శక్తి విరిగిపోయిన లిప్తగత సహస్రైక కాలమున నొక నూత్నశక్తి భాసించినట్లు మాత్రము నిస్సంశయముగా తెలివిడి కాదగినది. అప్పుడు వృద్ధరాజు నయనములయందు భాసించిన లక్షణమెట్టిది? ఆ లక్షణమిట్టిదని తత్రత్యులైన పరిచారకులకుఁ దెలియలేదు. మంత్రికి తెలియలేదు. ప్రక్కనున్న తల్లికిఁ దెలియలేదు. రాజుకంటిలో నొక విపరీతమైన భావము ప్రవేశించెనని యెవ్వరికిని తెలియలేదు. శిశునాగున కొక్కనికే తెలిసెను. తండ్రి కన్నులలోని యా కాంతి చూచినంతనే శిశునాగునకు దుఃఖ మంతరించెను. పొంగి వచ్చుచున్న దుఃఖము వెంటనే కట్టువడెను. దానితో

పాటు వాని యంతరాంతరమున లీలగా భాసించిన సంతోష రేఖయు మటుమాయమయ్యెను. శిశునాగున కొక విలక్షణ మైన మనస్స్థితి యేర్పడెను. అతఁడు తండ్రికాఁడు. తాను కొడుకుకాఁడు. ఇద్దరు నిద్దరుకారు. ఇద్దరు నొక్కటియే. ఏ ప్రతిక్రియాభావము తన హృదయమునం దున్నదో తద్భావమే వృద్ధరాజు కన్నులయందు భాసించుచున్నట్లు శిశునాగున కనిపించెను. అనిపించిన మరుక్షణమునుండి శిశునాగునకు సంకల్ప వికల్పములు సమారంభించెను. తనయు వేదమరీచియు సంబంధము తన తండ్రికి తెలియదు. తండ్రికేమి? ఎవ్వరికిని తెలియదు. వేదమరీచి వెడలిపోయినదన్న దుఃఖము తన మనస్సునకు తెలియును కాని పరులకెవ్వరికిని దెలియదు. ఆ సంబంధము, తద్వియోగము, తజ్జనిత దుఃఖము, తజ్జనిత ప్రతీకారభావము, నీ నాల్గు నొక సంపుటి. ఒకదానికొక్కటి పూర్వాపూర్వమైనది హేతువు. తొలుతటి మూఁడును లేకుండ నాల్గవది యెట్లు సంభవించును? ఒకట్లు సంభవించవచ్చును. ఏ పదార్థము తన జీవలక్షణమునందు కాష్ఠగత ధూమరేఖాపానమువలన సమ్మిళితమైనదో ఆ పదార్థము తన వాగ్గత వాయుతరంగ తాడిత పితృజీవ శక్తియందు సన్నిహితమై నిమేషకాలమునఁ దన రాజ్యమచ్చట స్థాపించుకొన్నచో తత్పదార్థ సహస్థితమైయున్న యా తొలుతటి హేతుత్రయ సంపుటి తదంతర్వ్యాప్తి యగుటచేత చతుర్థమైన ప్రతీకార భావము సహజముగా భాసింపవచ్చును. శిశునాగునకు నా పదార్థమెట్టిది? దానిశక్తి యెట్టిది? అది తనయం దెట్లు ప్రవేశించినది? అన్నగాఢ విచారము స్ఫురించెను. తండ్రి

సన్నిధానమున నుండి, ప్రధాని సన్నిధానమున నుండి, తల్లి యొక్క సన్నిధానమున నుండి, పరిజనులయొక్క సన్నిధానమున నుండి, ఈ విచారణ చేయుటకు తన మనస్సునకు తన జీవునకు దక్షత కలిగినట్లు కనిపించలేదు. సర్వ సమర్థమైన యాశక్తి తనయందు నిండియున్నదని శిశునాగున కిప్పుడు తెలిసెను. కాని యాశక్తి తల్లిదండ్రులయు, పరిజనులయు, తదితరులయు బాహిరమైన లౌకికమైన సంబంధమును లోలోనం ద్రెంచుట లేదు. కాని బయటికి వానిని నిరాదరించుట లేదు. అందుచేత తండ్రిని తండ్రి కాదనలేకున్నాఁడు. తల్లిని తల్లి కాదనలేకున్నాఁడు. పరిజనులను పరిజనులు కాదనలేకున్నాఁడు. వారియందు తనకుగల తొలుతంటి మార్దవము, తొలుతంటి సౌజన్యము, తొలుతంటి గౌరవ మర్యాదలు, తమ యెడఁద యందుఁ గనిపించుటలేదు. అవి వారియందు ప్రదర్శించకుండ నుండవలయునన్న తీవ్రతయు లేదు. కానిమ్ము. ఆయన తండ్రియే, ఆమె తల్లియే, వీరు పరిజనులే. వారి నట్లే చూడవలయును. కాని తాను వారినట్లు చూడగలడా? ఇదివరకు చూచినదే తన పూర్వపు ప్రవర్తనయంతయు జ్ఞప్తికిఁ దెచ్చుకొని సూక్ష్మ సూక్ష్మాంశువులు పరిశీలించి వానిని తన భవిష్యద్దైనందిన ప్రవర్తనలో సంయోజన పరచవలయునా? లేనిచో నీ ప్రతీకారము జరుగుట యెట్లు?

అతడు తండ్రివద్ద సెలవుఁదీసికొనెను. తాను సెలవు తీసికొనుట యభినయముగాఁ దనకే భాసించుచుండెను. తండ్రి యనుమతియొసంగెను. ఆ యనుమతియు నభినయముగాఁ

దనకు తోచెను. తల్లివద్ద సెలవుఁదీసికొనవలయుననుకొనెను. అతఁడు తటపటాయించెను. తల్లికూడ తనవలెఁ దనతండ్రివలె నయిపోవునా? ఈదుర్దశ తల్లికికూడ సంక్రమింపఁజేయవల యునా? ఇది దుర్దశయా? తనలో నెచ్చటనో సగముదుర్దశ యని సగముకాదని యనిపించుచుండెను. ఇదికాదని యనిపించు చున్న సగము చాల తీవ్రముగా నుండెను. తక్కిన సగమును చంపవలయునన్నంత పట్టుదల కలదిగాఁ గనిపించెను. తన తల్లికూడ నిర్జీవకావలయును. మరలఁగాఁగూడదు. కాఁగూడ దన్నదానికే విజయము ప్రాప్తించినట్లు తల్లితోఁ జెప్పకుండ బయలుదేరఁబోవుచుండెను. తల్లియే పలుకరించెను. "నాయనా! వెళ్ళుచున్నావా! నిన్న నెచటికేగితివి? తెల్లవారెచ్చట నుంటివి?" అన్నదామె. శిశునాగునికిఁ దనకు తెలియకుండ నవ్వువచ్చెను. తన కిష్టములేకపోయినను తల్లి తనవలె నగు టకు వాంఛించుచున్నది. అతఁడాగి సమాధానము చెప్పెను. "నే నెచ్చటికిని బోలేదు." అన్నది సమాధానము. అతఁడీ సమాధానముతోఁ దల్లి తండ్రివలె నగుననుకొనెను. తల్లి మాటలో మార్పులేదు. కన్నులలో మార్పులేదు. ఆమె ప్రేమలో మార్పులేదు. ఆమె శరీరసంచాలనమునఁగూడ మార్పులేదు. ఆమెయందు తననుండి తండ్రియందువలె నెదో వాయువు తనశక్తిని నిక్షేపించుకొనలేదు. అతఁడాశ్చర్యపడెను. ఈశక్తి సర్వసమర్థమైనది కాదా? తన తండ్రియొక్క జీవశక్తి కంటె తన తల్లియొక్క జీవశక్తి యధికమైనదా? లేదా తన తండ్రితో తాను మాటాడినమాట తొలుతఁటిది. తన ధూమ రేఖాపానానంతరమున మొట్టమొదటిసారి తన తండ్రితోనే

మాటాడెను. తన్నుఁ గొనిపోవచ్చిన పరిచారికులనంత నోట మాటలేకుండ బయలుదేరివచ్చెను. ఆ మొదటిమాటకే యా శక్తికలదా? తరువాతిమాటల కాశక్తియుండదా? అతనికి బ్రదికిపోయితి ననిపించెను. లేనిచో కాశీరాజ్యము రాజ్య మంతయుఁ దనవశమైనచో నేమికావలయును? ఈతనలో వచ్చి ప్రవేశించినట్లు కనిపించుచున్న యాశక్తి యెట్టిది? దానినిగూర్చి విచారించవలయును. ఆ విచారించుటకే యిచ్చ టనుండి వెడలిపోవలయును.

ఆమాటయనుచు శిశునాగుఁడు బయలుదేరిపోయెను. తల్లి కొడుకు వెంట నివ్వెరపోయి చూచెను. శిశునాగుఁడు తండ్రివద్దనున్న కాలము రెండు నిమేషములుకూడ లేదు. అతఁడు తనవంక చూచెను. తనకు సమాధానము చెప్పెను. ఆ చూపులో నా సమాధానములో నితఁడు తొలుతటి బిడ్డ కాఁడనిపించెను. ఎచ్చటికి పోయినాఁడు? గత నిశావేళ నెచ్చట నున్నాఁడు. అతనిలో నీమార్పేమి? మున్ను తన చరణముల మీఁద వ్రాలెడివాఁడు తన్నువచ్చి కౌఁగిలించుకొనెడివాఁడు. తన్ను దేవతగా చూచెడివాఁడు. తనవంక చూచినచో వెనుకటి నందజన్మలలో దమరిద్దఱు తల్లిబిడ్డలన్న భావము భాసింపఁజేసెడివాఁడు. తానిట్లైనాఁడేమి? ఈ తండ్రి యీ యేకైక పుత్రుని నిట్లు చూచుట మున్నెన్నఁడు లేదు. ఒక్కరాత్రిలో నీరాజింత వృద్ధుఁ డెట్లయ్యెను? ఏ కొడుకుకొఱకు తాను పాతిక, ముప్పది గడియలు విరహ మనుభవించుటచేత కడచిన యిరువది యేండ్ల వార్ధక్యమును పొందెనో? ఆ కొడుకు కనిపించగా రాజు పరుఁ డెవఁడో

కనిపించినట్లు తనతో సమానుఁ డెవఁడో కనిపించినట్లు ప్రవర్తించుట యేమి? తన కొడుకు నేమైన నావహించెనా? ఆ యావహించినది తండ్రికి సంక్రమించెనా? అది యేది? భూతమా? భూతమువలె లేదు. భూతలక్షణములు వారియందో భాసించుటలేదు. మరి యిది యేమి? ఆమె యందు నీ విచారణకంటెఁ గొడుకు తనతో సరిగా మాటాడ లేదన్న దుఃఖము విజృంభించెను. కొడుకునకుఁ దనయందుఁ బ్రేమ తగ్గినదని వాని మనస్సెవరో విరిచిరని యామె యను కొనెను. ఎవరు విరుతురు? అతనికి వివాహముకాలేదు. ఎన్నిసార్లు వివాహము చేయుదుమన్నను వాఁడు నిరాకరించుచు వచ్చెను. బుద్ధిమంతుఁడై శూరుఁడై సాహసవంతుఁడై విద్యావంతుఁడైన కొడుకునకు బలవంతముగా వివాహము చేయుట యెందులకు? తండ్రి వృద్ధుడైనను దేహ పటిష్ఠత కలవాఁడు. శిశునాగుఁ డెంతవరకును రాజ్యము తన తండ్రియే చేయవలయు ననుచుండెడివాఁడు. తండ్రి మరి పదేండ్లవరకు రాజ్యము పాలించఁగల శక్తిగలవాఁ డన్నట్లు కనిపించుచుండెను. ఆ పరిస్థితులలోఁ దాను కాని, తండ్రి కాని, మంత్రులు కాని, శిశునాగునిఁ దొందరపెట్టలేదు. బలవంతపెట్టలేదు. అట్లు గడచినది. వేదమరీచి వెడలిపోయినదని తన కొడుకునకు దుఃఖమా? వేదమరీచి తన చెల్లెలి మనుమరాలు. వారిద్దరు పినతండ్రియు కూఁతురును. వారిది వట్టి చెలిమి, వట్టి బాల్య క్రీడా సముపాత్త సౌహార్దము. అంతకు మించి మరి యేదియును కాదు. అగుటకు వీలులేదు. పదియేండ్లుగా నది వేరైన విషయమన్న పొడకూడ కనిపించలేదు. ఆ బాల్యస్నేహితురాలు

తన్ను వదలిపోయినదని దుఃఖము కలుగవచ్చును. ఆ దుఃఖము కోటను డి లేచిపోయి యర్ధరాత్రిమున నంధకారమున సంచరింపఁజేయు నంతటిదా ? కాదు. కాకూడదు. అట్లైనచో నిది సృష్టికి వ్యతిరేకమైన విషయము. స్త్రీపురుష సంబంధముగల ప్రేమయొక్క విఘాతము తాదృశావస్థకుఁ బాల్పరచును. తక్కినదాని కాశక్తిలేదు. లేకపోవుట సృష్టి సహజమైన లక్షణము. అన్నా సెల్లెండ్ర నడుమ, తండ్రి కూతుండ్ర నడుమ స్త్రీ పురుషుల నడుమగల ప్రేమ విఘాతమువలన జరిగెడి చిత్తోన్మాద ప్రభృతి లక్షణములు నిరూపింపఁబడుటకు కవి భావ విలసనమైన వ్యవహారముగాని సత్యవిషయమైన పరమేశ్వర సృష్టి సహజ లక్షణముగాదు.

రాణి పేరు చంద్రమతీదేవి.

ఆమె మరియు నిట్లూహించెను. తన కొడుకున కిన్నాళ్లు నెచ్చటనో యెవ్వరో రాజవంశసంజాతకాని స్త్రీ తోడ సంబంధము కలదా? అట్టి సంబంధమున్నట్లు పూర్వమెప్పుడును పొడకట్టలేదు. ఆ సంబంధమింత రహస్యముగా పరిపాలించుకొనుచు వచ్చినాఁడా? అది సంభవమైన ట్లామెకు భాసించలేదు. కాని యీ సృష్టిలో నిది సంభవమైన విషయము ఇది కాదని నిరూపించుటకు పరమేశ్వరునకే సాధ్యము కాకపోవచ్చును. ఆమెకోస మీతఁడు నట్లైనేమో, రాణి శిశునాగునిఁ గొనివచ్చిన పరిచారకులలో నొకనిని బిలిచి యతఁ డెచ్చటఁ గనిపించెను. కనిపించినపు డెట్లుండెను? ఆ ప్రదేశమెట్టిది? కనిపించినప్పటి యీతని స్థితి యెట్టిది? దారివెంటఁ బరిచారకులతో నేమేమని మాటాడెను? మొద

లైనవన్నియు నడిగెను. వారిట్లు చెప్పిరి "తల్లీ! ఆ స్థలము మహానగరమునకు గోడ దవ్వునం దున్నది. నాల్గు శ్మశానముల నడిమి ప్రదేశమది. ఒక శ్మశానమునం దైనను తగులఁబడుచున్న శవములేదు. ఆ నాల్గు శ్మశానములు దూర దూరములుగా నున్నవి. ఆ నడుమఁ బది పొదలు కలవు. అవి పొదలనుటకంటె దుబ్బులనుట న్యాయము ఆ దుబ్బుల పేరు నాకుఁ దెలియదు. నాకు సర్వవృక్షములయు సర్వలతలయు సర్వౌషధులయు నామములు తెలియును. ఆ దుబ్బులను నేనెన్నఁడు చూడలేదు. నేను దివ్వెటీ వెలుఁగున నా దుబ్బులలో నొకదానిని బరిశీలించితిని. దానిని మరల నేఁడు పగఁటి వేళపోయి తెలిసికొని వత్త మనుకొనుచున్నాను. ఆ దుబ్బులలో నడుమ నొకచోట యువరాజుగారు కూర్చుండి యుండిరి. యువరాజు లేచి పరిచారకుల వెంట వచ్చుచుండగా నేను నాచేతి దివ్వటీతో నా ప్రదేశమంతయుఁ బరిశీలించితిని. ఎన్నఁడు నెఱుఁగని ముడుచుకొని కూర్చుండుట యువరాజెట్లు చేయఁగలిగెను. అది నా కచ్చెరువు కలిపించి నేనా ప్రదేశమును బరిశీలించితిని. యువరాజుగారు కూర్చున్నచోట నాతని కాలిచిన్నెలు చూచితిని, చక్రవర్తి లక్షణములు గల యా పాదముల గుర్తులు విస్పష్టముగా కనిపించినవి. ఆయన కెదురుగా మరియొక పురుషుఁ డెవ్వఁడో కూర్చుండి యుండెను. వాఁడచ్చట లేఁడు. వాని కాలిగుర్తులు కనిపించెను. ఆ కాలి గుర్తులను నేను పరిశీలించితిని. అచ్చట నా గుర్తులు చెరిగిపోకుండ నచ్చట కాపుండవలసినదిగా నొక భటుని నేనం దుంచి వచ్చితిని. గాలి కా కాలిగుర్తులు చెడిపోకుండ నొక

భటుని చేతిలోని డాలును తీసికొని దానిమీఁదఁ గప్పి వచ్చితిని. ఈ పగఁటివేళపోయి వానిని బరిశీలింపవలయునని యనుకొను చున్నాను. మహారాణి యడిగినారని మనవిచేసితిని. మహారాజుగారడిగినను చెప్పెడివాఁ డనుగాను. మరియు నాకేలనఁ బరిశీలించితిని. ఒక మదించిన పోతునక్క బెదరి పరువెత్తిన కాలిజాడ లచ్చట కనిపించినవి. దాని బెదరుట సామాన్యమైన బెదరుటగాఁ గనిపించ లేదు. కుక్కలు నక్కలు పిశాచములను దర్శించఁ గల వందురు. తాదృశదర్శన సముపజాత మహా భయాందోళితమైన జంతువుయొక్క కాలిగుర్తులవలె యీ నక్క కాలిగుర్తులు కనిపించెను. సామాన్యుఁడు చూచినచో నది పులియేమోయని భ్రాంతి పడవచ్చును. సివంగియో, కొర్నాసిగండో యగునసనుకొనవచ్చును. అవి నక్క కాలి గుర్తులని తెలిసికొనుటకు నిరంతరాటవీ జంతులక్షణ పరిశీలనా జ్ఞాన ముండవలయును. అచ్చట యువరాజు కూర్చుండి యుం డెను. ఇపుడు నేను వెంటనే పోయి తక్కిన విషయములు పరి శీలించి రావలయును. పరిచారకులవెంట నడచినంతసేపు యువరాజు మాట పలుకు లేక నడచెను. నేను కొంతసేపటికి వారిని కలిసికొంటిని. ఈలోపుగా యువరాజేమైన మాటా డెనా యని యడిగితిని. వారు మాటాడలేదని చెప్పిరి.

రాణి నీపేరేమని యడిగెను. వాఁడు తన పేరు 'చిత్ర శిఖండి' అనెను.

౫

వృద్ధరాజాటినుండి మంచాన(బడెను. శిశునాగునివంక చూచిన చూపు తానట్లే నిలిచిపోయెను. రెప్పవాల్చ(డు. నోటివెంట మాటలేదు. కొడుకు వచ్చినాడుకదా! రాజు తేరి కొను ననుకొనిరి. చదువవేసిన నున్న మతికూడ పోయెనన్నట్లు రాజునకు శిశునాగుని ప్రతీక్షావేళావివేకముకూడ పోయెను. రాజవైద్యులువచ్చిరి, పరీక్ష చేసిరి. వ్యాధియేమియులేదు. రాజొక్క నిమేషములో ననిమిషు(డైపోయెను. ఆయనచేత రెప్పవేయించుటకు వైద్యులు బహుప్రయత్నములు చేసిరి. రెప్పలకు(గాని కన్నులలో(గాని మంట కలిపించు నౌషధలేపములు పూయుటకు రాణి యంగీకరించలేదు. కనులు మంట యెత్తినరాజునకు స్మృతికలిగి తన్ను నిందించునేమోయని యామె భయము. మరియు నది వృథాప్రయత్నమని యామె యంతరాంతరములలోని విశ్వాసము. తనకేదో తెలిసెనను కొన్న రహస్యము పలుమందికి తెలిసిపోవునేమోయన్న భయము. తీవ్రౌషధములు నేత్రములయందు ప్రయోగించినచో చిమచిమలాడి మంటయెత్తి కన్నులనుండి నీరుకారునేగాని రెప్పపాటు జరుగనిచో వైద్యులు భూతవిషయమందురు. భూత విషయమైనచో దానికి వేరే ప్రయత్నములు జరుగవలయును. వారణాసీ మహాక్షేత్రమున నీ మహాదుర్యోగము కలుగుట కామె కిష్టములేదు. తండ్రి యీస్థితిలో నున్నా(డన్నవార్త శిశునాగునకు తెలిసెను. శిశునాగు(డువచ్చి తండ్రిని చూడ

లేదు; అతని యెడఁదలో నెచ్చటనో తండ్రి యొకటి రెండు దినములలో మరణించునని యున్నది. ఆయన మరణముకొఱకు తాను ప్రతీక్షించుచున్నట్లున్నది. ఆనాఁటి సాయంకాలమునఁ దండ్రివద్దకువచ్చి చూచెను. మంచమువద్ద నిలుచుండెను. వృద్ధరాజు కన్నులు విప్పియుంచుటయేకాని యెవ్వరివంకను జూచుట లేదు. అస్వస్థతలో కొడుకువంకఁ జూచెను. ప్రక్క నున్నవారు సంతోషించిరి. కొడుకన్న యభిజ్ఞయైనను రాజునకు కలదుగదా! అది కొంత మేలని సంతోషించిరి. రాణి సంతోషించలేదు. ఆమెమనస్సులోనున్న యొక సందేహము దృఢమైనది. ఇతఁడు రాత్రి యెచ్చటికిపోయెను? ఇతని యెదురుగా కూర్చున్న పురుషుఁడెవఁడు? ప్రొద్దుక్రుంకవచ్చినది. చిత్రశిఖండి యింకను రాలేదు. అతఁడు వచ్చిన తరువాతఁగాని యిదమిత్థమని నిర్ణయించుటకు వీలులేదు. రాణి చిత్రశిఖండికొఱకు మరల వార్తనంపెను. ఆనాఁడిది నాల్గవవార్త. మహానగరమున నొక వృద్ధపండితుఁడు మహాసాముద్రికశాస్త్రవేత్త యున్నాఁడట. చిత్రశిఖండి యాయనను తనవెంట తీసికొనిపోయెను. మరియు నింకెవ్వరి నెవ్వరినో తీసికొనిపోయెను. అతఁ డిప్పు డప్పుడే రాకపోవచ్చును. రాణి యొక్క ప్రతీక్షావేగము గడియగడియ కధికాధికమగుచుండెను. శిశునాగుఁడు తండ్రివంక చూచుచుండెను. రాజు కొడుకువంక చూచుచుండెను. రాణికొక యూహతోచెను. ఇప్పుడు శిశునాగుఁడు వచ్చి యీతండ్రి దర్శనము చేయకున్నచో బాగుగానుండెడిదేమో! ఏసంస్కారమునాఁటి ప్రాతఃకాలమున బీజావాపము పొందినదో ఆసంస్కారము మరియు నీ పరస్పరావలోకనము

చేత దృఢీకృతమగుచున్నదేమో! లేనిచో వారొకరివంక నొకరట్లు తదేకధ్యానముగా చూచుచుట యెందులకు? కొడుకు తండ్రిని పలుకరించఁడేమి? పలుకరించినిచో రాజు సమాధానము చెప్పునేమో! తండ్రితో మాటాడుమని ప్రక్కనున్న వారెవ్వరు ననరేమి? తానే యెందుకనరాదు? వట్టి దృష్టిమాత్రమున నింత గాఢతరమగుచున్న యీ సంస్కారము మాటాడుటచేత మరియును బలియునేమోయని తన భయము. జరిగిదేమో జరిగినది. దాని స్వరూపముయొక్క యాత్కృష్ట్య మెట్టిదో పరిణామ మెట్టిదో చూడవలయును గదా! కొడుకు తండ్రితో మాటాడవలయుననియే చంద్రమతీదేవి నిశ్చయించెను. ఆమె కొడుకుతో నిట్లనెను. "యువరాజా! తండ్రిని పలుకరింపుము" అని రాణి కొడుకును యువరాజా! యని తాను మున్నెన్నడును పిలువలేదు. మంత్రులును పరిచారకులును నిర్వరపోయి రాణివంకఁ జూచిరి. శిశునాగుఁడు తల్లివంకఁ జూచెను. అట్లు చూచుటలో నతని కన్నులలోనుండి యొక విలక్షణమైన యాశ, యొక తీవ్రమైన సూచీసన్నిభదృష్టి, యొక పైకి భాసించని యుద్వేగము, గదుముకోరాని పొలములను గదుముకోవలయునన్న యొక కోరిక, ఇవి యన్నియు భాసించెను. రాణి కవి యన్నియు మనస్సునందు స్ఫురించెను. ఆమెకు తెలియకుండ నామె పెదవులమీఁద నొక చిరునవ్వు తాండవించెను. ఆ చిరునవ్వులో శిశునాగుఁడు తన కెదురు తీర్చియున్న యొక ప్రతిస్పర్ధిలక్షణమును చూచెను. తాను ప్రతారింపఁజాలని యొక దృఢమైన శక్తిని తెలిసికొనెను, అనూహితముగా నొక విరోధి

తన యెదుట నిలుచున్నట్లనిపించెను. ఆ విరోధి తన్ను తేలికగా చూచుచున్నాఁడు. తన శక్తి నధఃకరించుచున్నాఁడు. తన్ను సులభముగా నతఁడు గెలువఁగలఁ డన్నట్లు వానియందొక ధైర్యము కనిపించుచున్నట్లుండెను. ఆ చిఱునవ్వునకు నా దృష్టికి తాను నిలువఁగలఁడా? నిలువలేఁడా? యన్న ప్రశ్న పుట్టెను. తాను కన్ను వాల్చినచోఁ దా నోడినట్లగును. కన్ను వాల్చకుండ నా ప్రతిస్పర్థివంక నట్లే చూచినచో నా ప్రతిస్పర్థి యేమగునో యేమి చేయునో కాని ఆ ప్రతిస్పర్థికి బలవంతమైన స్థానము కలదుకలదు. అది తన తల్లి శరీరము. అది ప్రతిస్పర్థికి బలము. ఆమె తన తల్లియగుట తనకు నొక విధమైన బలమే. ఈ ప్రతిస్పర్థి మరి యెచ్చటనో యంకురించలేదు. శిశునాయకుఁడు తన కన్నుల నుపసంహరించుకొనెను. చంద్రమతీదేవి యిట్లనెను. "యువరాజా! తండ్రిని పలుకరింపుము. ఎవ్వరి వంకను జూడని తండ్రి నీవంకఁ జూచినాఁడు. ఎవ్వరితోడను మాటాడని తండ్రి నీతోడ మాటాడు ననుకొందును. మహారాజు నోటి వెంట నొక్క మాట వచ్చినచో నందరును సంతోషింతురు. మహారాజునకు నీయందుగల ప్రేమ మరి యెవ్వరియందును లేదని పూర్వమే తెలిసిన విషయమునకు నేఁడిది మరియొక సాక్ష్యము. తండ్రి నీ కొఱకుఁ దా నేమియైన నగును. అందుచేతనే యిట్లయ్యెను. మున్నే రాజ్యము నీకిచ్చి తాను తొలఁగ నెంచెను. నీవు వేదమరీచీ సహవాసలోభముచేత రాజ్యమును స్వీకరించలేదు. నీవు రాజ్యాభిలాషివై గతరాత్రమున పరిభ్రమణము చేసితివని వృద్ధభూపతి యూహించి

యుండును. అందుచే నీ దుఃఖమును తెచ్చి పెట్టికొనెను. నీవు పలుకరించుము."

అనఁగా శిశునాగుఁడు తన తల్లిలోఁ గనిపించిన ప్రతిస్పర్థి తన విరోధమును ప్రారంభించె ననుకొనెను. తన కార్యము తా నారంభించ లేదు. ప్రతిస్పర్థి తా నప్పుడే తన ప్రతివిఘాత కార్యవ్యగ్రుఁ డయ్యెను. ఇతనిని దట్టుకొనుట యెట్లు? ఆ పురుషుఁడు నేటి దివాసమయమంతయును దనవద్దకు రాలేదు. ప్రొద్దుటినుండియు వానికొఱకు ప్రతీక్ష చేయుచుండెను. దివావేళ వాని స్వరూప మెట్టిది. వాని మూర్తి యెట్టిది? జ్వాల లేకుండ కణకణ లాడుచున్న బొగ్గునంటి కాష్ఠమునుండి నిర్గమించిన వట్టినిప్పు వ్యాపింపఁ జేసిన ఎఱ్ఱని వెలుఁగులోమాత్రము వాని మొగము కనిపించినది. ఆ మొగము మొగముకాదు. పైన చర్మము మిగిలిన వట్టి కపాలము. కన్నులుమాత్రము ప్రకాశించుచున్నవి. పొగ పీల్చుటచేత ఘ్రాణేంద్రియముయొక్క కలిమి తెలిసినది. మాటాడుటచేత వాగింద్రియ మున్నట్లు కనిపించినది. అతనికి శరీరమున్నదా? అతఁ డెప్పుడు లేచిపోయెను. తనకుఁ దెలియకుండ నెట్లేగెను? తాను తలవంచికొని కూర్చున్నప్పుడు తాను లేచిపోయెనుగాబోలు? లేచి నిలుచుండఁగా, నడచి పోవుచుండఁగా నే సుంతసవ్వడియైనను కలుగవలయునుగదా! ఆ సవ్వడియే కలుగలేదు. తానొకవేళఁ దన్నుఁ దా విస్మరించియున్నవేళ నతఁడు పోవుట తనకు గుర్తుతగులలేదేమో! కాన నతఁడు పులివలె నడచునేమో! పంజా ముడుచుకొని మెత్తని కాలి యడుగునగల చర్మముతో నడువగా సవ్వడి కలుగదు.

అతని పాదములట్టివా? అతని చేతులుకూడ నట్టివా? అకస్మాత్తుగా శిశునాగునకు వాని చేతల పైభాగములు మంథర లోమస ముపేతములన్నట్లు తోచెను. అరే! అతఁడు మానవుఁడు కాఁడేమో! వాఁడొక విలక్షణమైన వ్యాఘ్రమేమో! మొగము పురుషాకృతిగానున్నది. వాఁడొక నరవ్యాఘ్రము కావచ్చును. కూర్చుండుట మానిసివలెఁ గూర్చుండెనే! అతనిని మరల చూడవలయును.

ఇట్లు శిశునాగుఁ డూహించుచుండగాఁ జంద్రమతీదేవి నవ్వుచు నిలుచుండెను. ఆమె మరియు నిట్లనెను. "ఏమయ్యా! యువరాజా! తండ్రితో మాటాడుట కింతసేపు విచారించ వలయునా? ఒక్కమాట మాటాడినచో నోటిముత్తెములు రాలిపోవునా? నీ మాటలువిని మేమందరము సంతోషింతుమే! నేను తల్లినిగదా! నేను సంతోషింతునుగదా! నీ తండ్రి నోటివెంట వచ్చిన యొకమాట నేను విని యెంత పరితృప్తి పొందుదు నందువు."

రాణియొక్క యీ మాటలువిని, ప్రేమలేని యీ మాటలువిని, తనయందును తన తండ్రియందునుగూడ లాలస భాసించని యీ పరజనోక్తులవంటి యుక్తులు విని శిశునాగుఁడు నివ్వెరపోయెను. ఈమె యెవరో? తనయూహా పరంపర యంతయు నీమెకుఁ దెలియునా? తాను తన తండ్రితో మాటాడినచోఁ దండ్రి సమాధానము చెప్పునా? శిశునాగుఁడు తండ్రిని పలుకరించుటకే నిశ్చయించుకొనెను. ఏమని పలుకరించవలెను? ఇదివరకు తానేమని పలుకరించుచుండెడివాఁడు?

నాయనగారూ! తండ్రిగారూ! మహారాజా! వీనిలోఁ దాను పూర్వ మేపిలుపు పిలిచెడివాఁడు? ఏపిలుపును పిలిచెడివాఁడు కాఁడు. జ్ఞాపకమునకు వచ్చుచున్నది. తానుపోయి తండ్రి వద్ద కూర్చుండెడివాఁడు. తాను దండ్రివంకఁ జూచెడివాఁడు. ఆయన తన్నుఁజూచి నవ్వెడివాఁడు. తన శిరస్సుమీఁదఁ జేయియుంచెడివాఁడు. తాను తండ్రి కత్తుకొనెడివాఁడు. తరువాత నేదో ప్రాసంగికముగా మాటాడెడివాఁడు. ఇప్పుడు పిలుచుటయేమి? ఇపుడు దగ్గరకుపోయి కూర్చుండుటకు వీలు లేదుకదా? తండ్రి మంచముమీఁద శయానుఁడై యుండెను. మహారాజా యని పిలువవలయుననుకొనెను. ఇంతలో నతని కొక యాశ యంకురించెను. తానుపోయి తండ్రి యొడిలోఁ గూర్చుండును. తన శరీరసన్నికర్ష చేత మరియు రాజు తనతో నొకఁడై పోవునేమో! అది రాజునకు శీఘ్రమరణహేతువు కావచ్చును అనుకొని శిశునాగుఁడు తండ్రియొడిలోఁ గూర్చుండెను. పరిజనులందరు మిక్కిలి సంతోషించిరి. రాణి మిక్కిలి భయపడెను. తాను మాటాడిన వైఖరిచేత వీఁడధికమైన ప్రయత్నము నారంభించె ననుకొనెను. తాను తనకుఁ గలిగిన సందేహమును మాటలలో వెలిఁబుచ్చెను. అతఁడు క్రియారూపమునఁ దన పని కొనసాగించుకొనుచుండెను. 'వీని నెవ్వఁడో బలవంతుఁ డైనవాఁడు సమావహించెను. వాని పేరేమి? వాని చరిత్రయేమి? ఇది యెట్లు తెలియఁగలదు. శిశునాగునివలనఁ దెలియదు. రాజువలనఁ దెలియవలయును. ఇది మంచిదే. రాజును పూర్తిగా శిశునాగు నావేశించిన యొక భూతమో పిశాచమో దానిచేత పూర్తిగా నావరింపఁబడనిమ్ము. రాజు

నకు దానితో తాదాత్మ్యము కలుగనిమ్ము. శిశునాగుఁడు వెడలిపోయిన తరువాత శిశునాగునిచేత రాజునకు మాటలు వచ్చుట కలిగిన తరువాత రాజుచేత తెలిసికోవచ్చును.' అని చంద్రమతీదేవి యనుకొనెను. ఆమె తానొక యభినయము చేసెను. ఇట్లనెను "నాయనా! శిశునాగా! నీవు తండ్రి యొడిలో కూర్చుండుట నాకెంతో సంతోషముగా నున్నది. నీవు మారిపోయితి వనుకొంటిని. నీవు మారలేదయ్యా. తండ్రిని గౌఁగిలించికొని మొగములో మొగము పెట్టి పలుకరించుము. తండ్రి సమాధానము చెప్పును. మరల రాజునకు నారోగ్యము సమకూరును." అన్న మాటలకు శిశునాగుఁడు మోసపోయెను. తల్లి తనకు ప్రతిస్పర్ధిని కా దనుకొనెను. తనయందు సహజమైన పితృప్రేమ భాసించకుండుచే నామె యట్లు మాటాడినది గాని వేఱు కాదనుకొనెను. తండ్రిని కౌఁగిలించికొనెను. తన చేతులు తండ్రి మెడకుఁ దగిలించెను. తండ్రిని కౌఁగిలించికొన్నట్లు లేదే! ఒక కాష్ఠమున కింకొక కాష్ఠము తగిలినట్లుండెను. తన శరీమునందు స్పర్శగుణము నశించినదా! తండ్రి శరీరమునందు శరీరలక్షణము పోయినదా? దాని యోఁగాములు తెలిసికొనుటకు తల్లిని కౌఁగిలించుకొనవలయు ననిపించెను. ముందుఁ దండ్రితో మాటాడి తరువాత దానిని నిరూపించికొనవలయును. రాజు మొగములో మొగము పెట్టి శిశునాగుఁ డిట్లనెను. "నాయనగారూ! నేను శిశునాగుఁడను. నేను తిరిగి వచ్చితిని. నాతో మాటాడుడు. మీరు మాటాడక పోవుటచేత ప్రకృతులును పరిజనమును దిగులు పడియున్నారు. తల్లి నిరుత్సాహ వంతురాలుగా

నున్నది." రాజు కన్నులలోనికి మఱియొక క్రొత్త ప్రకాశము వచ్చెను. ఆయన నవ్వఁబోయినట్లు కనిపించెను. శిశునాగుని మాటలను రాజు ఘ్రాణేంద్రియముతోఁ బీల్చుకొనుచున్నట్లుండెను. రాజునకొక శక్తివచ్చెను. వానకురిసిన నీళ్ళచేత నిండి నిలచి నిశ్చలమైయున్న యొక చిన్న నీటిపడియలోనికి కయ్యనుండి చొచ్చుకొనివచ్చిన బురదనీళ్ళు ప్రవేశించినట్లు, పడియ నల్లఁదనముపోయి పంకిలత్వము సంక్రమించినట్లు, తొలుతఁటికంటె మఱియుఁ గొంత పుష్టి సమకూడినట్లు రాజు కన్నులు భాసించెను. అతనికి మాట వెలువడెను. "యువరాజా! నీవు వచ్చితివి. నాపనియై పోయినది. ఇంక నీవే రాజవు. ఇన్నాళ్ళనుండి వలదు వలదంటివి. ఇప్పుడు నీకు తప్పదు. నీవు రాజ్యమును స్వీకరింపుము. నీ రాజ్యమును నీవు పాలించికొనుము. నీ శత్రువులను నీవు దండించికొనుము. నీ సుఖములను నీవనుభవించుము. నీ ప్రతీకారమును నీవు పాటించుము." ఈ చివరిమాట రాజు నోటివెంట వచ్చినంతనే శిశునాగుఁడు కళవళం పడెను. తాను తండ్రిమీఁద నింతసేపు వ్రాలియున్నవాఁడు. హఠాత్తుగా లేచి కూర్చుండెను. బెదరి తన తల్లివంకఁ జూచెను. ఆమె యేమనుకొనుచున్నదో యన్నట్లు వెలతెల పోసాగెను. అతని ప్రవర్తన యితరుల కర్థముకా లేదు.

నిదురపోవుచున్న యొక జంతువును చబుకుతోఁదాడించినచో నది నాల్గుకాళ్లు కూడకట్టికొని మరల విదలించి లేచి నిలుచుండు ప్రయత్నమున పాదములు సవరించుకొనుటలో గగ్గోలుపడి మొదలి బరువుమోయలేని శక్తిగలిగిన యా పాద

ములయందు మోయఁగలిగినశక్తి సమాధానపెట్టుకొనుచు లేచి నిలుచుండి గగ్గోలుపడినట్లు రాణి మనస్సు గగ్గోలుపడెను. ఆమె మనసులోని గగ్గోలు కన్నులయందు కనిపింపనీయ లేదు. శిశునాగుఁడు తా నెంచుకట్లు వెలతెలపోయెను. ఇపుడు విచారించుటకు వీలులేదు. ఆమె వెంటనే కొడుకుతో నిట్లనెను. "నాయనా! చూచితివా! మహారాజునకు నీవు బహిఃప్రాణమవు. ప్రొద్దుటినుండి మే మెంత ప్రయత్నించినను మాఱు పలుకని మీతండ్రి నీకు సమాధానము చెప్పెను. నీతో పది మాటలాడెను. ఇంక భయము లేదు. క్రమముగా రాజారోగ్యవంతుఁడగును. నీతండ్రిని నీవు బ్రతికించికొంటివి. మాటాడుచున్న రాజు లేచి కూర్చుండ లేదు. మఱికొన్నాళ్లు మంచమునందే యుండునేమో! నీతో మాటాడినవాఁడు నాతోఁగూడ మాటాడునా? అయినను పలుకరించి చూతునని యామె భర్తవద్దకుపోయి యిట్లనెను. "కార్తాంతికులఁ బిలిపించి పట్టాభిషేకముహూర్తము పెట్టింతుము. బిడ్డ యిన్నాళ్ళుగా రాజ్యము వలదనుచున్నాఁడు. నేఁడు తప్పకుండ నంగీకరించును. మీరు చెప్పితిరిగదా! పట్టాభిషేక మెప్పుడుచేయుమందురు." అని యడుగఁగా రాజు నేఁడే చేయవచ్చునననెను. రాణి మఱల నింకొక్క ప్రశ్న వేసెను. "మీకు ప్రొద్దుటినుండియు భోజనము లేదు. భోజనము చేయుదురా!" రా జక్కఱలేదనెను.

రాణి సంతోషించెను. అక్కఱలేదని తలయూడించ లేదు. నోటితో మాట చెప్పెను. రాణి మరల రాజుతో "తమరికి ప్రొద్దుటినుండియు స్నానములేదు. లేచి స్నానము చేయుదురా?" యనెను. రాజు తాను లేవలేనన్నట్లు సైగ

చేసెను. లేవలేరా యని రాణి యడుగగా లేనన్నట్లు సైగ చేసెను. లేవలేనని నోటితో ననరాదా యని రాణి సూదుల వంటి కనులతో చూచి యడుగగా రాజు మనసులో నేదో బలవంతము పొందినట్లు లేవలేనని నోటితో ననెను. రాణి "తమరు పరుండియుండగగానే మీచేత స్నానము చేయింతుము. ఈ వస్త్రములు తీసి యుదికిన వస్త్రములు కట్టుదుము" అనెను. రా జంగీకరించలేదు. రాణి బలవంతము చేయ నారంభించెను. పదిసార్లు చేతులతో నివారించి పదునొకండవసారి "నేనుఁ బ్రతికియున్నన్నినా ళ్ళీవస్త్రములే. వీనిని వదలను" అనెను. అందఱు నిశ్చేష్టులైపోవుచుండిరి. రాణి నవ్వి 'చిత్తమట్లే' యనెను. రాజు రాణివంక తీక్ష్ణముగాఁ జూచెను. రాణి "చిత్తమన్నాననియా? అనను. పొరపాటు బడితిని. తెలిసికొనుచున్నాను." అనఁగా రాజు నవ్వినట్లు కనిపించెను. రాణి తెలిసికొని నవ్వెను.

శిశునాగుఁడిది యంతయుఁ జూచుచుండెను. ఈ రాజు యొక్కయు రాణియొక్కయు ప్రసంగ మితరుల కేమియు నర్థముకాలేదు. శిశునాగునకు తత్కాలమందలి ప్రతిలిప్తయు భయ హేతువగుచుండెను. ఆశ్చర్య కారణ మగుచుండెను. ఈమె నిజముగాఁ దనకుఁ బ్రతిస్పర్థి కాదేమో! ఆమె తన జాతిలోనిదేమో! ఈమె కూడ ధూమవంశములోనిదేమో! అని శిశునాగుఁ డనుకొనెను. అతని మనస్సులో ధూమవంశ మన్నమాట స్ఫురించెను. ధూమవంశమేమి? ఇది యేమి మాట? ఎచ్చటినుండి వచ్చెను. తాను రాత్రి పీల్చిన ధూమమునకు దీనికి నేమైన సంబంధము కలదా? శిశు

నాగున కేమియుఁ దెలియలేదు. కాని ఇది యొక ధూాను వంశ మన్నప్రత్యయము మాత్రము గాఢముగా భాసించు చుండెను.

కొంతసేపటికి రాజువద్ద నెవ్వరును లేరు. ప్రొద్దుపోయి నది. పరిచారకులను పరిచారికలను రాణి పంపించివేసెను. తా నొక్కర్తకయే రాజువద్ద కుర్చుండెను. శిశునాగుఁడు తన వంక నెలతెలపోయి చూచిన సందర్భమును రాణి మనసా ధ్యానించెను. ఎందుకు నెలతెలపోయెను? రా జన్నమాట లలో నతని మనోభావమునకుఁ దగిలినమాట యేదియై యుండవలయును. రాజన్నమాటలన్నియు సామాన్యములైన మాటలే. చివరిమాట మాత్రమే శిశునాగునకుఁ దన మనస్సు లోని భావమును దగిలినట్లుండవలయును. ఆమాట యేమి? నీ ప్రతీకారమును నీవు చేసికొన్మనిన మాట. రాజ్యమేలు టయు శత్రువులను శిక్షించుటయు రాజయోగ్యమైన మాటలే. నీ ప్రతీకారమును నీవు సాగించుచున్న మాట నైయక్తికమైన విషయము. శిశునాగుఁడు ప్రతీకార మెవరి మీఁద చేయవలయును? ఎందుకు చేయవలయును? శిశు నాగున కిప్పుడు పాతిక యేండ్లు నిండలేదు. ఇన్నాళ్లును తల్లి దండ్రులచాటు బిడ్డగా నెదిగెను. సర్వ రాజ్యకార్యములు తండ్రియే చేయుచుండెను. ఈ రాజ్యమేపాటి గొప్పది? వార ణాసీపురముయొక్క చుట్టుపట్లనున్న నాల్గైదు వందల గ్రామ ములే యీ రాజ్యము. ఈ రాజ్యము మీఁది యాదాయము తైర్థికులవలన వచ్చునది. ఇది పెద్ద రాజ్యమే కాదేమో!

ఈ రాజ్యము భారతదేశమునందలి మహారాజ్యాధిపతులు వారణాసీ విశ్వేశ్వరస్వామి యందలి గౌరవముచేతఁ బాలించు చుండిరి. మాకు పెద్ద సైన్యములేదు. పెద్ద యాదాయము లేదు. పెద్ద రాజ్యము లేదు. శ్రీవిశ్వేశ్వరస్వామికి జరుగ వలసిన రాజోపచార దైవోపచారములకుఁ గావలసిన ధనము సంపాదించుట, దానితో నీ మహాక్షేత్రమును పరిపాలించుట, తైర్థికులయందు న్యాయాన్యాయములు విచారణముచేయుట. ఇతర రాజ్యములందుఁ బలె నిచట బహు పరిపాలనా శాఖలు లేవు. అన్ని శాఖలు కలిపి యొక్కటియే. కాశీరాజ్యమునకు విరోధులు లేరు. ఈ రాజ్యమును దమ హస్తగతము చేసికొని బావుకొందమని యేరాజును తలచఁడు. శిశునాగునకు శత్రు వులెవరున్నారు. ఇది సామాన్యపు మాట. మిగిలిన దొక్క టియే వాక్యము. నీ ప్రతీకారమును నీవు సాగించుకొమ్మను నది. ఆ ప్రతీకారమెవరి మీఁద? శిశునాగున కింకొకరితో సంబంధ బాంధవ్యములు లేవు. ఒక్క వేదమరీచితోడనే యతని సావాసమును పరిచయమును. ఆ వేదమరీచి మగధ రాజ్యాధికారిణి. ఆమెను దన రాజ్యమును స్వీకరింపవలసిన దని మాగధులైన మంత్రులు పలుమార్లు వచ్చుటయు, నామె వెళ్ళకపోవుటయు జరిగెను. నే నెన్నిసార్లు వేదమరీచి నడిగి నను 'బామ్మా! పోదునులే. తొందరయేమి.' యనుచుండె డిది. శిశునాగుఁ డామెను పోనీయలేదా! చివరకామె యితని మాటను నిరాకరించి వెళ్ళెనా? ఎందుకు పోనీయలేదు? ఎంత క్రీడాసౌహార్దము కలిగినను ఒక రాజ్యమున కుత్తరాధి కారిణియైన తన యన్న కూతును దన రాజ్యము తాను చేసి

కొనకుండ తా నాపవలసిన యవసరమేమున్నది? వారిద్దఱు సర్వదా అన్నా చెల్లెండ్రవలెనే తిరుగుచుండిరి. తండ్రి కూఁతుండ్రవలెఁగానే కాదు. వెలికినిట్లు నటించుచు నాంతర మున మఱియొక సంబంధము కలిగియుండిరా? ఈ పాపపు టూహ నాకెందుకు రావలయును? ఇదివర కెప్పుడునురాలేదు. ఇప్పుడే వచ్చినది. ఎందుకు వచ్చినది. శిశునాగునియొక్క ఈ పరిస్థితివలన వచ్చినది. దీని స్వరూపమేమో నాఁకు దెలి యదు. అతఁడు ప్రతీకారమును నిర్వహింఁచవలసి వచ్చినచో నది వేదమరీచిమీఁద. ఆమె తన మాటవినక తనరాజ్యమును తాను పాలించుకొనుటకు పోయెను. "తనమాట వినక" అన్న మాటలోని యర్థమేమో తెలియదు. తనమాటయేమి? నీవు పోయి రాజ్యము చేయవద్దనియేగదా! ఆమె పోకపోయినచో మగధరాజ్యమేమి కావలయును? మా నందివర్ధనునకు మగ సంతానములేదు. వేదమరీచిని కని నా చెల్లెలు దివంగతు రాలైనది. నందివర్ధనుఁ డామెయందలి ప్రేమచేత మఱల వివాహమాట నిచ్ఛగించలేదు. వేదమరీచిని నేను తీసికొని వచ్చితిని. పదునాలుగేండ్లు పిల్ల యిచ్చటనే యుండెను. ఇది మహాక్షేత్రము. శ్రీ విశ్వేశ్వరలింగమునుండి తరంగములు తరంగములుగా ప్రతినిమేష మావిర్భూతములై, పునఃపున రావర్తితములై వాయువీథుల నుండియుండెను మహాశక్తిచేత నిచ్చటిజనులు పవిత్రభావపరిపూర్ణ చేతస్కులైయుందురని, వేదమరీచియొక్క జీవుఁడు పరిశుద్ధుఁడగునని, మగధరాజ్య పాలనాపటిష్ఠుఁడగునని, వేదధర్మ ప్రతిష్ఠాపనా చార్యుఁడగు నని నేను భావించితిని, ఆ మగధరాజ్యముయొక్క కర్మమేమో!

జరాసంధుని నాఁటినుండి నేఁటివఱకు నది భగవద్విరోధమునే పాటించుచుండెను. వేయియేండ్లు బార్హద్రథులు పాలించిరి. వారందఱును శ్రీకృష్ణవిరోధులు. తరువాత నూటముప్పదియా ఱేండ్లు ప్రద్యోతులు పాలించిరి. వారిలో చివరివాఁడీ నంది వర్ధనుఁడు. ఈ నూటముప్పది యాఱేండ్లును శ్రీకృష్ణభక్తి మగధరాజ్యమున లేదుసరికదా శ్రీకృష్ణవిరోధమునే యా రాజ్యము పాటించుచుండెను. ప్రద్యోతులు రాజ్యమునకు వచ్చి నొక పదునాఱేండ్లు కాబోలు నయ్యెను. ప్రద్యోతుఁడు తనకూతును పద్మావతిని పాండవవంశ సంజాతుఁడైన యుద యనున కిచ్చెను. ఆ సంబంధ ముదయనునితోడనే యంత రించెను. ఉదయనుని కుమారుఁడు కిన్నరుఁడు. అతనినిగురించి వేయి కట్టుకథలు బలిసినవి. అతఁడు విద్యాధర చక్రవర్తి యయ్యెనందురు. తరువాత ప్రద్యోతవంశమునకు పాండవ వంశమునకు మఱల సంబంధమే లేదు. అయినచో నప్పుడే మగధరాజ్యముయొక్క దైవికమైన భావము మారవలసి యుండెను. అది మాఱలేదు. జరాసంధుఁడు చేసిన చండీ పూజ పరంపరగా బార్హద్రథ వంశ మున్నన్నినాళ్ళు సాగెను. ప్రద్యోత వంశపురాజులు దానినిగూడ మానివేసిరి. ఇంక భవిష్యత్తులో మగధరాజ్య పరిపాలకులు దేనిని స్వీకరింతురు? సహజముగనే కృష్ణవిరోధులు. ఈనాటికి చండీపూజయు లేదు. నందివర్ధనుఁడే శూన్యవాది. తరువాత రా జెవ్వరగును? వేద మరీచి వివాహమాడునా? ఆమెకు సంతానము కలుగునా? ఒక వదంతి యున్నది. ప్రద్యోత వంశమంతరించి మఱి యొకవంశము మగధరాజ్య సింహాసన మాక్రమించునని

యందందు వినబడుచుండును. మగధరాజ్యము మీఁద దండెత్తి జయించఁగల రాజ్యమేది? అంత బలిష్ఠమైన సైన్య మెవరికిఁ గలదు? చక్రవర్తులని పేరు లేకపోయినను మగధరాజ్య పాలకులు తమకున్న బలముచేత సర్వ భారతమునందు చక్రవర్తులవలెనే వ్యవహరించు చుండిరి. ఎవనిచేతిలో మగధరాజ్యమున్నదో వాఁడు వేయి యేండ్లుగా భారతదేశ సర్వాధికారిగా ప్రవర్తించుచుండెను. మహాభారత యుద్ధములో హస్తినాపురముయొక్క యధికారము చెడిపోయెను. నాటినుండి మగధరాజ్యముదే పైచేయిగా నుండెను. బార్హద్రథవంశము పోయి ప్రద్యోతవంశము వచ్చెననగా యుద్ధము చేసినవారు లేరు. గెలిచినవారు లేరు. ఓడినవారు లేరు. ఆనాఁటిమంత్రి రాజ్యమును చేతులు మార్చెనట. నేడు భారతదేశమున మగధరాజ్యము మీఁద దండెత్తి గెలువఁగల యింకొక రాజ్యము లేదు. శిశునాగునియొక్క ప్రతీకారముయొక్క స్వరూపమెట్టిది? ఆ ప్రతీకారము వేదమరీచి మీఁదనైనచో ప్రతీకారము దేనికి? ఇతఁడెట్లు చేయఁగలఁడు? ప్రతీకారము చేయవలయునన్న యీ భావ మితనిలో నెవరునాటిరి? రాత్రి యితఁ డెచ్చటికిఁ బోయెను? ఆ యెదురుగా కూర్చున్నవాఁ డెవఁడు? చిత్రశిఖండి వచ్చినచో వెంటనే నావద్దకు రమ్మంటిని. నేను తొందరపడి మఱల నతనికొఱకు మనిసిని పంపించరాదు. ఇప్పటికి నాల్గుసార్లు పంపించితిని. ఇది యెవరికో యనుమాన హేతువుకారాదు. ఎవరికనుమానము కలుగును? ఎవ్వరికిని కలుగదు. శిశునాగునకుఁ గలుగవలయును. అతఁడేదో యొక యున్మత్తస్థితిలో

నున్నాఁడు. ఆ యున్మాద మతనిలో నింకను నొకస్థాయి నేర్ప
ఱచుకొన్నట్లు లేదు. ఆ స్థాయి యేర్పడిన తరువాతఁగాని
వానికిఁ దక్కిన విషయములు పట్టవు. ఒక పదకము వేసికొన
వలయును. తాను కొందఱిని విశ్వసించవలయును. వారిని
నమ్మకములోనికి తీసికొనవలయును. వారిని దన రహస్య
చారులుగా నియమించుకొనవలయును. అప్పుడుగాని యొక
దానిని గూర్చి యనుమానపడఁడు. ఐనను చిత్రశిఖండికొఱకు
మనిసిని పంపించవలసిన యవసరమేమి ? ఈ రాజుచేత మాటా
డించుటకొక యత్నము చేసితిని. ఆయన మాటాడెను. మరల
నట్టి యత్నమే చేసెదను. మాటాడునేమో చూతును.
మంత్రి ప్రయత్నించెను. నిత్యము రాజు ననుసరించి యుండెడి
పరిచారకుఁడు పలుకరించెను. రాజు సమాధానము చెప్ప
లేదు. నాకును జెప్పఁడేమో ! ఒక విధముగాఁ బలుకరిం
తును. శిశునాగుని ప్రతీకారము నేననుకొన్న యూహ సమం
జసమైనచో రాజును పలుకరించఁ దగినదియు రాజు సమా
ధానము చెప్పదగినదియు నగు నంశమగును. ఆ ప్రతీకారమును
గూర్చి మాటాడెదను. రాజు బదులు పలుకునేమో చూతును.
అంతకంటె ముందు మఱికొన్ని విషయములు మాటాడి సమా
ధానము చెప్పకొన్నచోఁ బ్రతీకార ప్రసంగము చేసినపుడు
బదులు పల్కినచో నాయూహ నిజమైన దగును. అని రాణి
యోజించుకొనుచు రాజునద్దకుఁ బోయి యా ప్రశ్నయు
నీ ప్రశ్నయు వేసెను. ఆయన సమాధానము చెప్పలేదు.
రాణి రాజుమీఁద వ్రాలి మొగము మీఁద మొగము పెట్టి
సూదులవలె చూచుచు నిట్లనెను. “శిశునాగుఁడు రాజగును.

ప్రతీకారముచేయును. ఆ ప్రతీకారమెట్లు చేయవలయునో చెప్పఁ గలుగుదురా?" రాజు కన్నులు విప్పి రాణివంకఁ జూచెను. రాణి మరల ప్రశ్నించెను. రాజిట్లనెను "అతఁడు రాజైన తరువాత నేను తత్ప్రతీకార మార్గమును బోధింతును." మహాటవీ మధ్యమున నొక మద్దిచెట్టును మదపుటేనుగువచ్చి కొమ్ములతో కుమ్మినచో నా వృక్షమెట్లు కదలాడునో రాణి మనస్సట్లు కదలాడెను. అనఁగా కదలెను కదలలేదు. పడిపోవునేమో యనిపించెను. గాటముగా వేళ్ళుపాతుకొనిన మద్దిచెట్టంత సులభముగా నెంత మదపుటేనుఁగైనను దాని యాఘాతమున నొక్కసారి పెల్లగిలదు. దాని కదలిక కదలికవలె కన్పించదు. ఆ కదలిక బోదయందు భాసించదు. కొమ్మలయందు రెమ్మలయందాకులయందు భాసించును. రాణిమనస్సున కట్టి కదలిక కలిగెను. రాణి తటపటాయించుకొని యిట్లనెను. "మీరు బ్రతికియుందురా? ఇట్టే మంచములోపడి యింకెన్నాళ్ళుందురు. మీరు బ్రతికియున్నఁగదా యతనికి మార్గోపదేశముఁ జేయుట." అనఁగా రాజు నవ్వఁబోయెను. రాణికి సమాధానము రాదని తెలిసెను. కాని యిందులోని రహస్యమేదిమో తెలిసికొనవలెననిపించెను. హఠాత్స్ఫురణగా రాణి యొక ప్రశ్న వేసెను. "నీ వెవ్వఁడవు? ఎప్పు డిచ్చటికి వచ్చితివి? ఎట్లు వచ్చితివి?" ఆ మూఁడుప్రశ్నలు నొక్కగ్రుక్కలో రాణి వేసెను. ఆమె యాలోచించలేదు. ఆమె మనస్సులో నేమితోచినదో తెలియదు. ఆ ప్రశ్నల నామె యాలోచించలేదు. రాజు "నా పేరు జయద్రథుఁడు" అనెను. రాణి జయద్రథుఁడనగా నెవ

రని ప్రశ్నించెను. రాజు సమాధానము చెప్పలేదు. తరువాత రాణి వంద ప్రశ్నలు వేసెను. దేనికిని సమాధానములేదు. రాణి ప్రాణము విసివిపోయెను. కాని యామె మనస్సులో జయద్రథుఁడన్న పేరు నిలచిపోయెను. జయద్రథుఁడెవఁడు? ఎవఁడు జయద్రథుఁడు? ఎవఁడు జయద్రథుఁడు? భారత కథలో సైంధవుని పేరు జయద్రథుఁడు. మరియు జయద్రథనామ ధారులు కొంతమంది కలరు. వారెవ్వరును భగవద్వ్యతిరేక భావముకలవారుకారు. ఆ సైంధవుఁడగును. వానికిని దీనికి నేమిసంబంధము. రాణి రాజును మీరనుట మానివేసెను. భర్తనువలె గౌరవించుట మానివేసెను. నీవు నీవంచునే మాటాడెను. అతనికిఁ బ్రియము కలుగుటకొఱకుఁ దాను శిశునాగునికి సాహాయ్యము చేయుదునని చెప్పెను. ఎన్ని చెప్పినను రాజు బదులుచెప్పలేదు. ఆమె ప్రశ్నలతో నతనిని విసివించెను. రాజు చివరకిట్లనెను. "నేనొక వేళకొఱకుఁ బ్రతీక్షించుచున్నాను. ఈరాజుయొక్క శరీరము నప్పుడు వదలి పోయెదను. రాజు మరణించును" అనెను. రాణికన్నులలో నొక విశిత్రమైన యాలోచనా పరంపర యారంభించెను. ఆమె రాజువద్దనుండి లేచిపోయెను. ఒకచోట నేకాంతముగాఁ గూర్చుండెను. ఇట్లనుకొనెను. "వీఁడెవఁడో వచ్చి రాజునందుఁ బ్రవేశించెను. వాఁడు లేచిపోయినంతనే రాజు మరణించును. ఎవ్వఁడో వచ్చి రాజునందున్నాఁడని ప్రకృతులకుఁ బరిచారకులకుఁ దెలియదు. ఇది రహస్యము. జయద్రథుఁడు పొరపాటుపడి నాతోఁ జెప్పినాఁడు. ఏవేళకొఱకుఁ బ్రతీక్షించుచున్నాఁడు? ఆవేళ యెట్టిది? ఎట్టిది? జయద్రథుఁడు రాజులో

నెప్పుడు ప్రవేశించినాఁడు? శిశునాగునిఁ బరిచారకులు తీసికొని వచ్చువరకు రాజు పుత్త్రవియోగార్తుఁడైనరాజు. తనకుఁ దెలియును. శిశునాగుఁడు తండ్రితో మొదటిసారి మాటాడినప్పటినుండి రాజు మారిపోయెను. శిశునాగుని మాటలోనుండి యీ జయద్రథుఁడు రాజునందు సంక్రమించియుండవలయును. శిశునాగునందే యేల సంక్రమించలేదు? అతని మాటలో నుండి రాజు నందేల ప్రవేశించవలయును? శిశునాగుఁడు సాధనము. జయద్రథుఁడు కర్త. కర్త సాధనమునందుఁ బ్రవేశించఁడు. సాధనమును దన కనుకూలముగా నుంచికొనును. ఈ జయద్రథుఁడు కర్త. వీఁ డెవఁడు? వీని కార్యమేమి? శిశునాగుని ప్రతీకారము నిస్సంశయముగా వేదమరీచిమీఁదనై యుండవలెను. వేదమరీచిమీఁద నితఁడు తీసికొను ప్రతీకార మెట్టిది? ఆమె వివాహ మాడకుండఁ జేయుటయా? అది పెద్ద ప్రతీకారమేమి? - అది ప్రతీకారమైనచో నది యచ్చముగా శిశునాగుని భావమై యుండవలయును. అంత మాత్రమున కెవ్వఁడో జయద్రథుఁ డన్నవాఁడు, మానవ శరీరము లేనివాఁడు, విచిత్రమైన జీవుఁడుగా నాకాశమునందు సంచరించెడివాఁడు, వచ్చి యొక శరీరమునందుఁ బ్రవేశించి తత్ప్రతీకారముకొఱకుఁ బ్రయత్నింపఁ జేయవలసిన యవసరమేమి? అది మగధరాజ్యమును సమాక్రమించుకొనుటకు, మగధరాజ్య సమాక్రమణముద్వారా భారతదేశమున నేదో యొక సిద్ధాంతము వ్యాపింపఁ జేయుటకునై యుండవలెను. ఈ జయచంద్రుఁడు సైంధవుఁడేయై యున్నచో వాఁడు కృష్ణ విరోధి. పాండవ విరోధి. ఏదో యొక పగ వేల యేండ్లుగా

సాధించవలయునన్న యొక విచిత్రమైన జీవి కోపముచేత, మాత్సర్యముచేత, దుష్ట లక్షణముచేత, యహంకారముచేత, పట్టుదలచేత, పరమార్థస్థితియందున్న మృల్లక్షణ సహితమైన జీవలక్షణముచేతఁ గొందఱు జీవులు నిత్యముగా జీవలక్షణము పరిత్యజించకుండ, జీవలక్షణమునందుఁ బీటవెట్టికొని కూర్చుండి యనంతకాలముమీఁద మాటిమాటికి జన్మ లెత్తుచు మఱియుఁ గుటిలుఁడైన జీవి యైనచోఁ దన కనుకూలమైన జీవులయందు సంక్రమించుచు నీ యనంతకాలముమీఁద, ననంత దేశముల మీఁదఁ బ్రయాణించుచుందురు. వారిలో వీఁడొకఁడు. వీఁడా సైంధవుఁడే యైనచోఁ బదునొకండు వందల యేండ్లు ప్రయాణము చేయుచు వచ్చెను. ఈపాటికి వీనిశక్తి చాల యుడిగియుండును. ఏ వేళకొఱకు వీఁడు ప్రతీక్షించుచుండెనో విచారించవలయును. శిశునాగుఁడీ గత రాత్రమున నెవని తోడనో కలిసికొనెను. వాఁడీ మాయ శిశునాగునిమీఁదఁ బ్రయోగించెను. వాఁడీ కోటకుఁ దా నెప్పుడో రాఁగలఁడు. వాఁడు వచ్చుటయు రాజు మరణించుటయు నొక్క కాలము నందు జరుగుననుకొందును. వాఁడిచ్చటికి రాకుండఁ జేయ వలయును. అంతవరకు రా జిట్లే మంచమునందుఁ బడి యుండును. రాజు రాజు కాకపోయినను నీ శరీర మున్నన్ని దినములు రాజే. ఆ శరీర మున్నన్ని దినములు నేనా శరీరగత తత్పూర్వస్థిత జీవునకు భార్యను. రాజుయొక్క జీవుఁడీ శరీర మునం దిప్పు డున్నాఁడా లేఁడా? రాజు చనిపోలేదు. ఆజీవుఁడు వదలిపోలేదు. ఆ జీవుని నధఃకరించి ఈ జయద్రథుని జీవుఁడు వానిపై నధికారము చేయుచున్నాఁడు. వీఁ డెప్పుడో తొలఁగి

పోవును. తొలఁగిపోవుచు తిరిగివచ్చుచు నుండినను నుండ వచ్చును. నేఁటి ప్రొద్దునన ప్రవేశించినాఁడు. ఇది క్రొత్త. కొన్నాళ్ళు జరుగవలయును. ఎప్పుడో. వీఁడు తొలఁగిపోయి నపుడు రాజు రాజుగా మాటాడును. నేను రాజును వేయి కండ్లతో చూడవలయును. ఎప్పుడు నేమఱి యుండరాదు. నాకు చాల పని పెట్టినాఁడు జయద్రథుఁడు. వాఁడెవ్వఁడో తెలిసికొలవలయును. రాజు మేనినుండి వీఁడెపుడు లేచి పోవునో తెలిసికొనవలయును. ప్రతీకార స్వరూపమేమియో తెలిసికొనవలయును. శిశునాగ వేషమరీచుల సంబంధమెట్టిదో తెలిసికొనవలయును."

## ౬

రాత్రి ప్రొద్దుపోయి చిత్రశిఖండి వచ్చెను. ఏకాంతమునఁ గూర్చుండి చింతాపరాయణురాలైన చంద్రమతీదేవి సాన్నిధ్యమునకు వచ్చి యాదేవి కన్నెత్తి చూచువరకు ప్రతీక్షించి యుండి, కన్నెత్తి చూచిన తరువాతఁగూడ నామె తన్ను గుర్తించని చాలిక తెలిసికొని "అమ్మా! నేను చిత్రశిఖండిని. నా చూచిన సంగతి తమకు మనవి చేసికొనుటకు వచ్చితి"ననఁగా దేవి స్మృతికలిగి "అవునయ్యా! యాపురుషుఁ డెవ్వఁడు? వాని జాడ తెలిసికొంటివా? అది చాల ముఖ్యమైన విషయ"మనియెను. చిత్రశిఖండి యిట్లనెను. 'మహాదేవీ! మన నగరమున నొక వృద్ధ పండితుఁడు కలఁడు. ఆయన పేరు

పరాశరశాస్త్రి. నిత్య తపస్వి. యోగనిష్ఠాపరుఁడు. జ్యోతిషము, సాముద్రికము నాయన సొమ్ము. ఆ శాస్త్రిగారి నభ్యర్థించి వారిని వెంట తీసికొని నేను పోయితిని. ఆ స్థలము వెదకికొంచుఁ జేరితిని. అందు రక్షించుచుండుమని నేను నియమించిన భటుఁడు లేఁడు. నా కతనిమీఁద కోపము వచ్చినది. మఱల నా కింకొక యూహ దోఁచినది. వాని నచ్చటినుండి యెవ్వరైనఁ బ్రతారించి పంపించిరేమోయని. అందు పోయి వెదకితిని. డాలును నేలపై నా పురుషుని కాలిగుర్తు చెడకుండ మూసిన చోటును సమీపించితిని. డాలు మాత్రము కదల్పఁబడలేదు. డాలు నెత్తి చూచితిని. ఆ పురుషుఁడు కూర్చున్న గుర్తులు కనిపించుచుండెను. పరాశరశాస్త్రిగారిని 'స్వామీ ఈ పురుషుఁ డెవ్వఁడు? ఇది రాజకార్యము. ఈ పాదపు గుర్తులను చూచి వాఁ డెవ్వఁడో నిరూపింపవలయును. ఈ వేళను లెక్క పెట్టి వాఁడు నాకు దొరకునో దొరకఁడో నిశ్చయించి కట్టవలయును' అని రాత్రి జరిగిన సమాచారమును సర్వమును పూస గ్రుచ్చినట్లు వారికి నివేదించితిని. ఆయన వృద్ధు. తొంబదియేండ్లవాఁడు. కనుబొమ్మలు తెల్లనడి పొదలవలె క్రిందికి వ్రాలి కను లెప్పుడును మూతవడినట్లే యుండును. ఒడలు ముడుతలువడి యుండును. ఆయన యింటిలోనుండి కడచిన పాతికయేండ్లుగా బయలు దేరి వచ్చిన సంగతి నే నెఱుఁగను. నేను పోయి యీ సంగతి యిట్టిదని మనవిచేసితిని, ఆయన నావెంట బయలుదేరివచ్చెను. నా కాశ్చర్యము వేసెను. ఆ వృద్ధ పండితుఁడు నా వెంట వచ్చుచుండఁగా వారణాసీప్రజలు నివ్వెఱపోయి చూడ నారం

భించిరి. ఇది యేదో గడ్డైన రాజకార్యము సమాసన్నమైనది. లేనిచో శాస్త్రిగారు బయలుదేరి పోవఁడనుకొనిరి. నేను పిలిచినంతన పరాశర శాస్త్రిగారు బయలుదేరి వచ్చుట నాకు భయహేతువైనది. ఇది యింత క్లిష్టమైనపనియో, ఇది యెంత రాజాపాయకరమైనదియో. ఇది యెట్టి దేశ సంక్షోభ హేతువో పాతిక యేండ్లు కాలు కదపని మహా పండితుఁడు నేను పిలిచినంత నా వెంటఁబడి వచ్చుచున్నాఁడని నాకు భయము కలిగెను. ఆ భయముతోడనే వారి నాప్రదేశమునకుఁ దీసికొని పోయితిని. ఆ పాదపుగుర్తులు చూపించి వారి నభ్యర్థించితిని. ఆ పండితుఁడు నావంకఁ జూచి "ఈ కాలిగుర్తులు రక్షించుటకు డాలు మూసినవాఁడవు రక్షకభటు నొక్కని నిచ్చుట నిలుపక పోయితివా" యనెను. నేను స్వామీ నిలిపితిని. వాఁడు కనిపించుట లేదంటిని. ఆ పండితుఁడు నేలమీఁద నొక ప్రదేశమును నాకు చూపించెను. నేనచ్చట పరీక్షించితిని. కడచినరాత్రి బెదరిపోయిన జంబుకము యొక్క కాలి గుర్తులవంటి గుర్తులు రాత్రి లేనివి పండితుఁ చూపించినచోట నాకుఁ గనిపించెను. ఆజంబుకము మఱలవచ్చెను. రక్షకభటుని బెదరించెనా? దానిని చూచి వాఁడు పాఱిపోయెనా? వానిచేతిలో ఖడ్గమున్నది. వాఁడు దానికి బెదరునా? నేను వాని నచ్చటనుండుమన్న తరువాత నైదాఱు గడియలుమాత్రమే రాత్రి మిగిలియుండెను. తరువాత సూర్యోదయమై సూర్యుని వెలుఁగులు పొలమంతయు నావరించియుండును. ఆ యాఱుగడియల రాత్రివేళయందే

వానిని జంబుకము భయపెట్టి పారిపోవునట్లు చేసెనా? వాఁడు పారిపోయెనా? పారిపోవునా? పారిపోయిన లక్షణమేమియు కన్పించుటలేదు. అని నేను విచారించి వాని కాలిజాడలకొఱకు వెదకితిని. వాని కాలిగుఱ్ఱులే కనిపించలేదు. నా కర్థము కాలేదు. పండితునితో స్వామీ! వాఁడిచ్చటలేఁడు. వాఁడు నడిచిపోయినజాడ కనిపించుటలేదు. నా కర్థమగుటలేదంటిని. పండితుఁడు మాటాడలేదు. ఆయన యా పురుషుని పాద చిహ్నములు పరిశీలించుచుండెను. కొంతసేపటికి లేచి నిలుచుండి నీ పేరేమని యడుగగా నేను నా పేరు చెప్పఁగానోయీ! నీవు బ్రాహ్మణుఁడవా! యనెను. 'చిత్తమం'టిని. 'నీవు బ్రాహ్మణవృత్తి పరిత్యజించి రాజసేవావృత్తిలో దిగితివా?' యనెను. ఔనంటిని. ఖడ్గవిద్య నేర్చితివా యని యనెను. సర్వ యుద్ధకార్యములయందు నేను నిపుణుఁడనని మనవి చేసితిని. నీ రాజభక్తి యెట్టిదని నన్నతఁడు ప్రశ్నించెను. ఇదిగో యిట్టిదని నేను ఖడ్గముతో మంజేయి చీల్చికొంటిని. ఇదిగో తల్లీ! ఆకత్తివాదరగీఁ." అని చిత్రశిఖండి చంద్రమతీదేవికిఁ జూపించెను. రాణి రెప్పవాల్చక దానివంకఁజూచుచుండెను. చిత్రశిఖండి మఱల నిట్లనెను. ఆపండితుఁడు సంతోషించి 'యోయి! చిత్రశిఖండీ! నీవు మహాక్లిష్టమైన కార్యాచరణ చేయఁదగియున్నది. ఇది సులభమైన కార్యముగా నాకుఁ గనిపించుటలేదు.' అని యా పండితుఁడు చాలసేపు తానేదో యాలోచించుకొనెను. ఏవో లెక్కలు కట్టికొనెను. ప్రొద్దు కొలిచెను. శిరఃకంపము చేసెను. నాతో నిట్లనెను. 'ఓయీ! ఈపాదము లెవరివో వాఁడెచ్చటికి పోయెనో తెలిసికొనవల

యును. వాఁడు పోయినమేర సర్వత్ర పాదచిహ్నములు కని పించవుగదా ? వానినెట్లు పట్టుకొందువు ? వానిగుఱ్ఱు నీకెట్లు తగులును ? వాఁడిట్లుండునని నీకు తెలియదు. వాఁడెవ్వఁడో తెలిసికొని వానిని మన కాశీనగరమునకు రాకుండఁ జేయవల సిన యవసరమున్నది. వాఁడు కాశీనగరమునుఁ బ్రవేశించి నచో నీమహానగరమున కేదో పెద్దయాపద కలుగును. నా కింతమాత్రము తెలియుచున్నది. ఏమిచేయుచుందువు ?" అనఁగా నేను స్వామీ: వాఁడిట్టివాఁడని నాకు చెప్పఁడు. వాని యాకారవిశేషమును నాకు తెలియఁజేయుఁడు లేదా వాని పాదచిహ్నములనుబట్టి వానిమూర్తి యిట్లుండునని తెలియ రానిచో వాని భాగధేయమెట్టిది ? వాని యాత్మలక్షణమెట్టిది? వాని జాతకమెట్టిది? మొదలైన విషయములైన నాకు తెలియ జేయుడు. వానినిపట్టి నేనా పురుషుని వెదకెదను. నేను జన్మించి నందులకు కాశీనగరమునకు నట్టి మహాపదరాకుండఁ జేయు టయె మహాఫలితముగా మన్నించుకొందునంటిని. ఆ పండి తుఁడు 'నీవు నావెంట రావలయును. కాని యీప్రదేశము నందు పది దినములవరకు రక్షణయుండవలయును. నల్గురెదు గురు రాజభటులు ప్రతిక్షణము జాగరూకులై యుండవలయును. ఆనల్గురెదుగురు నిర్భయులై వ్యామోహరహితులై దూర స్థములైన వస్తువుల స్వరూపమెట్టిదో తెలిసికొందమన్న యలు పపు కోర్కియు నట్టి పేరాసయు లేనివారై యుండవలయును. నే నిచ్చటనే యుందును. నీవు నగరమునకుపోయి అట్టివారిని నలుగురినిఁ దీసికొనిరమ్ము. వారు దివారాత్రము లిచ్చటనే యుండవలయును. కన్నులలో వత్తులువేసికొని కాపుండవల

యును. దేనికిని భయపడరాదు ఎట్టిపరిస్థితులయందు నీస్థలము పరిత్యజించిపోరాదు. పులివంటి జంబుకములు రావచ్చును. పులులేరావచ్చును. వానిని జంపఁ బోవరాదు. వీనిని జూచి భయపడరాదు. ఈ గుఱ్ఱము నెక్కి స్వారి చేయనివాని బ్రతుకేమి బ్రతుకనిపించు గుఱ్ఱము కనిపించును. ఆ వ్యామోహమునకు లొంగరాదు. కొంద రాటవిక స్త్రీలు కనిపింతురు. వారి యౌవనము శివనేత్ర వహ్నిదగ్ధుఁడు కాని మన్మథుఁడు సంచరించు పర్వతసానుప్రదేశముల వంటిది. వారినిఁ జూచి కోర్కి పొందరాదు. అట్టి రాజభటులు నలుగు రున్నచోఁ దోడి తెమ్ము. లేనిచో ఇద్దఱమింటికి పోదుము, పద.' అని పరాశర శాస్త్రిగారనఁగా నాకు వెంటనే రక్షకభటుఁడే మయ్యెనో తెలిసెను. అందులో నేదియో రెుుకటై యుండును. నేను విచారించితిని. అందులో నే నొకఁడనా? నాయందట్టి గుణము లున్నవా? నాకుఁగల రాజభక్తి నన్నిట్టి వానినిగాఁ జేయునా? అని యాలోచించికొని 'స్వామీ! నేనొకఁడ నంటిని! పరాశరశాస్త్రిగారు చిత్రశిఖండీ! నీ వా నలుగురిలో నొకఁడవు కాకూడదు. నీవు చేయవలసినపని వేఱే యున్నది. ఆ నలుగురిని వేఱే తీసికొని రావలయును. నాకు వెంటనే స్ఫురించెను. తల్లీ! మన నగరమున నట్టివారు నలుగురు కలరు. వారి నలుగురిని నేనెఱుఁగుదును. వారు గంగాతీరమున తపస్సు చేసికొనుచున్నారు. పూర్వము వారు మన సైన్యములో నుండెడివారు. ఇద్దఱు క్షత్రియులు, ఒకడు శూద్రకులజుఁడు. ఒకఁడు వైశ్యుఁడు. ఈ నలుగురు స్నేహితులు. దృఢవ్రతులు, దృఢకాయులు, విరక్తులు, రాజభక్తులు. వారు

విరాగముపొంది సేననుండి విరమించి తపస్సు చేసికొను చున్నారు. వారు తపస్సు మొదలుపెట్టి రెండేండ్లైనది. వారు సైనికోద్యోగ విరమణము చేయునాఁడు నేను వారివద్ద నొక వాగ్దానము తీసికొంటిని. వారి యుద్యోగమునుండి విరమణము దొరకకుండ నేను సంవత్సరము వారి మార్గమునం దభ్యంతరములు కలిగించితిని. మీవంటివారు రాజసేవ పరిత్యజించినచో రాజ్యమేమి కావలయునని వారితోఁ బోరాడితిని. చివరకు వారివద్దనుండి వాగ్దానము తీసికొంటిని. వారు బ్రతికి యుండఁగాఁ గ్లిష్టమైన రాజ్యకార్యము వచ్చినచో వారు తపస్సు చాలించి వచ్చి యా రాజకార్యమును నిర్వహించి తీరవలయును. తరువాత మరలఁ బోయి తపస్సుఁ జేసికొన వచ్చును. వారు నల్వురు గలరు. నేను వారివద్దకు పోయితిని. వారి నలువురితో చెప్పితిని. ఇది పరాశరశాస్త్రిగారి యాదేశమని నంతనే వారున్నవా రున్నట్లు బయలుదేరిరి. వారి సైనిక పురాణపు దుస్తులు కలవు. వేసికొనిరి. ఖడ్గములను దీసికొనిరి. నా వెంట వచ్చిరి. మేము తత్ప్రదేశమునకుఁ జేరునప్పటికి ప్రొద్దు వాటారఁ బోవుచున్నది. శాస్త్రిగారు మే మచ్చటకిఁ జేరునప్పటికి నేవో కొలతలు కొలుచుచునే యుండిరి. రాత్రి చెదరిపోయిన జంబుకపు కాలిగుర్తులు నచట గాపుంచిన రక్షకుఁడు పోయిన మార్గము తెలియక యుండగా నచట నావరించియున్న జంబుకపు కాలిగుర్తులు సాయన పరిశీలించుచుండెను. నేను కనిపించినంతనే 'ఓయీ! మన మదృష్టవంతులము. ఈనాఁడు సవ లెల్ల గాలియే లేదు. ఇది చూచితివా? ఇవి నక్క కాలిగుర్తులు. ఇవి కూడ నక్కలేనా? గుఱ్ఱపు

కాలిడెక్కల గుర్తులవలెఁ గనిపించుటలేదా! జాగ్రత్తగాఁ జూడుము. నక్క యరికాలు చీలియుండును. గుఱ్ఱపుడెక్కలో చీలిక యుండదు. ఇది నక్క కాలిగుర్తులు కావు. గుఱ్ఱపు కాలిగుర్తులు. ఆ గుఱ్ఱము కాలిగుర్తు ప్రమాణమునుబట్టి టింగ ణాయై యుండవలయును. ఆ జంబుకము పరిమాణమెంతదో ఈ గుఱ్ఱపు ప్రమాణమంతదై యుండవలయును. ఓయీ! నీవిచట కాపువెట్టిన రక్షకభటుఁడు పొట్టివాఁడా? యని శాస్త్రిగారడుగగా నేనవునంటిని. ఆయన ఆ నక్క వానికొఱకు మఱింత యెత్తైనదై యుండవలయును. అని నావెంట వచ్చిన నల్ఫూరివంక శాస్త్రిగారు చూచి మీరా! మీవంటివారు మరి నల్ఫూరీ నగరమున నెవ్వరున్నారని నేననుకొంటిని. మీరు తపస్సు చేయుచుండుటచేతఁ జిత్రశిఖండి మనుజులు దొరకఁ లేదని తిరిగి వచ్చు ననుకొంటిని. మీరు పూర్వము రాజసేన లోనివారు. మరల రాజసేనలోనికి దిగితిరా? యనఁగా వారు 'స్వామీ! యీ చిత్రశిఖండి మమ్ము వాగ్దాన రజ్జుబద్ధులను గావించె'ననిరి. శాస్త్రిగారు నావంక ప్రశంసాదృష్టులను బఱపిరి. ఇట్లనిరి. "చిత్రశిఖండీ! నీవు దూరాలోచన కలవాఁడవు. ఓయీ! మనమిప్పుడొక మహాకార్యారంభమునం దున్నాము. ఈ కార్యము కొలఁది దినములలో కాదు సరికదా! కొలఁది సంవత్సరములలోఁ గూడఁ దేలునన్న విశ్వాసము నాకు లేదు. పదేండ్లు పట్టవచ్చును. ఇరువదియేండ్లు పట్టవచ్చును. ఈ కాలి గుర్తు లేపురుషునిదో వాఁడు మనకు దొరకెడుదాక మన కార్యమునందు సశ్రద్ధ పనికిరాదు. వాఁడు మనలనుఁ బ్రతారించి రాజసౌధ ప్రవేశముఁ జేసినచో మన ప్రయత్నమంతయు

వ్యర్థమగును. రాజసౌధము చుట్టు సంవత్సరముల కొలఁదిగా దివారాత్రములు, ప్రతినిమేషము నూహించరానంత కట్టు దిట్టములతోడి పరిరక్షణ యేర్పాటు చేయవలయును. దానికి నీవు సమర్థుఁడవైనచో నీపనిని ప్రారంభింతము. లేనిచో వీ రిచ్చట నుండనక్కరలేదు. అంత నే నిట్లంటిని. 'అయ్యా! తల వని తలంపుగా నొక పిడుగుపడినది. దీని యాను పానులు తెలి యుటలేదు. నే నూరకే రాజభక్తుఁడు తీసికోవలసిన శ్రద్ధ తీసికొంటిని. తమరి మాటలవలన ఇదియేదో గడ్డు సమస్యగాఁ గనిపించుచున్నది. పరమేశ్వరుఁడేదియో యొక యాపద తెచ్చి పెట్టినాఁడు. దాని నొడ్డుకొనుటకు ప్రయత్నించవలయును. మార్గమధ్యమున విఘ్నములు సమకూడునన్న భీతిచేత నెవఁడో దుర్జనుఁడు ప్రయత్నారంభమును పరిత్యజించును. నాచేత నైనంత ప్రయత్నముఁ జేయుదును. ఈ రాబోవు నాపద రాజు కొడుకునుగూర్చి యని నే ననుకొనుచుంటిని. నా ప్రాణ ముల నొడ్డియైనను నా జీవితాంతము తమ శ్రేప్రతీక్షా నైశి త్యము నుపదేశించు చుండిరో దానిని రాజసౌధము నందు పాలింతును. పాలింపఁ జేయుదును. అట్టిపాలనము నడుమ విఘటితమగునేమో యన్న భయముచేత ప్రయత్న విరమ ణముఁ జేయుట నా కిష్టములేనిపని. అది రాజభక్తి లక్షణము కాదు. విశ్వేశ్వర ప్రీతికరమైన విషయమును కాదు. సనాతన ధర్మాభిమతమైన మార్గముకాదు. శాస్త్రిగారూ! తమరు మహావేత్తలు. ఇది కాశీనగరము. ఆయన విశ్వేశ్వర స్వామి. మన రాజు ధర్మాత్ముఁడు. నేను బ్రాహ్మణుఁడను. ఈ రాజ్యమును రక్షింపుడు. వాఁడెట్టి వాఁడైనను నేను వానిని

గనుగొందును. నాకుఁ బ్రత్యక్షమైన యాస్తికలదు. దాని నంతయు వెచ్చించియైనను ఆ పురుషునిజాడ తీసెదను. వాని నాకత్తి కెరగాఁజేసెదను. ఎన్నిరాజ్యములు లేవు. వాఁడు తన దౌష్ట్యముఁ బరమపావనమైన కాశీరాజ్యము మీఁదఁ బ్రయోగింపవలయునా? వాఁడెవ్వఁడు? వాని యాకార విశేషమెట్టిది? వానికున్న క్షుద్రమహిమలెట్టివి? వాని క్షుద్రమహిమలను నాకు తెలుపుడు. వాని నాసేతుశీతాచలము గాలించెదను. అనగా శాస్త్రిగారు కనులు మూసికొని నా వెంటవచ్చిన నలువురిని గాంచి యిట్లనిరి. 'ఓయీ! వారిచ్చట గాపుండవలయును. దివారాత్రము లుండవలయును. నిద్రాహారములు పనికిరావు. ఆహారము కావలసినచో నెప్పుడో యొకప్పుడు మీలోనొకఁడు వెళ్ళి తెచ్చికొనవలయును. ఇద్దఱు నిద్రపోగా మఱియిద్దఱు మేల్కొని యుండవలయును. ఇదిగో జంబుకము. అది గుఱ్ఱమువలె నచ్చును. వయసులోనున్న భిల్లస్త్రీవలె వచ్చును. మరి యింకెట్లువచ్చునో తెలియదు. మఱియు నెవరువత్తురో తెలియదు. దూరమునందు విచిత్రమైన విలసనములు కలుగవచ్చును. ఆ విలసనములెట్టివో చూడవలయునని తెలసికొనవలయునని భ్రాంతిచేత మీరీచోటు తొలఁగి పోరాదు. మీ రిందు కదలకుండఁ బది దినము లుండవలయును. మఱియు రెండు మూఁడు దినములుండవలయునేమో నేనువచ్చి తెలియఁజేసెదను. ఈ పండ్రెండు దినములు నిచట పగటి యెండకు మీరు తలదాచుకొను నెలవులేదు. రాత్రులందు నిద్రించుటకు శయ్యలులేవు. రాత్రులందు చీఁకటిక్రమ్మును. దూరములు కనిపించవు. ఈ ప్రదేశముమాత్రము సురక్షిత

ముగా నుండవలయును. ఇచ్చట రాజకొడుకు కూర్చుండెను. ఇచట నెవఁడో యొక పురుషుఁడు కూర్చుండెను. జాగ్రత్తగాఁ జూచినచో కాలిగుర్తులు కనిపించును. ఆ పురుషుఁడచ్చట నెందుకు కూర్చుండెనో తెలియదు. ఈ ప్రదేశముయొక్క లక్షణము తోలుతఁ దెలిసికొనవలయును. రాత్రులం దిచ్చట నేమిజరుగును? ఎవరువత్తురు? ఈ చుట్టుపట్ల నేమిజరుగును? ఏమి కనిపించును? మీరు వానిని నన్నింటిని నాకు వార్త లందింపవలయును. ప్రతిదినము ప్రొద్దున సాయంకాలమున మీ కడకు నేను మనిసిని పంపింతును. అతనితోఁ జెప్పవలయును. మీ కిదేవిధి. మీభోజనము మీరే చూచికొనవలయును. అనఁగా నేను 'స్వామీ! వారికి నుభయవేళల భోజనము పంపించు నేర్పాటు నేనుచేయుదు' నంటిని. పరాశరశాస్త్రి యొప్పికొనలేదు. వారిభోజనము మనము సవరించరాదు. మనము తెచ్చిన యాహారము వారు తినరాదు. వారే వండుకొని తినవలయును, పదార్థములు వారే తెచ్చికొనవలయును. వీరిలో నొకఁడు నగరమున వంటచేసి ఇచ్చటికి తెచ్చినను సరియే. పదార్థములు తెచ్చికొని ఇచ్చట వంటచేసికొనినను సరే. ఇచట వంటచేసికొనుట యుత్తమమైన పనికాదు, ఆవంట సరిగా నిర్వర్తింపఁబడక పోవచ్చును. తీరా వంట చేసినతరువాత నా పదార్థము ఖాదన యోగ్యము కాకపో వచ్చును. అందుచేత వీరిలోనొకఁడు దినదినము ప్రొద్దుట నగరమునకుపోయి నల్వురకువండి తీసికొనివచ్చి వీరికి పెట్ట వలయును. పరాశరశాస్త్రిగారిట్లనగా వారిలో నొకఁడిట్లనెను. "మాకు వంట యక్కరలేదు. ఏ పండ్లో తెచ్చుకొని

తిందుము. పది దినములు కాదు. పన్నెండు దినములు కాదు. ఒక నెలనాళ్లైనను మేము పట్టి పండ్లుతిని నీళ్లు త్రాగి ఇచట నుండగలము. మాకు భయములేదు. ఇచ్చట జరిగినది యథాతథముగా మీకు నివేదింతుము. మా వాగ్దాన మట్టిది. మమ్మట్టి వాగ్దానమునందు చిత్రశిఖండి బంధించినాఁడు.

అంత నేనును శాస్త్రిగారును కలిసి బయలుదేరితిమి. శాస్త్రిగారు వెనుదిరిగి వారితో నిట్లనెను. 'ఓయీ! మీరు రెండేండ్లు తపస్సు చేసితిరి. మీకిచ్చటఁ గనిపించు దృశ్యములు సామాన్యులకుఁ బలె నంత భ్రాంతిదములు కాక పోవచ్చును. అదృశ్యములు మీకుఁ గలిపించెడి వ్యామోహము వేరు విధముగా నుండవచ్చును. మీలో నొక్క రొక్క రొక్కొక్క యభ్యాసమార్గమున నున్నారు. ఆ మార్గమునఁ గొన్ని ఫలితములకై ప్రతీక్షించుచున్నారు. తత్ప్రతీక్షాఫలము మీకు వచ్చినట్లు గాలిలో దూరములందు భాసింపఁజేయఁబడ వచ్చును. అది యథార్థము కాదని నిశ్చయించుకొనుడు. పది బారల దూరములో మీకు వైకుంఠము కన్పించినట్లున్న నైనను మీ రీస్థలము వదలిపోరాదు. మీ గురువు వచ్చి పిలిచి నట్లు తెలియింపఁబడఁ జేయవచ్చును. అతడు మీ గురువు కాదు. మీరీప్రదేశము వదలిపోరాదు. మఱియు నింకొక్క మాట, పరమదీనుఁడు, నిరాహారుడు, నస్థిపంజరము వంటి వాఁడు; నాకలివేయుచున్నది చనిపోవుచున్నాను. మీవద్ద నున్నచో కొంచెము నీళ్ళిప్పించుడని యడుగును. మీరు జాలి పడరాదు. వానిని గూడ నీస్థలమునకు రానీయరాదు. అట్టి వానినింగ త్తితో నరకుట యెట్లని విచారించనురాదు. ఆదార్ఢ్యము

మీ యెదలయందు కలదేని ఇచట నిలువుడు. ఈ పాటికి నేను చెప్పెడి సంగతిలోని పరమార్థము మీ కవగతమై యుండ వచ్చును. ఇది యొక మాయావిలాసము. ఇచట మీ కత్తి యక్కఱలేదు. కావలసినది మీ ధైర్యము. ధైర్యమనగా నేకాగ్రత, భ్రాంతిపడకుండుట. మీ రేకాగ్రత్వము వహించఁ దగిన విషయమొక్కటే. ఈ స్థలమున కెవ్వరిని రానీయకుం డుట. అది జంతువు కాకూడదు. మానవుఁడు కాకూడదు. పిశాచములైనను రారాదు. ఈ యొక్క విషయమునందు మీరు వ్యగ్రులై యుండుడు. పవళ్ళయందు భయపడనక్కఱ లేదు. రాత్రులందే పదిరెట్లు శ్రద్ధవహించవలయును. అపుడు వారిలో నొకఁ డిట్లనెను. 'పగటనే మాలో నిద్దఱు నిలచి యిద్దఱముగా నిదురపోదుము. రాత్రులందు నల్వురమును మేల్కొనియే యుందుము. నల్వురము నాల్గుదిశలయందు నిలుచుందుము. శ్రీమన్నారాయణ చతుర్బాహువులవలె మేమిందుండగా మా యిష్టములేక సుదర్శనాయుధము కూడ లోనికి రాఁజాలదు.'

"అంత నేనును శాస్త్రిగారును బయలుదేరి వారి యింటికి వచ్చితిమి. మేము వారి యింటికిఁ జేరువేళకు జాము ప్రొద్దుపోయినది. వారు జపము మీఁదఁ గూర్చుండిరి. తల్లీ! ఇప్పుడు రాత్రి రెండుజాములైనది. వారు నాల్గైదు గడియలు జపము మీఁదనుండి నాతోఁ గొన్ని విషయములు చెప్పిరి. నేను వారివద్ద సెలవు తీసికొని తమ దర్శనార్థము వచ్చితిని. శాస్త్రిగారు చెప్పిన భయమేమియో నాకు తెలియదు. యువ

రాజుగారెట్లున్నారో నాకు తెలియదు. మహారాజుగారు లేచిరా! మాటాడుచుండిరా! నేఁడు సుఖముగా నున్నారా! నాకేమియు తెలియదు. కోటయంతయు నిశ్శబ్దముగా నున్నది. రక్షకభటులు మాత్రమే మేల్కొనియున్నారు. తమరిని నేను దర్శింపఁ గల్గుదుననియను కొనలేదు. తమరిచటఁ బరధ్యాన మున నున్నారు. నాయదృష్టముకొలది తమ దర్శనము లభించినది. జరిగినదంతయు మనవిచేసితిని. ఎవఁడో యొక పురుషుఁడు కోటలోనికెప్పుడో వచ్చునట. వాఁడిట్లుండునని తెలియదు. వాఁడిప్పుడు వచ్చునని తెలియదు. అట్టి వానిని కోటలోనికి రాకుండ నేను చూచికొనవలయును. వెంటనే నే నాశ్రద్ధమీఁద నుండవలయును. సెల విప్పించినచో వెడలి పోవుదును" అనెను. చంద్రమతీదేవి "ఓయి! చిత్రశిఖండీ! వాఁడిదివరకే వచ్చినాఁడు. ఇప్పుడు మఱింకొకరీతిగా వచ్చును కాబోలు. పురుషాకృతితో వచ్చును గాబోలు. రాజు ప్రొద్దుటినుండి మాటాడుట లేదు. మంచమునందే పడియుండెను. ఆవచ్చెడివాఁడు రాజుకొఱకు వచ్చును. నేనున్నాను. వానిని రానీయను. నేను నిద్రాహార ములను మానివేసితిని. అచ్చట నీవు నలువురి నుంచితివి. ఈ మహానగరమున నట్టివారు ఆ నలువురుకాక మఱి యిం కొక్కరు లే రనుకొనుచుంటివి. ఇంకొక వ్యక్తియున్నది. అది నేను. నేనిచ్చట నున్నాను. ఆ పురుషుని రానీయను. వాఁడు రాలేఁడు. వచ్చినచో నా బొడ్డులోనున్న చురకత్తి కెర యగును. వానికిది తెలియఁ జేసెదను. ఎట్లు తెలియఁజేయ వలయునో నాకు తెలియును. వాఁడీకోటలోనికి నేను బ్రతికి

యుండఁగా రాలేదు. నీవు పోయి తక్కిన విషయమును చూచికొనుము."

చిత్రశిఖండి నిష్క్రమించి పోయెను. ఈమె యింకొక పరాశర శాస్త్రియా? ఇదివఱకే కోటలోనికి వచ్చినవాఁడెవఁడు? ఎట్లు వచ్చెను? అతని కేమియు నర్థము కాలేదు. మహారాణి నడుగుటయెట్లు? చిత్రశిఖండి సెలవుతీసికొని సర్వదుర్గద్వారముల యందు రక్షకభటులను నియమించి తాను శాస్త్రియింటికి పోయెను. శాస్త్రి మఱల జపముమీఁద నున్నాఁడు. చిత్రశిఖండి యాతనికెదురుగాఁ గూర్చుండెను.

అటు సూర్యోదయ మగుచుండగా నిటు పరాశరశాస్త్రి జపమునుండి లేచెను. లేచినంతనే యెదురుగాఁ జిత్రశిఖండి కనిపించెను. ఆయన మాటాడకుండ లేచి కాల్యకృత్యములు తీర్చికొని మఱల వచ్చెను. చిత్రశిఖండి రాణియన్న సర్వ వాక్యములనుఁ బరాశరశాస్త్రితోఁ జెప్పెను. పరాశరశాస్త్రి తన జీవితములో నెన్నఁడును రాజదర్శనముఁ జేసినవాఁడు కాఁడు. భూపతి యతని కోఱకుఁ గబురంపలేదు. అతఁడు వెళ్ళలేదు. రాజునకు మంత్రశాస్త్రమునందు నభిమానము లేదు. అందుచేత నాతనిని బిలిపించలేదు. ఇవియన్నియు క్షుద్రవిద్యలని రాజుయొక్క భావన. ఆయన నిత్యమును శివ పూజను జేసెడివాఁడు. ఆశివపూజ దైనందినముగా నొక యలవాటుగాని యుపాసనామార్గము నందుఁ జేయఁబడినది కాదు. పరాశరశాస్త్రియొక్క ప్రతిష్ఠ కాశీనగరమునందే కాదు, భారతదేశమునందు బహుస్థలములఁగలదు. రాజసౌధములకు ననాహూతుఁడై పోరాదు. పరాశరశాస్త్రికి రాణినిఁ జూడ

వలయుననిపించెను. ఆమెతో మాటాడవలె ననిపించెను. ఆ పురుషుఁడు రాజసౌధములో నిదివఱకే ప్రవేశించినాఁడనుటలోని యర్థమేమో తెలిసికొనవలె ననిపించెను. కాని నేను రాణి దర్శనము చేయవలయునని చిత్రశిఖండితోఁ జెప్పుటయూ యిష్టము లేదు. ఏమిచేయవలయునో తోఁచలేదు.

అది యట్లుండఁగాఁ జిత్రశిఖండి చేయవలసిన కార్యము చాలగలదు. చిత్రశిఖండి కాశీనగరమున నుండుటకే వీలు లేదు. ఆ పురుషుఁడెవ్వఁడో కనుగొనవలయును. కనుగొనుట కాని చాలికగాని పోలికగాని తగులలేదు. ఈ పది దినములు తత్ప్రదేశమునఁ గాపుంచినవారి యనుభవ విషయములు తెలిసిన తరువాత వానినిగూర్చి కొంత తెలివిడి కలుగవచ్చును. పదిదినము లాగుట యెట్లు? ఈ పదిదినములలో నాపురుషుఁ డెవ్వఁడో రాజసౌధప్రవేశముఁ జేయవచ్చును. వాఁడిట్టిఁడని రాణికిఁ దెలియదు. వాని నెట్లు రాణి నిరూపించికొనఁగలదు? వాఁడు గొప్ప మాయలమారి. ఎంత మాయలమారియైనను వాఁడు ధరించదగిన రూపములు సృగాలము మొదలైన యల్ప జంతువులకు సంబంధించియున్నవి. అట్టి జంతువులు రాజాంతః పురములోనికి వచ్చుటకు వీలులేదు. రక్షకభటులు రానీయరు. వాఁడు గంగానదిని ముట్టికొనఁడు. ఏలయనగా రాజసౌధము నుండి గంగానదిలోనికి సోపానములుకలవు. అచ్చట ద్వార బంధముకలదు. గంగాజలములో నీదికొనుచు నా సోపానముల వెంట రాజసౌధప్రవేశముఁ జేయవచ్చును. వాఁడు గంగా నదిలోఁ బ్రవేశించి యీదికొనివచ్చుట సంభవించదు. మఱి యెట్లువచ్చును? తక్కిన రాజసౌధ ద్వారములన్నియు భద్ర

పఱచితినని చిత్రశిఖండి చెప్పుచున్నాఁడు. తాను రాణిదర్శనము చేయుటయెట్లు? చిత్రశిఖండినిపంపి రాణివలన నా రహస్యమేదియో కనుగొనవలయును. రాజకుమారుఁ డేస్థితిలో నున్నాఁడు? రాజస్థితి యెట్లున్నది? రాజు ప్రొద్దుటినుండియు మాటాడుట లేదనియు మంచమునందే పరుండియున్నాఁడనియు నితఁడు చెప్పెను. తాను రాత్రియంతయు జపముచేసెను. తన కేమియుఁ గనిపించలేదు. సామాన్యముగా పరాశరశాస్త్రి జపముమీఁదఁ గూర్చుండగా దేనినిగూర్చి భావించుచుండునో తద్విషయము మూర్తిమంతమై యాయన కనులకుఁ గనిపించును. అట్టిదేదియు నీనాఁడు జరుగలేదు. ఇది పిశాచ వ్యవహారముకాదు. భూతములకు సంబంధించినదికాదు. భూత ప్రేతపిశాచములకు సంబంధించినదైనచోఁ బరాశరశాస్త్రి కా విషయము సులభముగాఁ గనులముందు దీపించెడిది. వీఁ డెవఁడో కుటిలమానవుఁడు. దుష్టయోగాభ్యాసము చేసిన వాఁడు. ఏవో మ్లేచ్ఛమంత్రముల బలముచేత బ్రతికియుండఁ గనే పిశాచమువలె నటించఁగలశక్తి సంపాదించినవాఁడు. వానిని తన మంత్రజప పరిధిలోనికి తీసికొనివచ్చుట కష్టముగాఁ గనిపించుచున్నది. అచ్చముగా లౌకికమైన వ్యవహారము లౌకికమైన మేధాశక్తిచేతఁ బరామర్శించి సులభముగాఁ దేల్చి కొనవచ్చును. అచ్చముగా నలౌకికమైన వ్యవహారము జప తపోమార్గముల మంత్రధ్యానాదులచేతఁ బరిష్కరించుకొన వచ్చును. అదియు నిదియుకాని వ్యవహారము క్లిష్టమార్గమున నుండును. పరాశరశాస్త్రి కొక యూహ పోయెను. తాను మున్నొక మంత్రమును నేర్చికొని దానినిఁ బరిత్యజించెను.

అది క్షుద్రమంత్రము. తన జీవితము శాంతమార్గమునఁ బోవు చున్నది. ఆమంత్రము నుపదేశించిన వాఁడొక మ్లేచ్ఛుఁడు. అది తా నెప్పుడో చిన్నప్పుడు నేర్చినది. నిత్యగంగాస్నానము, తన యాముష్మికముకొఱకు కొంత జపతములు చేసికొనుట, లోకోపకారముకొఱకు కొన్ని సాధుమంత్రముల నుపాసించి తీర్థమిచ్చుట, విభూతియిచ్చుట, రక్షరేకులు కట్టుట, మొదలైనవిమాత్రమే యతఁడు కడచిన పాతికయేండ్లుగాఁ జేయుచున్నపని. ఆమ్లేచ్ఛమంత్రమునందు నిరాదరణచూపి యాయన దానినిఁ బరిత్యజించెను. ఆ మంత్రమునందు సులభసిద్ధి కలుగును. దానికి శ్రమ పడనక్కఱలేదు. దానికి సంబంధించిన యొండు రెండు కుటిలాచారములు కలవు. ఆ కుటిలాచారములయందు జగుప్సవహించి పరాశరశాస్త్రి యా మంత్రమునుఁ దిరస్కరించెను. ఇప్పు డామంత్రమును స్వీకరించి నాల్గైదు దినములు జపముచేసినచో నేమగునో? ఈ వయస్సులోఁ దాను జేయఁదగినపనియా యది? రాజసౌధములోని పరిస్థితి యెట్టిదో తెలియఁదాయెను? ఆ పరిస్థితి తనకుఁ దెలిసినచో రాజరక్షణముఁ జేయవలసిన యగత్యము కలిగినచో రాజరక్షణార్థ మాకుటిలాచారములను నెరపినను నెరపవచ్చును. తన్నభ్యర్థించని రాణికొఱకుఁ దానేల శ్రమపడవలయును? వారడిగి నప్పుడే చూచికొనవచ్చును. కాని చిత్రశిఖండి తన్నభ్యర్థించుచున్నాఁడు. రాజుయొక్క యభ్యర్థనగాని యాజ్ఞగాని రాజే చేయఁడు. తనయనుయాయులచేతఁ జేయించును. రాజుకొఱకనుయాయులు చేయుదురు. అందుచేత రాజుచేసినట్లే.

తాను రాణివద్దకుబోవలయును. రాణి తన్ను నిరాకరించునా? తాను రాణిదర్శనము చేయఁదగిన యవసరమేమి కలిగినదని తానుపోయి నిరూపించికొనును. తనపేరుమాత్రము రాణికిఁ దెలిసియుండును. అంతమాత్రమునఁ దనకుఁ బ్రవేశ మబ్బునా? పరాశరశాస్త్రి చిత్రశిఖండి నడిగెను. అచటఁ దాసుచేసిన యేర్పాటులన్ని రాణికి నివేదించితివాయని. ఆ నలువురకచ్చటఁ గాపుంచుటయు నందులోని గడ్డుతనమును రాణికిఁ దెలిసినవా? తెలిసినచో నామె యూరకున్నదా? ఆ పరాశరశాస్త్రిని నేను చూడవలయునని యనలేదా? యని యడుగఁగాఁ జిత్రశిఖండి "స్వామీ! తమరు రాణిగారివద్దకు వచ్చినచో నేను తీసికొనిపోదును. 'అనాహూతో ఉధ్వరంగచ్ఛేత్' అన్నారు. రాజకార్యముమీఁద పిలువఁబడకుండనే పోవచ్చును. రాజాత్మ ప్రజశరీరము, ఆత్మరక్షణ నిత్యకర్తవ్యము. తమరు వచ్చినచో నేను మిమ్ముఁగొంచుఁ బోయెద ననెను. పరాశరశాస్త్రి ఇట్లనెను. ఓయీ! ఇది క్లిష్టమైన పరిస్థితి. నాకు దీని యానుపానులు తెలియలేదు. రాజరక్షణము చేయవలసియున్నది. ఈ పరిస్థితి లౌకికమునుగాదు. భూతప్రేత పిశాచాది విషయమునుగాదు. పరమమ్లేచ్ఛవిషయముగాఁ గనిపించుచున్నది. ఇట్టి విషయముల యందు నేనెప్పుడును జోక్యము పెట్టుకొనలేదు. రాజవంశముయొక్క రక్షణకొఱకు నేడు పెట్టికొనవలసి వచ్చుచున్నది. నేనింక నిర్ణయించికొనలేదు. నిర్ణయించికొనినతరువాత నాకు నాల్గైదు దినములు పట్టును. అప్పుడుగాని నాకు దీని స్వరూపావగతి కలుగదు. తత్స్వరూపావగతి

కలుగకుండ రాణివద్ద కెందుకు పోవలయును? కాని యొక భయ మున్నది. ఈ నాల్గైదు దినములలోన నే రాజవంశమున కొక యాపత్తి సంక్రమించినచో అది మద్ధేతుకమగును. దానికి నేను గొంత చెడిపోవలయును. పాతికయేండ్లు న్యాయమైన మార్గమున బ్రదికితిని. సన్మంత్రానుష్ఠానమే చేసితిని. వామాచారములతోడి మంత్రముల ననుష్ఠించలేదు. అది యొక లోకము. తదనుష్ఠానమువలన జీవునియొక్క శుద్ధసత్త్వము కలుషితము కావచ్చును. నేను మాటాడకుండ నూరకుండఁ గలుగుదుగాని నీవు నన్నిందులోనికి దించితివి. మనస్సెంత విచిత్రమైన దోయీ చిత్రశిఖండీ! తనకుఁ గొంత తెలిసి, తెలిసినదన్న భాగములోఁ గొంత పరిశిష్టమై యున్నచో నా పరిశిష్టమైనది నిజముగాఁ దెలిసికొనఁదగినది కాకపోయినను, తెలిసికొనుటవలన నధిక ప్రయోజనము లేకపోయినను, దానిని దెలిసికొనుట యనిష్టాపత్తియైనను, తనకు తెలిసిన పాలములోని యేకదేశమగుటచేతఁ బరిహార్యమైనదైనను, దానిని గూడ స్వీకరింపుము స్వీకరింపుమని మనస్సు ప్రబోధించుచుండును. ఓసి మనస్సా! అది పరిహార్యమైన విషయము. దానిని తెలిసికొనరాదని నీవు చెప్పుము. ఆ మనస్సంగీకరించదు. తెలికోవయ్యా తెలిసికొమ్ము. దానివలన దోషములు సమాసన్నములైనచోఁ బ్రాయశ్చిత్తముఁ జేసికొనవచ్చును. అని ప్రబోధించును. నాకొక యూహాయున్నది. రాణితో మాటాడినచో, రాజసౌధమునందలి పరిస్థితులు తెలిసికొన్నచో, నీ వ్యవహారము మఱికొంత సులభముగా నను

మితము కావచ్చు నని. ఆ పరిస్థితులు తెలిసిన తరువాత నొక కుత్సితమంత్ర మనుష్ఠింపఁ దగినదిగాఁ దోఁచినచో నట్లు చేయ వచ్చును. లేనిచో వ్యర్థముగా భ్రష్టుఁడను గావలసిన యవసర మేమున్నది? తత్ప్రాయశ్చిత్తము చేసికొనవలసిన యవసర మేమున్నది? మఱియు నొక యూహకలదు. ఈ నాల్గుదిన ములు నెట్లు గడచును? పరమేశ్వరానుగ్రహమువలన నివి సరిగా గడచినచో నష్టములేదు. ఈ నాల్గుదినములలో నేదైన నాపత్తి కలిగినచో నేను విచారించవలసియుండును. ఈ భావమే నన్ను బాధించుచున్నది. అని పరాశరశాస్త్రి కూర్చున్న వాఁడు కూర్చున్నట్లు లేచి పదమని రాజసౌధమునకు నడ చెను. ఇద్దఱును రాజసౌధమునకుఁ బోయిరి. పరాశరశాస్త్రి తొట్టదొలుత యువరాజును చూడవలయు ననెను. ఇద్దఱును యువరాజువద్దకుఁ బోయిరి. యువరాజు తలయెత్తి వాఱిద్దరినిఁ జూచెను. చిత్రశిఖండి నమస్కారము చేసెను. శిశునాగుఁడు వారివంకఁ జూచుచుండెను. ఆయన కన్నులలో తొలుతటి దీప్తిలేదు. పూర్వము చిత్రశిఖండి కనిపించగా నెన్నియో ప్రశ్నలు వేసెడివాఁడు. ఇపుడేమియును లేదు. చిత్రశిఖండి యిట్లనెను. "యువరాజా! నాయనగారు నిన్న నంతయు మాటాడలేదట. కనులు మూయలేదట. ఆహారములేదట. రాణిగారు తమతో మనవి చేయుమన్నారు." అనఁగాఁ బరా శరశాస్త్రి యువరాజును చూచి యిట్లనెను. "యువరాజా! నేను వారణాసీపురవాసిని. నాపేరు పరాశరశాస్త్రి. తమరు వినియుండవచ్చును. నేను మిమ్మొక్కటి యడుగుటకు వచ్చి తిని. మొన్నరాత్రి యిచ్చటికి యామడమేరనున్న నాల్గు

పొలిమేరల నడుమ, నాల్గు శ్మశానముల నడుమ తమరొక చోట కూర్చుండిరి. తమకెదురుగా నొక పురుషుఁడు కూర్చుండెను. అతఁడెవ్వఁడు? వాని ముఖాద్యాకారమెట్టిది? అతఁడు మీతో నేమి మాటాడెను? అపుడు తమ రేమి చేసితిరి? ఇవి యడుగుటకు వచ్చితిని అనగా శిశునాగుఁడు పరాశరశాస్త్రి వంకఁ గోపముగాఁ జూచెను. 'దానితో నీకేమిపని? యనెను. పరాశరశాస్త్రి యిట్లనెను. "నాకున్న పనియంతయు వానితోనే యున్నది. వాఁడు నావద్ద కొన్ని కుటిలవిద్యలు నేర్చికొనెను. వానిని దుర్వినియోగము చేయనని నాకు వాగ్దానము చేసెను. తమరి మీఁద దుర్వినియోగము చేయుట కారంభించెను. వాఁడెచ్చటనున్నను నేను వానిని బట్టికొని శిక్షించెదను. వాఁడిప్పుడెచ్చట నున్నాఁడో చెప్పుఁడు" శిశునాగుఁడు కదలాడిపోయెను. ఇట్లనెను "అతనికొఱకే నేను ప్రతీక్షించుచుంటిని. అతఁడెప్పుడో యిచ్చటికి వత్తునన్నాఁడు. ఎప్పుడు వచ్చునో తెలియదు. వాఁడు వచ్చినఁగాని నే నేమి చేయవలయునో నాకు తెలియదు." పరాశరశాస్త్రి వాఁడు రాఁడు. నేను వానిని రానీయను."అనెను. శిశునాగుఁడు 'వాఁడు మనుష్యుఁడే అన్న మాట.వానిని చూచి నేను శవ మనుకొంటిని. వాఁడు పిశాచ మనుకొంటిని. వాని తల యంతయు త్రాళ్లుగా పేనిన జటలున్నవి. వాడు నాకొక ధూమకాష్ఠము నందించెను: నేను దానిని పీల్చితిని. దానిని పీల్చినంతటనే నాకొక దిమ్మెక్కినది. అదివఱకు పాపమను కొన్న విషయము పాపము కానట్లు భాసించినది. నాయొడలు నాకు తెలియలేదు. నే నింటికి వచ్చువఱకు నా కేమియుఁ

తెలియదు. నేను మా నాయనగారితో మాటాడితిని. తరువాత నాకుఁ దేలిక యిచ్చినది. నాలోనుండి యేదో బరువు తొలఁగిన ట్లనిపించినది. అతఁడు వత్తు నన్నాఁడు. రాఁడా? వాఁడు నీ శిష్యుఁడా? నీవుకూడ దయ్యమువా?" అనెను.

పరాశరశాస్త్రి చిత్రశిఖండి చేయి పట్టుకొని మాటాడకుండ వెలికివచ్చెను. వచ్చి చిత్రశిఖండితో నిట్లనెను. "ఓయీ! వాఁ డేదో శక్తిని యువరాజునందు నిక్షేపించెను. ఆ శక్తి రాజునందు సంక్రమించెను. వాఁ డిదివరకే రాజసౌధమునందు ప్రవేశించెనని రాణి చెప్పిన మాటలోని యథార్థమిది. మనము రాజును పోయి చూడవలయును. ఆ యుద్ధపిశాచము యువరాజు నాశ్రయించలేదు. రాజు నాశ్రయించెను. రాజు నాశ్రయించి యేమిచేయును? వాఁడెవఁడు? రాణి కీరహాస్యములోఁ గొంత తెలిసియుండవలయును. రాణి వద్దకు పోదము పద." అని యిరువురును రాణివద్దకు పోయిరి. చిత్రశిఖండి రాణితోఁ బరాశరశాస్త్రి చెప్పిన మాటలన్నియుఁ జెప్పెను. రాజకుమారునివద్దకు పోయితిమనెను. రాజకుమారుఁడన్న మాటలు నివేదించెను. రాజకుమారునిలోనుండి యెవఁడో యొక జీవుఁడు రాజునందుఁ బ్రవేశించెను. వాఁడెవ్వఁడో తెలిసికొనిగాని ప్రతిక్రియా సంరంభము సాగదు.

రాణి యిట్లనెను. "ఓయీ! వానిపేరు జయద్రథుడు. వాఁ డెవ్వఁడో నాకుఁ దెలియదు. ఇంత మ్లేచ్ఛమైన భాషసంపత్తి కలిగిన జీవుఁడు జయద్రథుఁడన్న పేరు కలవాఁడైనచో వాఁడు భారతమునందు కనిపించు సైంధవుఁడు కావలయును.

వాఁడు తనకు చెల్లెలి వరుసయైన ద్రౌపదిని చెఱబట్టబోయిన వాఁడు. వాని జీవ లక్షణ మట్టిది. మరియు నేదో కాష్ఠ ధూమము శిశునాగుఁడు పీల్చితినని చెప్పెనుగదా! ఆ కాష్ఠ మెట్టిది?" అని రాణి యనగా "తల్లీ ఆ ప్రదేశమునందు కొన్ని దుబ్బులు గలవు. అది నే నెఱుఁగని సస్యము. నే నెఱుఁగని సస్యము లేదు. ఒక దుబ్బు త్రవ్వి క్రింద దుంప యున్న దేమో చూడవలయు ననుకొంటిని. చూడ లేదు. నేను మరల పోయి యొక దుబ్బును త్రవ్వి క్రింద దుంపయున్నచో నది యెట్టిదో పరిశీలింతును. తరువాత దీనిలోని రహస్యము కొంత తెలియవచ్చును. ఆ దుబ్బు లచట నెట్లు మొలచినవి? ఎవరైనఁ దెచ్చి వాని నచట నాటిరా? ఎచటనుండి, తెచ్చిరి? ఈ జయద్రథుఁ డెవ్వరు? నేను దీనికొఱకుఁ బ్రయత్నము చేయుదును."అని చిత్రశిఖండి యనుచుండఁగాఁ బరాశరశాస్త్రి రాజదర్శనము తాను చేయవలయున నెను. ముప్వురును రాజు వద్దకు పోయిరి పరాశరశాస్త్రి రాజును చూచినంతనే పకా లున నవ్వి "ఓయీ! నీ విచ్చటికి వచ్చితివా? భారతయుద్ధ మేనాటిది? నీవిన్నాళ్ళు గాలిలో తిరుగుచుంటివా? ఎన్నా ళ్ళకుఁ గనిపించితివి?" అనెను. రాజు "ఓయీ! నీనెవ్వరవు? నీవు నాకు గుర్తు లేదే?" యనఁగాఁ బరాశరశాస్త్రి "నన్ను నీవు గిరివ్రజ పురములో చూడ లేదా?" యనెను. రాజుఁ నాకు గుర్తుఁ లేదోయీ! ఆ మాహేశ్వరి నన్నేడిపించిన యేడిపింపునకు నాస్మృతి పథములోఁ గొన్ని యవక తవకలు జరిగినవి.'' అనెను. మరల మాటాడ లేదు.

## ౭

పరాశరశాస్త్రి చిత్రశిఖండితో "నోయీ! నాల్గుదినములు నీవు రాజదుర్గ రక్షణముచేయవలయును. ఈ నాల్గు దినముల తరువాత సర్వరక్షణభారము నేనే వహించెదను. వహింపఁగలనన్న ధైర్యమున్నది. కలనో లేనో రెండుదినములలో తేల్చెదను. మూఁడవదినము సాయంత్రమువరకు చూచెదను. అప్పటికిని సాధ్యముకానిచో నే వామాచారములు చేయవలయునో యవి చేసెదను. తరువాత భగవంతుఁడున్నాఁడు. ప్రాయశ్చిత్తములున్నవి. రాజకుటుంబరక్షణముకన్నఁ బ్రస్తుతము చింతనీయమైన విషయము మరియొకటి కనిపించుట లేదు. ఓయి! చిత్రశిఖండీ! ఇందులో చాలసమస్యలిమిడియున్నవి. మన మిద్దఱమే కనిపించుచున్నాము. నే నూరువదలిపెట్టి పోఁదగినవాఁడనుకాను. నిన్ను పంపించినచో నేనొక్కఁడ నగుదును. నీవలె నావలె నీవిషయమునందు బద్ధమనస్కులైనవారిని మరి నలుగురైదుగురిని జూచికొన్నగాని యీ వ్యవహారము మనము తుదముట్టించలేము" అనెను. చిత్రశిఖండి 'ఆ శ్మశానమువద్దఁ గాపుంచిన నల్వురును గలరుగదా, వారొకవేళ నారక్షణ కార్యము పూర్తియైనంతనే మరల గంగయొడ్డున కూర్చుందమన్నచో వారిని నేను గూర్చుండనీయను. వారు నావలనఁ జాల యుపకారముఁబొందిరి. నాకు వారిచ్చిన వాగ్దానము పదిదినములతో పూర్తికాకపోవచ్చును." అని యనఁగాఁ బరా

శరశాస్త్రి 'ఈ నాల్గుదినములు నీయిష్టమువచ్చినట్లు చేసి కొనుము, నేను పోవుచున్నానని చెప్పి యింటికిఁ బోయెను. అంగడికిపోయి ఏవో యపురూపపు దినుసులు కొని తెచ్చెను. కొంత తతంగము చేసెను. ముగ్గులువెట్టెను. ధూపములు వేసెను. ముగ్గులలో కొన్ని యంత్రములు గీసెను. ఆ యంత్రపు గదులలో నేవో యక్షరములవంటి గీతలు గీసెను. ఒక యేకాంతమైన స్థలమునఁగూర్చుండి తాను నేర్చిన శాబరమంత్రమును పురశ్చరణము చేయ నారంభించెను. రెండుదినము లేకధాటిగా జరిగెను. మరునాఁటి తెల్లవారువరకు నతని కేమియు ఫలితముఁ గనిపించ లేదు. రెండు దినములు వృథాయైనవని భావించెను. మూఁడవదినముకూడ నిట్లే గడపుటయా? కలుషకార్యములు చేయుటయా? ఆ మంత్రము సిద్ధించుటకుఁ గొన్ని యసహ్యకార్యములు చేయవలయును. వానిలో ముఖ్యమైనది బ్రాహ్మణజన్మమెత్తి చేయరానిది. భారతీయుఁడే చేయరానిది చేయ వలయునా? వలదా? యన్న సంశయముచేతఁ బరాశరశాస్త్రి యుయ్యాల లూగి సీ! సీ! నేను చేయను. రాజకుటుంబ మేమైన నాకేమి? కలికాలము వచ్చి పంద్రెండువందల యేండ్లైనది. క్రమ క్రమముగా నిది చెడిపోవుట కేర్పడిన కాలము. దీని నెవ రడ్డుకొనగలరు? పోనిమ్ము. అని నిశ్చయించుకొని యుపర మింప నెంచు చుండగా నతనికి నొక నక్క యూల వినిపించెను. తన యిల్లు మహానగరము నడుమనున్నది. తెల్లవారఁ బోవుచున్నది. అచటికి నక్క యెట్లు వచ్చును? ఈ యూల యెట్లు వినిపించెను? లేచిపోయి యాధ్వని వినిపించినచోట

వెదకుద మనిపించెను. ఇంతలో నాయనకు నొక విషయము స్మరణకు వచ్చెను. ఆ మంత్రమును తన కుపదేశించినవాఁ డొక మాట చెప్పెను. ఈ మంత్రోపాసన నీవు చేయుచున్న ప్పుడు నీకు నక్క యూల వినిపించెనా నీకు మంత్రము సిద్ధింపఁ బోవుచున్న దని యర్థము. సిద్ధి కభిముఖముగా నున్నదని యర్థము. అప్పుడు నీవు మానివేసితివా నీవు నిదురపోవు చుండగా తోడేళ్ళు వచ్చి పీకికొని తినును. నీకుఁ దప్పదు" ఈమాట స్మరణకు వచ్చెను. ఆయనకు భయము వేసెను. తానునిదురపోవుచుండగాఁదోడేళ్ళువచ్చితన్ను పీకికొనితినునా? అతఁడు చెప్పెనుగదా! చెప్పినట్లు నక్క కూతఁ వినిపించెను. నక్క వచ్చుటకు వీలులేనిచోటతన కీకూఁత వినిపించుట యెట్లు? ఇచ్చట నక్క లేదు. ఊల వినిపించెను. తోడేళ్ళు లేవు. అవి పీకికొని తినును. లేచిపోయి నక్కయొక్క జాడకోసము వెదకుదమనగా దానగటనుండి లేచుటకు వీలులేదు. కానిమ్ము సిద్ధికభిముఖముగా నున్నదికదా! ఆయసహ్యాములైన వామా చారములు చేయనక్కర లేదు. చేయనక్కర లేకయే సిద్ధికాభి ముఖ్యము కల్గినది. పరాశరశాస్త్రికిఁ దన కామంత్ర ముపదే శించినవాఁ డిరువదియేండ్లక్రింద చెప్పిన మాటలన్నియుఁ గ్రమక్రమముగా జ్ఞాపకమునకు వచ్చుచుండెను. వాని సన్నిఁ టినిఁ దాను మరచిపోయెను. ఈ మాత్రమును గురించి స్థూల ముగా జ్ఞాపకమున్నది. మంత్రము తాటియాకుమీఁద వ్రాసి కొని యుంచికొనెను. అతఁడు చెప్పిన మాటలన్నియు వ్రాసి కొని యుంచలేదు. ఆభిముఖ్యము కలిగినదన్న తరువాత మిగి లిన వామాచార మొక్కఁడే యున్నది. తక్కినవన్నియు

నాభిముఖ్యము కలుగుటకొరకు చేయవలసినవి. ఇది యొక్క-టియే మిగిలినది. అది యొకటియు తాను జేయవలయునా? వలదా? శ్మశానమునకు పోవలయును. చనిపోయిన పసిపిల్ల నెవ్వరైన పూడ్చిపెట్టినచో నాగోయి త్రవ్వి ఆ పసిపిల్ల యపాన వాయు నిర్గమన స్థానమునందున్న యొక సన్నని నరమును కోసి తెచ్చి దాని నా దేవతకు నైవేద్యము చేయవలయును. తానిది స్వంతముగాఁ జేయవలయును. ఎవరిచేతను జేయించ రాదు. తానెట్లు శ్మశానమునకుఁ బోవలయును? తా నీపని యెట్లు చేయవలయును? తానీపని చేయుచుండగా నెవ్వరైనఁ జూచినచో నేమగును? తెల్లవారినది. ప్రొద్దుగ్రుంకువరకు దా నాగవలయును. ఈ ధర్మరాజ్యములోఁ బసిపిల్లలు చచ్చుట చాలయరుదు. ఈ నాఁడది దొరుకునా? ఏమిచేయవలయును? చిత్రశిఖండి తనవద్దకు నాల్గు దినములవరకు రాఁడు. ఇందులో నెవరిసాయ మపేక్షింపవలయును? అనవసరముగా నిందు లోనికి దిగరాదు. ఆపని తానుచేసిఁగాని సిద్ధిలేదు. మ్లేచ్ఛ రాజ్యములలోఁ బసిపిల్లలు చచ్చిపోవుట యుండును. ధర్మ ముగాఁ బరిపాలింపఁబడు రాజ్యములలో నట్టిది జరుగదు. పసి పిల్లలు చచ్చిపోవుట తా నెన్నడు చూడలేదు. ఏమిచేయవల యును? ఆయసకొక యూహతోచెను. లేనిచోట నక్క-కూత వినిపించినపుడు జరుగని పసిపిల్ల మరణము గూడ జరుగ వచ్చునుకదా? ధర్మేతరమైన వృత్తితో బ్రదికెడువా రున్నచో వారి పసిపిల్లలు పోవుదురు. అట్టివారు కాశీనగరము నందు లేరని నమ్మకమేమి? కాశీనగరమునం దుండక పోవచ్చును. నగరబహిఃప్రదేశమున మ్లేచ్ఛజాతులకుఁ జెందిన

వారలు కొందరుండవచ్చును. ప్రొద్దుక్రుంకిన తరువాతఁ దాను బోయి యది సాధ్యమగునేమో చూడవలయును. మరియు నే పరమేశ్వరశక్తి కాలమును నడిపించుచున్నదో దానికి సాధ్యము కానిదేది? ఏ ప్రయత్నము లేకుండఁగనే చెప్పఁబడిన యే వామాచారములు జరుగకుండగనే యీ మంత్రము తనకు సిద్ధించుట కాభిముఖ్యము గల్గెను. ఆ యాభిముఖ్యమే దానిని గూడ సాధ్యము చేయు ననుకొందును. ఇది వామాచారము. అసహ్యమైన ప్రక్రియయే. అయినను తనయందు నధికమైన పాపము సంక్రమించవలసిన యవసరము లేదు. ఆనరము నాదేవతకు నైవేద్యము చేయుదును. ఆ దేవత పరమ తుచ్ఛమైన దేవత. దానికది నైవేద్యము చేయఁబడుట వలన తనకేమియు నష్టములేదు. తనయాత్మ ద్రవ్యమునందు దోసఁగు సమీపింపదు. ఇది కశ్మలమైన వ్యవహారము జుగుప్సా హేతువైన వ్యవహారము. అయినను వైద్యము కొరకిట్టి పనులు చేయుట లోకమునందు కలదు. అందుకనియే వైద్యులను పంక్తి బాహ్యు లనినారు. రసవిష గంధకములను దహించుట యొక్కటియేకాక యిట్టి మర్జాతిసనులను చేయుట కూడ వారు చేయుచుందురు. శ్మశానములోనున్న యొక పసిపిల్ల శవమును త్రవ్వినచో దాని బంధువు లెవరైనఁ జూచినచో మన కాపదగాని తక్కినవారి కేమి పట్టినది? మరియుఁ దాను త్రవ్వనక్కరనే లేదేమో? శ్మశానములోఁ గొంతసేపు ప్రతీక్షించుచుఁ గూర్చున్నచో నే నక్కయో వచ్చి నేల నదియే త్రవ్వును. తాను కత్తితో కోయనుగూడ నక్కరలేక పోవచ్చును. ఇంతలోఁ బరాశరశాస్త్రి కొకనవ్వు

వచ్చెను. ఏ నక్క యిప్పుడు గూసినదో ఆ నక్కయే వచ్చి యా పనిఁ జేసిపెట్టవచ్చును. ఆయన నిశ్చయించికొనెను. ప్రొద్దు గ్రుంకువరకుఁ బ్రతీక్షింపనేల? అట్టిది సాధ్యమైనచో దానికి నిశాకాల మక్కఱ లేదు. దివాకాలమైనను సాధ్యమే. మరియు శ్మశానములో నేమి జరుగుచున్నదో యెవ్వరికిఁ గావలయును? ఏమి జరుగునో చూతమని యాయన శ్మశానాభిముఖుఁడై వెళ్ళెను. ఆయన శ్మశానమునకు చేరినవేళకు నా చుట్టుపట్ల నెవ్వరును లేరు. ఎవ్వరైన నున్నారేమో యని యిటునిటు చూచెను. ఎవ్వరును లేరు. అది ప్రాతఃకాలము. సర్వ జనులు తమ తమ దినాదికృత్యములయందు నిమగ్నులై యున్నారు. దారిలో నొక పురుషుఁడు నొక వృద్ధస్త్రీయుఁ దనకుఁ గనిపించిరి. పురుషుని చేతిలో ద్రవ్వుగోల యున్నది. ఆయన కప్పుడే స్ఫురించెను. ఎవరో పసిపిల్లను బాతిపెట్టి వచ్చుచున్నా రనుకొనెను. శ్మశానముదగ్గర క్రొత్తగా పూడ్చిన స్థలము త్రవ్వుచున్న నక్కయు గనిపించెను. ఆ నక్కకు వారు త్రవ్వినంతసేపు పట్టలేదు. బిడ్డ శవము బయటకు లాగఁబడెను. నక్క తన కోరలతో దాని నెచ్చట చీల్చవలయునో అచ్చటే చీల్చెను. ఆ నరమును లాగెను. ఆ నర మొక్కటియే దాని నోటిలో నున్నది. పరాశరశాస్త్రి కంతయు నద్భుత మనిపించెను. ఆ నక్కను బెదరించినచో నది నరమును నోట గరచుకొని పారిపోవునేమో! తన కది యెట్లు లభించును? పరాశరశాస్త్రి యొక మంటిబెడ్డను తీసికొని నక్కకుఁ దగులకుండ దాని సమీపమునఁ బడునట్లు విసరెను. ఆ నక్క తల యెత్తి చూచెను. తన్ను చూచి

బెదరిపోవు ననుకొనెను. అది పారిపోలేదు. తన్ను చూచి కోపముతో దంతములు ప్రకటించెను. నోరు తెరచెను. అప్పుడు దాని నోటిలోని నరము క్రింద బడెను. మరల నా నరమును నక్క తీసికొనకుండ నేమి చేయఁవలయును? పరాశరశాస్త్రి తన చేతిలో నొక కఱ్ఱనైనఁ దేలేదు. ఇంతలో మరియొక నక్క యచ్చటికి వచ్చెను. రెండును శవముకొరకుఁ బోరాడ నారంభించెను. నర మచ్చటనే పడియుండెను. ఇంతలో నెవఁడో యొక పురుషుఁడు వచ్చెను. పరాశరశాస్త్రి వానితో నిట్లనెను. "ఎవరో పాపము చనిపోయిన బిడ్డను పాతిపెట్టి పోయిరి. ఆ నక్కవచ్చి పెల్లగించినది కాబోలు. ఆ రెండును దానికొరకుఁ బోరాడుచున్నవి. ఆ నక్కలను దోలి ఆ బిడ్డమీఁద నింత మన్ను వేసి పోయినచో బాగుగా నుండుననియెను. అతఁడు బలిష్ఠుఁడు. చేతిలో దృఢమైన కాష్ఠము కలవాఁడు. అతఁడు నక్కలను కొట్టుటకు వాని వద్దకుఁ బోసాగెను. పరాశరశాస్త్రియు వాని వెంట నేగెను. వీరిద్దరినిచూచి నక్కలు కొంతసేపు వీరిని పండ్లతో బెదరించుచు కొంతసేపు తమలోనవి పోరాడుచు నీ బలిష్ఠుఁడైన పురుషుని చేతిలోనున్న దృఢ కాష్ఠమును జూచి దూరముగాఁ దొలఁగి పోక తప్పక వచ్చెను అతఁడా శవమును కఱ్ఱతో గోతిలోనికిఁ ద్రోసి తన కాలితో మట్టినిఁ దానిపైకి ద్రోయుచుండెను. పరాశరశాస్త్రి వాఁడు చూడకుండ నా నరమును క్రిందపడి యున్న దానిని ఇంత మట్టితోఁ గలిపి కూడఁబట్టికొని తన యొడలు గగుర్పొడువఁగాఁ గొంచెము దూరములోనున్న నొక

మేడిచెట్టు నాకులు రెంటిని కోసి యీమట్టి వానిలోబెట్టి తన యుత్తరీయమున ముడివేసికొని యతనితో "మంచి పనిచేసితివి." మరలవచ్చి యీ నక్కలు శవమును బెల్లగించునేమో యనెను. ఆ పురుషుఁడు వదులు వదులుగానున్న యీ మట్టిని తనకాళ్ళతో గట్టిగా మట్టగించి "ఇంక రావు. మన మేమి చేయుదుము" అనెను. ఇద్దరును వారిదారిని వారు పోయిరి. ఆ పురుఁషుడు పరాశరశాస్త్రివంటి సద్బ్రాహ్మణుఁడు తానచట పడియున్న నరమును గుప్తపరచెనని యనుకొనుటకు వీలులేకపోయెను. శాస్త్రి యింటికి వచ్చెను. ఆనాఁడు తానుపవాస ముండవలయును. స్నానము చేయరాదు. బ్రాహ్మణకర్మ యేదియు చేయరాదు. కానిమ్మనెను. ప్రొద్దు గ్రుంకినది. మరలఁ గూర్చుండి యీజపము నారంభించెను. ఈ పాటి కాయనకు నా మంత్రోపదేష్ట చెప్పిన సర్వవిషయములు జ్ఞాపకమునకు వచ్చెను. అన్నియును తు. చ. తప్పకుండ చేసెను. చివరకా నరమును మట్టిని గడిగి జిల్లేడాకులో పెట్టి జిల్లేడు పాలతో దానిని ప్రక్షాళనముఁజేసి నైవేద్యము చేసెను. ఇంత గుగ్గిలమును తెచ్చి పొగవేసెను. పట్టపగలే సంపాదించిన గాడ్దువసనుండి తీసిన తైలముతో దీపారాధనము చేసెను. రెండు బొమికలను కొట్టి కలిగిన ధ్వనిచేత దేవతను మేల్కొల్పెను. ఇది జరుగునప్పటికి రాత్రి రెండుజాములయ్యెను. నగరమంతయు నిదురబోవుచుండెను. తన యింటిలోఁగూడ నెవ్వరు మేల్కొనియుండలేదు. తాను కూర్చున్న ప్రదేశము తన గృహమునకు దక్షిణదిశ. ఆ ప్రదేశమునకును తన గృహమునకును సంబంధములేదు. తాను కూర్చున్న

స్థలమునకు నాలుగువైపుల గోడ యున్నది. ఉత్తరవైపున దానికి ద్వారమున్నది. ఆద్వారము బిగింపబడియున్నది. లోని కేజంతువు వచ్చుటకు వీలులేదు. నైవేద్యము, ధూపము హారతి, బాయికలతోడి గంట వాయించుటయుఁ, బూర్తియై యింత దుమ్మును చేతిలోఁ బట్టుకొని సర్వమును తద్దేవతార్పిత మని యా మట్టిని వదలినంతనే పదినక్కల కూతలు పది తోడేళ్ళ యరపులు తన గదిచుట్టును వినిపించెను. దేవతా ప్రత్యక్షమిదియా? ఇది కాదు. ఒక దేవత కనిపించునని యతఁడు చెప్పెను. మరియుఁ గొంతసేపు జపము చేయవల యును. అచటినుండి కదలరాదు. భయపడరాదు. తాను భయపడుటయేమి? ఇంతకంటె విపరీతములైనవే తానెఱుఁ గును. అట్లే కూర్చుండి మరల నొకజాముసేపు తన కర్థము తెలియని యా మంత్రములోని మాట లుచ్చరించుచుండెను. ఆ మాటలకర్థమున్నదా? అది యేభాష? తన కేమియు తెలి యదు. ఈ మంత్రముల నెవరు సృష్టించిరి? ఎట్లు సృష్టిం చిరి? మహర్షులు మంత్రద్రష్టలు. అనఁగా వారి తపోంత మున నా మంత్రాక్షరములు వారికి స్ఫురించినవని యర్థము. అట్లే ఈ శాబరమంత్రములకు మ్లేచ్ఛమంత్రములకు ద్రష్ట లుండవలయును. ఆ ద్రష్టలు చేసిన తపస్సెట్టిది? అయ్యో! వైదికమైన తపస్సునకు నియమములు సదాచారము, మనోవ్య గ్రత మొదలైన సల్లక్షణములున్నవి. ఈ ద్రష్టల కేమి లక్షణ ములున్నవి? సురాపానము, బహుజంతు మారణము, మాంస ఖాదనము, మాంసనైవేద్యము, కుటిలవర్తనము, మనో వ్యగ్రతతో కూడ యిట్టి మంత్రదర్శనమునకు యోగ్యమైన

స్థితినిఁ దెచ్చునా? ఏమి విచిత్రమైన సృష్టి? కోకిల కూయఁగా నా ధ్వనియంత మధురముగా నేల యుండవలయును? ఎలుఁగు గొడ్డు దగ్గఁగా నాధ్వని యంత కఠోరముగా నేలయుండ వలయును? ఈ రెండు ధ్వను లాకాశభూతమునందు వ్యాపించును. వియదణువులు తొలి సవ్వడిచేత సుకుమారములై, మసృణములై, శ్రవణపేయములై శ్రవణేంద్రియమునకు సమాహ్లాద జనకములై యుండు టేమి? దానివలన నొక యానందము కలుగు టేమి? రెండవదాని సవ్వడి వియదణువులనుఁ బగిల్చి వానియందు గాఠిన్యము తెచ్చి శ్రవణేంద్రియమునకుఁ గఠోరమై హృదయమునకు భయము సంధానించు టేల? ఎవఁడో నవ్వెను? ఆ నవ్వు సంతోషముచేత సముద్భవిల్లెను అది విన్నప్పుడు మనకు సంతోషమే కలుగుచుండెను. అర్ధరాత్రమున నెవ్వఁడో యెవనినో గొంతు పట్టుకొని పిసుకుచుండెను. వాఁడు కెవ్వుమని కేక పెట్టెను. ఆ కేక విన్నంతనే విన్నవారి గుండెలలో నెత్తురు కరుడు కట్టుట యేల? ఈ సృష్టిలోనున్న భిన్న భిన్న ధ్వనులకు భిన్న భిన్న శక్తు లెచటినుండి సంప్రాప్తించినవి? దీనియందు దుఃఖమున్నది. దీనియందు సంతోషమున్నది. దీనియం దుత్సాహమున్నది. దీనియం దానందమున్నది? ఇట్లు ధ్వనులు వివిచ్యమానములై సృష్టియందు భాసించుచున్నవి. మానవుఁడు తన సంగీత శాస్త్రమును సృష్టిగతములైన యీ ధ్వనులను విడి విడిగా నిరూపించుకొని వానినుండి స్వరములను నిర్ణయించుకొని తత్స్వరముల సమ్మేళనముచేత నాయా దుఃఖ సంతోషోత్సాహానందాదులను వినిర్గమింపచేయు స్వరసంపుటిని సమా

యత్త పరచుకొని వానినుండి సంగీత మొక కళయని నిర్మించు కొనెను. ఈ మానవ హృదయాంతర్గతమైన రతిక్రోధ దుఃఖ భయాదు లన్నియు సహజముగనే యున్నవి. వానిని మానవుఁడు ధ్వనులయందు దర్శించెను. అంతకంటె పైకిపోయి ఆ ధ్వనులనుండి తాను శబ్దములను సృష్టించుకొనెను. మరి కొందఱు తచ్ఛబ్దములయందు విలక్షణములైన ధ్వని సంఘటికల యక్షర సమాహారమును మంత్ర రూపముగాఁ జూచికొనిరి. ఆ మంత్రములు సంగీత స్వరములు భిన్నగుణముల నెట్లుదయింపఁ జేయునో భిన్నశక్తుల నట్లుదయింపఁ జేయునవిగా నయ్యెను. సంగీత శాస్త్రములో నొక్కొక్క రాగమున కొక్కొక్క యధిదేవత, ఆ రాగాలాపమున కొక్కొక్క వేళ యనుకూలమైనది. అట్లే యీ యంత్రముల కొక్కొక్క యధిదేవత. తత్తదుపాసనల కొక్కొక్క వేళ యనుకూలమైనది. అట్లే వాని వానికి యోగ్యములైన యాచారములు నైవేద్యములుఁ బ్రబలించుకొనిరి. ఇదియొక విచిత్రమైన సృష్టి. ఈ సృష్టియొక్క రహస్య మిదియని తెలిసికొనెడివాఁ డెంతటి వాఁడు. ఆలోచింపఁగా నాలోచింపఁగా వేళలు, ధ్వనులు, భావములు, మూఁడును మూఁడు ననంతములైనవి. ఈ మూఁటిలో వేనియొక్క యేకదేశము తక్కిన రెంటిలోని యే యేకదేశముతో పొసఁగునో, ఆ మూఁడునుఁ గలిసి యే విచిత్రమైన శక్తిని సముద్భవింపఁ జేయునో, యనంతమైన మానవుని విచిత్రములైన యాశలచేత విచిత్రములైన యనుభవములచేతఁ దెలియఁబడినవి. అవియే చిత్రములైన విద్యలుగా నెలారినవి. ఒక విద్య యొకప్పుడు భాసించవచ్చును.

మరియొకప్పుడు భాసింపక పోవచ్చును. ఒకదానికొకప్పుడు ప్రాముఖ్యము రావచ్చును. మరియొక్కప్పుడు ప్రాముఖ్యము లేకపోవచ్చును. గండభేరుండ మనునది పక్షి. శరభమనునది మృగము. అవి రెండున్నప్పుడు వానికి వానికి నామములు కలిగెను. ఆ జంతువులు రెండు సృష్టిలో నిశ్శేషములై పోయెను. వాని పేళ్లమాత్రము మిగిలెను. ఇప్పటివారు ఆ జంతులే లేవు అవి కల్పితము లనవచ్చును. కాలమునం దనేకము లంతర్హితము లగుచుండును. క్రొత్తవి యనేకములు సముద్భూతము లగుచుండును. ఎప్పటికప్పు డంతర్హితములైనవి లేనే లేవనుట జరుగుటయుఁ గలదు. పరాశర శాస్త్రి కాశ్చర్యము వేసెను. తన కర్థము తెలియని కొన్ని ధ్వనులు. ఆ ధ్వనులను తాను లక్షసార్లుచ్చరించెను. అట్లుచ్చరితమైన యాధ్వనులలోనుండి యొకశక్తి పుట్టినది. ఆధ్వనులకు, నీపసిబిడ్డ నరముయొక్క నైవేద్యమునకు, నీ గుగ్గిలపు పొగకు, నీ బొమికలవలన కలిగిన సవ్వడికి, పశువసావినిర్గత తైలదీపమునకు నేమి సంబంధము? నక్కలు లేనిచోట, వచ్చుటకు వీలులేనిచోట, వాని యూలలు విని పించెను. నాల్గువైపుల బలిష్ఠమైన గోడప్రాకారముగాఁ గల యిచ్చోటికి పదినక్కలు వచ్చెననుట యసంభవము. తన ప్రాకారపుగోడ యెంత యెత్తుసగా నక్కలు దూఁకి రాలేనంత యెత్తు. పది తోడేళ్ళ యఱపులు. తాను కూర్చున్నవాఁడు లేచిపోయి తోడేళ్ళుగాని నక్కలుగాని లోన నున్నవాయని చూచుటకు వీలులేదు. లేచినచో నే దేవత తనకుఁ గని పించవలయునో యా దేవత కనిపించదు. దేవత కనిపించుట

ప్రధానము కాని నక్కలను తోడేళ్ళను చూచుట ప్రధానము కాదు. ఆయన మరియు నిట్లాలోచించెను. తాను పూర్వము మహామంత్రములను పురశ్చరణము చేసినవాఁడు తన్మంత్ర పురశ్చరణవేళ మరియొక యూహ దేనిని రానీయకూడదు. అన్యభావతాడితమై తన్మంత్రాధిదేవత దూరదూరము పోవుచుండును. ఏతన్మంత్ర పురశ్చరణవేళ తనబుద్ధి యెంత యన్యభావ తాడితమగుచున్నదో యంత దేవతా సామీప్యము జరుగుచున్నట్లుండెను. యిది ఏ దేవతకు నక్కలయు తోడేళ్ళయు కూతలు ప్రియమో ఆ దేవతాకృతి యెట్లుండును? యేను నొక మరి యొకఁడైనచో గుండెపగిలిచచ్చును. తనకుఁ గనిపించుట కా దేవతకే భయముగా నున్నదేమో? చిన్నప్పుడు తనతండ్రి చెప్పెను. నీకొక మహామంత్రము సిద్ధించియున్నచో తక్కిన యల్పమంత్రముల బలము నిన్నేమియు చేయఁజాలదు: తక్కిన వాని సిద్ధులు నీకు సులభముగా కలుగును. ఆ మంత్రాధి దేవతలు నిన్ను చూచి భయపడుచుందురని. ఆ దేవతను చూడవలయునని కూర్చుండెను. ఇంతలో నాయనకు నేదియో కనిపింప నారంభించెను. అదియొక మహారణ్యము. ఆ ప్రక్క నొక నది ప్రవహించుచున్నది. అంతయు అయోమయము. ఆనదియొడ్డున నొకపర్వత మున్నది. ఆపర్వతముకెలన నొక విరిగిపడిపోయిన యొక విగ్రహమున్నది. అది పెద్దవిగ్రహము. మరియుఁ జూడగా నది చండీవిగ్రహము. తల క్రిందపడియున్నది. నాల్క చాచఁబడియున్నది. కన్నులకు నాలుకకు వేయబడిన యెఱ్ఱనిరంగు వానల కెండలకుఁ జెడిపోయెను. మరికొంతదూర

మున దేవియొక్క చేయి, చేతిలోనున్న పెద్ద పట్టాకత్తితో కనిపించెను. ఆస్థలమంతయు విస్పష్టముగాఁ గనిపించుచుండెను. అచ్చట రెండు బొమికల ప్రోవులుండెను. ఎన్నాళ్లైనదో వా రచ్చటపడి చనిపోయి ఆ రెండుబొమికల ప్రోవులనడుమ నొక ప్రదేశముండెను. అది చచ్చదరముగానున్నది. తక్కిన సర్వ దేశము గడ్డియో నేదియో మొలచియే యున్నది. ఆ ప్రదే శము మాత్రము బూడిదచేత నింపబడియున్నది. మరియు చూచెను. అచ్చటనున్న సస్యమంతయు దనకు పరిచితమై నదే. అదిమేడి. ఇదిరావి. ఇదివేప. అదిదొండ. ఇదిపచ్చిక. ఇదిదర్భ. ఇదినల్లేరు. ఇది గంగపావిలె. ఈదుబ్బులేమి? ఆహా! ఇవి మొన్న శిశునాగుఁడు కూర్చున్నచోటనున్న దుబ్బులు. అవి యిక్కడివా? ఆ దుబ్బులను లెక్కబెట్టెను. అవి యిరు వదియున్నవి. మరలఁజూడగా కొండపైభాగము కనిపించెను. ఆపైన నింకొక్కదుబ్బున్నట్లు కనిపించెను. ఆ కొండకొమ్ము నిర్మించిన స్తంభమువలెనున్నది. ఆపైకి పోవుటయెట్లు? ఈ దుబ్బులేమి? అనుకొనుచుండగా మరల నింకొకరీతిఁగనిపించెను. ఏదో శవము తగలుబడుచుండెను. అందులోనుండి పొగ వచ్చుచుండెను. ఆపొగ వచ్చివచ్చి ఈదుబ్బులుగా నాకా రము పొందెను. మఱియుఁ గొంతసేపు గడచెను. మరల నిట్లు గనిపించెను. ఆదుబ్బులు నేలమీఁదనుండెను. నేలలోఁదనకుఁ గనిపించుచుండెను. ఆ దుబ్బుల యడుగున వాని వేళ్ళు కట్టె లుగానుండెను. ఏ సస్యముయొక్క వేరైనను భూమిపైకి వచ్చిన సస్యము నంటియున్న మొదట లావై పోవును సన్నపడును. ఈ దుబ్బుయొక్క వేరు వెదురు కట్టవలె నుండెను. సామా

స్యముగ భూమిలోనున్న వేళ్లు పచ్చిగా నుండును. అవి యెండినగాని కాలవు. ఈ వేసు పచ్చిగా నున్నప్పుడే ముట్టు కొనునా? కొన్ని పచ్చి వస్తువులకు నిప్పు ముట్టించినచో నంటుకొనుటయు తిరిగితిరిగి యారిపోవుటయు మరల నంటించు చుండ వలయుటయు జరుగును. ఇది యట్టి వస్తువులలో నొకటియా? దీనినే కాబోలు నా పురుషుఁడు ముట్టించి ధూమపానము చేయుచుండఁగా యువరాజు దానిని దాను కూడ తీసికొని ధూమపానము చేసెను. ఆ పొగ పీల్చుట వలన నొక విలక్షణమైన బుద్ధిసిద్ధమగునేమో! పాపము పాపముగా భాసించదేమో! ధర్మబుద్ధి నశించునేమో! ధర్మమునకు నధర్మమునకు భేదము భాసించదేమో! అట్టి శక్తి ఈ ధూమమునందుఁ గలదా? ఈ ధూమమున కట్టి శక్తి యుండుటకు హేతువేమి? ఈ ధూమ మాదగ్ధమగుచున్న చితినుండి వచ్చి కట్టిన దుబ్బుల పరిణామముగా కనిపించు చున్నది. తచ్చితా ధూమమున కీ శక్తి యేల వచ్చెను? ఆ చితి యెవరిది? దానిమీఁద నెవ్వరు తగులఁబెట్టఁబడినారు. అన్న యూహ పరాశరశాస్త్రికి వచ్చినంతనే యా చితిమీఁద నొక శవము కనిపింప నారంభించెను. వాఁడొక బలిష్ఠుఁడైన పురుషుఁడు. జటలు మీసములు కలవాఁడు. ఆజాను బాహువు. శాక్తేయుఁడు. చేతిలో ఖడ్గమున్నది. మెడలో సన్నని యస్థిహారము కలదు. నెడందయురమువాఁడు. అది కనిపించినంతనే పరాశరశాస్త్రికిఁ దెలిసెను. వాని శరీరము నుండి నిర్గతమైన ధూమమున కీశక్తి కల్గినది? వాఁడెప్పు వాఁడు! పరాశరశాస్త్రికి తన కన్నులయెదుట నొక పు

మూఁడు వందల సంవత్సరములలో జరిగిన చిత్రవిచిత్రములైన సన్నివేశముల నాటక మాడుచుండగాఁ దెరయెత్తినట్లు దింపినట్లు కనిపింప నారంభించెను. తొట్టతొలుత నొక వనము, నొక స్త్రీ ఆమె నొక రాజకుమారుఁడు బలవంత పెట్టుచుండెను. ఆమె యేడ్చుచుండెను. ఇంతలో నైదుగురు జటాధారులు రథారూఢులై వచ్చి వానిని బట్టికొని శిక్షించి వానికి ముండనముఁ చేసిరి. తరువాత వాఁడు తపస్సు చేసెను. శివుఁడు కనిపించెను. మరల మహాయుద్ధము. వాఁడు మహాయోద్ధగా కనిపించెను. మరల నింకొక యుద్ధము. వానిని బలుమంది వీరులు రక్షించుచుండిరి. ఇంతలో వాని మెడ తెగిపోయెను. వానితల గాలిలో నాడుచుండెను. ఆ శిరస్సు సాయమర్ఘ్యము వదలుచున్న యొకని చేతిలో బడెను. వాఁడు చీదరించుకొని దానిని నేల వదలెను. వదలినంతనే యా యర్ఘ్యప్రదానము చేయుచున్న వాని శిరస్సు సహస్రధా ప్రవయ్య లయ్యెను. ఇంతలో సూర్యుఁ డస్తమించెను. తరువాత పదునల్గురు పదునేన్గురు పురుషు లొకని తరువాత నొకరు తీవ్రవ్రతులు, ఖడ్గవిద్యానిపుణులు, చిత్ర చిత్రములైన సన్నివేశములందుఁ గనిపించిరి. చిట్టచివరివాఁడు తత్కాలాంతారమును తచ్చితారోహణముఁ జేసినవాఁడు. ఒక రాజుభార్య. ఆమె యితనికి శిష్యురాలు. మరియొక యిద్దఱు యుద్ధమాడుచుండిరి. వారిలో నొకఁ డింకొకనిఁ జంపెను. ఈ శాక్తేయుఁడు రెండవవానినిఁ జంపెను. ఏదో సరిగా కనిపించలేదు. మొత్తము మీఁద నలువురును చనిపోయిరి. వాని శవము తగులఁబడుచుండెను. విస్పష్టముగా నేదియుఁ దెలియలేదు. ఒక్కటి

మాత్రము గట్టిగాఁ దెలిసెను. ఆ తొలుతఁటివాఁడే తిరిగి తిరిగి జన్మలెత్తి ఈ శాక్తేయుఁడుగా నేదో యొకానొక సిద్ధాంతమో, వ్రతమో, యవలంబించి కొన్ని వందలయేండ్లు తన దుష్ట జీవుని కొనసాగించు కొన్నట్లు భాసించినది. వాఁడింక మరల నిట్టి శరీరమెత్తి యీ జీవలక్షణమో వ్రతమో సాగించుటకు వీలు లేకపోయినది. ఆ జీవలక్షణము ధూమముగా పరిణమించి ఈ దుబ్బులుగాఁ గట్టినది. ఆదుబ్బుల క్రింద నీదుంప లేర్పడినవి. ఈ దుంపలనుండి వచ్చిన పొగ యెవఁడు పానము చేయునో వానియందు తజ్జీవలక్షణము భాగశః సంక్రమించుచున్నది. ఈ జీవలక్షణ మెట్టిది? మొదట కథయేమి? ఔను, వాఁడు సైంధవుఁడు. ఇది యేదో భగవంతుని మీఁద పగ. శ్రీ కృష్ణదేవుని మీఁది విరోధము. వేదములమీఁద, నుపనిషత్తులమీఁద, సనాతన మతము మీఁద, భగవద్గీతలమీఁద, వైదికధర్మము మీఁద, శ్రుతి స్మృతి పురాణేతిహాసముల మీఁదఁ గట్టిన కత్తి, అది సాగించుచున్నాఁడు. పదమూఁడు వందల యేండ్లిది సాగినది. దీనికిఁ దొలుతటి తీవ్రత పోయి నది. అయ్యో! ఆ తీవ్రతయే యేకపురుషనిష్ఠమై యున్నచో నెంత బాగుండెడిది. ఏకపురుష నిష్ఠముకాదు. పరిమిత సంఖ్యాకులైన పురుషులయందు నిష్ఠమైయున్నచో నెంత బాగుగా నుండెడిది? శ్రీ కృష్ణదేవుఁడు ద్వారకానగరమునం దున్నప్పుడు భగవంతుని మీఁద పగ గలిగిన వా రెంతమంది కలరు? ఏకలవ్యుఁడు, శిశుపాలుఁడు, దంతవక్త్రుఁడు, జరాసంధుఁడు, పౌండ్రక వాసుదేవుఁడు దుర్యోధనుఁడు, సైంధవుఁడు మఱియు నెంతమందియో కలరు. వారిని వారిని సంహరించుటతో నది

తేలిపోయెను. పదుమూఁడు వందల యేండ్లీ సైంధవుఁడు - వాని పేరు జయద్రథుఁడు గదా! మహారాజు తన పేరు జయద్రథుఁడని చెప్పెను గదా? ఇదియే దీని రహస్యము. ఆ శాక్తేయునిపేరు కూడ జయద్రథుఁడు కావలయును. జయద్రథుఁడన్న పేరే యీ పరంపర వహించుచు వచ్చుచుండె నన్నమాట. అల్లౌకికపురుష నిష్ఠమైయున్న యీ భగవంతుని మీఁదిపగ పదుమూఁడు వందల యేండ్లు వ్యర్థమైపోవుట విచారించుకొని యా విరోధభావము మరియొక మార్గ మవలంబించెను. తాను ధూమముగా పరిణమించినది. ధూమముగా బహుప్రదేశములయందు సులభ ప్రవేశము సంపాదించుకొనఁ గలదు కదా? మేఘములయందుఁ జొచ్చి సస్యములయందుఁ బ్రవేశించవచ్చును. లక్షలు కోట్లుగాఁగల జీవరాసులయందుఁ బ్రవేశింపవచ్చును. సనాతన ధర్మమునకు చెప్పరానంత కీడు కలిగించవచ్చును. భారతదేశము దేశమంతయు సనాతన ధర్మ విరోధులైన జీవులచేత నిండింపవచ్చును. అందు కా ఈ చివరి జయద్రథుఁడు తన్ను దాను తగులబెట్టికొని ధూమముగా పరిణమించినాఁడు. ఈ దుబ్బులు కట్టినాఁడు. ఈ దుబ్బులక్రిందఁ దాను కాష్ఠములుగా నేర్పడినాఁడు. ఈ ఇరువది దుబ్బు లేమి? కొండకొననున్న దుబ్బేమి? అని పరాశర శాస్త్రి యనుకొనుచుండగా నొక్కొక్క దుబ్బుమీఁద సూర్యచంద్రులు లాడనారంభించిరి. ఆరు ఋతువులు తిరుగ నారంభించెను. పరాశరశాస్త్రికిఁ దెలిసెను. ఒక్కొక్క దుబ్బు ఒక్కొక్క సంవత్సరమునకు గుర్తు. ఇవి యిరువది సంవత్సరములు. కొండకొమ్ము మీఁది దుబ్బు కనిపించనేలేదు. దాని

చుట్టు సూర్యచంద్రులు తిరుగుటలేదు. అది మహాంధకారములో నున్నది. దానిని వెల్లగించుటకు వీలే లేదు. ఈ యిరువది దుబ్బులనుఁ బెల్లగించి యిరువదియేండ్లు వేదశత్రుత్వమును నాశనము చేయవచ్చును. ఈ పర్వతి మెక్కడ? తానకు తెలియుటలేదు. పరాశరశాస్త్రి యా మంత్రము నుచ్చరించుచునే యుండెను. దేవతాదర్శనము కాలేదు. ఆయన కొక్కయూహతోఁచెను. తాను తన్మంత్రమున కధిదేవత యొక్క దేవతాకృతిగా భాసించు ననుకొనుచుండెను. దేవతాశబ్దము దానికిష్టములేదేమో? దానిని దేవత యనరాదేమో! ఓసి తదక్షరాధికారిణియైన శక్తీ! దేవత యన్నంతచేత నీవు భయపడనక్కరలేదు. దేవత యనఁగాఁ బ్రకాశించునది యని యర్థము. ప్రకాశించుట యనఁగా బుద్ధికిఁ దోచునది యని యర్థము. పాంచభౌతికమై కన్నులకు కనిపించనిదని యర్థము. కన్నులకు కనిపించదు. కన్నులయందు దృష్టికలదు. కన్నులు మూసికొన్నప్పుడు కూడ నా దృష్టికలదు. చర్మచక్షుస్సులు గాకుండనొక చక్షుస్సు ఫాలభాగమునందు కలదు. కన్నులు మూసికొన్నప్పుడు నీ కొక్కటి గనిపించుచుండును. చీఁకటియో వెలుఁగో, వెలుఁగుముద్దయో కనిపించుచుండునుగదా! కన్నులు మూసికొనఁబడియున్నవిగదా! ఆ చీఁకటినిగాని యా వెలుఁగు ముద్దనుగాని చూచుచున్నదెవరు? అది యంతశ్చక్షుస్సు దానికిఁ గన్నులక్కఱలేదు. ఆయంతశ్చక్షుర్లక్షణ మేమనగా నది జీవునియొక్క చూడవలయునన్న కోరికయొక్క లక్షణము. ఆ కోరిక శరీరమునందు సంక్రమించి కన్నులుగాఁ బరిణమించినది. ఆ పరిణామమార్గమునందు దానికి రెండు మూఁడు

స్థితులుకలవు. చర్మనేత్రోపరిస్థితి యొకటికలదు. దానికి మాత్రము గనిపించునది దేవత. దేవతయనఁగా ప్రకాశించు నది. అనఁగా బుద్ధికిఁ దోఁచునది. కనుక నోసిశక్తీ! నీకు సహజమైన పాంచభౌతికముగాని, రూపముగానిరూపము కలదు నీ యా రూపము తదక్షరములచేత రేఖలుగా భాసించును. అది పాంచభౌతికమైన యాకృతిగల ద్రవ్యాంచల కృతరేఖాపరిణతిముకాక మనోనిరూపితమైన యొక ద్రవ్యము కాని ద్రవ్యముతోఁడి, రూపముకాని రూపముతోఁడి, రేఖాంచలములు భాసించినమూర్తి. అది నీకెట్టిదో అట్టిదే కనిపించును. నాకేమినష్టము? నీవు మాటాడలేవు? మాటాడినట్లు నాకు భాసించుము. నీకుఁ గన్నులులేవు. కన్నులున్నట్లు నాకుఁ గనిపింతువు. అచ్చముగా నీకుఁ గన్నులులేవనుటకు వీలులేదు. అచ్చముగా నీవు మాటాడలేవనుటకు వీలులేదు. అచ్చముగా నీకు రూపములేదనుటకు వీలులేదు. ఎనట నీ రూప మీవికృతాక్షరములుగాఁ బరిణమించినదో తదక్షర నిరంతరోచ్చారణముచేత వాయువునందు నాకాశమునందు పరినిష్ఠమైయున్న వ్యాపించియున్న మానవశరీరగతమైన మనస్సుకంటె భిన్నమైన మనోలక్షణము పంచభూతముల యందు వ్యాపించియున్నదో యా మనఃప్రపంచకములో నీ మూర్తియేమి? సర్వమూర్తులు నున్నవి. ఆ మూర్తులను తత్తద్భావనియతచిత్తవృత్తులు భావనచేసి యక్షరమూర్తులుగా మనోమూర్తులుగాఁ గొన్నింటిని నియమించి పెట్టిరి. అందులో నొక్కటి మూర్తి. ఆయనమూర్తిని, ఏతదక్షర సంపుటిగతమైనదానిని, తదక్షర సంపుటిగాఁ బరిణమించిన

దానిని, వివృతమైనదానిని, తదక్షర ద్రష్ట తొట్టతొలుత చూచెనో ఆమూర్తియే నాకుఁ గనిపించుగాక! అని పరాశర శాస్త్రి సంకల్పించినంతనే యతని మనోనేత్రమందొక యాకృతి భాసింప నారంభించెను. దానికిఁ గాళ్ళులేవు. కాళ్లులేనిదాని బదులు చేతులు బహుదీర్ఘములై యుండెను. అది నడువదు. గాలిలో నెగిరిపోవుచున్నట్లుండెను. అహంకారము మూర్తికట్టి నట్లుండెను. అజ్ఞానమాకృతి పొందినట్లుండెను. తానే సర్వ గతమైనశక్తి. తానే సర్వవిజ్ఞాన నిలయము. తనకంటె మరి యొక్కటి సృష్టిలోలేదన్నట్లు కనిపించెను. పరాశరశాస్త్రి యిట్లూహించెను. "దీని యాకారమునందీ భావములెట్లు భాసించినవి. అంతయు మనోవికృతి. కాని యాశక్తికి నొక రూప మున్నది. ఇది సుందరమైన రూపమే. రూపమునందు భయంకరత్వము లేదు. ప్రసన్నముగానున్నది. ఆయనకునవ్వు వచ్చెను. ఇంత యందమైనమూర్తి దీనికంఠమునుండి వచ్చు చున్న ధ్వనులు నక్కయూలలు, తోడేళ్లు యఱపులు, నిన్ను నేను దేవతయనను. నీవు పురుషాకృతివి. శక్తియని నేను స్త్రీ మూర్తిగా భావించితిని. ఓయీ! నీ వెవ్వఁడవు." అనగా నామూర్తి యిట్లన్నట్లు భాసించెను. "నే నెవ్వఁడనైన నీకేమి? నేను నీకు వశవర్తిని. నీకెప్పుడేది కావలయునో నన్నడుగుము. నాకుఁ గొన్ని శక్తులుకలవు. ఆశక్తుల కతిక్రమించనివన్నియు నీకు నేను చేసిపెట్టెదను. నేను చేయఁగల, నాకు సామర్థ్యము కల సర్వవిషయములు నీ కన్నులముందింతకుముందే యాడి నవి. వానియన్నింటిమీఁద నీకు నధికారము కలదు. నీ వేనాఁడు

నేను కనిపించవలయుననికోరుదువో ఆనాఁడు నన్నె ట్లడుగ వలయునో యట్లడుగుము. నీకన్నిఁటిని చెప్పెదను."

పరాశరశాస్త్రి యాపురుషునప్పుడే రాజదుర్గరక్షణ మెట్లని యడిగెను. ఆమూర్తి చెప్పెను. దుబ్బులను గురించి యడిగెను. యామూర్తి వాని తత్త్వము నుపదేశించెను.

౮

ఒకనాఁటి యుదయమున పరాశరశాస్త్రి శిశునాగుని వద్దకుఁబోయెను. శిశునాగుఁడు వచ్చిన పరాశరశాస్త్రితో మాటాడలేదు. కూర్చుండుమనలేదు. శిశునాగుని ముఖ మండలమున నొక నిరాశాభావము గోచరించుచుండెను. వేద మరీచి మగధరాజ్యమునకు వెడలిపోయి పది దినములయ్యెను. అట్లే తనకు గురువని యనుకొన్న యెవఁడో పురుషుఁడు తనకుఁ గనిపించి పది దినములయ్యెను. ప్రతిదినమునుఁ దత్ప్రతీక్షా వ్యగ్రుఁడైన శిశునాగునకు తద్వైఫల్యములోఁడనే యస్తమించు చుండెను. ఆనాఁడే మరణించునన్న రాజు మరణించలేదు. ఆయన మంచములోఁ బరుండియుండెను. మాటాడుచునే యున్నాఁడు. అందఱితో రాజువలెనే మాటాడుచున్నాఁడు. మఱల భోజనాదులలోనికి దిగెను. రాజకార్యములు పరా మర్శించుట యారంభించెను. తానుపోయి తండ్రినిఁజూచి రాలేదు. తండ్రి రమ్మని వార్తపెట్టలేదు. పూర్వము దిన దినము పుత్రునిఁజూడకుండ నుండలేని తండ్రి పదిదినములుగాఁ

జూడకుండ నుండెను. నిజమే. ఆ జనకుఁడు చనిపోవలయును. తనకు రాజ్యము రావలయునని కోరుకొన్న కొడుకును తండ్రిచూడ వలసిన యవసరమేమున్నది? కాని కొడుకట్లనుకొనుచున్నాఁ డని తండ్రికిఁ దెలియదుకదా! తండ్రిలో నేదో యొకమార్పు వచ్చినదని కొందఱు చెప్పుచున్నారు. ఆయన యెల్లవేళల రాజువలెనే మాటాడుటలేదట. ఒకొక్కప్పుడు తా నెవ్వరో యన్నట్లు మాటాడుచుండునట. శిశునాగునకుఁ జాలవార్తలు తెలిసెను. చిత్రశిఖండియుఁ బరాశరశాస్త్రియుఁ దానాఁడు రాత్రివేళ కూర్చున్నస్థలమునకుఁబోయి యేదో యేదో విచారించి వచ్చిరట. ఈ పది దినములలోఁ దొలుతటి నాలైదు దినములు శిశునాగునకుఁ దనకంతయు ననుకూలముగా నున్నట్లు దోఁచెను. రాత్రి నడిజాముల వేళ జంబుకముల యరపులు కోట చుట్టును వినిపించెడివి. ఆ యరపులువినిపించినంతసేపు శిశునాగునకొక యాశాభావము గోచరించుచుండెడిది. తన గురు వన్నవాఁడు వచ్చుచున్నట్లు భాసించెడిది. కడచిన నాలైదు దినములనుండి యా ధ్వనులు వినిపించుటలేదు. వినిపించుట లేదు సరికదా! దూరమునుండి యేదియో నొక ప్రతిబంధము త్రవ్వములకు జరిగినట్లు విలక్షణమైన ధ్వనులుగా వినిపింప నారంభించెను. ఈ ప్రొద్దుటఁ బరాశరశాస్త్రి వచ్చెను. కడచిన రాత్రి రాత్రియంతయు నిశ్శబ్దముగా నుండెను. అనఁగాఁ బూర్తిగాఁ దన యాశ విఫలమైనదనియా? తన ప్రతిక్ష వైఫల్యమందినదనియా? తనకోరిక కొనసాగదనియా? పరా శరశాస్త్రి యనఁగా శిశునాగున కొడలు మండుచుండెను.

ఇతఁడే యా గురువును దూరముగా త్రోలినవాఁడు. ఎట్లు త్రోలెను ? ఆ గురువుయొక్క శక్తియేమి ? ఆ శక్తికంటె మించినశక్తి పరాశరశాస్త్రివద్ద నున్నదా ? ఆ గురువు తన వద్దకు రానేరాఁడా ? తాను రాజగుటయే జరుగదా ? ప్రతీ కారమే లేదా ?

పరాశరశాస్త్రి యిట్లనెను. "యువరాజా! తమరుపోయి తండ్రిగారి దర్శనము చేయవలయును. తమరికొఱకు మీ తల్లిదండ్రులు ప్రతీక్షించుచున్నారు."

శిశునాగునకుఁ బరాశరశాస్త్రితో మాటాడుటయే యిష్టములేదు. తానేదో సమాధానము చెప్పనిచో నతఁడచ్చటినుండి పోఁడు. అందుచేత తాను వెంటనే బయలు దేరెను. సూటిగా తండ్రివద్దకేపోయెను. అతని వెంటఁ బరా శరశాస్త్రియు వెళ్ళెను. తండ్రియుఁ దల్లియు శిశునాగుఁడును శాస్త్రియు చిత్రశిఖండియు వృద్ధమంత్రియు నందఱు నచట సమావేశమై యుండిరి. పరాశరశాస్త్రి యిట్లనెను. "రాజా! యువరాజునకు వివాహము చేయవలయును. ఆయన యిన్నాళ్ళను వేదమరీచితోఁగలసియుండెను. వేదమరీచి వెళ్ళిన తరువాత యువరాజునకు మతిచిక్కఁబట్టుకొనుటకు సాధ్యమగుట లేదు. మున్ను పలు సంబంధములు వచ్చినవి. యువరా జంగీకరించ లేదు. అందుచేత సంబంధములు వచ్చుటయే మానివేసినవి. ఏ రాజకుమార్తెనో యొక రాజకుమార్తెనుఁ దీసికొనివచ్చి వెంటనే వివాహము చేయవలయును. తమ రంగీకరించినచో నేనే పోయి యొక సంబధమునుఁ దీసికొని వచ్చెదను. తమరు పూర్వమువలె వ్యవహరించుటకు యోగ్యమైన శరీరస్థితిలో

లేదు. యువరాజు రాజ్యభారమును వహించవలయును. తమరు జీవించియుండగా నాయన రాజ్యభారమును స్వీకరించుట కనుమతించరు. అందుచేత వారికి వివాహముఁ జేసినఁగాని వారి మనస్సు కుదుటఁబడదు. ఇన్నాళ్ళు వేదమరీచితో నాటపాటలతో విహరించినవారు నేఁడు నిర్వ్యాపారముగా నుండుట కష్టము." చంద్రమతీదేవి యంగీకరించెను. రాజూరకుండెను. అందఱును దప్పకుండ వివాహము చేయవలయు ననిరి. శిశునాగుఁడు మాటాడలేదు. మఱలఁ బరాశరశాస్త్రి యిట్లనెను. "మున్నెన్నడాఱు సంబంధములు వచ్చినవి. అందులో నాంధ్రదేశ ప్రభువుయొక్క కుమార్తె మిక్కిలి యందకత్తెయని యువరాజును వేదమరీచియు నిద్ద ఱంగీకరించిరని నేను విన్నాను. ఆ యాంధ్రరాజ దుహితను దెచ్చియేల పెండ్లి చేయరాదు? ప్రభువు లంగీకరించినచో నేను పోయి వారితో మాటాడి వచ్చెదను. పోవుటకు వచ్చుటకు నెల దినములు పైనఁ బట్టును. అయినను పోయివచ్చెదను. నేను కానిచో మఱియెవరినైన పంపెదను." అనఁగా నెవ్వరును మాటాడలేదు. పరాశరశాస్త్రి వెడలిపోయెను. అందఱును తమ దారిని దాము పోయిరి. రాణియు రాజయు నొక్కతే యుండిరి. రాణి రాజు నిట్లడిగెను. "ఆంధ్రరాజ కుమార్తె మనకుఁ గోడలగుట మీ కిష్టమేనా?" రాజు నవ్వెను. నవ్విన వెంటనే రాణికిఁ దెలిసెను. రాజు రాజుకాఁడు, రాజును విడచి విడచి రాజు నావేశించిన పురుషుఁడు వచ్చుచుండును. ఆ యావేశము తా నున్నప్పుడు పరాశరశాస్త్రి యున్నప్పుడే గలుగుచుండెను. తక్కినప్పుడు రాజుగానే

యుండుచుండెను. ఎందుచేతనో రాణికిఁ బరాశరశాస్త్రి వద్ద లేనప్పుడు తదావేశము కలుగుటం యిష్టము లేకుండెను. పరాశరశాస్త్రి తదావేశ పురుషునితోఁ బరిచయము కలవాని వలె నటించుచుండెను. తనకుఁ దెలిసినది వాని పేరు జయద్రథుఁడన్న దొక్కటియే. రాజు నవ్వినంతనే యామె యిట్లనెను. "నీ కంగీకారమేనా ?" రాజు తనకు చాల యిష్ట మనెను. రాణి:- "అట్లైనచో నిందాక నేల చెప్పలేదు ? రాజు:- అందఱు నుండగా నెట్లు చెప్పుదును ? రాణి:- యువరాజుండగా నైనఁ జెప్పవలయుఁగదా ! రాజు:- యువరాజు బెదరిపోయినాఁడు. పరాశరశాస్త్రి బిభీషికలకు వెలవెల పోవుచున్నాఁడు. నా శక్తి యువరాజునకుఁ దెలియదు. పరాశరశాస్త్రికిఁ దెలియదు. యువరాజును నేనును మేమిద్దఱమే యొకసారి యేకాంతముగా మాటాడవలయును. అప్పుడుగాని నే నేమిచెప్పుటకును వీలులేదు." అని రాజు మఱల నవ్వెను. రాణి యాలోచించెను. ఆమె మఱలఁ బరాశరశాస్త్రికి వార్త బెట్టెను. ఆయన వచ్చెను. రాజన్న మాటలు చెప్పెను. పరాశరశాస్త్రి యాలోచించ నారంభించెను. ఈ వ్యవహారము తనకంటె మించిపోయినట్లున్నది. తా నేదో కట్టుదిట్టము చేసితి ననుకొనుచుండెను. ఆపురుషుఁడు రానక్కఱలేకుండఁగనే ఇచట జరుగవలసినది జరుగునా ? ఈ రాజునందుఁ బ్రవేశించినవాఁ డెవఁడో తా నెవ్వనికొఱకో ప్రతీక్షించుచుంటిననియు వాఁడు రావలయుననియుఁ జెప్పెను గదా ! ఇపుడు వాఁడు రాఁడని తెలిసి క్రొత్త తెన్నునఁ బోవుచుండెనా ? పరాశరశాస్త్రి కొకయూహ తోఁచెను. అది

తొందరగాఁ జేయవలసినపని. తాను మూఁడు దినములు బాగు చేసెను. ఇపుడు యువరాజును రాజును గలుపుటయా? వారిద్ద రేకాంతముగా నున్నప్పు డేమిమాటాడుకొందురో తెలిసికొనుట సాధ్యము కాదే. రాణితోఁ బరాశరశాస్త్రి మరునాఁడా విషయమును గూర్చి చెప్పెదనని వెడలి పోయెను. ఆ రాత్రి గుసపములతోఁ జిత్రశిఖండిని వెంటఁ బెట్టి కొని తచ్ఛ్మశాన ప్రదేశమునకుఁ బోయెను. అచ్చట నల్వురును గాపుండిరి. పరాశరశాస్త్రి "ఇంక మీరు కాపుండనక్కఱ లేదు. కాని మీరు నల్వురు మీ దారిని మీరు పోరాదు. రాజకార్యము పూర్తికాలేదు. అది యెట్లగునో నాకు తెలి యుటలేదు. మీరీపది దినములిచ్చట నుంటిరి కదా! ఇచ్చట నేనేమి జరిగెనో చెప్పుమనెను. వారిట్లనిరి "ఎవఁడైన పురు షుఁడు వచ్చుననియు వానిని బట్టికొందమనియు మే మెంతయో యెదురు చూచితిమి. ఎవ్వఁడును రాలేదు. మొదటి నాల్గు దినములు నక్కలును తోడేళ్ళును యథేచ్ఛావిహారము చేసెను. మేమిచ్చట గాపున్న తర్వాత రెండవ రాత్రి యొక విచిత్రమైన సన్నివేశము జరిగెను. ఒక నక్క వచ్చెను. ఆ నక్క వృషభ ప్రమాణమున నుండెను. చీఁకటిలో దాని మొగము మాత్రమే నక్కయనియు శరీరము పురుషాకృతి యనియు ననిపించెను. ఊరకే యట్లు తోఁచెను. పోయి పరి శీలించుటకు మే మిచ్చటనుండి కదలుట కాజ్ఞ లేదు గనుక మేము కదలలేదు. అప్పటికిని మాలో నొకఁడు పోయి యతఁడు వదలిన స్థలమును బరిరక్ష చేయుటకు బాధ్యత తక్కిన ముగ్గురము వహించి యతనిచేత నా విషయము తెలిసి

కొందమనుకొంటిమి. కాని మాలోనుండి యొకఁడు పోయినను మీ యాజ్ఞాప్రకారము వాఁడు వెళ్ళిన దిశయందు రక్షణ యొక్క సంపూర్ణత తక్కువయగునని మీరనుకొనినట్లు మాకు స్ఫురించినది. మేము శత్రువులైన మానవులతో వ్యవహరించుట లేదు. భూతమో భూతప్రాయమోయైన దానితో వ్యవహరించుచుంటిమి. అందుచేత మాలో నొక్కఁడును కదలలేదు. ఆ నక్క నవ్వినది. ఆ ధ్వని మానవుఁడు నవ్విన నవ్వుగాని నక్క యఱపుకాదు. మాకు చాల కోపము వచ్చినది. మీ యాజ్ఞయంత బలవంతముగా లేనిచో మేమా కృతక సృగాలమును ఖండించి యుందుము. తరువాత మూనాళ్ళు నక్కలు వచ్చుచునే యుండెను. అవి చుట్టుపట్లనున్న సామాన్య జంతువులే కాని మాకు వానియందు విశేషము గోచరించలేదు. కడచిన నాల్గునాళ్ళుగా సర్వనిశలును నిశ్శబ్దములుగా నున్నవి. ఒక నక్కరాలేదు. ఒక కుక్క రాలేదు." అని యతఁడు చెప్పఁగాఁ బరాశరశాస్త్రి యిట్లనెను. "ఇచ్చటనీ దుబ్బులున్నవి. ఇవి నాల్గు కలవు. వీనిని గుఱించి మీ రేమైన విచారించితిరా?" యని యడుగగా వారు మా కేమియుఁ దెలియదనిరి. ఆ నలుగురిలో నొకఁడు వామనుఁడు; దృఢకాయుఁడు, వాని మొగము వానరముఖము వాని నందఱు పరిహసింతురు. కాని అతఁడప్రతార్యుఁడు. అందుచేత నతనినిఁ జూచి భయపడుదురు. అతఁడిట్లనెను. అయ్యా! పవలు మేమిద్దఱము నిదురపోవుదుము. ఇద్దఱము మేల్కొని యుందుము. ఒకనాఁడు నాల్గు దినములక్రింద నేను మేల్కొని యుంటిని. రెండవవాఁడు కూడ కునుకుచుండెను. అది సంధ్యా

సమయము నిదురపోవుచున్నవారు మఱి కొంతకాలము గడచినఁగాని మేల్కొనరు. ఆ సమయములోనే నొక్కఁడనే మేల్కొని యుంటినని చెప్పవలయును. అప్పుడొక్క సంగతి జరిగినది. సంజచీఁకట్లు వచ్చెను. ఎవరో ఈ దుబ్బులను త్రవ్వుచున్నట్లు నాకు తోచెను. నేను జాగ్రత్తగా పరిశీలించితిని ఎవ్వరును కనిపించలేదు. కాని దుబ్బులు కదలాడుచుండెను. ఒక్క గాలిపిసరు లేదు. క్రిందనుండి యెవ్వరో యీ దుబ్బుల వేళ్లు కదలించుచున్నట్లు గట్టిగానున్న దుబ్బులు కదలనారంభించెను. నేలలోనుండి యెలుకలు త్రవ్వుచున్నవా యనుకొంటిని. భూకంపమా యనుకొనుచుంటిని. భూకంపము కాదు. నాకేమియు నర్థము కాలేదు. తక్కిన మువ్వురును నిదురపోవుచుండిరి. మేల్కొనియుండవలసిన వానిని మేల్కొల్పితిని. అతనితోఁ జెప్పితిని. అతఁడు దుబ్బులవంక చూచెను. నన్ను పరిహాసించెను. మఱల నేమియు జరుగలేదు." అని యతఁడు చెప్పఁగా పరాశరశాస్త్రి యీ దుబ్బులనుఁ ద్రవ్వుదము రండని నలువురినిఁ దీసికొనిపోయెను. ఉన్న నాల్గు దుబ్బులను త్రవ్విరి. ఆ దుబ్బులక్రింద వేళ్ళు లేవు. ఎవరో కత్తితో కోసినట్లు కనిపించెను. దివ్వెటీల వెలుఁగున చూచిరి. కఱ్ఱల వలెనున్న యీ వేళ్లు నేలలోనికి చొచ్చుకొని యుండిన రంధ్రములు కనిపించెను. పరాశరశాస్త్రి తనకు భాసించిన విషయములు జ్ఞాపకము చేసికొనెను. వీని యడుగునఁ గాష్ఠములు కలవు. అవి యీ దుబ్బులవేళ్ళు. అవి నిప్పు ముట్టించినచో నంటుకొనును వానినుండి ధూమము వెడలును. ఆ ధూమపానము చేసినవారికి మనోలక్షణములు మారును. ఈ నాల్గు

దుబ్బులక్రింద నున్న కాష్ఠములేమైనవి. ఇది యద్భుతముగా నున్నది. వీని నెవరు త్రుంచికొని పోయిరి. ఎట్లు త్రుంచిరి? ఆయన కవగతముకాలేదు. ఆయన యిట్లూహించ నారంభించెను. పైనున్న దుబ్బులకు ప్రాధాన్యములేదు. లోనున్న దుంపలకు ప్రాధాన్యము. కట్ట నిరువదియొక్క దుబ్బులు కలవు. ఆ ప్రదేశ మెచ్చటనో తెలియదు. ఆ యిరువదియొక్క కాష్ఠములు నీనాల్గు కాష్ఠములు పాతిక కాష్ఠములు. ఈ నాల్గును చేయి మిగిలిపోయినవి. తక్కినవి కూడ నిక్లే యగునా? ఆ స్థలమెక్కడ? ఇది యిచ్చట నున్నవని తెలిసియే తాను వానిని రక్షించుకొనలేకపోయెను. ఎచ్చట నున్నవో తెలియని స్థలమున నున్నవానిని గూర్చి తానేమి చేయగలఁడు? ఆ నాల్గు దుబ్బులనుఁ ద్రవ్వించెను. నాల్గింటిని మూట కట్టెను. అచ్చట నెవ్వరు కాపుండనక్కర లేదనెను. తాను బయలుదేరెను. అందరును బయలుదేరిరి. ఈ దుబ్బుల నేమిచేయవలెను? జరిగిన కార్యమునుబట్టి దుబ్బులకు ప్రాధాన్యములేదు. అయినను జాగ్రత్త యవసరము. తన యింటికి తీసికొనిపోయెను. వీధిలో నొకచోట పెద్దరోలు కలదు. ఆ వీధిలో నివసించు జనులందఱు నా రోటియందే తమ తత్సంబంధములైన కార్యములు చేసికొందురు. మిరియాలు కొట్టుకొందురు. లవణపురాళ్లు దంచికొందురు. జొన్నలు దంచికొందురు. ఆవీధి వీధికంతకు నదియే రోలు. ఇట్లానాళ్లలోఁ బ్రతిపురమునందు గ్రామమునందు జనోపయోగార్థము వీధుల యందిట్టి రోళ్ళుండెడివి. ప్రతివారికి తమ యిండ్లలో రోళ్ళుండవు. పరాశరశాస్త్రి ఈ నాల్గు దుబ్బులను నారోటిలో

వేయించి రుబ్బించెను. సర్వపాపములను దహింపఁగల గంగా నదిలో యీ దుబ్బులు రుబ్బిన పిండిని కలిపించెను. తరువాత నేమగునో తెలియఁదు. అప్పటికి రాత్రి రెండు జాములయ్యెను. ఆయన మరల జపము మీఁదఁ గూర్చుండెను. ఆ ప్రసన్న ముఖలక్షణములు గల ఫేనవారనముగల త్రిన్నేత్రచ్ఛ మంత్రాధి దేవత కనిపించెను. పరాశరశాస్త్రి నీవు దుబ్బులు చూపించిన పర్వత మెక్కడిది? యని యడిగెను. ఆ దేవత వింధ్య పర్వతములలో నున్నది? దాని మార్గమిది యని బోధించెను. పరాశరశాస్త్రికొక సందేహము కలిగెను. ఇచ్చటఁ దాను పోకముందే మూలములైన కాష్ఠములను కోసికొని పోయిన ట్లచట కూడ జరుగునాయని ఆ సంగతి ఈ దేవత నడుగవలయునా యడుగరాదా? ఈ దుంపలు క్రిందినుంచి కోసికొని పోఁబడుట యేతత్సర్వ పరిజ్ఞాత్రయైన యీ దేవతకుఁ దెలి యును. మఱియు నింత యాలోచన యెందులకు? ఆనుంప లేమైనవి? యని పరాశరశాస్త్రి యీ మంత్రము నుచ్చరింప నారంభించెను. కొంతసే పైనతరువాత నతని కిట్లు దీపించెను. ఒక కాలసర్పము దుబ్బుల క్రిందనున్న నాల్గు కాష్ఠములను నోటితోఁ గొరికెను. మఱి చూచుచుండగా నా నాల్గుకాష్ఠములు తన చేతితోఁ బూని యొక పురుషుఁడు పైనుండి క్రిందికి నల్లని దుస్తులు ధరించినవాఁడు కాలసర్పాకృతి గల వాఁడు ప్రయాణము చేయుచుండెను. ఎచ్చటికిఁ బోవు చుండెను? ఏదో దూరదేశము. ఒక నది ప్రవహించు చున్నది. ఆ నది ప్రక్కన నది రాజధానివలె నున్నది. అది రాజసౌధము. సౌధము కెలన తోఁట యున్నది. ఆ తోఁటలో

నొక రాచకూతురు కూర్చుండి యున్నది. ఆమె యెవ్వరు? ఇదివరకు చూచినట్లున్నదే. ఆహా! తెలిసినది. ఈమయే యాంధ్రరాజదుహిత. ఈమెనే శిశునాగున కిత్తుమని యారాజు వార్త పుచ్చెను. ఆమె ప్రతికృతి చిత్రమునందుం దాను చూచెను. చిత్రశిఖండి చూపించెను. పరాశరశాస్త్రికిం దనకే యాశ్చర్యమయ్యెను. తాను ప్రొద్దుట యాంధ్రరాజ దుహితను శిశునాగునకిచ్చి పెండ్లిచేయుటకు సంబంధము కుదిర్చి వత్తునని చెప్పెను. ఇప్పుడు జరిగిన దిది. ఈ కార్యములు త్రిలింగ రాజ్యమునకుం జేరెను. తన మనస్సున కాంధ్రరాజ దుహిత యెందుకు స్ఫురించెను? తా నీదేవతా మంత్రమును జపించెను. తన్మంత్రములోనున్న యొక శక్తి తనకుం దెలియకుండ తన జీవునియందభివ్యాప్తమై యున్నదని యర్థము. ఆ మంత్రశక్తిచేత నిహితమైన తన జీవుండు తన్మంత్రమే యేకార్యములు చేయుట కుద్దేశింపబడినదో యాయా కార్యముల యొక్క యానుకూల్యమును తనకుం దెలియకుండ సంపాదించుకొనుచుండును. తాను మనస్సుచేత దత్సర్వకార్య విఘటనా భావముకలవాండు. తన్మంత్ర పురశ్చరణముచేత తన మనస్సున కధిగమించిన జీవునిలో దాని కనుకూలమైన లక్షణ మేర్పడి యున్నది. జీవునిలో తదాభిముఖ్య మున్నది. తన మనస్సు దానిని విరోధించుచున్నది. ఈ మనస్సాజీవుని నుండి సముద్భవించినదే. దాని విరోధ మీ మనస్సునకు బహిర్విషయములనుండి సమాసిన్నమైనది. ఎంత తుచ్ఛమంత్ర మైనను దాని శక్తి తత్పురశ్చరణముచేత జీవునియందు సంక్రమించి తీరును. ఇంతలో నా యుద్యానవనమున నా రాజ

కన్య నిద్రించుచున్నది. ఈ పురుషుఁడు నాల్గు కాష్ఠముఁకు నిప్పు ముట్టించెను. పొగ యంతయు ప్రోవుచేసెను. ఆ పొగ యంతయు నిదురపోవుచున్న యా రాజదుహితయందు ప్రవేశ పెట్టెను. ఇంత పొగను రాజదుహితచేత సుమారు వేయిఁడ్లు పీల్పించెను. కాష్టములు మిగులలేదు. ఆ ధూమమంతయు నా రాచకూతునందు నిండింపఁబడియుండెను. ఆమెకు మెల కువ రాలేదు. మెలకువ రావలసిన యవసరములేదు. నిద్దు రలో నుచ్ఛ్వాస నిశ్వాసములు జరుగుచుండెను. ప్రత్యు చ్ఛ్వాసము నెంట నీ పురుషుఁడు ధూమమునే యామె చేతఁ బీల్పించెను. ఆమెకు తెలియదు. ఈమె యాంధ్రరాజ దుహిత. ఇప్పుడు చేసెడి దేమియు నేదు. తక్కిన యిరువది దుంప లేమి కావలయును? మఱల మంత్రోచ్చారణము నారంభించెను. తన కేమియు కన్పించలేదు. అవి తనకు స్వాధీనమగునా? తాను స్వాధీనము చేసికొని యేమి చేయ వలయును? రుబ్బి గంగలో కలుపునా? ఏదో చేయవలయును.

మఱునాఁడు ప్రొద్దుటఁ జిత్రశిఖండిని పిలిచి యాశిగ్వ పర్వత ప్రదేశము నిరూపించిచెప్పి యచ్చట నిచ్చట దుబ్బ లిరువది కలవు. వానిని ద్రవ్వించి తెప్పించవలయును. పుఱి యొకదుబ్బు కొండశిఖరముననున్నది. దాని నెవ్వరునుఁ దేరు. ఈ యిరువది దుబ్బులను క్రిందికాష్ఠములతోఁగూడఁ దేవల యును. తీసికొనివచ్చునప్పుడు వాని నపహరించుటకు విశ్వ ప్రయత్నము జరుగవచ్చును. మొన్నఁ గాపున్న నలుగురే దానికి సమర్థులు. అప్రమత్తులు. వారే పోవలయును. వారే తేవలయును. వానిని దొంగిలించుటకు పక్షులు రావచ్చును.

నక్కలు కుక్కలు తోడేళ్ళు రావచ్చును. సర్పములు రా వచ్చును. ఈ ఐదు మార్గములను రక్షించుచు వానిని దీసికొని రావలయును. వచ్చినతరువాత నేమిచేయవలయునో విచా రింతును. మఱియు నింకొక యూహతోఁచుచున్నది. వాని నచ్చటనే యుంచినచో నేమగును? ఈ నాల్గుదుబ్బులదుంపలు తొలఁగింపఁబడిన ట్లవి తొలఁగింపబడునన్న సందేహము కలు గుట లేదు. దాని వేరైన దుంపయొక్క స్వరూపమేమో నా కింతవఱకుఁ దెలియదు. దానికి నిప్పుముట్టించినచో సంపూర్ణ ముగా ధూమమువచ్చి భస్మముకూడ మిగులునట్లు లేదు. ఓయీ! ఒక యూహతోఁచుచున్నది. ఆ దుంపలను తెప్పిం పుము. పదునేను పదునాఱు దినములలో వానిని దేవచ్చు ననుకొందును. ఆ నలువుఱిని నేఁడే పంపింపుము. ఇంకొక పని కూడ చేయవలయును. వందపాతిక యేండ్లక్రిందటి గిరివ్రజ పురములోని సంగతులు మనకు తెలిసికొనవలసిన యవసరము కలిగినది. మహావృద్ధు లుందురు. నూటయేఁబది యేండ్లు. రెండు వందలయేండ్లు బ్రతికినవారుకూడ నుందురు. గిరివ్రజపురము నకుఁబోయి కనుగొన్నచో వారు కనుపింతురు. వారిని పదుక వలయును. ఆనాఁటి రాజకీయ పరిస్థితులయొక్క సమగ్రమైన వృత్తాంతము మనకుఁ దెలియవలయును. అంతవరకు నేనేమి చేయవలయునో నాకుఁ దోఁచుట లేదు. బార్హద్రథవంశమంత రించి ప్రద్యోతవంశ మారంభించెను. ఆ రాజ్యముమాఱెను. అప్పటి పరిస్థితులేమి? ఇది యేదో యొక విచిత్రమైనమాయ. ఒక యుపనిషన్మత విరోధభావము. ఒక శ్రౌతమార్గ ప్రతి స్పర్థి, ఒక వైదికభావ సపత్నమైనది. కల్యారంభమునుండి

సూత్రంపట్టి నడుచుచున్నది. దానియందు ముడులుకలవు. చివరిముడి యీనాఁడుకలదు. ఇంకొకముడి యిప్పుడు వేయఁబడఁబోవుచున్నది. ఈ ముడియొక్క స్వరూపముయొక్క సంపూర్ణాభిజ్ఞానము కావలయునన్నచో నామడి యెట్లు పడినదో తెలిసికొనవలయును. గిరివ్రజపురమున్న కెవరిని వంపింతువు? అతఁడెన్నాళ్ళలో తిరిగివచ్చును. నాకుఁ దెలిసినంతనుండ నన్నమించి యొక వ్యవహారము జరుగఁబోవుచున్నది. ప్రతి క్రియాశూన్యవృత్తినై యుండవలసి వచ్చునట్లుండెను. నా కొక దాని కొకటి పొసఁగుట లేదు. ఈ దుంపలు ద్రవ్యము. పదార్థము. అవి త్రవ్వికొనఁబడిపోవుట విచిత్రముగానున్నది. అవి యిక్కడ త్రవ్వఁబడుట యేమి? ఆంధ్రరాజ్యమునకుఁ గొంపోఁబడుట యేమి? అచట వాని చేత నిర్వర్తింపఁజేయఁబడఁదగిన కృత్యము నిర్వర్తింపఁబడుట యేమి? ఒక్క నిశాకాలమున జరిగినది. ఇది భౌతికము. అది భౌతికేతరమైన శక్తి. ఈరెంటి పొసఁగింపు నాకు తెలియుట లేదు. తొట్టదొలుత గిరివ్రజపుర గత తత్కాల సర్వవార్తా పరిజ్ఞానము ముఖ్యమై కూర్చున్నది. నీవు పోరాదు. నేను పోరాదు. ఏమందువు? అనఁగాఁ జిత్ర శిఖండి అట్టివాఁడు మన కాశీనగరమునం దొకఁడున్నాఁడు. ఆయన కీ రాజకీయ వ్యవహారములు తెలియునో తెలియవో నాకుఁ దెలియదు. ఆయన వయస్సు నూటయెనుబది యుండునని కొంద ఱందురు. కొందఱు రెండు వందలందురు. కడచిన పదియేండ్లుగా నాయన యీ నగరమునం దున్నాఁడు. నిర్ధారుఁడు, నిస్సంసారుకుఁ, ప్రతిదినము పోయి గంగానదియందు స్నానముచేయును. సత్రమునందు

భోజనముచేయును. అచ్చటనే యొక పంచాదిలో నివసించు చుండును. ఎవ్వరితోడను మాటాడఁడు." అని చిత్రశిఖండి చెప్పినంతనే పరాశరశాస్త్రి బయలుదేరెను. ఇద్దఱు నతని వద్దకుఁ బోయిరి. ఆయన నిద్రించుచుండెను. వీరుఁ బ్రక్కఁ బోయిరి. ఆయన నిద్రించుచుండెను. వీరు ప్రక్కఁ గూర్చుం డిరి. అతఁడు నిద్రలో నవ్వుచుండెను. కొంతసేపటికి నతఁడు మేల్కొనెను. మేల్కొంచునే "ఎన్నాళ్ళకుఁ గనిపించితివి?" అనుచు మేల్కనెను. పరాశరశాస్త్రి "ఎవ్వరు కన్పించిరి? ఎన్నాళ్ళక్రిందఁ గనిపించెను? అతఁడేనా? "ఆయన పేరు నీకు తెలియదు. నేను చెప్పినను తెలియదేమో?" అనఁగా నా వృద్ధుఁడు "నాకు రాణిగారు చెప్పినది. అతనిపేరు జయ ద్రథుఁడు. వాఁడు యోగి. పరమమాహేశ్వరుఁడు. వాఁడు మా రాజ్యమునకుఁ జేసిన యుపకార మంతయు-నింతయునా?" ఈ మాటలు చెప్పువేళకు నా వృద్ధునకు మెలకువ విస్పష్ట ముగా వచ్చెను. ఎదురుగానున్న వీ రిద్దఱివంకఁ జూచెను. మీ రెవ్వరని యడిగెను. పరాశరశాస్త్రి "మేమెవ్వరమో తరువాత చెప్పుదుము. ఆయోగి యేమిచేసెను? మీ రాజ్య మున కతఁడు చేసిన యుపకృతి యెట్టిది? అది తెలిసికొను టకే మేము వచ్చితిమి? మేము గిరివ్రజపురము పోవలయు ననుకొనుచున్నాము. నూఱేండ్లక్రింద గిరివ్రజపురమున జరి గిన రాజపరివర్తనమును గూర్చిన సంగతులు మాకుఁ దెలియ వలయును. నీవున్నావని యీయన చెప్పగా వచ్చితిని." అనఁగా నా వృద్ధుఁడు. "నాకేమియుఁ దెలియదు. నేను కలలో నేదియో కలవరించితిని. శాంబోలు." అనెను. పరాశరశాస్త్రి

యిట్లనెను. "అయ్యా! నేనింకొొక విషయము చెప్పఁబోవు చున్నాను. నీవు గిరివ్రజపుర నివాసివి. ఆ రాజవంశమునందు నీకు గౌరవము కల దనుకొొందును. మఱల నా రాజ్యములో నింకొక విప్లవము జరుగఁబోవుచున్నది. ఆ విప్లవము జరుగ కుండఁ జూచుటకు నేను ప్రయత్నము చేయుచున్నాను. నీ కావిషయముసం దభిమానము కలిగినచో నాకు దానిని చెప్పుము." ఆ వృద్ధుఁడు దీర్ఘముగా నాలోచించెను, "మీరు పెద్దలుగాఁ గనిపించుచున్నారు. బ్రాహ్మణులు, పండితులు, తేజశ్శాలురు, అందుచేత మిమ్ము నమ్ముచున్నాను. నేను గిరి వ్రజపురమును వదలిపెట్టి చాల సంవత్సరములైనది. అచ్చటి పరిస్థితులతో నాకేమియు సంబంధములేదు. ఏది యెట్లైన నాకేమి? హరహర మహాదేవ శంభోశంకర యంచు కూర్చు న్నాను. ఆ భగవంతుఁడేమో నేనేమో యన్నట్లున్నాను. నాకిట్టి స్వప్నము నేఁడెందుకు వచ్చినదో నాకుఁ దెలియదు. మీరు వచ్చి నా ప్రక్కన కూర్చుండుట చేతనే వచ్చినదేమో! అయ్యా? తమరి పేరేమి? పరాశరశాస్త్రిగారా! చిత్రము. నేను కనీసము పదియేండ్లనుండి విశ్వేశ్వర స్వామిని వదలిన భావము లేకుండ ప్రయత్నముచేసి మనస్సును నిలుపుకొొను చున్నాను. కడచిన యైదారేండ్లుగా కొంత కృతకృత్యుఁడ నైనా ననుకొొంటిని. స్వామీ! ఈ సంస్కారమెంత బలవంతమైనది. హఠాత్తుగా నాకు వందయేండ్లక్రింద జరిగినది ఈ సన్నివేశము మనస్సులో స్ఫురించుట యేమి?" అనెను. పరాశరశాస్త్రి యిట్లనెను. "ఓయీ! నేను తద్భావముచేత నిండియున్న మనస్సుతో తీవ్రమైన

తద్భావ వేగముతో గాఢమైన తదాలోచనతో నీ ప్రక్కఁ గూర్చుంటిని. ఆనా మనస్సులో నున్న భావము యొక్క తీవ్రత యెట్టిదనగా నీ పరిసర ప్రదేశమంతయు చర్మ చక్షుస్సులకుఁ గనిపించని యొక భావనా తరంగముల చేత నభివ్యాప్తమైనది. ఆ యభివ్యాప్తి కలిగిన ప్రదేశములో నీ వుంటివి. నీకు తత్పూర్వ పరిచితి కలదు. నీ మనస్సున కది దీపించెను. ఈ సర్వాకాశము సర్వవాయు వీధులు భిన్న భిన్నములైన తీవ్ర భావములచేత వ్యాప్తములై యుండును. తత్తద్భావములుగల యొక కార్యమో యొక మనుష్యుఁడో తదభిముఖుఁడైన యొక ప్రయత్నమో తీవ్రముగా జరిగినప్పుడు ఏ ప్రదేశమునందు, ఏ విషయ దేశదేశమునందు ఏ వాయు వీచి యందు దాని ముద్ర యున్నదో యది వంటనే నిప్పు ముట్టించిన ట్లంటుకొనును. ఇది యాకాశముయొక్క స్వరూపము. పంచభూతములయొక్క స్వరూపము. అవియన్నియు భావములచేత నిండి యున్నవి. తదనుకూల భావస్పర్శ కలిగిన వెంటనే యవి మేల్కొనును. ప్రతిధ్వనించును. ప్రతిభాసించును. ఆ వృద్ధుఁడు మఱల నిట్లడిగెను. "స్వామీ! నేను నిత్యముగా శివధ్యానము చేయుచున్నాను. శివుఁడు వీని సన్నింటిని మించిన జ్యోతిస్సుకదా! ఆ యగ్నిముం దివి యన్నియు దహించుకొనిపోవా!" శాస్త్రి యిట్లనెను. "దహించుకొనిపోవు. వీనిని దహింపగల శక్తియొక్క సమాధిదశకే గలదు. వెఱ వానికి లేదు. తక్కిన స్థితులు వీనిని స్వశక్త్యనుసారముగాఁ బ్రతిబింబించును. సమాధిప్రాయమైన బుద్ధిలో నవి భాసించును, కాని ఫలితముండదు. సమా ధ్యభిముఖమైన బుద్ధిలో

నవి వాని శక్తులను తరతమ భావములచేతం బ్రకటించును. ఉదాహరణము చూడుము. నీకా పూర్వసన్నివేశము స్మృతిపథమునందు తగులుట యొకటి. ఎన్నాళ్ళకుం గనిపించితివని నీ వనుట యింకొకటి. కనిపించుటలో నెక్కువ బాధలేదు. ఎన్నాళ్ళకుంగనిపించితివనుటలో నీకుం దత్పూర్వ పరిస్థితులం దభిమానము చావలేదని వ్యక్తమగుచున్నది" అనంగా వృద్ధుండు "స్వామీ! నా మనస్సింకను శివపదధ్యానమునందు గాఢత్వము సంపాదించికొనునట్లు చేసిపెట్టవే" యనెను. పరాశర శాస్త్రి యిట్లనెను. "ఓయీ! నీ ప్రయత్నము క్రమ క్రమముగా ఫలించంగలదు. దానికి పరమేశ్వరుని యనుగ్రహమే కారణము. పూర్వజన్మ కర్మ కారణము. అది యట్లుంచి మాకుం గావలసిన విషయమును చెప్పుము. నీ మనస్సులోం బూర్వ సంస్కృతి కలదని విస్పష్టమైనది. గిరిప్రజ పుర రాజ్యాభిమానముకూడ కొంత మిగిలియున్నచో నా కా విషయమును జెప్పుము. ఆ పురుషుం డెవరు? అతం డేమి చేసెను?" అని యడుగగా నా వృద్ధుం డిట్లనెను. "స్వామీ! నేను మా రాణిగారికి పల్లంకికావాహకులలో నొకండను. ఎవరో యెవరో యుండెడివారు. మా రాజ్యమునకు మంత్రి కలండు. ఆయన పేరు మునీకుండు. మా రాణిగారి పేరు మాహేశ్వరి. వారిద్దఱికిని విరోధముగా నుండెను. ఆమె కొక గురు వున్నాండు. వాండు యోగి. పరమశాక్తేయుండు. మా రాణిని తన వలలో వేసికొన్నాండు. ఇద్దఱికిని దగువాత తరువాత బెడిసిపోయినట్లు జ్ఞాపకము. చివరిసారి మేమా నను వింధ్య పర్వతములకుం దీసికొని పోయితిమి. అచ్చట నీయోగ

నేను చూచితిని. అతనిని చూడగా నాకు భయము వేసినది. మమ్మెవ్వరిని దేవీ మండపమువద్దకు రావద్దని రాణి యాజ్ఞా పించినది. నేను చెట్లచాటుగా పుట్టలచాటుగా వెళ్ళితిని. ఆ యోగి నావంక చూచెను. వాని మొగమెట్లున్నదనగా శాస్త్రిగారూ! వాఁడు నాకలలో కనిపించినప్పు డదే మొగ ముతోఁ గనిపించెను. అప్పుడు భయపడితిని. కలలో భయపడ లేదు. శివునిదయ నాయందు కొంతకలిగినట్లేకదా!" అని యడుగఁగాఁ బరాశరశాస్త్రి యిట్లనెను. "నిస్సందేహముగాఁ గలిగినట్లు. భయము నీ మనస్సులో నుండిపోయినట్లు. భయము పోయినదనగా శివుని యనుగ్రహము కలిగినదనియే యర్థము. అది కనిపించినదనగా మనస్సునకుఁగల సంస్కారము వదల లేదని యర్థము. ఉన్నస్థితిలోఁ గొన్నాళ్ళకు శివానుగ్రహము సంపూర్ణముగా కలుగఁగలదన్న సూచనగలదు. ఆ శాక్తే యునిపేరు జయద్రథుడని నీ కెట్లు తెలియును." అనఁగా నా వృద్ధుఁడు "స్వామీ! మహారాణియొక్క పల్లకీ మే మొక చోట దించినచో మోసెడు తక్కినవారు పనులమీఁద దూర ముగా పోయినచో నే నొక్కఁడనే రాణిగారి పల్లకివద్దనుండెడి వాఁడను. ఆమె నాతో కొంతచనవుగా మాటాడెడిది. ఒక సారి నేనా యమ్మ నడిగితిని 'తల్లీ! మీ గురువుగారు బ్రాహ్మ ణులా? యని' రాణి ఇట్లుచెప్పెను. 'ఆయన యేకులమువాఁడో మనకు తెలియదు. ఆయన క్షత్రియుఁడనుకొందును. ఆయన పేరు జయద్రథుఁడని చెప్పినాఁడు. ఇరువది ముప్పది తరము లుగా వారందఱును జయద్రథుఁడనియే తమపేరు పెట్టుకొను చుండిరట. ఆయన పూర్వులందఱు వివాహములు చేసికొన్న

వారే! ఈయనయే చేసికోలేదు. ఆ పూర్వులందఱును గొప్ప వారు. అందఱును ఖడ్గవిద్యావిశారదులు. రాజనీతివేత్తలు. బహుశాస్త్రము లభ్యసించినవారు. ఈయనకూడ నట్టివాఁడే. ఈయన వివాహమాడలేదు. ఈయన ఆ పూర్వులందరికంటె గొప్పవాఁడు. మీరు క్షత్రియులా యని నేనడిగితిని. మేము శాక్తేయులము. మాకు వర్ణ భేదములేదన్నాఁడు. మీపూర్వు లందఱు క్షత్రియులా యనికూడ నడిగితిని. ఆయన తల యూ డించినాఁడుగాని నోటితో ననలేదు. ఓయి శాస్త్రిగారూ! ఇన్నియేండ్లు జరిగిన తరువాత నాకానాటి ప్రసంగమిట్లు పూస గ్రుచ్చినట్లు జ్ఞాపకమున్నదే. ఇది మీ మహత్తనుకొందును? అనఁగాఁ బరాశరశాస్త్రి యిట్లనెను. "ఇది నా మహత్తు కాదయ్యా! నామహత్తుకాదు. ఆ జయద్రథనామక వంశ పరంపరా మహత్తు. ఓయీ! యీకాలము చాల చమత్కార మైనది. ఇదియొక దక్షిణాపథ మహావాహిని వంటిది. ఆవాహిని కూడ కృష్ణా, గోదావరీ, కావేరీ సదృశమైన వాహినికాదు. పినాకినీ ప్రభృతి వాహినులు కొన్ని కలవు. అవి యెప్పుడో ముంచికొని వరదలుగా వచ్చినప్పుడే తప్ప తక్కిన సర్వవేళల యందు కొంతమేర నీరు, కొంతమేర యిసుకదిబ్బలు. నీరును నిసుకదిబ్బలును విడిచి విడిచి యొకదాని తరువాత యొకటి యుండుచునే యుండును. నదీ వైశాల్యము యోజనముగాని యర్ధయోజనము మేరగాని యుండవచ్చును. ఒక నీటిప్రవా హము దాటుదువు. అచ్చట నొక యిసుకదిబ్బ యుండును. అది దాటుదువు. మరల నీటిపాయవచ్చును. ఇట్లు నీటి పాయలు నిసుకదిబ్బలు గడచుచునే యుండవలయును. ఇట్టిది

కాలము. ఇసుకదిబ్బలవలె నడుమ నడుమ వైదికేతరమైన పరమేశ్వరాభిముఖమైన భావములకు ప్రాశస్త్యము వచ్చుచునే యుండును. ఆ యిసుకదిబ్బ దాటినచో మరల నీటి పాయ వచ్చును. వేదధర్మమునకు ప్రాశస్త్యము నాస్తికమత విజృంభణము మార్చి మార్చి కాలమునందు భాసించుట జరుగుచుండును. ఒక్కొక్కప్పు డిసుకదిబ్బ పెద్దది. ఒకప్పుడు నీటి పాయ పెద్దది. మరియు నా నదులను జాగ్రత్తగాఁ బరిశీలించినచో నెప్పుడో నది పొంగి వచ్చినపుడుతప్ప జలస్పర్శ యెఱుఁగని పెద్ద యిసుకలంక లుండును. ఆ యిసుకలంకలను నదీప్రవాహము పదేండ్లకొకసారి పదునేనేండ్ల కొకసారి ముంచవచ్చును. తక్కినయప్పు డాలంకలలో సేద్యము చేయుదురు. ఆ లంకల స్వరూపమెట్టిదనగా నచట పండెడు పంట నదీజలపూరితమైన ప్రదేశములయందు క్షేత్రములయందుఁ బండెడు పంటకు పదిరెట్లిరువది రెట్లుండును. లోకములోఁ గొన్నిచోట్ల వైదిక మతేతరమైన సంప్రదాయ విశ్వాసములు గలచోట లక్ష్మియుఁ బరాక్రమమును రాజనీతియుఁ గొన్ని వందల రెట్లుగా భాసించుచుండును. అవి యీ కాలప్రవాహము నందలి లంకలు. పదియేండ్లకు నది పొంగి వచ్చినట్లు కొన్ని వందల యేండ్లకో వేల యేండ్లకో నాలంకలు సర్వము ప్రళయ సముద్రమునందు మునిగిపోవును. ఒకసారి నదీప్రవాహము వచ్చినచో ప్రవాహము తీసిన తరువాత నాలంక యచట నుండునో యుండదో తెలియదు. ఆ నదీప్రవాహమా యిసుక లంకను పెల్లగించి మఱియొకచోట చేర్చును. అచట మరల సస్యములు పండించుటకు ప్రారంభింపఁబడు

టకుఁ గొన్ని యేండ్లు పట్టును. ఈ మహాకాల ప్రవాహములో రాజ్యములు దేశములు లిట్టివి. భారతదేశము నిత్యముగాఁ బ్రవహించు నదిపాయ వంటిది. ప్రక్కనున్న యొక లంకవలె మ్లేచ్ఛ దేశములు సంపచ్ఛౌర్య కుటిల రాజనీతి ప్రముఖ మహా ప్రతిభలతో విరాజిల్లుచుండును. వానినిఁ జూచి సహజ నదీజల పరిపుష్ట క్షేత్రవాసులు భ్రాంతి పొందుచుందురు. చూచితివా! సహజనదీజల ప్రవాహము క్రింద సేద్యమగు చున్న నేల యుగ యుగములుగా సేద్యమగుచున్నది. అచట భూదేవి పతివ్రతవలె దుర్వ్యాపములు వేయదు. సత్సంతాన మును కనును. ఆయమకు మొగమునకు లోధ్రప్రసవ పరా గమక్కఱ లేదు. చెక్కిళ్ళయందు మకరికా పత్రము లక్కఱ లేదు. పెదవులకు లత్తుక యక్కఱలేదు. తినుటకు ప్రాసంగు ధాన్యము మొదలైన వక్కఱలేదు. జొన్నలు దంపికొనును. తినును. ఆముదముతో దీపము పెట్టికొనును. అసహజమైన జలప్రవాహముచేత నామెకంటె ముబ్బడి నలుబడిగా పండు చున్న క్షేత్ర లక్ష్మి యున్నదే! యామె పోయెడి యొయ్యా రములు, హేలలు, విలాసములు, పట్టరాకుండ నుండును. అందుచేత భారత దేశము కాని యితర దేశములందు నీ కాల వాహిని పెట్టిన లంకలలోఁ బండెడు నాగరకతా సస్యము విపరీత లక్షణము కలదిగా నుండును. అదియంతయు నశించి యీ సహజ ప్రవాహములోననే కొన్ని యొగుడు దిగుడులు వచ్చును. ఆ నీటినడిపాయ యీ వేసంగిలో నీ యొడ్డునం దుండును. ముందు నాఁటికా యొడ్డునం దుండును. ఇంకొ కప్పుడు సరిగా వేణీమధ్య భాగమునం దుండును. అందుచేత

నసలు ప్రవాహము ప్రవాహముగానే యుండును. అసలు ప్రవాహమనుకొన్నది కూడ నటు నిటు తోcంగవచ్చును. అందుకనియే ఆ జయద్రథునకు పట్టులేనిచోట పట్టు దొరకు చున్నది. ప్రవాహము వైచాలcగుచున్నది. ఆ ప్రవాహము యొక్క నడుమనే తానస్థిడప్పు డిసుక దిబ్బలు వేయు చున్నాcడు. కలి ప్రవేశించిన తరువాతc డానొక యిసుక దిబ్బ వేయుటకు వేయియేండ్లు పట్టినది. తరువాత నూరేండ్లు మాత్రమే గడిచినది ఇంత తొందరలో మరల నొక యిసుక దిబ్బ వేయుటకతcడు ప్రయత్నము చేయుచున్నాcడు. కాలము వాని కనుకూలముగా నున్న ట్లున్నది. అంత యనుకూలముగా నున్నదని చెప్పుటకు వీలులేదు. అంతటి యానుకూల్య మున్నచో నే నెందుకుందును. నేను బ్రతికి యున్నన్నినాళ్ళు వాని యానుకూల్యమునకు సౌముఖ్యము లేదు. నే నింకెన్నాళ్లు బ్రదుకుదునో నాకు తెలియదు. పదేండ్లో యిరువది యేండ్లో? ఆపైన వాcడు మరల దిబ్బ పెట్టినట్లే యున్నాcడు. ఇంత కును జయద్రథుc డతcడా! రేపతనితో మాటాడెదను. ఇది వఱకు నా కానుపానులు చిక్కలేదు. ఊరకే బూకరించితిని. అతcడు నావలలో పడినాcడు. రేపు వాని సర్వస్వరూప మును నీవు చెప్పిన మాటలమీcద వానివద్దనుండి లాగి గ్రహించెదను."

# ౯

పరాశరశాస్త్రి రాణిగారి యనుజ్ఞతోఁ దా నొక్కఁ డును పోయి రాజువద్దఁగూర్చుండెను. కొంతసేపటికి రాజి ట్లనెను. ఆ వృద్ధుఁ డేమని చెప్పెను? నా పేరు జయద్రథుఁడని నేనే చెప్పితినిగదా? వానివలన నీకుఁ దెలిసిన క్రొత్తవిషయ మేమి? మా పేశ్వరికిని నాకును విరోధమనియా? వాఁడు పల్యంకికా వాహకుఁడనియా? ఇవి తెలిసినంతమాత్రమున నాతోఁ బ్రసంగించుటకు నీ కొనగూడిన యధికమైన సదు పాయ మేమి? నన్నడిగినచో నేనే చెప్పుదునుగదా!" అనఁగా బరాశరశాస్త్రి "నిన్నడిగినచో బాగుగా నుండునా? ఇప్పుడు నే నతని వద్దనుండి యివి యన్నియుఁ దెలిసికొని వచ్చితిని గనుక నీవు నన్నడిగినచో నేను చెప్పెడివాఁడను గదా యనుచున్నావు. అప్పు డడిగినచో భీష్మించుకొని కూర్చుండెడివాఁడవు. ఎవనినో మనము రెండావులు కావలసి వచ్చి, లేదా యొక గరిసెడు ధాన్యము కావలసివచ్చి యడు గుద మనుకొందుము. వాఁడు మనకుఁ గావలసినవాఁడు. అడిగినచో వాఁడీయఁడని మనకుఁ దెలియును. పరు నెవరినో యడిగి తెచ్చికొందుము. అప్పుడీ కావలసినవాఁడును, లోభియునైన వాఁడును, తా ననునుగదా 'ఈ మాత్రమునకుఁ బరాయివానిని బోయి యేల యడుగవలయును? నను నడి గినచో నే నీయక పోయితినా?' యని ఇది లోకము. నీవును

లోకములోని వాఁడవే'' అని పరాశరశాస్త్రి యనఁగా రాజు చాలసేపు మూన మవలంబించెను. జయద్రథుఁ డిట్లనుకొనెను. 'వీఁడు గడుసువాఁడు. వీనిని దేలికగా గగ్గోలుపఱచుటకు వీలులేదు. వీనిని నెమ్మదిగనే సాధించవలయును' అని మఱియు నిట్లనెను. "ఓయీ! నేను లోకములోనివాఁడను కాను. నీవే చూడుము. నా సంగతి నీకుఁ దెలియదు. ఎవరో ఆనాఁటి యొక వ్యక్తిని దర్శించి వానివలన నా సంగతి తెలిసికొనవలయునని నీవు నీ మనస్సులో తర్జన భర్జన పడితివి. నే నిచ్చటనుంటిని. నే నీ రాజు నేక దేశమునం దాక్రమించితివి. అనఁగాఁ బరాశరశర్మ "నా కదియే యాశ్చర్యముగానున్నది. ఈ రాజు శివపూజా ధురంధరుఁడు. ఆయన జీవుని నీవు కొంత తొలఁగించి యెట్లు ప్రవేశించఁ గలిగినావని." అనఁగా జయద్రథుఁడు "ఓయీ! శివుఁడు - గివుఁడు నాయుందు పనికి రాఁడు" అనెను. పరాశరశాస్త్రి "నీ విరోధము శ్రీకృష్ణుని మీఁదనే యనుకొంటినే శివునిమీఁదఁ గూడనా!'' అనఁగా జయద్రథుఁడు "ఆ శివుఁడును కృష్ణుఁడును వేఱువేఱని యనుకొను నంత యవివేకము నాకు లేదు." అనఁగాఁ బరాశరశాస్త్రి "ఓయి జయద్రథా! నీ వింతటి వివేకివి. నీ కీయవివేక మేల పట్టినది?'' యనఁగా జయద్రథుఁడు 'పిచ్చివాఁడా! ఆ శివుఁడును ఆ కృష్ణుఁడును, నన్ను మించినవారు కారు. వా రెంతటివారో నే నంతటివాఁడను. వారు కాలస్వరూపులు. నేను కాలస్వరూపుఁడను. వారుసర్వజ్ఞులు. నేను సర్వజ్ఞుఁడను. వారు శత్రుహనన క్రియాచండులు. నేనును దాదృశుఁడనే. నే నిచ్చట నుంటినిగదా! నీ వేమి చేయుచున్నావో నా

కన్నియుఁ దెలియును. ఆ వృద్ధునివద్దకుఁ బోయి నా సంగతి తెలిసికొని వచ్చితివని చెప్పితివికదా! మఱియు నింకొక సంగతి చెప్పుమందువా! నీవు వింధ్య పర్వతమునకు నల్వురిని బంపించితివి. వారా దుబ్బులను పెల్లగించి వాని క్రిందిదుంప లను దెత్తురు. ఆ దుబ్బులనుగూడ రుబ్బించి గంగలోఁ గలు పుము. నాకు చాల యభిమతమైన విషయమునుమా యది. ఓయీ! గంగా ప్రవాహము పోయి యెచ్చటఁ గలియును? సముద్రములోఁ గలియును. ఈ గంగపోయి సముద్రములోఁ గలియుచో నెచ్చట? అచ్చటినుండి నా శక్తులు భారత దేశము మీఁద వచ్చి విరిచికొని పడును. నా శక్తు లెట్టివో అవి యెప్పుడు వచ్చునో నీకుఁ దెలియదు. నాకుఁ దెలియును" అని జయద్రథుఁ డనఁగాఁ బరాశర శాస్త్రి "నీకును దెలియద" నెను. రా జింతవఱకు మాటకు మాట చెప్పుటయేగాని నవ్వ లేదు. ఇప్పుడు నవ్వెను. ఆ నవ్వు చాల విలక్షణముగా నుండెను. రా జెట్లు నవ్వెనో పరాశర శాస్త్రికిఁ దెలియదు. అయినను నేటి నవ్వు రాజు నవ్వు కాదనిపించెను. "రాజు నవ్వగా నతని పెలవులు క్రిందికిఁ బోవునా? చప్పిదవడలవాఁడు నవ్వినట్లు క్రింద పెదవి పైకిఁ జొచ్చుకొని పోవునా? కంటిచివరలు పైకి మఱలునా? రెప్పలలో నడుమ నుండలుగా కట్టి కనుగ్రుడ్లు మీఁదికి వ్రాలునా? వీఁడు చాల చక్కని పిశాచము" అను కొను చుండగా రాజు మఱల నిట్లనెను. "నాకును దెలియ దనఁగా నేను బెదరి నీకుఁ జెప్పుదు ననుకొంటివా? నేను సర్వజ్ఞుఁడనని నీకుఁ జెప్పలేదా? యనెను. పరాశర శాస్త్రి యిట్లనెను. "ఓయి! జయద్రథా! నీవంటివారు తమ్ముఁ

దాము మోసగించికొనుటలో నిష్ణాతమైన ప్రజ్ఞకలవారు. నీ సర్వజ్ఞత్వ మెట్టిదో నేను చెప్పఁగలనా? నీవును నీ కులము వారును వేయి యేండ్లుగా నొక ధారగా వచ్చుచున్నారు. భగవంతునిమీఁదఁ బగ పట్టినారు. ఆ పగపట్టిన హేతువుచేత నీ జీవలక్షణమునం దొక విశిష్టత యేర్పడినది. సృష్ట్యాది యందు ప్రజాపతి బహు జీవులను సృష్టించెను. అందులో రాక్షసు లున్నారు. పిశాచము లున్నవి. భూతములు కలవు. రాక్షససృష్టి దేవతాసృష్టితో సమకాలమునందు జరిగినది. దేవతలకున్న జ్ఞానము రాక్షసులకు నున్నది. దేవతలకుఁగల కామరూపత్వము వియద్యానము మొదలైనవి రాక్షసులకుఁ గలవు. ఇద్దఱకు నొక్కటియే భేదము. దేవతలు వేదాశ్రయులు, శ్రౌతకర్మాభిరతులు. వేదధర్మనిష్ఠులు, శ్రీకృష్ణచరణాంబుజ ధ్యానపరులు. రాక్షసులు వీనికంటె భిన్నులు, మఱియు వేద విరోధులు. కుత్సిత కర్మాభిరతులు, శివభక్తులు, శివభక్తు లనుటలోఁ గొంత భేద మున్నది. వారి శివభక్తి విలక్షణ మైనది. శివుఁడు సర్వచైతన్య స్వరూపుఁడని, సర్వజీవ సమాహారభూత ప్రథమచైతన్య లక్షణవంతుఁడని వారికిఁ దెలియదు. ఆయన మూర్తినే వా రారాధింతురు. వారు లింగధారుల కంటెఁ గనిష్ఠులు. లింగధారులకుఁ బిండీభూతమైన శివమూర్తి యైనను దోఁచును. వారికిఁ బరిణామముఁ బొందిన త్రిశూల ధారియు నందివాహనుఁడును, సోముఁడును, చంద్రమః కిరీటుఁ డును నైన శివమూర్తియే తెలియును. వీరికంటెఁ ద్వాదృశు లయిన జీవులు భిన్నులు. నీవంటి జీవులు సృష్ట్యాదియందు లేరు. సృష్టి గడువఁగా గడువఁగా బహు నూతనములైన

విషయములు సృష్టియందు సంభవించుట సహజమైన లక్ష
ణము. అనాదిలో బ్రాహ్మణులే యున్నారు. రజస్తమో గుణ
ముల యభివృద్ధియు, సాంకర్యమును గలుగుటచేఁ జాతు
ర్వర్ణ్య మేర్పడినది. తరువాత తరువాత నొక కులమేమిటి?
చెప్పరానన్ని కులములు బయలుదేరినవి. ఈ లోకమునందు
నీ యిష్టము వచ్చినన్ని ప్రదేశములనుఁ బరిశీలింపుము.
మానవ శరీరమునందు సన్నిహితము లగుచున్న రోగములనుఁ
బరామర్శింపుము. ధన్వంతరి యెప్పు డవతరించినాఁడు?
సముద్ర మథన వేళయం దవతరించినాఁడు. సముద్ర మథన
మెప్పుడు జరిగినది? ప్రథమ మన్వంతరమునందు కాదు.
కొన్ని మన్వంతరములు జరిగినతరువాత జరిగినది. అంతవఱకు
భూలోకమునందు వ్యాధులు లేవా? ఉన్నవయ్యా! ఉన్నవి.
వాని స్వరూపము వేఱు. ఈ సృష్టి కొన్ని కోట్ల సంవత్స
రములు జరిగిన తరువాత కుటిల కుటిలములైన విధుర
విధురములైన లక్షణములు బయలుదేరినవి. అప్పుడే
యేమైనది. ఇంతవరకు కాఱు మన్వంతరములే కదా జరిగి
నది. ఎన్ని జరిగినవో మఱి యన్ని జరుగవలయును. ఇది
వఱ కెన్ని కలియుగములు నడచినవి. వానిలో భగవంతుఁడు
శ్రీకృష్ణుఁడై జన్మించెను. నీవంటివాఁ డప్పుడు లేఁడు నీవు
పొడిచికొనివచ్చిన కొమ్మువంటివాఁడవు. రామావతారము
కల్పకల్పమునకు వచ్చుచునేయున్నది. ఈ కల్పమునందు జరి
గిన రామావతారకథ వేఱు. పూర్వకల్పములందు జరిగినది
వేఱు. పూర్వకల్పమునందు - పద్మకల్పమునందు రాముఁడు
సేతుబంధనము చేయలేదు. శివుని ధ్యానించెను. కరుణావ

శ్వ్యాయ కిరణకిరీటుఁడైన పరమేశ్వరుఁడు తన పినాకమును సముద్రముమీఁద మహేంద్రగిరి మొదలు లంకాపట్టణతీరము వఱకువాల్చెను. వానరులు పినాకముమీఁద నడచిపోయిరి. మఱియొక కల్పమునందింకొకవిధముగా జరిగినది. చూచితివా! ఈ మహాకాలమునందు గడచిన కొలఁది యలుపవు టలుపవు టూహాలు విజృంభించును. భగవద్విరోధ మభివృద్ధి చెందును. నాస్తికత మఱియు మఱియు నట్టలు కట్టును. తార్కికశక్తి విడిలిపోవును. అవయవ రహితమైన యనుమానములు విజృంభించును. ఓయీ! నాస్తికత నీవు క్రొత్తగా కల్పించినది కాదు. యుగములక్రింద బృహస్పతి నిర్మించినది. అతనినాస్తికత వేఱు. నీ నాస్తికత వేఱు. ఇంకను నీకంటె బుద్ధిమంతులు పుట్టుదురు. వారి తర్క మెట్లుండుననగా- భూతమే లేదు. ఉన్న దంతయు వర్తమానమే-యందురు. భవిష్యత్తులేదని మాత్రము పాపము! వారనరు. భూత భవిష్యత్తులయొక్క రెంటిజ్ఞానము సమానమే. రెండు నవిజ్ఞాతములైన విషయములే. వారాశాజీవులు కనుక భవిష్యత్తును మన్నింతురు. మంటిజీవులు కనుక భూతమును మన్నించరు. నీ సర్వజ్ఞత్వలక్షణ మెట్టిదో చెప్పెదను వినుము. ఈ నీ సర్వజ్ఞత్వము పరమేశ్వరభావమునందుఁ గల సర్వజ్ఞత్వము వంటిదికాదు. సత్వ రజస్తమో గుణములు మూఁడుకలవు. సత్వగుణము సర్వజ్ఞమైనది. రజోగుణమునందలి జ్ఞానము దానికంటెఁ దక్కువది. తమోగుణమునకు జ్ఞానమేలేదు. జ్ఞానమే లేదనగా జ్ఞానసంబంధమైన వాసన యుండును. ఆ వాసనయే జ్ఞానమనుకొని తమోగుణ మహంకార దూషితమై విడంబించుచుండును. ఆవాసనకుఁగూడ

నొక యభివ్యాప్తి యున్నది. సృష్టిలో నిదియొక చమత్కా రము. ఒక వస్తు వెంతమేరఁ దాను వ్యాపించియుండునో అంత మేర దనకుఁ దా నది తెలిసికొనఁగలశక్తి యిప్పుడు చెప్పిన వాసనారూపమైనది, యథార్థమైన వివేకముకానిది వివేకా భాసమైనది యుండును. తన వ్యాపించిన పరిమితమైన ప్రదేశ ములోఁ దనకుగల యీ శక్తిని పురస్కరించుకొని యీ ప్రదే శములో నున్న భిన్నములైన ప్రదేశములందలి ఖండదేశము లందలి తన యీశక్తియొక్క వ్యాపించుట తెమోగుణము సర్వజ్ఞత్వమనుకొనుట. నీవొక ధూమరూపుఁడవు. ఆధూమము నందు భగవద్విరోధభావమును వ్యాపింపఁజేసితివి. తద్భావ సహితమై యాధూమమునకు పూర్వోక్త తమోలక్షణమైన యొక వివేకవాసననలదు. ఆ వివేకవాసన దధూమవ్యాప్తికల సర్వప్రదేశమునందు వ్యాపించియుండును. నీ కీవాసన యెందు కున్నదో చెప్పుదునా? నీవు రాజునందు ప్రవేశించితివి. రాజు యొక్క జీవలక్షణ మున్నది. ఆ రాజుయొక్క జీవమునకు తద్వాసన కప్పఁబడియున్నది. నీకంటె భిన్నమైన జీవలక్షణము కలవాఁడు రాజు. అతనిలో నున్నంతసేపు నీ కీపూర్వవాసన భాసించుచుండును. నీవు రాజుయొక్క జీవముకంటె భిన్నుఁ డవుగా నున్నావుకదా! ఈశరీరముతో నీకు సమైక్యములేదు కదా! ఒక శరీరముతో సమైక్యము కలిపించుకొను లక్షణ సన్నికృష్టతా సంపాదకమైనచోట నీవు ప్రవేశించుము. నీకీయభి వ్యాపనాజ్ఞానము పోవును. ఎవఁడో వచ్చునంటివి. వానినినేను రానీయలేదు. అది నీ యీ తెలివికి హేతువుగా నున్నది. నీ విప్పుడు విలక్షణమైన ప్రేతగత జీవాకృతివి. ఈ స్థితిలో నీ కా

జ్ఞానముండును. నీ విప్పు డేకార్యమును జేయలేవు. ఇప్పు డిట్లున్న నీకు క్రియాచరణ శక్తిలేదు. క్రియాచరణశక్తి నీకుఁ గలుగవలయు ననఁగా నీ దనుకొన్న శరీర మొకటి నీకుఁ గావలయును. ఆ శరీరముతో నైక్యము పొంది ఆ శరీరమే నే ననుకొన్న బిట్టు భ్రాంతి విడంబించినపుడు నీవు లౌకిక క్రియాదక్షుఁడ వగుదువు. ఇది యిప్పటి నీ విజ్ఞాన సర్వజ్ఞతా భ్రాంతి లక్షణము." రాజు మాటాడలేదు. పరాశరశాస్త్రి యానాఁటికి వెడలిపోయెను. మఱునాఁడు మఱల వచ్చెను. రాజతనినిఁ జూచి మొగమటు త్రిప్పుకొనెను. శాస్త్రి యి ట్లనెను. "నిన్న నేను నీవు సర్వజ్ఞుఁడవు కావని చెప్పినందులకు నామీఁద నీకుఁ గోపముగా నున్నది. ఓయి జయద్రథుఁడా! నీ వల్పుఁడవు కావు. గొప్పవాఁడవు. కాని పరమేశ్వరుఁడవు కావు. కాని వేయియేండ్లు నీ వేకధాటిగా నొక తపస్సు చేసితివి. ఆ తపస్సుయొక్క ఫలితముగా నీకుఁ గొంత జ్ఞానము కలిగినది. నీవు సుమారు తొమ్మిదివందల యేండ్లక్రింద నాంధ్రుల రాజధానిలోఁ గొంత నీతి నెఱపితివి. నీ జ్ఞానములో నీ వెత్తిన పది పదునొకండు జన్మలలోని నీ వివేకము పరామర్శించి పోల్చికొను జ్ఞానముకూడ నీకున్నచో నానాఁటినీకు నీవు సర్వజ్ఞుఁడవన్న భావము కలదా? ఈనాఁడు నీవు సర్వజ్ఞుఁడ వనుకొనుచున్నావు. ఆనాఁడు కావుగదా! అట్లు నీవనుకోలేవుగదా! ఆనాఁటి నీ యాంధ్ర రాజధానియందలి పరిచయమేగదా నేఁడు మా యువరాజును నాంధ్రరాజదుహితనిచ్చి పెండ్లి చేయించవలయునన్న యూహకు హేతు వైనది." అనఁగా రాజు "ఆ మాటయన్నది నేను కాదు. నీవే

యంటివి. నేననలేదు. నేను మాటాడలేదు." అనెను. పరాశరశాస్త్రి "ఓయి జయద్రథా! నేను నీకోర్కె కాద నుట యెందులకు? నీ వా రాజదుహితను తెచ్చి శిశునాగునకుఁ బెండ్లిచేయ నెంచుచున్నావు. నీ యిష్టమే కానిమ్మని నే నా సంబంధమును జెప్పితిని." అనఁగా రాజుఁ "నాకట్టి యూహ యున్నదని నీకెట్లు తెలియును." అనఁగా పరాశరశాస్త్రి "ఎట్లు తెలియునో చెప్పినచో నేనుగూడ సర్వజ్ఞుఁడ నగుదును గదా! నాకుఁ దెలియును. నాకుఁ గొన్ని తెలియును. కొన్ని తెలియవు. నీకు నట్లే కొన్ని తెలియును, కొన్ని తెలి యవు. ఓ జయద్రథా! ఆ రాత్రి శిశునాగుఁడు పోయి కూర్చున్నచోట నా పురుషుఁడు కూర్చుండెను. అతఁడు వచ్చును, నీవు రాజు శరీరమును వదలి వానిలోఁ బ్రవేశింత మనుకొంటివి. అతఁడు రాఁడు. అతఁడు రాకుండఁ జేసితిని. అతఁడెప్పుడు వచ్చునో నాకుఁ దెలియదు. నే నెప్పుడు మర ణింతునో యతఁడప్పుడు వచ్చును. అతఁడు వచ్చినంతనే నీవు రాజు శరీరమును వదలిపోవుదువు. రాజు మరణించును. రాజ్యము శిశునాగునకు వచ్చును. ఓయీ! మగధరాజ్య మును సమాక్రమింప వలయునని నీ యూహ కాని కాశీనగర మును సమాక్రమింప వలయునని కాదుగదా! అందుచేత నేనిట్లు చేయుచున్నాను. ఆ శ్మశానము వద్దనున్న నాల్గు దుంప లను సర్పాకృతితో దొంగిలించి వానినిఁ గొనిపోయి యాంధ్ర రాజ దుహితాత్మయందు తద్ధూమశక్తి నింపితివిగదా! నా కొక సంగతి తెలియును. సుమారొక వేయి యుచ్ఛ్వాస ములు రాజదుహితచేత పీల్పించితివి. వేయి యెందుకు

పిల్పించితివి? దాని యర్థమేమి? అది నాకుఁ తెలియదు. కాని నీవీ పనిచేయించితివని నాకుఁ దెలియును. అందుచేత నే నేను సర్వజ్ఞుఁడనని నీవనుకొనుటకు వీలున్నదని చెప్పితిని. ఆ వేయి యుచ్చాపముల వెంట కుంభీ భూతమైన యా ధూమము రాజదుహితచేత నెందుకు పిల్పించితివో నాకుఁ దెలియదు. అందుచేత నేను సర్వజ్ఞుఁడను కాను, నీకుఁ దెలియునా? అందు చేత నీవును కావు." అనఁగా రాజు నాకుఁ దెలియు ననెను. పరాశరశాస్త్రి నీకుఁ దెలియదనెను. రాజు నాచేత దాని యర్థమును జెప్పించుటకు నీవిట్లు వాదించు చున్నావనెను. పరాశరశాస్త్రి "నీ వర్థమును చెప్పెదవు, నాకు వచ్చిన లాభము లేదు. నీకు వచ్చిన లాభములేదు. ఒకవేళ నీకది గూడ తెలిసినను నీవు సర్వజ్ఞుఁడవుకావు. సర్వజ్ఞుఁడనైనచో నేనింకొకపని చేయఁ బోవుచున్నాను. నీకు సంబంధించిన పనియే. అది యేదో చెప్పుము." అనఁగా రాజు "నాకు సంబంధించిన దనగా నాకు సంబంధించినవి వంద విషయములు కలవు. అందులో దేనికి సంబంధించినది?" అనెను. శాస్త్రి "ఫలానా దానికని చెప్పినచోఁ దెలియక పోయినను నూహ చేయవచ్చును. చేయుము. ఈ ధూమకాష్ఠములను గుఱించి నదే!" అనఁగా రాజు మఱల నవ్వెను. ఇట్లనెను. "ఓయీ! నీవా యిఘవది దుంపల నేమి చేసెదవు?" శాస్త్రి "నీవా దుంపల నెందుకు కొరుక లేదు?" రాజు:- నే నచ్చటికిఁ బోవు టకు వీలులేదయ్యా! దేవి నన్ను శపించినది. నీవిచ్చోటికి వచ్చితివా! నీ జీవునిఁ గొనిపోయి యంధతమస లోకము లందు ప్రవేశింపఁ బెట్టుదుననెను. అందుచేత నేనచ్చటికిఁ

బో లేదు. ఆ దుంపలతో నాకు సంబంధము లేదు. నీ వేమి చేసి కొన్నను సరియే. అనఁగాఁ బరాశరశాస్త్రి "నాకాసంగతి తెలియును. దేవి శపించెనని తెలియదుగాని నీవు వాని జోలికి పోవుటకు నేదో యభ్యంతరముండి యుండవలయునని యను కొంటిని. చూచితివా? సర్వజ్ఞుఁడైనవాఁడు సర్వశక్తి మంతుఁడై యుండును. నీవు సర్వశక్తిమంతుఁడవు కాదు గదా! సర్వజ్ఞుఁడవును కాదు. సర్వశక్తియు నెవరు? పరమేశ్వరి. ఆమెయే సర్వజ్ఞురాలు! ఆమెయే సర్వశక్తి, శివుఁడును కృష్ణుఁడును ఆమెయు నీ ముగ్గురు నొక్కటియే స్వరూపము. అందులో నొక మూర్తియైన కృష్ణునితో నీవు విరోధించు చుంటివి. ఒక మూర్తియైన శివునిఁ దక్కువగాఁ జూచుచుం టివి. ఒకదానికొకటి పొసఁగుట లేదు." అనెను. రాజు ఆ యిరువది దుంపలనేమి చేయును వనెను. పరాశరశాస్త్రి నే నింకను వానిని గూర్చి యూహించుట లేదు. అవి నాస్వప్నకు రాలేదు. వచ్చిన తరువాతగాని నేను వానితో నేమి చేయు దునో తెలియ దనెను. రాజిట్లనెను. "సరేగాని నీ యీ రహస్య మును నాకుఁ జెప్పుచుంటివేమి?" అనఁగాఁ బరాశరశాస్త్రి యిట్లనెను. "నీవ నెడివాఁడ విప్పుడు లేవు. ఇప్పుడున్నది రాజు. ఆరాజు నేను చేసెడు పనికి నడ్డు తగుల లేఁడు. నీవం తకు ముందు చేయ లేవు. నీ మాటవినెడి పరిచారకుఁడు లేఁడు. ఆ పరిచారకులు నీవొకఁడ వున్నావని తెలిసినచో రాజునే రాజుగా చూడరు. ఆ పురుషుఁడు వచ్చినచో వాఁడు శిశు నాగునిద్వారా నా కార్యమునకు భంగకారి కావచ్చును. నీవు వట్టి జీవుఁడవు. కానిచోట నుంటివి. శరీరమునఁదు,

సంములో నొక స్వశరీరమందు నభివ్యాప్తి కాంచని జీవుఁడు క్రియాదక్షుఁడు కానేరఁడు. నీకీసంగతి నిన్నఁ జెప్పితినికదా! అందుచేత నీవన్నచో నాకు భయము లేదు. అనఁగా రాజు నీవేమిచేయు దువో చెప్పుము. నా శాస్త్రి నీవు సర్వజ్ఞుఁడవు గదా నీవే చెప్పికొమ్మనెను. రాజు "ఓయి పరాశరశాస్త్రీ! నీవు వట్టి పరాశరుఁడువు కావు. పారాశర్యుఁడవు" పరాశర శాస్త్రి యిట్లనెను. "వ్యాసమహర్షియందు నీకంత గౌరవ మున్నదా! అందుకనియేనా యాయన భారతములో, భాగవతములో నెవనిని బరమేశ్వరుఁడుగా నిర్ణయించెనో యాయనకు విరోధము పూనితివి" అనెను. రాజు నాకును వ్యాసునకు నేమి సంబంధము ? నేను కాలస్వరూపుఁడ" ననెను. పరాశర శాస్త్రి "నీ స్వరూప మెట్టిదైన నాకేమిగాని నీవు తలఁచుకొన్న వ్యవహారము నీ వనుకొనునట్లు సాగుట లేదు. నే ననుకొన్న వ్యవహారము నే ననుకొన్నట్లు సాగుట లేదు. నాకుఁ గొంత యనుకూలముగా నున్నది. నీకుఁ గొంత యనుకూలముగా నున్నది. ఒక పని జరుగఁబోవునట్లు కనిపించుచున్నది. ఆ పని నీ వనుకొన్నంత తొందరలో కాదు. అది జరుగుట కాలస్యము చేయఁగల్గుదును, కాని నే నంతకంటెఁ జేయఁగలిగినట్లు కన్పించుట లేదు. నీ కాలస్య మగుచున్నది. ఆ యాలస్యమగుటయే నేను చేయఁగలిగిన పని. అందుచేత మన మిద్దఱమును గలిసి యా కార్యము నట్లు సాగనిత్తము. నీ వాంధ్ర రాజ దుహితను తెచ్చి శిశునాగునకు వివాహము చేయించుము. తరువాత నేమగునో చూతము. అనఁగా రాజు "నాకది యభిమతమే" యనెను. ఇద్దఱు నంగీకరించిరి.

పరాశరశాస్త్రి వెడలిపోయెను. జయద్రథుఁడు సర్పాకృతితో నా దుంపల నెట్లు కోరికెనో యాఁడనకుఁ దెలియదు. అతఁడు సర్పాకృతి నెట్లు పూనెను? ఆ పురుషుఁ డెవరు? ఈ రెండు విషయములయందు పరాశరశాస్త్రి కేమియు నభిజ్ఞత కలుగలేదు. జయద్రథు నడిగినచో చెప్పఁడు. ఒక్కటి మాత్రము విస్పష్టమైనది. ఆ జయద్రథుఁడు శిశునాగునికంటె నధికమైన ధూమశక్తి జీవమునం దిమిడించుకొన్నవాఁడు. అంతకంటె మించిలేదు. ఆ పురుషుఁడు వచ్చుట యెందులకు? వానిలో జయద్రథుఁడు ప్రవేశించుట యెందులకు? ఆ పురుషుని జీవుఁ డేమగునో ఆ పురుషుఁడు వేఱు - జయద్రథుఁడు వేఱు కదా? ఇచ్చట రాజుయొక్క జీవలక్షణమునకు తన జీవలక్షణమునకు భేద మున్నది. పరకాయ ప్రవేశము చేసినట్లు తానిచ్చట వ్యవహరింపలేఁడు. రాజు చనిపోలేదు. అందుచేత పరకాయ ప్రవేశవిద్య యిచ్చట సాధ్యముకాదు. భూత మావేశించిన ట్లావేశించెను. ఏకదేశమం దావేశించెను. ఆ పురుషుఁడు రాజుకంటె భిన్నుఁడు. వాని జీవుఁడు సర్వథా జయద్రథున కొదిగియుండును. జయద్రథుఁడు వానియందుఁ ప్రవేశించినచో వానికి స్వాతంత్రమైన జీవలక్షణమే యుండ దన్నమాట. అట్లు వానిని జయద్రథుఁడు తీర్మానించెను. ఆ పని నెట్లు చేసెను? ఇతఁడు సర్పాకృతితోఁ బోయి యా దుంపలను కోరికెను. సర్పాకృతితోఁ నెట్లు పోయెను? ఏదియో మృతమహా భుజంగ ముండవలయును దానియం దితఁడు పరకాయ విద్యచేతఁ ప్రవేశించవలయును. ఈ రాజనగరమునందు నెవరైనఁ జనిపోయినచో వారియం దితఁడు

ప్రవేశించునేమో! నేనుండఁగాఁ బ్రవేశించఁడు. నేను వెంటనే వానిని గుర్తు పట్టెదనుగదా! ఆ భయముతోఁ జేయఁడు. అది యట్లుండగా నితఁడాదుంపలను త్రిలింగ రాజధానికిఁ గొనిపోయెను. ఆ కొనిపోవుట చాల శీఘ్రముగాఁ గొనిపోయెను. ఆ స్వరూపముననే కొనిపోయెనా? లేనిచో వాని నెట్లు కొనిపోవును? ఆ సర్పము నాల్గు కాష్ఠములను తనయొక్క నోటితో నెట్లు కరచుకొని పోయెను? అది నాల్గు తలల పామా? ఇదియంతయు విస్మరాని సమస్యగా నున్నది. శిశునాగునిచేత నా మూల భూతకాష్ఠ ధూమాగ్ని పీల్పిం చుటకు నొక పురుషుఁడు వచ్చెను. అది ధ్రువము. ఒకవేళ నా కాష్ఠములను తద్భుజంగమే యక్కడకు కొనిపోయినచో యా యుద్యాన వనములో నొక పురుషుఁ డుండవలయును. వాఁడీ కాష్ఠములకు నిప్పు ముట్టించ వలయును. ఆ ధూమ మును కృతకముగా రాజదుహితృ నాసా గోళములయం దెక్కించవచ్చును. అక్కడి పురుషుఁడెవఁడు? ఈ సర్పము పోయి వాని కీకాష్ఠము లందించవలసి యుండెను. ఆపురుషుఁడే యీ పురుషుఁడా! అయిదు దినములలో వీఁడు కృష్ణానదీ తీరమునకుఁ జేరఁగలఁడా? వేగరియైన రాజభటుఁడు పదునేను దినములు నడువవలయును. వాఁడు నాల్గు దినములలో నెట్లు వెళ్ళెను? వాని మొగమునుఁ జూచినచో వాఁడు శవప్రాయుఁ డుగా నున్నాఁడని శిశునాగుఁడు చెప్పెనా? కాదు కాదు. నేను చూచితిని. వాని కంటెటి వేగ మెట్లు వచ్చెను? లేక వాఁ డింకొక పురుషుఁడా? అక్కడ నొకనిని జయద్రథుఁడు సిద్ధముగాఁ జేసియుంచెనా? అట్లైనచో నా యిద్దఱే యని

నిర్ణయ మేమి? మఱికొంత ఉండవచ్చును. అప్పు డెక్కువ క్లిష్టమైన స్థితిలో నేనుందును. ఒక పురుషుఁడైనచో వానిని రాకుండఁ జూడవచ్చును. ఇద్దఱు ముగ్గురు నల్గురైనచో నది యెట్లు? ఎల్లేమిటి? ఏ దేవత నాకు స్వాధీనమైనదో అది యొకని నేమి? నలువురినైనను రాకుండఁ జేయును. దానినిఁ గూర్చి మిక్కిలి విచారింప వలసిన పనిలేదు. ఆ యాంధ్ర రాజధానియం దున్నవాఁడు వేఱొకఁడో, కాదో కొలఁది దినములలో తెలిసిపోవును. యువరాజు వివాహ మైనంతనే యచ్చటికి నిచ్చటికి రాకపోకలు జరుగునుగదా? అట్టివాఁ డచ్చట నున్నచో సులభముగాఁ దెలిసికొన వచ్చును. కాక యా దేవతయే తెలియఁజేయునేమో? అది వేఱే విషయము. ఇంక పది దినములకుఁగాని యా నల్వురును దుంపలను తీసికొని రారు. ఆ దుంపల నేమిచేయవలయునో నాకే తెలియుట లేదు. ముందు రాజకుమారునియొక్క వివాహము జరుగవలయును. ఇచ్చటినుండి మీ కూతురును రాజకుమారునకుఁ జేసి కొందుమని వార్త పంపవలయునా? ఇదివఱకు తిరస్కరింపఁ బడినచోటైన యిచ్చట మఱల నాంధ్రరాజు వార్త పంపుద మన్న యాశ కలిగియుండునా? ఆ వార్త వచ్చినచో జయద్రథుఁ డచ్చటఁ గొంత వ్యవహారము జరుపుచున్నాఁడనియే యర్థము. రేపు మఱల జయద్రథునితో మాటాడ వలయును.

మఱునాఁడు పరాశరశాస్త్రి రాజువద్దకుఁ బోవునప్పటికి రాణి యున్నది. మంత్రి యున్నాఁడు. మఱి ముగ్గురు రాజోద్యోగులున్నారు. కాశీనగరవాసులు ధరించు దుస్తులు ధరించని మఱి యెవ్వరో యిద్దఱున్నారు. వెంటనే పరాశరశాస్త్రికిఁ

దెలిసెను. వా రాంధ్రుదై యుండవలయును. వారు సంబం ధమునకు వచ్చినారు. అనఁగా జయద్రథుఁడు తన తతంగ మచ్చట సాగించుచున్నాఁ డన్నమాట. ఆంధ్రరాజ దుహి తను శిశునాగున కిత్తుమని వారు చెప్పిరి. రా జంగీకరించెను. అందఱును సంతోషించిరి. శిశునాగునకు వార్త నెట్టిరి. శిశునాగుఁడు వచ్చెను. రాణి యువరాజుతో నిట్లనెను. "నాయనా! పూర్వము నీకుఁ బిల్లనిత్తుమని యాంధ్రరాజు వార్త పంపించెను. ఆ పిల్లయొక్క చిత్రపటమును గూడ పం పించెను. ఆమె నీకు సర్వథా తగినదని యందఱ మనుకొంటిమి. నీవు కూడ యీామె సౌందర్యవతియే యంటివి. అప్పుడు వివా హాము చేసికోనంటివి. వారు మంచివారు కనుక వలదనిన సంబంధమునకు మఱల వచ్చిరి. ఇప్పుడు కూడఁ గాదనుట యేమియు న్యాయముకాదు. నాయనగారా యిట్లు మంచము నందుఁ బడియున్నారు. నీ వన్యమనస్కుఁడవై యుంటివి. నీవు వివాహమాడినచో నీ మనస్సు కుదుటఁబడును. నీవు తప్పక యంగీకరింపలయునననెను. శిశునాగుఁడు విని యూరకుండెను. పరాశరశాస్త్రి "యువరాజా! తల్లిగారి మాట వినవలయును. 'న మాతుః పరదైవతమ్' అన్నారు." అనెను. మంత్రి యొత్తిడి చేసెను. శిశునాగుఁడు బలవంత పెట్టఁబడి తన యంగీకృతిని మరునాఁటి ప్రొద్దున చెప్పెదననెను. వచ్చిన రాయబారులు విడిదికి పంపింపఁబడిరి. ఎవరి దారిని వారు పోయిరి. రాణి పరాశరశాస్త్రినిఁ బిలిచి యిది యెట్లు పొసఁగు ననెను. పరా శరశాస్త్రి యిట్లనెను. "ఆనాఁటినుండి యీ నాఁటివరకు సుమారిరువది దినములు గడచెను. యువరాజును రాజు

గారును వారిద్దఱేయున్న సమయము లేదు. యువరాజు రాజు గారితో నున్నప్పుడు పరులుగూడ నుండుచునే యుండిరి. తమ రును రాజుగారును నేకాంతముగానున్న వేళలు కలవు. నేనును రాజుగారు నేకాంతముగా నున్న వేళలు కలవు. అందుచేత నాకునుఁ దమకును దెలిసిన రహస్యము యువరాజుగారికిఁ దెలియదు. మహారాణీ! ఇందులో నొక రహస్య మున్నది. పూర్వము మీ పిల్లను మేము చేసికోమని చెప్పితిమిగదా! మఱల నిత్తుమని వచ్చెడి లజ్జాహీనుఁడైన పురుషుఁ డుండునా! అంత యభిమానములేని మానిసియుండునా? అందులో నొక దేశపు రాజిట్లు చేయునా?" అనఁగా రాణి నిజమే శాస్త్రి గారూ! ఇది యెట్లు జరిగినదందురు? అని ప్రశ్నించెను. శాస్త్రి యిట్లనెను. "అమ్మా! ఇదియంతయు నాకు సంపూర్ణ ముగా నవగతముకాలేదు. ఇందులోని మూలమూలలు చాల తెలిసినవి. ఎవఁడిప్పుడు రాజ శరీరమునం దున్నాఁడో వాఁ డల్పుఁడు కాఁడు. వాఁడు చేయుచున్న చమత్కార మిది. ఈ వివాహము కానిండు. తరువాత మనకుఁ గొన్ని తెలియఁ గలవు. ఈ పదకమెవ్వరు నిర్మించిరో దీని తుదియేమో నాకుఁ దెలియుటలేదు. ఈ వివాహము జరిగిన తరువాతఁ గొన్ని విషయములు తెలిసికొనవచ్చును. యువరాజుగారికి వివాహ మెట్లును జరుగవలయును. వారు తమంతట తాము తాము వివాహమాడుదమని చెప్పరు. ఈ రూపముగా వివాహము కానిండు. తరువాత చూతము. ఈ వివాహము కావలయు ననగా రాజును యువరాజును రహస్యముగా కలిసికొనవల యును. యువరాజు యువరాజు కాఁడుగదా! ఆయన

మనస్సు మాఱిపోయినది. ఆ మాఱిపోయిన లక్షణమేమిటో మనకుఁ దెలియదు. దానికిని ఈ జయద్రథునకును సంబంధ మున్నది. యువరాజు రాజునందు తన కభిమతమైన యూహ లుగల జీవి యొకఁడు తాత్కాలికముగా నున్నాఁడని తెలిసి కొన్నచో వాఁడు తన్ను వివాహమాడుమని చెప్పినచో యువరాజు వివాహమున కంగీకరించును. తరువాత నడచెడి నడకనుపట్టి మనమేదైన చేయఁగల్గుదుము కాని ప్రస్తుతము నిస్సహాయులముగా నున్నాము." అనఁగా రాణి యింతకంటె నధ్వాన్నమైనచో నేమిచేయుదము? అనఁగా పరాశర శాస్త్రి "ఇంతకంటె వ్యవహారము చెడిపోదు. ఎంత వఱకుఁ జెడిపోవలయునో యంతవరకు చెడిపోయినది. అక్కడ నిలచినది. అచట నిలువఁ ద్రొక్కుకొన్నది. నా కీరహస్యము సంపూర్ణముగాఁ దెలియుటకు నేను మఱికొందఱితో మాటాడవలయును. నాకు కాలజ్ఞానము లేదు. కాలజ్ఞానముగల పండితుఁడు మధురలో నొకాయన యున్నాఁడని నేను విన్నాను. ఇదియంతయు గిరివ్రజపుర రాజ్యమునకు సంబంధించిన వ్యవహారముగా నాకుఁ దోఁచు చున్నది. నే నేదో జపము చేసికొనెడివాఁడను. మంత్రాను ష్ఠానము చేసికొనెడివాఁడను. ఉపనిషత్తులు భగవద్గీతయు మొదలైనవానినిఁ జదువుకొనెడివాఁడను. సామాన్యులకుఁ గలిగిన యంకిలిని నివారింపఁగలవాఁడను. ఇప్పు డీమహారాజ కార్యభారము నా శిరస్సునఁబడినది. ఇంత బరువు నేను మోయలేను. మోయఁగలుగుదునని నే ననుకొనలేదు. మోయుచున్నాను. మోయఁగల్గుదు నన్నట్లున్నది. ఇందులో

నాకొక్కటియే సందేహము. రాజును యువరాజును గలిసి మాట్లాడు నపుడు మీరో నేనో దగ్గఱనుండవలయును. లేమున్నచో జయద్రథుఁడు మాటాడునో? మాటాడఁడో? నేనుండినను కొన్ని మాటాడక పోవచ్చును. నేనును మీరును లేనిచో నతఁడు కొన్ని తన రహస్యములు యువరాజుతో చెప్ప వచ్చును. అవి మనకుఁ దెలియవు. తెలిసినచో మన భవిష్యత్ప్రయత్నములకు కొంత ననులు బాటుకలుగును. ఇది యాలోచించుచున్నాను. నాకేమియుఁ దోఁచుటలేదు. వివాహము మాత్రము జరిగితీరవలయును. యువరా జంగీకరించుటకుఁ దనవెనుక నితఁడున్నాఁడని యువరాజునకుఁ దోఁచవలయును. వారిద్దఱు మాటాడుకొనువానిలో విశేషములు మనకుఁ దెలియ వలయును." అనఁగా రాణి "రాజుగారియొక్క మంచము ద్వారబంధము దగ్గఱకు పెట్టింతును. నేనా ద్వారబంధము వెనుక నిలుచుండియుండుదును" అనెను. శాస్త్రి "జయద్రథుఁడు పరమవివేకి. వాఁడు వెంటనే తెలిసికొనును. అయినను చేయించుడు. రాజుగారి పరుండియున్నగదిని పరిశుభ్రము చేయుట జరుగునుకదా! దానికి వేళలున్నవా?" అనఁగా రాణి ప్రతిశనివారమును సాయంకాలమున నాగది పరిశుభ్రము చేయఁబడును. ఈ జయద్రథుఁడు వచ్చినతరువాత నీయాసని రెండుసార్లు జరిగినది. నేఁడు శనివారము. ఇదివఱకు రెండు సార్లు రాజుగారి మంచము నా ద్వారబంధము వద్దనే పెట్టించితిని. ఆసంగతి జయద్రథునకుఁగూడఁ దెలియును. అందుచే సందేహపడక పోవచ్చు ననెను. పరాశరశాస్త్రి యిట్లనెను. "ఒకవేళ జయద్రథుఁడు యువరాజును తలుపు తెరచి యెవ

రైన నున్నారేమో చూడుమనవచ్చును. తమ రచ్చట నిలు చున్నచోఁ గనిపింతురు. ఏదియో చాటుచేసికొని నేలమీఁదఁ బరున్నచో నాయన తలుపుతీసి చూచును. ఎవ్వరు లేరను కొనును. మీరు వినవచ్చును. ఆయన తెరచిన తలుపు తెరచి నట్లే యుంచినచో మీరు లేచి నిలుచుండుటకు వీలులేదు. అందుచేత తలుపు తెరచియున్నను వానికిఁ గనిపించని ప్రక్క ప్రదేశములోఁ దమరుండి తలుపు తెరచిన సవ్వడి కలిగిన తరువాత సవ్వడిలేచి తెరచియున్న తలుపుతెక్క వెనుకనే నిలుచుండి వినవచ్చును. వారిమాటలు విన్నతరువాత మీరచ్చట నుండి విన్నారని వారికిఁ దెలిసినను నష్టములేదు.”

యువరా జొంటరిగావచ్చి రాజునకుఁ గనిపించెను. రాజు నిదానించి యువరాజువంక జూచెను. యువరా జిట్లనెను. “మహారాజా! నా యంగీకృతి రేపు చెప్పెదననుకొంటిని. నన్నొంటరిగాఁ దమ్ము కలసికొమ్మని మంత్రి నన్నుఁ బ్రోత్సాహపరచెను. తమ దర్శనార్థము వచ్చితిని. ఆపిల్లను చేసికొనుట నా కిష్టములేదు. నేను వివాహమే చేసికోను.” అనఁగా రాజు “ఓయీ! మనమిద్దఱము మాటాడుచుండగా నేమి మాటాడుకొందుమోయని వినుటకు నీతల్లి యీ ప్రక్కగదిలో దాఁగికొని యున్నది. ఆమెనుఁగూడ దీసికొనిరమ్ము. మువ్వురముఁగలిసి మాటాడుదము.” అనఁగా యువరాజు ప్రక్కగదిలోనికిఁబోయి వెదకెను. ఆమె కనుపించలేదు. వచ్చి యామె లేదని చెప్పెను. రాజు కాదయ్యా! యే దుప్పటి వెనుకనో యే తివాచీ మడత లోపలనో యే పట్టుతెర లుంగగా పడియున్నచోటనో దాఁగి యుండును చూచి రమ్మనెను. యువరాజు వెళ్ళిచూచెను.

రాణి కనిపించలేదు. ఆమె నిశ్చయముగా లేదని యువరాజు చెప్పెను. జయదత్తుఁడిట్లనెను. "వారు నా పరోక్షమందు మాటాడుకొను మాటలునాకుఁ దెలియునో తెలియదోయన్న సందేహము నివర్తించుకొనుట కిట్లుచేసిరి. ఆ పరాశరశాస్త్రి చాల గడుసువాఁడు. ఓయి ! యువరాజా ! నేను నీతండ్రిని కాను. ఆరాత్రి నీకా శ్మశానములనడుమ నీచేత ధూమపానము చేయించిన పురుషుఁడున్నాఁడే, వాఁడు నాకు నీకెట్టి వాఁడవో అట్టివాఁడు. వాని నిచ్చటికిఁ దీసికొనివచ్చి నీకు గురువుగా స్థాపింపవలయునని నీచేతఁ జాలపనులు చేయించవలయునని నే ననుకొంటిని. వాని నన్నిఁటినిఁ బరాశరశాస్త్రి విఘటనము చేసెను. అతఁడేన్నాళ్ళు చేయఁగలఁడు? నీ ప్రతీకారము నీచేతఁ జేయించెదను. ఇప్పుడు మఱికొంచె మాలస్యమగును. ఆలస్యమగుటకూడ మంచిదియే. పరాశరశాస్త్రి లేనిచోఁ బ్రతీకారము జరిగెడిది. నీ కెక్కువ లాభముండెడిది కాదు. నీ భవిష్యత్తు నీకుఁ దెలిసెడిదికాదు. నీకు సంతానముండెడిదికాదు. నీ ప్రతీకారము నీతోడనే యంతరించెడిది. ఇప్పుడా ప్రతీకారఫలము కొన్నివందల యేండ్లవఱకు సాగుచుండును. నీవీ యాంధ్రరాజ దుహితనుఁ బెండ్లాడుము. నేను నీ కామెను భార్యనుగా నిర్ణయించితిని. నేను నీకు గురువను. ఆపురుషుఁడు నీకు గురువుకాఁడు. వాఁడు నాశక్తిచేత భ్రమ్మఁబడినవాఁడు. ఆరాత్రి తత్కాలిష్ఠ ధూమపాన వ్యాపార మిష మున నేను నీలోఁజొచ్చితిని. నాముద్ర నీమీఁద వదలితిని. నేను ప్రతీకార స్వరూపుఁడను. నీ తండ్రి నారాత్రి నిట్టిస్థితి లోనికిఁ దెచ్చినది నేనే. నీ విరహ మనుభవించుచున్న నీ

తండ్రియొక్క శరీరపటుత్వమునంతను నే నపహరించితిని. నాకుఁ గొన్ని శక్తులుకలవు. దుఃఖములో నున్నవాని శరీరమును నేను సంధిబంధములందు వ్రయ్యునట్లుచేసి నీ తండ్రిని వలె చేయఁగల్గుదును. నేనొక మాటలో నొక గాలితరగలోఁ జొచ్చి ప్రయాణము చేయఁగలను. నీమాటలోఁ బ్రవేశించితిని. వచ్చి నీతండ్రియందుఁ బ్రవేశించితిని. ఆ పురుషుఁడు నీగురువని వాఁడు వచ్చునని ప్రతీక్షించుచున్నావు. వాఁడు రాఁడు - పరాశరశాస్త్రి వాఁడు రాకుండఁ జేసినాఁడు. వాఁడే వచ్చినచో నాటక మాడించియుందును. నాకు స్వాధీనపడని జీవుఁడుఁగల మఱియొకని శరీరమునందు నేనున్నాను. ఏదిచేయవచ్చునో ఏది చేయరాదో చెప్పుటకుమాత్రము నేనిప్పుడు సమర్థుఁడను. నే నెవ్వఁడనో మీతల్లికిఁ దెలియును. పరాశరశాస్త్రికిఁ గూడఁ దెలియును. నీకుఁ జెప్పెదను. నా పేరు జయద్రథుఁడు. తక్కినవన్నియుఁ బరాశరశాస్త్రినిఁ గనుగొనుము. అతఁడు చెప్పును. నీకీ వివాహముగుట యాయన కిష్టము లేదు. ఎందుకనఁగా నిది నా పదకము. అతని పదకము కాదు. నీకీవివాహమైనచో నీ ప్రతీకారము సాగును - ఆ ప్రతీకారము సాగుట వాని కిష్టము లేదు. నేను గురువనని నీకు తెలిసినదా! తెలిసినది. పెండ్లియాడుదువుగదా! ఆడుదును.

# ౧౦

ఆంధ్రరాజు తన కూఁతును మొదటఁ జేసికోమన్న శిశునాగునకు తానే లజ్జవిడిచి యెట్లైనను మా పిల్లనుఁ జేసికోవలసినదని బతిమాలినట్లుగాఁ గబురంపుటయే కాక పెండ్లికొడుకు తరలి వెళ్ళుటయే లేక మీరు మీ పిల్లను మా రాజధానికిఁ బంపినచో నే మిచ్చట మా యిష్టము వచ్చినట్లు పెండ్లియాడుదుమని వార్త నంపగా దానికిఁగూడ లోఁబడి తన కుమార్తెను, కుమార్తెతోఁ గొందఱు పరిజనులను కొంతమంది బంధువులను పంపుట విన్నరాజలోకమునకు విడ్డూరముగా నుండెను. ఆంధ్రరాజు లింతలో చెడిన వ్యవహారము పూర్వ మెప్పుడును జరుగలేదు. దీనికి హేతువుగా పలుమంది పలువిధములఁ జెప్పికొనసాగిరి. యాథార్థ్య మెవ్వరికినిఁ దెలియదు. ఎంతమంది యెన్నిఁ జెప్పికొనినను నిజమైన హేతువు వారి కందనేలేదు. ఆ హేతువు పెండ్లికుమార్తె వెంట వచ్చుచుండెను. పెండ్లికుమార్తె పల్యంకికారూఢయై వచ్చుచుండెను. ఆమెకు ముందు వందమంది సైనికులు దృఢకృపాణ పాణులు నడచుచుండిరి. ఆమె పల్యంకిక యిరుదెసల రాజకుమార్తెయొక్క పరిచారకులయొక్క పది పల్యంకికలు నడచుచుండెను. వీరుగాక నలుఁబది యేఁబది శకటముల మీఁద రాజ దుహితృ పరిచారికా సమితి వచ్చుచుండెను. ఆ వెనుక పది బండ్లమీఁద రాజోద్యోగులు రాజబంధువులు

వచ్చుచుండిరి. ఆ వెనుక పది యేనుగులు, వంద గుఱ్ఱములు నాల్గువందలమంది పదాతులు వచ్చుచుండిరి. ఆశ్చర్య మేమనగా ముందు నడువవలసిన రథ గజ తురగ పదాతులు వెనుక నడచుచుండెను. ఒక్క వందమంది సైన్యముమాత్రమే ముందు నడచుచుండెను. వచ్చెడి పెండ్లివారికి నేదైన యాపద వచ్చునన్న భయమున్నచో నాయాపద ముందు నుండి వచ్చును. ఈ పెండ్లివారికి వెనుకనుండి వచ్చునా? ముందునుండి యాపద రానేరాదా? వచ్చినచోఁ బ్రతి ఘటింపఁగల మహాశూరుఁ డెవఁడైన ముందు నడచుచుండెనా? ఆ మహాశూరుఁడు ముందున్న వంద మందిలో నొక్కఁడును కాఁడు. అతఁడు వారికంటె ముందు నడచుచుండెను. ఆయనయే యా హేతువు. ఆయన మహావీరుఁడు కాఁడు. వీరుఁడే కాఁడు. అతని చేతిలో ఖడ్గముకూడ లేదు. అతఁడు గుఱ్ఱముమీఁదకూడ స్వారిఁ జేయుటలేదు. అతఁడు ముందు నడచుచుండెను. అతనినిఁ జూచినచో నీ మూర్తి మానవ విగ్రహమేనా యనిపించును. మానవుఁడేనా యనిపించును. కాని కరచరణాద్యవయవము లున్నవి. నడచుచున్నాఁడు. మానవ శరీరమువలెనే భూమిమీఁద నిట్టనిటూరుగా నాఱడు గుల యెత్తుగా నొక పదార్థము కనిపించుచున్నది. అది యేదో సన్నని కఱ్ఱ యనుకొన్నచోఁ గఱ్ఱయే యుందము. కఱ్ఱకుఁ గను లుండునా? కఱ్ఱకు జడలుండునా? కఱ్ఱకు జడలున్నచో నవి యెంత పొడుగుండును? ఇంత పొడుగుండునా? కఱ్ఱకుఁ గనులున్నచో నంత నిప్పులవలె నుండునా? అదియట్లుంచి ఆ కఱ్ఱ పంగలకఱ్ఱ. అతఁడు బిళ్ళలఁద్రాడువలె నుండెను.

త్రాఁడు చివర రెండు శాఖలుగా నేర్పడినట్లు పేనినచో దానిని బిళ్ళలత్రా డందురు. కట్టి రెండుగాఁ జీలకుండ సహజముగా చివరిభాగము రెండుగా నున్నచో దానినిఁ బంగలకఱ్ఱ యందురు. ఈపురుషుఁడు నడుముకడనుండి క్రిందికిఁజూచినచో నతని రెండు పాదములు నట్లు రెండుగాఁ జీలియుండుటచేత వానినిఁ గఱ్ఱ యనినచోఁ 'బంగలకఱ్ఱ'యనవలయును. త్రా డనినచో బిళ్ళలత్రా డనవలయును. అతఁడు నడచుచుండెను. ఒక పాము నడచుచున్న ట్లుండెను. పాము నేలమీఁదఁ బ్రాకిపోవును. ఈ పాము నడచుచున్నది. పాము తోఁకమీఁద నిలుచుండును. ఈ పాము నడచుచున్నది. ఎచటనైన రెండు తలలపా ముండవచ్చును. రెండు తోఁకలపా ముండదు. ఆ రెండుతోఁకలును పాదములుగాఁ బనిచేయుచున్నట్లుండెను. ఆ పాము నడచుచున్నది. దాని నడక ముందు పల్యంకికా వాహకులు గాని సైన్యముగాని రథగజ తురగ పదాతులుగాని నిలుచుటలేదు. వారు పరుగెత్తి వలసి వచ్చుచుండెను. పాముతో నెవరు పరుగెత్తఁగలరు. వారి యదృష్టమువలన నతఁడు నడచుచుండెను; గాని నేల మీఁద బడి ప్రాక నారంభించినచో వానితో వీరేమి నడువఁ గల్గుదురు? ఒకవేళ నతఁడు పోవుచుండఁగా నొక పర్వత మడ్డము వచ్చును. ఒక పెద్ద మట్టిగుట్ట యడ్డము వచ్చును. అతఁడు నేలలోఁ జొచ్చుకొనిపోవును. నేల త్రవ్వుకొని పోవును. ఉదంకుని కుండలము లపహరించిన తక్షకుఁడు నేల బొఱియలో దూరి పాతాళమున కేగినట్లు వాఁడు పోఁగలఁడు. పాతాళమున కేగఁగలఁడు. ఏగలేఁడు. నిస్సందేహ

ముగా భూమిలో మాత్రము వొచ్చిపోఁగలఁడు. అతఁడు తన వెనుక వచ్చుచున్న పెండ్లివారియం దనుగ్రహముచేత తన నడకను వారి యందు బాటులో నుండునట్లు సాగించుచుండెను. అతఁడు ముందు నడచుచుండఁగా నీ పెండ్లివారికి ముందు నుండి యాపదయని యొకఁడు వచ్చునా? వచ్చుట సాధ్యమా? వాఁడు తక్షకుఁడో, వాసుకియో, ఐరావత భుజగ రాజులలో నొక్కఁడో, వాని నేత్రములనుండి వెలువడెడు మహాగ్నికి నెదురుగా వచ్చెడు విరోధులు దగ్ధులైపోదురు. అతని కన్నులనుండి నిప్పులు వచ్చుచున్నవా? వచ్చుటలేదు. అతని వదనమునుండి ధూమము వచ్చుచున్నదా? వచ్చుచున్న దనిపించుచున్నది. ఒకవేళ నెవరైన శత్రువులు వచ్చినచో నా ధూమముచేఁ బిహితాక్షులై కనులు కనిపించక తట్టాడు కొనవలసి వచ్చును. తథావిధాంధీభూతులైన యా శత్రువులను ముందున్న సైన్యము ముక్కలు ముక్కలుగా నరుకును. వీఁడు ధూమాయుధుఁడు. కాని వెనుక నడచు చున్న వారందఱు వాఁడు శాపాయుధుఁ డనుకొనుచుండిరి. అతని యాజ్ఞచేత నీ విద్ధూరము జరుగుచున్నది. ఆంధ్రభూమీ పతికి వాఁడు గురుస్థాన భూతుఁడాయెను. అతఁడు గీసినది గీటు. అతఁడు త్రిలింగ ధరానాథునితో నిట్లని చెప్పెను. "ఓయి! రాజా! నీవు నీకూతును కాశీరాజ కుమారుఁడైన శిశు నాగున కిమ్ము. అతఁడు పూర్వము నీ కుమార్తెను తిరస్కరిం చిన మాట నిజమే. అతని కప్పుడు తెలియదు. ఇప్పుడు తెలి యును. నీ కుమార్తె గర్భమున మగధ సామ్రాజ్యమునకు చక్రవర్తి కాఁదగినవాఁడు పుట్టును. ఆమె సంతానము

వరుసగాఁ జక్రవర్తులగుదురు. సర్వ భారతదేశము వారి యదుపులో నుండును. అంతకంటెఁ గోరఁదగిన దేమున్నది." అని చెప్పఁగా రాజు మోహపడెను. మోహపడె ననుటకంటె గురువాక్యమును నిరాదరణము చేయుటకతనికి సామర్థ్యము లేదని చెప్పవలయును. గురువు చెప్పును. శిష్యుఁడు వినును. చెప్పకముందే వినెను. వినకముందే వినెను. ఇది పరిస్థితి.

ఆ సైన్యము నడచుచుండెను. రాజదుహిత పేరు 'వంక జాబిల్లి.' ఆమె వంకరగాఁ జూచును. ఆమె ఫాలము చందురుని విదియనాఁటి వెండి సన్నని కొడవలితనమును పెలార్చును. ఆమె నేత్రములు వంక జాబిల్లి క్రిందనున్న రెండు నక్షత్రములవలె నుండును. అవి నక్షత్రములు కావు. బృహస్పతియు శుక్రుఁడును వచ్చి నాసా రేఖకు నిరుదెసలఁ గాపుండినట్లు కనిపించును. ఆమె శిరోజములు వినీలమత్త మధుకర గరుదంచల నవీన శోభాసనాథములై భాసించుచుండెను. ఆమె పెదవులు ముద్దమందారమువలె నుండెను. ఆమె చెక్కిళ్లు పండిన కేతకీ పాండుర పత్రసుషమాభిరామమ్ములై యుండెను. ఆమె శరీరము లవంగవల్లీ కిసాలయ మసృణచ్ఛవి సముపేతముగాఁ దనరారుచుండెను. ఆమె కట్టిన చీర సంధ్యాసమయ బాలసూర్య ప్రభావిభా సుభాషిణిగా నుండెను. ఎవరో యొక దేవత పల్లకిలో కూర్చున్నది. అంతే.

పెండ్లివారు కాశీనగరమును సమీపించిరి. ఇతరులకు పదునేను దినములు ప్రయాణము వీరి కేఁడుదినములలో జరిగెను. ఎట్లు జరిగెనో వారికే తెలియదు. నడుమ నడుమ సైన్యము విశ్రమించునట్లు గూడ వారికిఁ దోచుచున్నది. విశ్రమించవలసిన యవసరమే వారికిఁ గనిపించలేదు. గురువిచ్చట విశ్రమింతమని చెప్పుటయే విశ్రమించవలసిన యవసరము కలుగుటగా సంభవించెను. ఇట్లు ప్రయాణము కొనసాగెను. ప్రయాణము సాగుచుండఁగా నెవరో యొకరు గురువు వద్దకుఁ బోవుటయు నేదోయొక సంగతిని గుఱించి యాయన నడుగుటయు జరుగుచుండెను. విశ్రమించిన స్థలమునందు గురువు పోయి పదిమందినిఁ బరామర్శించి వచ్చుట కలదు. గురువు మాత్రము వంకజాబిల్లి'వంక పోలేదు. వంకజాబిల్లికి గురువు నకు నష్టమచంద్రుఁడు - నైధనతారగా నున్నట్లుండెను. చెలికత్తెలు రాజకుమార్తెతోఁబొరపాటున నెప్పుడైన నీ వదృష్టవంతురాలవన్నచో రాజకుమార్తె కనుబొమలు ముడుచును. ఆమె ముఖమండలము రాహుగ్రస్త చంద్రునివలె భాసించును. వారప్పుడప్పు డట్లనుచుందురు. అది గురువుగారి యాజ్ఞ. ఆమెకుఁ గోపము వచ్చినను బరిచారికల నేమియుఁ జేయఁజాలనట్లుండెను. మిక్కిలి నేరమైనఁ జేసినచో నీ మొగము గాకు చూపించకుమన్నంత మాత్రమే చేయఁ గలుగుచుం

డెను. ఇంకఁ గాశీనగరము క్రోసెడు దూరములో నున్నది. అచ్చట నందఱును మఱల విడిది చేసిరి. మగపెండ్లివా రాంధ్ర నగరమునకు రాకపోయిన రాకపోయిరిగాక. అచ్చటికైనను వచ్చి పెండ్లికూతునుఁ దీసికొని పోవలయుఁగదా! వా రచ్చట విడిదిఁ జేసి కాశీనగరమునకు వార్త పంపిరి. వారెప్పుడు బయలుదేరుచున్నారో కాశీనగర రాజకుటుంబమునకుఁ దెలి యును. వా రిచ్చటికిఁ జేరునప్పటికి మఱి యింకొక్క వారము దినములు పట్టునని రాణి మొదలైనవా రనుకొనుచుండఁగా వీరప్పుడే వచ్చితిమని వార్తనంపగా రాణి యాశ్చర్యపోయెను. వారము దినములలో నింత దవ్వ నెట్లు ప్రయాణము చేయఁ జాలిరి? రాజకుమార్తె యొక్క తెయే వచ్చెనా? అట్లెప్పుడును జరుగదు గదా! సపరివారయై సరాజపురుషయై ప్రయాణము చేయును. ఇంత శీఘ్రముగా వచ్చుట యసంభవము. ఆమె వెంటనే పరాశరశాస్త్రికి వార్తపుచ్చెను. ఆయన వచ్చెను. రాణి యీ సంగతి చెప్పెను. మన మెదురుపోవలయును. ఏనుఁగులతో గుఱ్ఱములతో పదాతులతో మేళములతో వెళ్ళి పెండ్లికుమార్తెనుఁ దీసికొని రావలయుననెను. పరాశరశాస్త్రి రాణితో ననెనుగదా "తల్లీ! వారు క్రోసెడు దూరమున నున్నారు. నగరము మొగదలకే రావచ్చుఁగదా! ఇచ్చట నుండి వారి విడిదలవరకు నిర్జనమైన దేశము. మేళములతో తాళములతో బయలుదేరి వచ్చుట జనసమ్మర్దము గలచోట వినోదముకొఱకు చేసెడిపని. ఈ క్రోసెడు దూరము వట్టి నిర్జన ప్రదేశము. కనుక వారిని బయలుదేరి నగరముయొక్క పొలిమేరవఱకు రమ్మనియు, అచ్చటనుండి మేళతాళములతో

రథగజాదులతో నెదుర్కొని తీసికొని వత్తుమనియు. యీ నిర్జనప్రదేశమునందీ శోభనుఁ జూచి యానందించెడి వారెవ రుందురనియు రాయబారులతోఁ జెప్పుమనెను. ఆమె వారితోఁ జెప్పెను."తూఁగిరావలసినది. మేము సిద్ధముగానే యున్నాము. మీరింత తొందరలో వత్తురనుకోలేదు. అందుచేత మాకు కొంచెము జాగగుచున్నది. మీరు పొలిమేరవఱకు వచ్చునంతలో మేమును సమాయత్తపడి పొలిమేరవద్ద మిమ్ముఁ గలిసికొందుము" అని చెప్పఁగా వారు తటపటాయించిరి. అట్లుకాదు, మా గురువుగారు మిమ్మిచ్చుటికే రమ్మన్నారనియు, మాయంతట మేము పిల్లను మీకిచ్చుచున్నాము గదా, పెండ్లికూడ నాచార వ్యతిరేకముగా క్షత్రియాభిమానమునకు సయోగ్యముగా నింత ప్రేమతో నింతవాంఛతో బయలుదేరి వచ్చితిమికదా! మీరొక్క క్రోసెడుమేర మాకొఱకెదురువచ్చుటలో దోసమేమియు లేదనిరి. పరాశర శాస్త్రి వారితో నిట్లనెను. "అయ్యా! ఒకఁడు వేయినొక్క గోవుల నడిగెను. వేయి గోవుల నిచ్చితిరి. ఆ ఒక్క గోవు నిచ్చుటయందు వెనుకాడుటలో నర్థమేమి? అట్లు వెనుకాడిన వారి స్వరూప మేమనగా నా వేయిగోవుల నీయక తప్పక యిచ్చెను. ఈయక తప్పదు. వాని మనస్సులో నున్న లోభము, వాని కిష్టములేనితనము నా మిగిలిన గోవునందు వాఁడు ప్రదర్శించును. మీ రాజకుమార్తెను మా కిచ్చుచున్నారు. సంపూర్ణముగా మాకుఁ గైవసము చేయుచున్నారు. మీ రెందుకు మా కిచ్చుచున్నారో మాకుఁ దెలియదు. మేము మొదట తిరస్కరించినాము. అట్టి మాకు

మఱిల మీ కూతు నిచ్చుట మీ యౌదార్యమని మాకుఁ దెలియును. ఆ యౌదార్య మవ్యాజమైనదియో సహేతుక మైనదో మాకుఁ దెలియదు. మీరు మాపొలిమేరవఱకు ననఁగా నూరి మొగదల వఱకు వచ్చినచో నది యవ్యాజ మను కొందుము. లేనిచో నేదో యొక హేతువున్న దనుకొందుము. మీ రింత ప్రేమతోఁ బిల్ల నిచ్చుచు మాయెడఁదలం దొక సందేహము నాటుట మీ యౌదార్యమునకుఁ దగినదికాదు. పదునేనుదినములు చేయఁవలసిన ప్రయాణము మీ రేఁడు దినములలోఁ జేసితిరనగా మీ రాజకుమార్తె దేవతాస్త్రీ యేమో యనిపించు చున్నది. ఆమెయొక్క శక్తిచేత మీరు గాలిఁమీఁద నడచి వచ్చిన ట్లున్నారు ? ఆమె తన దేవతా శక్తిని మీ పాదములయందు, నేనుఁగుల పాదములయందు, గుఱ్ఱముల కాళ్ళయందు, రథచక్రములయందుఁ బ్రవేశపెట్టి, మిమ్ము రెట్టింపు వేగముగా నడిపించెను. అట్టి దేవతా స్వరూపిణియైన మీ రాజకన్య ఱెక్కలు కట్టుకొని గంధర్వ స్త్రీ వలె మా యువరాజు మేడమీఁద వ్రాలవచ్చును. ఇదియొక లీలా విశేషము. ఈ మాటలన్నియు మీ రాజ దుహితతో చెప్పి మాయందు నింతయనుగ్రహము చూపిన యా దేవతామూర్తి మఱి సుంత యనుగ్రహము కూడఁ జూపవచ్చునని మేము మనవి చేసితి మని విన్నవింపుడు. నేనన్న మాటలు యథాతథముగాఁ జెప్పుడు. ఆమెకు నిస్సందేహముగాఁ గరుణ యుదయించును.''

ఆ రాయబారులు పరాశరశాస్త్రి మాటలను యథా తథముగా గురువునకు నివేదించిరి. అతఁ డాలోచించెను.

వారితో నిట్లు చెప్పెను. "ఇది సంధ్యాకాలము. ఈ సమయమునందు మనము పురప్రవేశము చేయరాదు. నిశాసమయము కూడ దాని కయోగ్యము. రేపు ప్రొద్దున మనము వారి పొలిమేరవద్ద నుందుము. వారి నచ్చటికే వచ్చి మసలను స్వీకరించవలసినదని చెప్పుడు! మఱలఁ బొండు. రాజదుహిత వారి యాజ్ఞను మన్నించినదనియు, నిశావేళ యగుట నిప్పుడు వచ్చుచుండుట లేదనియు, రేపుదయకాలమున దేవతాయోగ్యమైన మర్యాదలతో వారు వచ్చి పెండ్లివారిని నగరములోనికిఁ దీసికొని పోవలయుననియు చెప్పిరండు. ఈ రాత్రికి మన మిచ్చటనే విడిది చేయుదము" రాయబారులు వెళ్ళిరి.

## ౧౨

రాయబారులు వచ్చిరి. రాణితో నా మాటలు చెప్పిరి. పరాశరశాస్త్రియు వినెను. అటనుండి పరాశరశాస్త్రి వెడలిపోయెను. పోయి జపము మీఁదఁ గూర్చుండెను. ప్రసన్నముఖుఁడు ఫేరవరవుఁడైన దేవత నాహ్వానించెను. అతఁడు వచ్చెను. "ఏమయ్యా! ఈ మహానగరమును నీవు రక్షింతునంటివికదా! లోనికెవ్వరిని గానీయనంటివికదా! రాచకూతుతో వచ్చుచున్నాఁడు. ఎవఁడు రాకూడదనుకొంటిమో వాఁడు వచ్చును. నా వేసిన పదకమంతయుఁ జెడిపోవును. నీవు నాకుఁ బ్రసన్నుఁడ వైతివి. నేనడిగినదంతయుఁ

జేయుదునంటివి." అనఁగా నా దేవతాపురుషుఁడు నవ్వి "వాఁడూరిలోనికి రాలేఁడు. పొలిమేరదాటి రాలేఁడు? రేపు ప్రొద్దుట వత్తుమని యెందుకు చెప్పినాఁడు. ఎందుకు చెప్పి నాఁడో రేపు ప్రొద్దున నీకుఁ దెలియును. నీకుఁ దెలియకను పోవచ్చును. రేపు ప్రొద్దుట వట్టి పెండ్లివారు పురప్రవేశము చేయుదురుగాని వాఁడు చేయఁడు. వాఁడు రేపు కనిపించనే కనిపించఁడు." అనఁగాఁ బరాశరశాస్త్రి "వానిని నాకు వశము చేసిపెట్టుము. వాఁడొక్కఁడేనా? వానివంటి వారింక నుండిరా." అని యడుగఁగా దేవతా పురుఁషుడు తిరోధానమునందెను. వెంటనే పరాశరశాస్త్రికిఁ దెలిసెను. కొన్ని విషయములు తెలిసికొనవలెననఁగాఁ దా నామంత్రము నుచ్చరించు చుండ వలయును. దానియంతట నది భాసించును. వాని నడిగినచోఁ జెప్పఁడు. అని వెంటనే స్ఫురించి యతఁడు సందేహావస్థలో పడెను. ఈ ప్రశ్న వేయకపోయినచో నా పురుఁషుడు వీనిని తనకు వశముఁ జేసెడివాఁడేమో. ఈ రాత్రి యేమి జరుగునో తాను మంత్రానుష్ఠానము చేయవలయును. వాఁడొకఁడో యిద్దఱో ముగ్గురో తెలిసికొనవలయును. అది తేలిన తరువాతఁగాని మఱల నా దేవతా పురుషుఁడు కనిపించఁడు. వారెంత మందియో తెలిసికొనుట కంటె నీ నాఁటి రాత్రి వాఁడు పురప్రవేశ మెట్లు చేయ లేఁడో తెలిసికొనుట యెక్కువ ముఖ్యమైన విషయము. తానే చేతులార వ్యవహారము పాడుచేసికొంటినని పరాశర శాస్త్రి వేఱు గతిలేక మంత్రానుష్ఠాన మారంభించెను. కొంతసేపు గడచిన తరువాత నతనికిట్లు భాసింప నారం

భించెను. నెల నాళ్ళ క్రింద శిశునాగుఁడు నాల్గు శ్మశానముల నడుమ నర్ధరాత్రమునందుఁ గూర్చుండి యుండెను. అచట నొక పురుషుఁ డుండెను. వాఁడు ధూమము వెలార్చుచున్న యొక కాష్ఠమును శిశునాగుని చేతి కందించెను. రాజభటులు శిశునాగుని వెదకికొనుచు వచ్చిరి. ఇంతలో నా పురుషుఁడు సర్పాకృతిఁ బూని జరజర సాగిపోయెను. మఱల నాల్గు దినములు గడచెను. ఆ సర్పము భూమిలోనికిఁ జొచ్చెను. దుబ్బుల క్రిందనున్న కాష్ఠమునుఁ గొరికెను. వానిని నాల్గింటిని తన తోకయందు మత్తగజము తాను విఱిచిన వృక్షశాఖలను తొండముచేత నిరియఁబట్టినట్లుగాఁ బట్టికొని ప్రయాణము చేయుచుండెను. పాముయొక్క తోఁకలో సగము చుట్టుకొని యున్నది. తక్కిన సగము ప్రాకుచున్నది. పాము తోఁక నెగబట్టి ప్రాకదు. ప్రాక లేదు. ఇది పాము కాదుగదా! మొగము చూచినచో మానవుని మొగమే. నేలమీఁద ప్రాకుచున్నదా? గాలిలో నెగిరిపోవుచున్నదా? మఱలను ధ్యానము. కనిపించెను. రాజదుహిత నిదురపోవుచుండెను. ఆ పురుషుఁడే. అక్కడ కూర్చున్నాఁడు. నాల్గు దుంపల నుండి యొక్కసారిగా ధూమమును వెలార్చుచున్నాఁడు. రాజ దుహితృనాసా నాళములగుండ నాధూమము నామెగర్భ ప్రదేశమునందుఁ బ్రవేశింపఁ జేయుచున్నాఁడు. ఇది పూర్వము చూచినదే.

ఇంతకంటె వేఱేమియు కనిపించలేదు. వాఁడొక్కఁడే పురుషుఁడని నిర్ధారణ జరిగినది. ఇంకొకఁడు లేఁడు. వాఁడొక్కఁడే తనకు ప్రతిస్పర్ధి. వానిని వశముఁ జేసికొన్నచో,

నీ మంత్రాధి దేవతయైన పురుషుఁడుఁ దనకు వానిని వశపరచి
నచో నీ సమస్య తీర్మానమగును. అందుచేత మఱల మంత్రాధి
దేవతా మూర్తిని పిలుపవలయును. అప్పటికి రాత్రి ప్రొద్దెంత
గడచెను. సామాన్యముగా రాత్రి రెండు జాములు మొదలు
మూఁడవ జామువరకు మధ్యనున్న కాలములో నీ భూత
సంబంధమైన మంత్రములు క్రియలు ఫలవంతము లగును.
తా నెంతసేపు జపములో నున్నాఁడో పరాశరశాస్త్రికిఁ దెలి
యలేదు. లేచి రాత్రి యెంత గడిచినదో లెక్క గట్టుటకు
నారంభించెను. ఉత్తరపు దిశకు చూచెను. సప్తర్షి మండలము
కుబేర దిశయందుఁ గనిపించెను. మూఁడు నక్షత్రములు పైకి
తిరిగియుండెను. నాల్గు నక్షత్రములు క్రిందికుండెను. బాగుగా
క్రిందికి దిగియుండెను. మండలము వాయవ్యదిశాభి ముఖ
ముగా నుండెను. తెల్లవారఁ బోవుచుండెను. జరిగెడిదేమియో
ఇదివఱకే జరిగియుండెను. ఏమి జరిగెనో తనకుఁ దెలియదు.
అయినను తాను నగరపు పొలిమేరకడకుఁ బోయి చూడవలె
ననిపించెను. వెంటనే బయలుదేరెను. మూఁడవ జామింకను
బూర్తిగా లేదు. పరాశరశాస్త్రి తాను నడచుచున్నానని
తాననుకొనలేదు. తనకే చిత్రముగా నుండెను. తన యింటి
నుండి యూరి పొలిమేరకు నెంత తొందరగా నడచినను రెండు
న్నర మూఁడు గడియలు పట్టును. తా నరగడియలో పొలి
మేరకు వచ్చెను. అచట నిలుచుండెను. ఇది యొక చిత్రము.
తా నెప్పుడు నట్లు జరుగునని యనుకొనలేదు. అట్లుండునని
యనుకొనలేదు. పొలిమేరవద్దఁ బది తోడేళ్ళు వంద నక్కలు
మహా భీకరాకృతులు నిలుచుండి యుండెను. ఎవఁడో దూరం

మునందుఁ జారిపోవుచుండెను. వాఁడు దూరముగాఁ బోయి మఱియొక దెసనుండి వచ్చుటకుఁ బ్రయత్నించగా నివి యన్నియు మఱల నచ్చటనే సిద్ధమైనవి. ఇట్లెంత సేపటినుండి యతని పురప్రవేశమునా వృకజంబుకములు నివారించుచున్నవో తెలియదు. ఏదో లీలగా నా పురుషుని యీ ప్రయత్నము చివరిదశలో నున్నట్లు తెలిసెను. వాఁడు సర్పాకృతియై నేలను ద్రవ్వికొని ప్రవేశించఁ గలఁడు గదా! అట్లే జరుగుచున్నది. ఇంత చీఁకటిలో నిది యంతయు తనకెట్లు కనిపించుచున్నది? ఈ కనిపించుటకు వెలుఁగక్కఱలేదా? దవ్వు — దగ్గఱ యన్న విషయమిచ్చటఁ బట్టదా? ఆ పురుషుఁడు సర్పాకృతి యయ్యెను. నేలలోఁ జొరబడెను. ఈ నక్కలన్నియు ముట్టెలతో ద్రవ్వి నేలయందుఁ బ్రవేశించెను. అతఁడు కనిపించుట లేదు. నక్కలు కనిపించుటలేదు. మట్టిలో నేమి జరుగుచున్నదో యనుకొన్న పరాశరశాస్త్రికి మట్టిలో నేమి జరుగుచున్నదో కనిపించెను. ఆ పామెచ్చట మట్టిలో దూరెనో యెచ్చట చొచ్చుకొని పోవుచుండెనో అచ్చటనెల్ల జంబుకముయొక్క దంష్ట్రాభయంకర ముఖము ప్రత్యక్షమగుచుండెను. ఈ జంబుకమా పామునుఁ బట్టికొని రెండుగాఁ జీల్చివేయునన్నట్లుండెను. చీల్చివేయుట యెంతో సులభము. జంబుకముఖదర్శనము గలిగినంతనే పాము వెనుదిరిగి పోవుచుండెను. ఈ జంబుకములా పామును పట్టికొని యేల చంపవు? సాహసించి యా సర్పమేల లోనికిఁ జొరఁబడిరాదు. చివరకు విఫలప్రయత్నమై సర్పము మఱలిపోయెను. ఇంతలో దూరమునందుండి యా పురుషుఁడు వెనుదిరిగి పోవుచున్నట్లు కనుపించెను.

వాని వెనుదిరిగి పోవుటయే చమత్కారముగా నుండెను. పాముగా, ఒక్క పలుచని పురుషుఁడుగా, సన్నని ధూమరేఖగా, మబ్బుచారికగా, దూరాకాశమున నంతరించెను.

## ౧౩

మరునాఁడు మగపెండ్లివారు మేళతాళములతో, రథ గజ తురగ పదాతులతో నాఁడు పెండ్లివారిని కలిసికొనుటకు పొలిమేరకడకు పోయిరి. పొలిమేరవద్దఁ బెండ్లివారు లేరు. వారందఱకు సందేహము కలిగెను. వారికిఁ గోపమువచ్చి వెడలిపోయినారేమో యనుకొనిరి. పరాశరశాస్త్రి "వారు వెడలిపోరు. ఇంతదూరము వచ్చి వెడలిపోవుదురా? మనము క్రోసెడు దూరమైనను పోనిచో మనము వారి మర్యాద వారి కిచ్చినట్లు కాదు. ఇంత మర్యాదమైన మనము చేయకున్నచో మనవలన వారు పొందనిచో వారి గౌరవము వారు దక్కించు కొన్నట్లు కాదు. వారింత లొంగివచ్చిరి. మనము కొంచెము లొంగవలదా? అందుచేత మనమీ క్రోసెడు దూరమునుఁ బోయి వారిని తీసికొని రావలయును. అని నచ్చచెప్పి రాజోద్యోగులతో రాజవంశ వృద్ధులతో బయలుదేరి యా క్రోసెడు దూరమునుఁ బయనించుటకే నిశ్చయపరచెను. ఇంతలోఁ బరాశరశాస్త్రి కొకయూహ వచ్చెను. రాజవృద్ధు లతో నిట్లనను. "క్షత్రియ వృద్ధులారా! రాజకుమార్తె వెంట నామెతల్లి వచ్చియుండదు. మన మందఱము పురుషు

లను. మన వెంటఁ గొందఱు పరిచారిక లున్నమాటనిజమే. వట్టి పరిచారికలు కాఁబోవు స్నుషను స్వీకరించుటలో నౌచిత్య మేమికలదు? రాణిగారు వచ్చినచో నెంతయో బాగుగా నుండును. రేపటినుండి కోడలిని కడుపులో పెట్టుకొనునా మె యామెకదా! రాణిగారు వచ్చినచో నా రాజదుహిత యా పెండ్లికూతురు తానుగా నిన్నాళ్ళనుభవించిన మనో దైన్యము సులభముగా నివారితమగును. ఆమె మనస్సులో నున్న కళంకము వాయును. తల్లిదండ్రులను వదలి వచ్చితి నన్న దిగులు మాయును. యువరాజునకు చెల్లెండ్రు లేరు. అప్ప గార్లులేరు. ఒక్క వేదమరిచి యున్నది. ఆమె తన రాజ్యము తానుపాలించుకొనుటకుఁ బోయినది. ఇచట నాడుదిక్కు లేదు. రాణిగారుతప్ప పెండ్లికూతును పరామర్శించుటకు యోగ్యురా లైన స్త్రీ సమీప రాజబంధువన్నది లేదు. అందుచేత రాణియే రావలెను.” ఇట్లనగా నిద్దఱు వృద్ధరాజ బంధువులు పరాశరశాస్త్రితో గలిసి రాణివద్దకుఁ బోయిరి. ఆ యిద్దఱు వృద్ధ క్షత్రియుల భార్యలతో కలిసి రాణి బయలుదేరెను. పరాశరశాస్త్రి చెప్పిననఁగా రాణి బయలు దేరుటయే. అంద ఱును కలిసి జాము ప్రొద్దెక్కువరకు నాడుపెండ్లివారు విడిసిన చోటికిఁ జేరిరి. ఆ విడిసిన ప్రదేశము కళాకాంతులు లేక యున్నది. తేజోవిహీనముగా నున్నది. అందఱు నెవ్వారి కొఱకో ప్రతీక్ష సేయుచున్నట్లు కనిపించుచున్నది. వీరు మగ పెండ్లివారు. ఎదురుకోలు నడుపుటకు వచ్చినారన్న గుర్తే వారికిఁ గలుగలేదు. ఏదో సైన్యము తమమీఁదికి దండెత్తి వచ్చుచున్నదని వా రనుకొనిరి. వారు ప్రతినిమేషము బయలు

దేర వలయు నన్నట్లు కూర్చున్నారు. వెనుకనున్న రథగజ పదాతులు ముందునకు వచ్చి నిలచి యుండెను. వారు యుద్ధమునకు సిద్ధపడిరి. రాజవృద్ధులు పరాశరశాస్త్రితో నిట్లనిరి. "ఇది యేమయ్యా? వీరు పెండ్లివారు కానట్లున్నదే. ఆంధ్రరాజ సైన్యము మన మీఁదికి దండెత్తి వచ్చినది. వారికి పది యేనుఁగులు, నంద గుఱ్ఱములు, వంద రథములు, ఏదాఱువందల సైనికులు కలరు. మన మంతమందిమి రాలేదే. మనము నాలు గేన్గులతో వచ్చితిమి. పాతిక గుఱ్ఱాలతో వచ్చితిమి. వందమంది సైన్యముతో వచ్చితిమి. వీరిచేత సంహరింపఁబడుటకు మనము చాలనట్లు రాణిగారినికూడఁ దీసికొనివచ్చితిమి. ఇది యేమి యన్యాయము?" అనఁగాఁ బరాశరశాస్త్రి నవ్వి యిట్లనెను. "వారికిఁ దెలియదు. మనము బెండ్లివారమని వా రనుకొనుట లేదు. రాణిగారును వృద్ధ క్షత్రియ స్త్రీలును నేనును ముందు పోవుదుము. అప్పుడు వారికిఁ దెలియుననెను. అట్లే రాణిగారి పల్యంకికయు, వృద్ధస్త్రీల పల్యంకికలును, తదుచిత పరిచారికలును ముందు నడువఁగా వారిముందు పరాశరశాస్త్రి నడచి యాడు పెండ్లివారి విడిది కభిముఖముగా సాగిరి. వారును నివ్వెఱపోయిరి. ముందు తీర్చియున్న సైన్యము పాయలిచ్చెను. వీరు లోనికిఁబోయిరి. వంకజాబిల్లి కూర్చున్న పల్యంకిక దానియందు రచింపఁబడిన యధికచిత్ర సన్నివేశముచే, రత్నవైడూర్యాది మణులయొక్క కాంతిచే, పట్టుకుచ్చులచే, బంగారపు పనిచే, విస్పష్టముగాఁ దెలిసికోనయ్యెను. రాణి యచ్చటికిఁ బోయెను. వృద్ధస్త్రీలును పరాశరశాస్త్రియు ననుసరించిరి. పల్లకివద్దకుఁ జేరినంతనే పరాశరశాస్త్రి ముందేగి

రాజదుహితనుఁజూచెను. చిత్రములోఁ జూచిన ప్రతికృతి యీయామె సౌందర్యమునకుఁ బ్రతికృతియా! ఈమె నిజముగా దేవతాస్త్రీ. ఆమె వంకరగాఁ జూచుచుండెను. ఆమెఫాలము చందురుని విదియనాఁటి వెండి సన్నని కొడవలితనమును వెలార్చుచుండెను. ఆమె నేత్రములువంక జాబిల్లి క్రిందనున్న రెండు నక్షత్రములవలె నుండెను, అవి నక్షత్రములుకావు. బృహస్పతియు శుక్రుఁడును వచ్చి నాసారేఖకు నిరుదెసల గాపుండినట్లు గనిపించుచుండెను. ఆమె శిరోజములు వినీల మత్తమధుకర గరుదంచలనవీనశోభాసనాథములై భాసించుచుండెను. ఆమె పెదవులు ముద్దమందారమువలె నుండెను. ఆమెచెక్కిళ్లు పండిన కేతకీ పాండుర పత్రసుషమాభిరామములైయుండెను. ఆమె శరీరము లవలీలతా కిసాలయ మసృణచ్ఛవి సముపేతముగాఁ దనరారుచుండెను. ఆమె కట్టిన చీర సంధ్యాసమయ బాలసూర్యప్రభా విసంవాదిగా నుండెను. ఆమె సౌందర్యమునుచూచి పరాశరశాస్త్రి వెనుకాడెను. ఆయన వెనుకాడుటలో రాణి తన కోడలినిఁ జూచెను. ఆమెయును దిగ్భ్రాంతి చెంది వెనుకాడెను. ఆ వెనుకాడుటలో వృద్ధక్షత్రియస్త్రీలును రాజదుహితృ సౌందర్యరేఖా తాడితలై వెనుకాడిరి. అప్పటికిఁ బరాశరశాస్త్రి తట్టుకొని ముందునకువచ్చెను. పక్కనవారును ముందునకువచ్చిరి. పరాశరశాస్త్రి యిట్లనెను:

"అమ్మా! నేను రాజపురోహితుఁడను. ఇంతవఱకుఁగాదు, నేఁటినుండి రాజ పురోహితుఁడను. ఈమె చంద్రమతీదేవి గాదు మీ యత్తగారు. నిన్ను ప్రేమతో తన యంతఃపురమునకుఁ దీసికొనిపోవుటకు వచ్చినారు. నీ మనస్సులోనున్న

కాలుష్యమును కడిగివేయుటకు వచ్చినారు. నిన్నుఁ బ్రసన్ను రాలిని చేసికొనుటకు వచ్చినారు. నీకు జరిగిన యవమాన పంకము క్షాళితముచేయుటకు గంగాదేవివలె వచ్చినారు. నీవు పల్యంకికనుండి దిగివచ్చి యత్తగారి పాదాభివందనము చేయుము." అనఁగా వంకజాబిల్లి పరాశరశాస్త్రివంకఁజూచెను. "ఇతఁడెవరు? ఆ గురుఁడెందుకు రాలేదు? ఏమైనాఁడు? అతని కొఱకు స్కంధావారమంతయుఁ బ్రతీక్షించుచున్నది. అతఁడు రాలేదు. అతనిశక్తి వారణాసీనగరముమీఁద లేదు. ఉన్నచో మగపెండ్లివారే తరలివచ్చెడివారు. ఆశక్తి యీ నగరము మీఁద నెందుకు లేదు? ఈయనమూలముగా లేదా? ఈయన తా నిదివఱకు రాజపురోహితుఁడను కాననుచున్నాఁడు. ఇప్పటినుంచి యగుదుననుచున్నాఁడు. ఆపురుషుఁడు, ఆగురుఁవు, ఈ బ్రాహ్మణునిముందు నిలువలేకపోయెనా? ఇతఁ డతనిని విధూతమహిమునిఁ జేసెనా? కానిచో నతఁడు వచ్చెడివాఁడే. ఇతఁ డిచట నున్నాఁడని యతనికిఁ దెలియదా? తెలిసికూడ సాహసముచేసి వచ్చెనా? సాహసము ఫలింపలేదా?" వంక జాబిల్లి పల్యంకికనుండి దిగి రాణిగారి పాదములకు నమస్క రించి వృద్ధ క్షత్రియస్త్రీలకు నమస్కరించి పరాశరశాస్త్రి వంకఁ జూచుచు నిలుచుండెను.

## ౧౪

చిత్రశిఖండి గిరివ్రజపురమునకుఁ బోయెను. శిశునాగుని వివాహము జరుగుచున్నదని వేదమరీచికి నామె తండ్రియైన నందివర్ధనునకునుఁ జెప్పి వేదమరీచిని నిస్సందేహముగా వివాహమునకుఁ దీసికొని రావలయునని చంద్రమతీదేవి యాజ్ఞ. చిత్రశిఖండికి నేటికొక విషయము దెలియుచున్నది. చంద్రమతీదేవి యాజ్ఞ యనఁగా పరాశరశాస్త్రియు నామెయుఁగలిసి చేసిన యాలోచన యని. ఆ యాలోచన సర్వమును శిశునాగుఁడు మాఱిపోయిన రాత్రినాఁటి సన్నివేశమునకు సంబంధించినదని. చిత్రశిఖండి వారిలోనివాఁ డైనను, రాణియుఁ బరాశరశాస్త్రియు సర్వమునుఁ జిత్రశిఖండికి చెప్పుట లేదు. చిత్రశిఖండి రాజసేవకుఁడుగా మాత్రమే యెక్కువపని చేయుచున్నట్లు, అతనిచేత పనిచేయించుచున్నట్లు వానికిఁదోచెను. చిత్రశిఖండియు నిట్లనుకొనెను. ఒక పని చేయుదుము. ఆ పని మనది కాదు. పరులది. ఇచ్చట పరులనగా తన రాజకుటుంబము. ఈ పని యిందుకు చేయుచుంటిమనఁగా చేతయందు శ్రద్ధ యధికముగా గలిగెడు మాట నిజమే. మనకు దానివలనఁ బ్రయోజనము లేనప్పుడు తాదృశమైన శ్రద్ధాధిక్యము సంపాదించుటకు దాని హేతు పరిజ్ఞానము కావచ్చును. మన మా పని చేయుట మనభృతికొఱకు. నుయ్యి త్రవ్వుమన్నాఁడు. సేవకుఁడు త్రవ్వుచున్నాఁడు. జల పడును. పడదు. వానికేమి?

త్రవ్వించుకు వాని కింత యని యిత్తురు. వాఁ డిచ్చెడి ధన మును వాంఛించి వీఁడు చేయుచున్నాఁడు. అతఁడిచ్చునన్న ధనమే యితనికి శ్రద్ధాహేతువు. చిత్రశిఖండి తానుకూడ నట్టివాఁడేనా ? తా నీవ్యవహారములో దిగకపోయినచో నతనికి మాసికముగా వచ్చెడు భృతికి లోపమేమికలదు? అయినను ఈ వ్యవహారమును త్రవ్వినవాఁడు తాను. అందు చేత తద్ధేతు పరిజ్ఞానమునందు తాను భాగస్వామి కావల యును. త న్నాజ్ఞానమునుండి పరిహరించుటలో రాణికిఁగాని, పరాశరశాస్త్రికిఁగాని వ్యతిరేకభావ మున్నట్లు తనకుఁ బొడ కట్టలేదు. ఈ వివాహము తత్పూర్వ పరిస్థితులు వీనియందు వారిద్దఱు తన్ను బాహిరించినట్లే చిత్రశిఖండి యనుకొనెను. ఇది వట్టి పెండ్లికి పిలచిరమ్మనుట. ఇందులోఁ బ్రాధాన్య మేమి యున్నది? ఉన్నదేమో! లేనిచోఁ దన్ను పంపుట యెందులకు? నిజముగా వారు త నీవ్యవహారమునుండి వెలి వెట్టలేదేమో! తా నడుగలేదు. వారు చెప్పలేదేమో! పెండ్లికుమార్తె వచ్చెను. వచ్చిన తరువాత రెండు మూఁడు దినములలో వివాహము జరుగవచ్చును. కాని తాను గిరివ్రజ పురమునకుఁబోయి తాను మఱలివచ్చి వారు వివాహమునకు వచ్చుటకు సామాన్యముగా నొక మాసమైనను పట్టును. ఈ నెలనాళ్ళు వివాహము జరుగదా ? మఱియును ఈ నెలలో నీ పక్షములో నీ తిథినాఁడు వివాహమని చెప్పవలయునని తనతోఁ జెప్పలేదు. తా నడుగలేదు. పోయి పిలిచిరమ్మనిరి. తన తెలివి యేమైనది ? ఈ సంగతి యింటివెగ్గటి నడుగ లే దేమి ? తన కీయూహ గిరివ్రజపురములోనా రావలయును ?

వివాహ మెప్పుడయ్యా! ఎప్పటికి రావలయునని వారడిగినచోఁ దా నేమి సమాధానము చెప్పును. గ్రుడ్లు మిటకరించునా? నాలుక వెళ్ళఁబెట్టునా? ఇప్పటికైనను మాటాడకుండ వెనుకకుఁ దిరిగిపోయినచో నేమగును? పిలచితివా యని వా రడుగగా నీ కారణముచేతఁ బిలువలేదనఁగా నాకారణము నిచ్చటనే తొలుత నిర్ణయించుకొనలేక పోయితివా యని వీరనఁగా దారపుపోగులేని యాసులోని కండెవలెఁ దా నటు నిటు తిరుగుటయా తన పని? తన తెలివి యే మైన దె? బయలుదేరువేళఁ దనకేదో మైకము క్రమ్మినది. పరాశర శాస్త్రి క్రమ్మించినాఁడా? ఈ ప్రయోగము తనమీఁద కూడఁ జేయవలయునా? ఏది ఎట్లు జరుగునో అది యట్లు జరుగును. వివాహలగ్నము తరువాతఁ బెట్టి వార్త పంపించవచ్చును. వివాహము జరుగుచున్నదన్న విషయము వారికిఁ దెలియవలయును గదా? అందుకని పంపించియుందురు. గిరివ్రజపురమునకుఁ జిత్రశిఖండి చేరెను. రాజద్వారము సమీపించెను. తాను కాశీనగర రాజోద్యోగినని చెప్పెను. వేదమరీచితోఁ జెప్పవత్తునని దౌవారికుఁడు పోయెను. చిత్రశిఖండి యచ్చటనే కూర్చుండెను. చాలసేపు కూర్చుండెను. దౌవారికుఁడు చిట్టచివరకు వచ్చి రాజమహిత వేతేపనిమీఁద నున్నదని యానాఁడు చూచుటకు వీలులేదని చెప్పెను. చిత్రశిఖండి "ఇది చాల ముఖ్యమైన వార్త. మా రాణిగారు - చంద్రమతీదేవిగారు మీ రాణిగారైన వేదమరీచిగారితో నంటనే యీ వార్తనుఁ జెప్పవలయునని నా కాజ్ఞాపించిరి. నే నాగుటకు వీలులేదు. మఱలఁ బోయి విన్నపముచేసి రమ్మని యనగా

నా దౌవారికుఁడు చెప్పివత్తునని వెళ్ళి మఱల వచ్చి రేపు ప్రొద్దున చూఁడవలయునేగాని యీ నాఁటికి వీలులేదని చెప్పెను. చిత్రశిఖండికి నొక విడిది యేర్పాటు చేసెను. ఆ విడిది రాజసౌధము నంటియుండెను.

ప్రొద్దుగ్రుంకెను, చీఁకటిపడెను. ప్రొద్దుపోయెను. అంతయు నిశ్శబ్దముగా నుండెను. మేల్కొన్న ప్రాణి రాజాంతఃపురములం దున్నట్లు కన్పించలేదు. చిత్రశిఖండికి నిదుర వచ్చుటలేదు. తనకేర్పాటైన మంచము మీఁదఁ బరుండి యుండెను. ఆ మంచమునకు దగ్గఱగా నొక పెద్దపీట యున్నది. దానికానుపీట యున్నది. దానిమీఁద పట్టుపరుపులు వేసి యున్నవి. ఆ యాసనముయొక్క స్థితి చిత్రశిఖండి ప్రొద్దుట నుండియు చూచుచునే యున్నాఁడా? ఇప్పుడా యాసన మచ్చట నూత్నముగా నెలసినదా? చిత్రశిఖండి నిదుర రాకున్నను కనులు మూసికొని పరుండియుండెను. ఒకసారి కనులు తెరచెను. ఆ యాసనము కనిపించెను. ఇదివఱకా యాసన మచ్చట నున్నదని తానేల గుర్తించలేదు? ఇది యతిథుల కేర్పడిన విడిది. అతిథులు విశ్రాంతి తీసికొనుటకై యీ యాసనమచ్చటనే యుండి యుండవలయును. తా ... మనస్కుఁడై దానిని చూడలేదు. అతఁడు మఱలఁ గన్నులు మూసికొనెను. కొంతసేపటికి మఱలఁ గన్నులు తెరచెను. ఆ యాసనము మీఁద నొక స్త్రీ కూర్చుండి యుండెను. ఆమె నిదివఱకు తా నెఱిఁగి యున్నట్లుండెను. అతనికి నిదురపట్టఁ బోవు చుండెను. ఆ సమయములోఁ గన్నులు తెరచెను. ఆమె ... మరీచి యని తెలిసికొనుటకు వానికి రెండు లిప్తలకాలము

పట్టెను. ఆ రెండు లిప్తలకాలము రెండు నిమేషముల కాలముపలె నతని బుద్ధికిఁ దోఁచెను. వెంటనే లేచి నిలుచుండి నమస్కారముచేసి "అమ్మా! తమ దర్శనము రేపు ప్రొద్దుటఁగాని కలుగదని చెప్పినారు. నాయందలి మీ యనుగ్రహముచేత నీయర్ధరాత్రి సమయమునఁ దమరే వచ్చి నాకు దర్శనమిప్పించినారు. అనఁగా వేదమరీచి నీవు తెచ్చిన వార్త యెట్టిది? ఏమని? చెప్పుము? అనెను.

చిత్రశిఖండి యిట్లనెను. "యువరాజునకు వివాహము కాఁబోవుచున్నది. ఆంధ్రదేశపు రాజు తన కూతునిచ్చుచున్నాఁడు. పెండ్లికూతురు వచ్చి కాశీనగరముననే యున్నది. లగ్నమింకను నిర్ణయింపఁబడలేదు. తమరితోఁ జెప్పవలసినదని నన్నుఁ బంపించిరి. తమరు వచ్చిన తరువాత లగ్నమును నిర్ణయింతురేమో! ఊరకే యీ వార్తమాత్రమే మీకుఁ జెప్పి రమ్మనిరి." వేదమరీచి "ఎవరు చెప్పుమనిరి? శిశునాగుఁడా? రాణిగారా?" యనెను. చిత్రశిఖండి యిట్లనెను. "తల్లీ! రాణిగారే చెప్పుమనిరి. మీ రిచ్చట నున్నప్పుడు మీ రెఱుఁగని యొక బ్రాహ్మణుఁడు నేఁడు సర్వ రాజకార్యములయందుఁ బ్రాముఖ్యము వహించి యున్నాఁడు. ఆయన పేరు పరాశరశాస్త్రి. ఆయన చెప్పుమన్నాఁడు."

వేదమరీచి "నీవు తెల్లవారకముందే లేచి పొమ్ము." అనుచుండగా నట వేదమరీచి లేదు. ఒక మహాదుఃఖమూర్తి కుప్ప కూలి యున్నది.

# ౧౫

నలువురును వింధ్యపర్వతమునందున్న యిరువది దుబ్బులనుఁగోసి వేఱ మూటకట్టి, దుంపలనుఁ బెల్లగించి వానిని వేఱ మూటఁగట్టికొని ఖడ్గపాణులై యిద్దఱు నిదురపోవుచున్నప్పు డిద్దఱు మేల్కొనియుండుచు, ప్రయత్నము లేకుండనే యాహారము లభించినదానినే భుజించుచు, నొక్కఁడు ప్రత్యేకముగాఁ దొలఁగిపోవలసి వచ్చినచో నల్వురునుగలిసియే పోవుచు, నిన్ని యిబ్బందులు పడిరని చెప్పుటకు వీలులేక వారి తీవ్రమైన స్వభావమును, దీక్షమైన పట్టుదలయుఁ, జేతులలోని కరవాలములును నీ మూఁడు సాధనములుగా నెలనాళ్ళకుఁ గాశీనగరమునకుఁ జేరిరి. వారు కాశీనగరపు పొలిమేరకుఁ జేరువేళకు రాత్రి రెండుజాములైనది. నగరద్వారములు మూసియుండును. ఆ యర్ధరాత్రిమునందు నగరప్రవేశమునకు వీలులేదు. వారీ నెలనాళ్ళు ప్రయాణముచేసిన సమయములో వారనుభవించిన యిక్కట్టులు మఱల నీయొక్క రాత్రియందే అన్నియు కలిసి సమీపించునా యన్నంతభయము వారికి వేసినది. తత్పూర్వము పది దినములు శ్మశానమున రక్షగానుండుట, కొన్నాళ్లు వింధ్యపర్వతములకుఁ బ్రయాణముచేయుట, ఆప్రదేశమును వెదకి కనుగొనుటకుఁ గొన్నాళ్లుపట్టుట, ఈ ప్రయాణము కొన్నాళ్లు, వారు నల్వురునుఁ జిక్కి శల్యములై యున్నారు. వారి స్వభావములలోనున్న తీవ్రత్వమొక్కటియే

మొక్కవోనిదిగా నున్నది. పూర్వము పదిమందివచ్చి వారి నెదిరించినచో వారిని పదిమందిని వీరు నల్వురును సులభముగా ఖడ్గములతో నరకియుందురు. ఇప్పుడు నల్వురకు నల్వురు వచ్చినచో వారు తట్టుకొనఁగలరా ? ఇంతకు వారిని మనుష్యులైనవారు వచ్చి యెదిరింతురన్న సందేహము లేదు. ప్రొద్దు గ్రుంకినంతనే యిన్నాళ్ళును వారు నడచినంతమేర వారి చుట్టునుఁ దోడేళ్ళును, నక్కలు సంచరించుచునే యుండెను. పగలు వానిపొడ కన్పించుటలేదు. రాత్రులందు నిద్ర పోవలయునన్నచో వారికి భయము వేసినది. ఇద్దఱు మేల్కని యున్నను వీని నెవరో దొంగిలించుకపోదురన్న భయము. అందుచేత వారు పవళ్ళు నిద్రించుటయు రాత్రులందుఁ బ్రయాణము చేయుటయుఁ జేసిరి. ఆ కారణముననే కాశీనగరపుఁ బొలిమేర చేరునప్పటికి యర్ధరాత్రియగుట. వారికెట్లు తెల్లవారవలయును? వారు నడచుచుండినఁగాని వారికి నిద్రరాకుండ నుండదు. నడువవలసిన ప్రదేశము లేదు. తెల్లవారువఱకు మహానగరముచుట్టును తిరిగి వచ్చినచో నెట్లుండును? వారట్లే నిర్ణయించిరి. అందులో వామనుఁడిట్లనెను. "దీనియందేదైన దోషమున్నచో నాదోషము కాశీనగర పరిసరములయందు పుంజీభవించియున్నది. నన్నడిగినచోఁ దెల్లవారువఱకు మనము వచ్చినమార్గముననే వెనుకకుఁ దిరిగిపోయి తెల్లవారిన తరువాత నగరప్రవేశము సేయుదము. ఈ మహానగరముచుట్టును, ఈ రాజసౌధముచుట్టును, రెండువైపుల గంగానది నంటుకొన్నంతమేర నేమికాపున్నదో, ఏవిరోధులున్నారో మనకుఁ దెలియదు. మన మీప్రయాణముచేసిన సమయములో మన

వెంటఁబడి వచ్చుచున్న తోడేళ్ళను చూచితిమి. జంబుకము లను చూచితిమి. ఒక కాలసర్పము మనల వెన్నంటుకొని వచ్చుచున్నట్లు మనకు తెలియును. దూరముగా నెవఁడో పురుషుఁడు మనముందు నడచుచున్నట్లు మనకు తెలియును. అతని నాగుమని పలుసార్లు పిలిచితిమి. వాఁ డాగలేదు. ఆపాము మన వెంట వచ్చుచుండుటయే కాని మనల నేమియుఁ జేయలేదు. మనుజులను చూచి పాఱి పోవలసిన నక్కలును, తోడేళ్ళును మనయందుఁ బద్ధాను రాగులవలె వచ్చుచునే యున్నవి. ఇది యంతయు మనము మోసికొని వచ్చుచున్న దుబ్బులయందు, దుంపల యందు గల ప్రేమమే కాని మనయందలి ప్రేమ కాదు. వానికి మనలనుఁ జూచినచో భయము. మనము కత్తులతో నఱకుదుమని. నిజముగా నా పది తోడేళ్లును నక్కలును మనమీఁద నొక్కసారి పడినచో మనము వాని నేమి చేయఁ గల్గుదుము? మానవులకు సంఘీభావజ్ఞానము కలిగినట్లు జంతువులకు లేదుకనుక మనము సురక్షితముగా వచ్చితిమి. ఇవి తోడేళ్ళును నక్కలును గనుక సరిపోయినది. రేచుకుక్క లైనచో నవి మనల నింత దవ్వు రానీయవు.” అనఁగా తక్కిన మువ్వురిలో నొకఁడు “బిగ్గరగా ననకుము. ఆ దూర మున నడచుచున్న పురుషుఁడు వినునేమో! విని రేచుకుక్క లనుఁ బంపునేమో! అపుడు పరాశరశాస్త్రిగారికి మనము చేయుచున్న యుపకారము వ్యర్థమగును.” అనెను. మఱియొకఁ డిట్లనెను. “వాఁడు నక్కలకు గురువు. తోడేళ్లకు స్నేహి తుఁడు. రేచుకుక్కలకు వానికి సంబంధము లేదు. ఓయూ!

రేచుకుక్కలనగా నేమి? వానికి స్వపరభేదము లేదు. అవి మనలను తిన్నచో వానినిఁగూడఁ దినును. పది రేచుకుక్కలే మన వెంట వచ్చినచో మన కింత యలసటయే లేదు. అవి మనలనుతినును. ఈ తోడేళ్ళను తినును. ఈ నక్కలను తినును. ఆ సర్పమును తినును. ఆ మనుజునికూడ నెన్నాడి తినును. వాని యాకలి యింతయని చెప్పుటకు వీలు లేదు. ఒక రేచు కుక్కనుఁ బట్టుకొనుము. దాని గొంతుకలో నొక గొట్టము పెట్టి యొక మహారణ్యములోని సర్వజంతువులను చంపి ఆసర్వ రక్తము దాని గొంతులో పోయుము. రక్తమంతయు త్రాగిన తరువాత నది యేమనునో తెలియునా? ఇంకొక యరణ్యము లేదా? ఆ యరణ్యములోని జంతువులనుఁగూడ చంపి యా రక్తమునుఁగూడ నా గొంతులోఁ బోయుమనును. రేచుకుక్క యనఁగా నిది. అనఁగా వామఁనుడు "ఓయీ! రేచుకుక్కలు గుంపులు గుంపులుగాఁ దిరుగుఁగాని యొకఁ డొక్కఁడు తిరుగవు. నీవు రేచుకుక్కను పట్టుకొనలేవు. దాని నోరు తెరువలేవు. అది దాని నోటిలో గొట్టము పెట్ట నీయదు. అడవిలోనున్న సర్వజంతువులను చంపువఱకు కదియాగదు. తెలిసినదా" యనెను. ఆ పూర్వుఁడు మఱల నిట్లనెను. "ఓయీ! యడవిలోని రేచుకుక్కలను పట్టుకొనుట కష్టమే. కాని రేచుకుక్కలకు చెందిన యొక జాతి కలదు. రేచుకుక్కలకు నూరకుక్కలకు నెప్పుడో సంబంధము కలిగి యొక జాతికుక్క పుట్టును. ఊరకుక్క యాఁడుది. రేచుకుక్క మగది. రేచుకుక్కల గుంపులలోనుండి యొక కుక్క విడివడి యడవులకు సమీపముననున్న పల్లెలలో నట్టి సంఘటనము

జరుగును. ఆ యూరకుక్క పిల్లలను బెట్టును. నాలుగైదు పిల్లలను పెట్టును. అవి యన్నియు బ్రతుకవు. ఒకటి బ్రదుకును. ఇట్టికుక్కలు చాల చెదరుగా నుండును. అది చూచుటకు నూరకుక్క. స్వభావముచేత రేచుకుక్క. వేటకాండ్రు దాని నుపయోగించికొందురు. దాని స్వభావమే చిత్రము. దానికి కోపము వచ్చినదో రాలేదో నీకుఁ దెలియదు. అది దారిలోఁ బండుకొని యుండును. నీవేదో సామాన్యపు కుక్క యనుకొని దానిని ఛీ పొమ్మని యదలింతువు. అది దారినుండి లేచిపోవును. కాని నీ వెంటనే వచ్చుచుండును. ఎక్కడనో దానికి వీలైన ప్రదేశమునందు నిన్నుఁబట్టికొని యది నీ ప్రాణములు పోవువఱకు నిన్ను వదలదు. రేచుకుక్కలు పులినిఁ బట్టికొనును. పులి యాకాశములో మూఁడు నాలుగు గజముల యెత్తెగురుచు గెంతుచు మహావేగముతో నడవిలోఁ బరుగెత్తుచుండును. ఆ వేగములో నా యెగురుటలో నా క్రిందఁ బడుటలో దానిని పట్టుకొనిన కుక్కలు కొన్ని చావవలయునేగాని పట్టు వదలవు. రేచుకుక్క యనఁగా నది. దానికిఁ బుట్టిన ఈ యూరకుక్క సరిగా నట్టిదే. రేచుకుక్కకుఁ దెలివి యుండదు. దీనికిఁ దెలివియు నును. ఇంతే భేదము.”

# ౧౬

చిత్రశిఖండి వచ్చెను. రాణియుఁ బరాశరశాస్త్రియు నిద్దఱు కూర్చుండిరి. చిత్రశిఖండి జరిగినదంతయుఁ జెప్పెను. వారిద్దఱును నివ్వెఱపోయిరో పోలేదో తెలియ లేదు? వారిట్లే వేదమరీచి నటించునని యిదివఱ కనుకొని తాను చెప్పగా మనమనుకొన్నట్లే జరిగినదని వారనుకొన్నట్లు వారి మొగములలోఁ గనిపించినదా? తెలియదు. వారు చిత్రశిఖండితో మఱల నేమియు ననలేదు. చిత్రశిఖండియే యిట్లనెను. "రాణిగారు నన్ను వివాహమునకుఁ బిలిచి రమ్మని పంపిరి. లగ్నమిప్పుడని చెప్పలేదు. ఆమె నన్నడుగలేదు; గనుక సరిపోయినది. అడిగినచో నేనేమి యైయుండెడి వాఁడను. అనఁగాఁ బరాశరశాస్త్రి 'యోయీ! యువరాజునకు వివాహము జరుగుచున్నదనఁగా వేదమరీచికి నింతదుఃఖ మెందుకయ్యా! ఆమె యంత దుఃఖపడుచున్నదని నీకుఁ దెలిసినది. కనుక సరిపోయినది. మఱి యింకొకరికిఁ దెలిసినచో మనమర్యాద యేమగును? ఈసంగతి తెలియఁదగిన వాఁడవు నీవు దప్ప మఱి యింకెవ్వరు? ఆమె నీకుఁ బట్టబగలు దర్శనమేల యీయలేదు? అర్ధరాత్రమున నీవున్నచోటి కెందుకు వచ్చెను? నీవేమి వార్త తెచ్చితివో తెలియదు. ఎట్టి వార్తయో తెలియదు. నలుగురున్నప్పుడు నీవీవార్త యామెతోఁ జెప్పితివనుకొందుము. ఆమెయంతటి దుఃఖితురాలయ్యెడిదికదా! శిశునాగు

నకు వివాహమగుచున్నదనఁగా నామె యెంత దుఃఖించినచో యచటనున్న వారంద ఱేమనుకొందురు? కనుక నీవు తీసికొని వెళ్ళిన వార్తా స్వరూపమామెకుఁ దెలియదు కనుక తెలియని వార్త యిట్టిదని నిర్ణయించుటకు వీలులేదు కనుక నా వార్త యొకవేళ చెడ్డదియైనచోఁ దనకు మర్మాఘాతియైనచో నలువురిలోఁ దానట్లగుట విపరీతముగాఁ గనిపించును గావున నర్ధరాత్రమున నీవద్దకు వచ్చెను. ఆమె పడ్డ యనుమానము నిజమైనది. ఆమె యీ మాట విని యట్లైనదని నీకుఁ దప్ప మఱి యెవ్వరికిఁ దెలియదు. నీవు మాతోఁ జెప్పవచ్చును. ఆమె అంతటి దుఃఖములో నుండి మరచిపోయినది గాని లేనిచో నీతో నిట్లు చెప్పెడిది. 'ఓయీ! చిత్రశిఖండీ! నేనిట్లైతినని చంద్రమతీదేవితోఁ జెప్పకుము. పరాశరశాస్త్రితోఁ జెప్పకుము.' అని." అనఁగాఁ జిత్రశిఖండి "శాస్త్రి గారూ! మిమ్మామె యెఱుఁగనే యెఱుఁగదు కదా! మీతోఁ జెప్పవద్దని యెట్లు చెప్పును?" అనఁగాఁ బరాశరశాస్త్రి నవ్వి చిత్రశిఖండీ! నామాట వినుము. నే నీ వ్యవహారములోనికి దిగుటకు హేతువు నీవు. రాజకుమారుఁడేదియో యాపదలో నిరుకుకొన్నాఁడని గుర్తుపట్టినది నీవు. నిన్నుఁబట్టి నే నింత లోనికి దిగితిని. నీ నుండియు దాచవలసిన వ్యవహారమేమియు నిచట లేదు. ఎప్పుడు నీ సాహాయ్యము కావలయునో యప్పుడు నేను ని న్నర్థింతును. నీవు లేకుండ నే నొక్కఁడనుఁ జేయఁగల పని యిది కానేకాదు. ఇంతటి రహస్యమునకు నిన్నుఁ బంపించితిని. తెలిసినదా! అనవసరముగాఁ గోపమును పెట్టుకొనకుము. నాపేరు నీవు వేదమరీచితోఁ జెప్పితివి. అందుచేత

నా పేరామెకుఁ దెలియును. తెలిసినదా ?" యనఁగాఁ జిత్ర శిఖండి నివ్వెఱపోయెను. "స్వామీ! రాజవంశమేదో యాపదలో నున్నదనియు నిది భౌమము దివ్యము కాని నడిమి మేరలోనున్న వ్యవహారమనియు నచ్చముగా భౌమములైన మా శక్తులు దీనికిఁ జాలవనియు దివ్యమైన శక్తులుఁగల తమరే దీనిని సాధింపఁ గలరనియు మిమ్ము నేను వచ్చి యర్థించితిని. అర్థించినందుకు నేనిపుడు విచారించుట లేదు. ఈ పరమ రహస్యములన్నియు నాకు మీరు చెప్పుట లేదని నా మనస్సులోఁ గొన్ని యూహలు వచ్చినమాట నిజమే. ఆ సంగతి మీకుఁ దెలిసెను. మీ రచ్చట నామెతోఁ జెప్పితినని మీకుఁ దెలిసెను. ఇట్టి దివ్యశక్తులు గలవారు కనుకనే మీ రీ యాపదఁ గడవఁ బెట్టఁగలరనియు, నోపి శుభంబైన దాని నొడఁ గూర్పఁ గలరనియు నాయాశ. నేనింక సందేహపడను. కాని వేదమరీచి యువరాజుగారియొక్క వివాహవార్త విని యెందుకట్లుండిపోయినది ? నాకుఁ దెలియలేదు." అనఁగాఁ బరాశర శాస్త్రి "ఆమె దుఃఖమునుండి తెప్పిరిల్లువఱకు నీవచట నుండలేదు. నీవు రాజభృత్యుఁడవు. రాజవంశీయులు దుఃఖించుచోట సుఖించుచోట యథార్థమైన రాజభృత్యుఁడు నిలువఁడు. అందుచేత నీవు వచ్చితివి. ఎట్లును వచ్చితిమిగదా యని దారిఁ బట్టితివి. ఓయి చిత్రశిఖండీ? నీ యాదాత్మ్యమిచ్చటనే యున్నది. రాజుగాని రాణిగాని యువరాజుగాని రాజదుహితలుగాని దుఃఖించుచుండగా నంచుండరాదన్న ధర్మము తెలిసిన రాజసేవకు లెంతమంది యుందురు ? నీ రాజసేవక లక్షణమట్టిది. కనుకనే నేను నీ ధైర్యము చూచికొని

యిందులోనికి దిగితిని. వేదమరీచి యట్లెందుకు దుఃఖించినదని నీవు నన్ను ప్రశ్నించుచుంటివి. అట్లు ప్రశ్నించెడి వాఁడు నీవంటి వాఁడేయగును. ఇంకొకఁడు ప్రశ్నించఁడు. ఎందుకు దుఃఖించెనో వానికి వెంటనే తెలిసిపోవును. నీకుఁ దెలియ లేదనఁగా నీ జన్మలోని యౌదార్యమట్టిది. నీ మనసులోని యౌదార్యమట్టిది. ఇప్పుడు యువరాజువివాహము చేయ వలయును. వధువు వచ్చి కోటలో నున్నది. ప్రతిక్షణ ప్రతీక్షాపరాయణురాలుగా నున్నది. ఆమె వచ్చి యిరువది దినములైనది. నేనామెవద్దకుఁ బోలేదు. మాటాడలేదు. నీవు వచ్చిన తరువాతఁగాని నేను మాటాడుటకు వీలులేదు. ఆమె కిచట నన్ని సదుపాయములు జరుగుచున్నవి. రాణిగారు ముప్పూటలు పోయి కన్నబిడ్డను చూచినట్లు చూచుచున్నది. ఓయి. చిత్రశిఖండీ! ఆమె యువరాజ వధువు. లోకోత్తర సౌందర్యవతి. నీ వామెను చూడలేదు. ఆమె సౌందర్యమిట్టి దని చెప్పుటకు వీలులేదు. పూర్వ మామెచిత్రము చూచిన యువరాజున కామె మహాసౌందర్యవతియని తెలియును. ఆయన యువకుఁడు. తన్నుఁ బెండ్లాడుటకు రాజకుమార్తె వచ్చి తన కోటలో నున్నది. ఆమెను తాను చూడవలయు నన్నచో నభ్యంతరమేమియు నుండదు. అభ్యంతరములున్నను వానినిఁ దొలఁగించికొని దొంగచాటుగా నామెనుఁ జూచు టకు యువకుఁడైన యెట్టివాఁడైనను ప్రయత్నము చేయును. యువరాజీవిషయములోఁ జేయుచున్న ప్రయత్నమేలేదు. ఆమెను చూడవలయునన్న కోర్కెయే లేదు. ఇది యాశ్చర్య కరమైన విషయము కదా!” అనఁగాఁ జిత్రశిఖండి మఱి వివా

హము చేసికొననునేమో! యనఁగాఁ బరాశరశాస్త్రి చేసి కొందునని వాగ్దానమిచ్చినాఁ డనెను. చిత్రశిఖండి "యెందు కిచ్చెను? తాను ప్రేమించని స్త్రీని తానెందుకు వివాహమాడ వలయును." అనఁగాఁ బరాశరశాస్త్రి "సరేనయ్యా! తాను ప్రేమించలేదు. తన్నుఁ బ్రేమించి మూఁడు వందల యామడల దూరమునందుండి యొక రాజకుమార్తె వచ్చెను. ఆమె నెవఁడు తిరస్కరించును." అనఁగాఁ జిత్రశిఖండి "ఆమెనుఁ జూడవలయునని యెవఁ డారాటపడుఁడు?" అనఁగాఁ బరాశర శాస్త్రి "అతఁడు వివాహము చేసికొనునని తెలియఁగా నొక స్త్రీ యంతదుఃఖించినా, అతఁ డారాటపడుఁడు" అనెను. చిత్రశిఖండి నివ్వెఱపోయెను.

## ౧౭

పరాశరశాస్త్రి వంకజాబిల్లివద్దకు వెళ్లెను. "అమ్మా! మీరువచ్చి నెలనాళ్ళయినది. ఇంతవఱకు మీ దర్శనమే చేయలేదు నేను. మేము మీ యాశ్రితులము. తమకు రేపు రాణి గాఁబోవుచున్నారు. మీ దయ సంపాదించుట మా జీవితములోఁ బ్రధానమైన విషయము. ఇన్నాళ్లు తమ దర్శనము చేయనందులకు నన్ను మన్నింపవలయును" అని పరాశరశాస్త్రి యొక పీఠముమీఁద నాసీనుఁ డయ్యెను. వంకజాబిల్లి యాయనవంక పొలిమేరవద్దర తోలుతఁ జూచి నప్పు డెట్లు చూచెనో అట్లే చూచెను. పరాశరశాస్త్రి గుస్తి

పట్టెను. అత్తగారి చరణములకు నమస్కరించి వృద్ధ క్షత్రియ స్త్రీలకు నమస్కారము చేసి అప్పుడు వంకజాబిల్లి తనవంకఁ జరిగి నిలుచుండెను. ఆమె చేతులు నమస్కారము చేయుటకు జోడించి యుండలేదు. చేయఁబోవుచున్నట్లు నుండలేదు. వృద్ధ స్త్రీలకు నమస్కరించి యీ నమస్కారము చేసినప్పటి జోడింపు వదలఁబోవుచుఁ దనకు నమస్కారము చేయ వల యునా? వలదా? యన్న స్థితిలో నా చేతుల యుంచుట జరిగినది. అత్తగారికి నమస్కరించినపుడు కన్నులలో భక్తి యున్నదేమో తెలియదు. వృద్ధ స్త్రీలకు నమస్కరించినపుడు కన్నులలోఁ గొంత గౌరవ మున్నట్లు కనిపించినది. తనవంకఁ జూచినపుడు గౌరవము లేదు. భక్తిలేదు. భయములేదు. ప్రేమలేదు. ఏదో యొకానొక యాశారేఖ భాసించుచుండెను. తా నేదో యొక విచిత్రమైన పరిస్థితులతో నున్నట్లునుఁ ద న్నా పరిస్థితులలోనుండి రక్షించువా రెవరా యనుకొను చున్నట్లును తన్ను జూచినంతనే తానా యాధార హేతువైన పురుషుఁడు కాఁదగునా యన్న యాశాంకూరము వంకజాబిల్లి కనులలోఁ గనిపించెను. ఇప్పుడును సరిగా నామె యట్లే నిలుచుండెను. తాను కనిపించినంతనే వంకజాబిల్లి లేచి నిలుచుండెను. ఆ చేతు లట్లే పెట్టెను. ఆ నిలుచున్న వైఖరి యట్లే యుండెను. ఆ కన్నులలోని ప్రతీక్షాభావము మఱల నిప్పుడు తెచ్చికొన్నదా? నెలనాళ్ళనుండి యా భావ మా లోచనములయం దట్లే మిగిలి యున్నదా? అత్తగారు ముప్పొద్దుల వచ్చుచున్నది. కడుపున గన్నబిడ్డనువలెఁ జూచుచున్నది. ఇంకను పెండ్లి కాకపోయినను యువరాజు

భార్య క్షేమమర్యాదలు జరుగవలయునో యీ మర్యాదలన్నియు వంకజాబిల్లికి జరిపింపఁబడుచున్నవి. ఆమె కనుసన్నల ననుసరించి యీమె సర్వవాంఛలును కొనసాగింపఁబడు చున్నవి. ఆమె తన భర్త కాఁబోవువానిని చూడవలయునని యడుగ లేదు. ఆమె యడిగినచోఁ జంద్రమతీదేవి యువరాజు నామె వద్దకుఁ బంపించి యుండెడిదే. ఇంత ప్రేమగానున్నను వంక జాబిల్లి యుత్తగాని నమ్ముటలేదు. ఒక కుటిలమైన రహస్య మైన వ్యూహములోఁదాను తగుల్కొన్నాననియు,యీవ్యూహ ములోని బహ్వంశములలోఁ దన యుత్తగారొక్క ద్రుక యనియు నామెయూహ. అట్లే పరాశరశాస్త్రియు కావచ్చును. ఇతఁడు కాఁడేమో యన్న యాశ. ఇట్టి స్థితిలో వంకజాబిల్లి యున్నది. నిస్సహాయురాలు. ఆమె స్థితి పరమ దుర్భర ముగా నున్నది. ఆ దుర్భరత్వముయొక్క లక్షణ మిట్టిదని చెప్పుటకు వీలు లేదు.

పరాశరశాస్త్రి యీ చిన్నరాణినిఁ గూర్చుండ నియ మించెను. ఆమె కూర్చుండెను. అతఁ డిట్లనెను. "అమ్మా! నీది యొక విచిత్రమైన భాగధేయము. ఏ గురువు మిమ్ము మా పొలిమేరవద్దకుఁ దీసికొని వచ్చెనో వాఁడు తిరిగి రాలేదు. ఆతఁడు మీతోఁ గలిసి యీ రాజనగరమునుఁ బ్రవేశింప నెంచినాఁడు. వాఁడు మీతోఁబాటు వచ్చినచో నీ జీవితము మఱియుఁ గ్లిష్ట సమస్య యైపోయెడిది. నేను వానిని రానీయ లేదు. వాఁడు గురువుగా నీ తండ్రి నగరమునందు నెలకొనెను. నీ తండ్రిని మంత్రులనుఁ దక్కినవా రందఱినిఁ దనకు దాసు లుగాఁ జేసికొనెను. వాఁడు గీసినది గీత. వ్రాసినది వ్రాతగా

వాఁడు వ్యవహరించెను. నీవు వాని కెదురు తిరిగితివి. నిన్నే మియుఁ జేయలేకపోయెను. నీ తండ్రిమాటకూడ నీవు వినలేదు. నీ మీఁద నతని కధికారము లేకపోయెను. నీ విచ్చటికి వచ్చితివి. ఇచ్చటికి బయలుదేరుటకుఁ బూర్వము నాల్గు దినములవఱకు నీ వంగీకరించనే లేదు. నీ వెంత బాధ పడితి వనగా నీకు నంతఃపురములో నిద్రయేపట్టలేదు. కొన్ని రాత్రులు నీవు నిద్రలేకుండఁ గడపితివి. ఆనాఁ డుద్యానవనములోఁ బరుంటివి. నీకుఁ దెలియకుండ నీకు నిదురవచ్చెను. నిదుర మేల్కాంటివి. మేల్కాన్నంతనే నీ గర్భగోళమునం దేదో నీకు బరువుగాఁ దోచెను. ఏదో సన్నని త్రాడు వంద చుట్టలు చుట్టికొని నీ కడుపులో నున్నట్లు నీకు భాసించెను. నీమనస్సు నీ స్వాధీనములో నున్నది. నీ యూహాలు తొల్లిఁటివలెనే యున్నవి. కాని యప్పటినుండి నీవు నీ తండ్రియు నీ గురువును జెప్పిన మాటలను గాదనలేక పోయితివి. వారు నిన్ను కాశీ నగర యువరాజునకు భార్యనుఁ జేయుదు మనిరి. నీ కిష్టము లేదు. నీవు మాటాడలేదు. ఈ కథయంతయు విపరీతముగా జరిగెను. నిన్ను బయలుదేరఁ దీసిరి. నీ యంతట నీవైనచో విసము త్రావి చచ్చెడి దానవు. కాని బయలుదేరితివి. నీ జగన్మోహనమైన సౌందర్యమునకు, నీకుఁగల స్వాతంత్ర్యమునకు, నీకుఁగల తుచ్ఛభావములయందలి ద్వేషమునకు, నీకుఁగల జ్ఞానమునకు, నా గురు వెవఁడో మాయావి, నాస్తికుఁడు, దుర్జనుఁడు, నా తండ్రి వీని వలలో పడిపోయినాఁడన్న యభిజ్ఞ చెడిపోకుండ పట్టికొని రాఁగలిగినంత విస్పష్టమైన జ్ఞానతరంగము నీ మనస్సులో నిలచియున్నది. అట్టి నీకు

భగవంతుఁ డిట్లు వ్రాసినాఁడు. తల్లీ! కాలము చమత్కార మైనది. నీవంటి స్త్రీని పూర్వయుగములలో భగవంతుఁడు సృష్టించి యున్నచో నీకు యోగ్యుఁడైన పురుషునిఁగూడ సృష్టించి యుండెడివాఁడు. ఒక పరమేశ్వర భావసహితమైన, పరమ ధర్మానుష్ఠాన యోగ్యమైన, యధర్మ విధ్వంసకమైన, ధర్మ ప్రతిష్ఠాపనా పరాయణమైన యొక సంతానము మీ సంయోగమువలనఁ గలిగి యుండెడిది. శకుంతలా దుష్యంతుల సమాగమమువలన భరతుఁ డుదయించునట్లు. కాలము మారినది. నీవంటి పరమోత్తమురాలైన స్త్రీని బ్రహ్మ సృష్టించకుండ నుండలేఁడు, అట్లే పరమోత్తముఁడైన పురుషునిఁగూడ సృష్టించును. అట్టి యిద్దఱను దంపతులుగా చేయుట ఈ యుగమునందు బ్రహ్మశక్తి కతీతమైన విషయము. కాని నిన్నుఁగూర్చి నీ వెక్కువ దిగులు పడనక్కఱలేదు. నే నున్నాను. నీ కాపద రానీయను. నీ బ్రతుకు వృథా పఱచను. కాని నా చేతనైనది స్వల్పమైనది. అంతకు నేనుఁ బ్రయత్నింతును. నీతో నొక్కమాట చెప్పవలయును. తల్లీ! లోకమునందు జనులందఱు నున్నారు. అందఱును శరీరధారులు. శరీరము వేఱు. లోనున్న జీవుఁడు వేఱు. ఎప్పుడో తజ్జీవ సంస్కారాను రూపమైన శరీరము రెంటికి యోగ్యమైన భాగధేయములును గలుగుచుండును. ఒకఁడు పరమ సౌందర్యవంతుఁడు. వాని భార్య కురూపి యగును. ఒకఁడు గాయకుఁడు వానిభార్య కంఠస్వరము గార్దభస్వరము. భర్త విద్యావంతుఁడు. భార్య వట్టి పశువు. భార్య అట్టిది కావచ్చును. భర్త యిట్టివాఁడు కావచ్చును. ఇది కలికాల

లక్షణము. రాముఁ డున్నప్పుడు సీత యున్నది. నలుఁడున్న ప్పుడు దమయంతి యున్నది. సత్యవంతుఁడున్నప్పుడు సావిత్రి యున్నది. రుక్మిణీదేవి యున్నప్పుడు కృష్ణుఁ డున్నాడు. సుభద్రార్జును లేకకాలమందు జన్మించిరి. ఇప్పుడట్లు జరు గదు. కలియుగము ప్రవేశించి పదునొకండువందల యేండ్లు జరిగినది. కొన్ని లక్షల సంవత్సరములు జరుగవలయును. అప్పటి కెట్లుండునో తెలియదు. ఒక్కటి మాత్రము చెప్పఁగలము. నీవంటి స్త్రీలు ధారుణిలో జన్మింపరు. నా వంటివారుండరు. నావంటి వారున్నారన్న చో విశ్వసించెడి వారే యుండరు. నీ యీస్థితి నాకెట్లు తెలియును? అంత యునుఁ గన్నులతో చూచినట్లు చెప్పుచుంటినిగదా! ఎట్లు చెప్పఁ గలుగుచున్నాను? నేను మంత్రానుష్ఠాన పరుఁడను. ఆ మంత్రాధి దేవతలు నాకు సర్వమును విశదీకరింతురు. మం త్రములున్నవని, తదధి దేవతలుందురని, లౌకికము కాని యొక స్థితియున్నదని, భూతప్రేత పిశాచము లున్నవని, మనుష్య శక్తి కతీతములైన క్రియలును క్రియాపరిణామము లును సంభవించునని, కలి పోనుపోను విశ్వసించరు. పాంచ భౌతికమైన విషయములకంటె భిన్నములైనవి, యతీతము లైనవియు నుండుననియు వానివలన వచ్చిన యాపదలు మంత్రశక్తులద్వారా నివారింపఁబడఁ గలవనియు వారు విశ్వ సింపరు. అందుచేతఁ బ్రయత్నము చేయరు. చేసిన వారిని విశ్వసించిన వారిని మూర్ఖు లందురు. మూఢ విశ్వాసము కలవా రందురు. అని యిట్టి యాపదల ననుభవింతురు. ఒకనిని భూత మావేశించును. పిశాచము పట్టుకొనును. వైద్యుఁడు

వచ్చి వానినిఁ బరీక్షించును. రోగమే యుండదు. నాడీపరీక్ష తెలియని వైద్యులు పుట్టుదురు. నాడీపరీక్ష తెలిసినచో భూత నాడి యని యాడుచుందును. పిశాచావిష్టుని నాడియొక్క లక్షణము వేరు. వారికది తెలియదు. వీఁడు వ్యాధిలేదనును. వానిని మృత్యువు గ్రసించును. తమ మానవ జ్ఞానము వైద్య జ్ఞానమునకు దాటినవిషయ మందురు. అవి వానికి దాటిన విషయము లున్నవని యంగీకరింపరు. ఎప్పుడో పుట్టఁబోవు వారి మాట మన కెందుకు ? ఇప్పటి నీస్థితి యెట్లున్న దనగా సామాన్యమైన రాచకూతురువలె నటించుచున్నావు. అత్తగా రన్నచో గౌరవమున్నది. ఎవరియం దెట్లు ప్రవర్తించ వల యునో యట్లు ప్రవర్తింతువు. మనస్సులో నీ వివాహము నీ కేమియు నిష్టములేదు. ఇష్టము లేదని నోటితో ననలేవు. వివాహ విషయమున మాత్రము నీ శరీరము నీ యదుపులో లేదు. నీకు వివాహ మగును. నీకు సంతానము కలుగును. అంతవరకు నిస్సంశయము. నీవు నీ భర్తను ప్రేమింతువో, అతఁడు నిన్ను ప్రేమించునో యెవ్వరికిని తెలియని విషయము. ఈ మాటలు నీతోఁ జెప్పుటకే వచ్చితిని. వివాహము జరు గును. ఇది తప్పదు గనుక నీవు మనస్సును కష్టపెట్టికొనకుము. ఏది యెట్లు జరుగునో అది యట్లు జరుగును. పరమేశ్వరుఁ డది యట్లు జరుగవలయునని వ్రాసియున్నాఁడు. దానినిఁ గూర్చి మన మేమియుఁ జేయలేము."

అంత వంకజాబిల్లి చేతులు కనులమీఁద నుంచికొని యేడువ నారంభించెను. ఏడ్చుచుండెను. పరాశరశాస్త్రి యామె నోదార్చలేదు. ఎదురుగా నట్లే నిలుచుండెను.

కొంతసే పైనతరువాత నామె కనులమీఁదినుండి చేతులు తీసివేసి కన్నీళ్ళు తుడిచికొనెను. పరాశరశాస్త్రి యిట్లనెను. "అమ్మా! నీ వేడువవలయునని నెలా పది దినములనుండి కోరుచుంటిని. ఏడుపు వచ్చుచు నుండెను. బయటకు రాదు. ఈ బాధ యిన్నాళ్లు పడితివి. ఎవరినిచూచి యేడ్తువు? ఎవరిని చూచి యేడ్చినచో మన దుఃఖ మువనయించునో వారు నీ కింతవఱకుఁ గనిపించలేదు. నేను కనిపించితిని. నేను కని పించుట కాదు. నన్నుఁజూచి యేడ్వవచ్చునని నీకు బోధించి తిని. నీ దుఃఖము వెలికి వచ్చెను. నేను దీనినే వాంఛించితిని. యువరాజుతో వివాహము జరుగకముందు నీ యీగుండె బరువు దిగవలయును, ఆ గుండెబరువుతో నీవు వివాహమాడినచో నతనియందు సంతానము కన్నచో కలిగెడి సంతానము తా నెట్టిదగునో? ఇప్పుడు కలిగెడి సంతానముకూడ విలక్షణమై నదే యగును. కాని అంత ముంచుకొనిరాదు. అని యను కొనుచున్నాను. ఓ తల్లీ! నీ సౌందర్యమేమి? నీ గర్భము నం దాదుష్టుఁడు ప్రవేశపెట్టిన ధూమరజ్జు సంతానమేమి? నీవు నిదురపోవుచుండగా నిన్నింకొకరీతిగా తన వైపునకు త్రిప్పుకోలేనివాఁడై వాఁడు నీగర్భమునందొక నాస్తిక ధూమ రేఖా రజ్జుసంతానమును ప్రవేశ పెట్టినాఁడు. నీ కాసంగతి తెలియదు. నిదుర లేచిన తరువాత నీకు వానిని గాదనుశక్తి పోయినది. అనఁగా వాఁడు నిన్ను శరీరమునందు బంధించి నాఁడు. నీ మనస్సునకు, నీ శరీరముమీఁద నధికారము లేకుండఁ జేసినాఁడు. నీ మనస్స్వాతంత్ర్యము నపహరింప లేకపోయి నాఁడు. నీ తండ్రియొక్కయు, నీ భర్తయొక్కయు మనస్స్వా

తంత్ర్యములనుకూడ హరించినాఁడు. వారి జీవులకంటె నీ జీవుఁడుత్తముఁడు. అధిక స్వచ్ఛతకలవాఁడు. ఎక్కువ వెలుఁగు కలవాఁడు. అందుచే నీ మనస్సు వానికి స్వాధీనముకాలేదు. కాకపోవుటవలన నొక లాభమున్నది. నీ సంతానము వాఁడనుకొన్నంత తుచ్ఛమైనదికాదు. నీకు కుమారుఁ డుదయించును. వానికిఁ కుమారుఁడుదయించును. ఆ మనుమనికి కొడుకును, మనుమఁడు నుందురు. ఇట్లు పది తరములు సాగును. పదిమందియు విచిత్రమైన మనోలక్షణములు కలిగియుందురు. రెండు మూఁడు తరములవఱకు నష్టములేదు. తరువాతివారు నాస్తికు లగుదురు, నాస్తికులైనను నీ యీ మనోలక్షణము చేత వారి నాస్తికత్వము నీ గురువు వాంఛించిన నాస్తికత్వము కాదు. వాఁడు వాంఛించినది యొకటి. జరిగెడు పరిణామ మొకటి. వానిపని సగముమేర ఫలించును. వైదిక మతమునకు వాఁడు విరోధి. వైదిక కర్మమునకు వాఁడు విరోధి. ఆ విరోధము మాత్రము సాగును. వాఁ డాత్మలక్షణములను నిర్మూలించలేఁడు. దయ, అహింస, శమదమములు, వైరాగ్యము మొదలైన యాత్మలక్షణములను వాఁడు చెఱపలేక పోవుచున్నాఁడు. దానికిఁ గారణమునీ మన స్స్వచ్ఛత. నీ జీవసంస్కార విశేషము. శ్రౌత కర్మాభిరతి, వేద కర్మాభిమానము, నివి తత్సాధకములైన బహిరంగములు. వానిని వాఁడు నీ గర్భకోశమునందు తద్దుష్టధూమమును వ్యాపింపఁజేసి నీ సంతానమునందు లోపించెడునట్లు చేసినాఁడు. ఇది జరిగినపని. నీవు భగవంతుని ధ్యానించుచుండుము. కృష్ణధ్యానము చేయకుము. శివధ్యానము

చేయుము. కృష్ణుఁడు నిన్ను రక్షించలేఁడు. నీ స్థితి కృష్ణశక్తి కతీతమైనది. సంసారదుఃఖ నిమగ్నులు కృష్ణుని ధ్యానించ వలయును. జ్ఞానమును కోరినవారు నంధకారమునుండి విముక్తి పొందఁదలచినవారు శివధ్యానము చేయవలయును. నీ శరీరము మీఁద నీ కధికారములేకుండ చేయఁబడినది. నీ మనస్సు మీఁద నీకుఁగల నధికారము నెవ్వఁడు నపహరించలేఁడు. అందుచేత నీవు శివు నారాధింపుము. విష్ణువు స్థితిహేతువు. లోకమునకు నాయనకు సంబంధము. ఆస్థితి కలికాలమున గాడి తప్పిపోవును. శివుఁడు లయహేతువు. లయ మనగా జ్ఞానము. అది గాడితప్పి యెప్పుడును పోదు. శివధ్యానము నకు భంగములేదు. నీ కడుపున నెవఁడు పుట్టినచో నీ కేమి? నీవు శివునియందు భద్రాకృతివికమ్ము."

# ౧౮

ఒకనాఁటి ప్రొద్దుట వామనాదులు నల్వురు పరాశర శాస్త్రి వద్దకు వచ్చి రెండు మూటల నచ్చట నుంచిరి. పెద్ద మూట దుబ్బులు. చిన్నమూట దుంపలు. దుబ్బులను రుబ్బించి గంగలోఁ గలిపించెను. దుంపలున్నవి. ఏమిచేయ వలయును? వామనుఁడు 'స్వామీ! వీనినేమి చేయుదు" రనెను. పరాశరశాస్త్రి "వాని మాటఁ తరువాత చూతము. మీరు మార్గమధ్యమున నేమేమి యిబ్బందులు పడితిరో మీకు జరిగిన యనుభవములెట్టివో సర్వమును నాకు నొక్క యక్ష

రము కూడ వదలకుండఁ జెప్పవలయును." అనఁగా వారన్నిఁటినిఁ జెప్పిరి. పరాశరశాస్త్రి "ఈ దారిపొడుగునను పొలిమేరవద్దను యర్ధరాత్రమున బొలిమేరవద్దకు వచ్చి మఱలఁ గొంత వెనుకకు పోయి మఱలఁ దిరిగి వచ్చితి మంటిరిగదా! ఆ సమయమునం దనుకొన్నమాటలు కూడ మీకు వచ్చిన యూహాలు కూడ నాకుఁ దెలియవలయును." అని యడుగఁగా వామనుఁ డిట్లనెను. "స్వామీ! వానివలనఁ దమకేమి ప్రయోజనము?" అనఁగాఁ బరాశరశాస్త్రి యిట్లనెను. "ఒక మరుభూమి కలదు. అచ్చట వృక్షము లెందుకు మొలవవు? వృక్షములు మొలచెడి యొకస్థలమున్నది? అనేక ప్రదేశము లున్నవి. అన్ని ప్రదేశములయందు నన్నివృక్షములు నేల మొలవవు? ఒకచోట తాళవనము మొలుచును. మఱియొక చోట రసాలములే మొలుచును. తాటిచెట్టు మఱియొకచోట పాతినచో నది పెరుగదు. మామిడి చెట్టింకొకచోట వృద్ధి పొందదు. ఎందుచేతననఁగా నచ్చటి భూమి, యచ్చట గాలి, యచ్చట నీరు నివియన్నియు నొకటే లక్షణములు కలవి కనుక భిన్నలక్షణములు కలవి యచటఁ బుట్టవు. అచట పెరుగవు. ఇది ఈ ధాత్రీమండలములోని వైలక్షణ్యము. ఈ వైలక్షణ్యము సస్యాదులనుఁ గూర్చి ప్రదేశములయం దున్నట్లే, భిన్న భూభాగములం దున్నట్లే, భిన్న భూఖండములం దున్నట్లే, భావములు కూడ వాని వానికిఁ దగిన ఖండాకాశములను మనోజగత్తునందు భిన్నాలక్షణ వంతములైన యేక దేశములను నిర్మించుకొని యుండును. ఆ భావజగత్తు ప్రత్యేక మైనది. అది యున్నప్పటి కాలము స్థితి వానికవి ప్రత్యేకము.

మైనవి. ఆ సమయములయందు దాని లక్షణములు కల భావ ములే సముద్భవించుచుండును. అప్పుడు నీకొక యూహ పుట్టినచో నా యూహకు నాభావ పరంపరకు నభేదప్రతిపత్తి యని యర్థము. ఇది కూడ యొక వైలక్షణ్యము, మీరీ దుంపలను మోసికొనివచ్చుచు నుంటిరి. ఈ దుంపలనుఁ గూర్చిన యొక లక్షణమేదో తదనుబంధి భావజగత్తునం దున్నది. మీరీదుంపలను మోసికొని వచ్చుచుండిరనగా నా భావజగత్తులో నుండిరని యర్థము. ఆ భావజగత్తు మి మ్మాశ్రయించి యున్నది. అపుడు మీ సర్వమైన యూహా ప్రపంచకము తద్భావ సంబంధిగా నుండును. అప్పుడు మీకు వచ్చిన యూహాలు నాకుఁ జెప్పినచో నా యూహాలలో నేది చేసినచో నీ దుంప లను మద్భావానుకూలముగాఁ బరిణమింపఁ జేయఁ గలుగు దునో నాకు స్ఫురణ కలుగవచ్చును. అందుకని చెప్పు మంటి" ననెను. వారు తమకు తమకు నప్పుడు తోచిన యూహాలు, ననుకొనిన మాటలు జ్ఞాపకము చేసికొని యొక్కటి వదలకుండఁ జెప్పిరి. చెప్పుచుండఁగా రేచు కుక్కలను గూర్చి వారనుకొన్న మాటలు పరాశరశాస్త్రి వినుచున్న వేళ నాయన కనుబొమలు సన్నగా కదలిన సంగతి వారిలో వామనుఁ డొక్కఁడే గ్రహించెను. తరు వాతఁ బరాశరశాస్త్రి వారినిఁ బంపించెను. వారిని వెళ్ళు మనఁగాఁ దక్కిన ముప్పురును వెళ్ళిరి. వామనుఁడు వెళ్ళ లేదు. పరాశరశాస్త్రి నీవేల పోలేద ననెను. వామనుఁ డిట్లనెను. "స్వామీ! ఆ రేచుకుక్క యెచ్చట నున్నదో నాకుఁ దెలియును. అది మీకు చెప్పి వెళ్లవలయునని యుంటి ననెను. పరాశర

శాస్త్రి "దానినిఁ దీసికొని రాఁగలవా? ఆ కుక్క వయస్సెంత? అది యచ్చముగా రేచుకుక్కకు పుట్టినదా? రేచుకుక్కకు పుట్టినదానికి పుట్టినదా? ఈ సంగతులన్నియు నీకుఁ దెలియునా" యనఁగా వామనుఁడు రేపు ప్రొద్దుటికిఁ దమ కన్నియు మనవిచేయుదుననియు, నది యచ్చముగా రేచు కుక్కకే పుట్టినచో, దాని కేడాది దాటనిచో, నేను దానిని వెంటనే తీసికొని వచ్చెదననియు, నని "స్వామీ! తమరు సిష్ఠాపరులైన బ్రాహ్మణులు, దాని నెచ్చటఁ గట్టివేసెదరు? కట్టివేయకపోయినచో దానివలన నాపద గలుగును." అనఁగాఁ బరాశరశాస్త్రి "వామనుఁడా! నీవు గొప్ప యూహాశాలివి. ఇప్పుడే చెప్పుచున్నాను. ఆ కుక్క విషయములో నీవును నేనును గలసి ప్రవర్తించవలయును. దానిని నీవు రక్షించు చుండవలయును. పోయి తీసికొనిరమ్ము" అనఁగా వామనుఁడు "క్షమించవలయును. మన మిద్దఱము దానియం దేకభావులము గనుక సమానమైన బాధ్యత కలవారము కాఁబోవుచున్నాము గనుక నాకీ విషయమును తమరు చెప్పవలయును. ఈ దుంప లకు నా కుక్కకు సంబంధమేమి?" అని యడుగఁగాఁ బరాశర శాస్త్రి నీకుఁ దెలియకుండ నది జరుగదు. ఆ కుక్క సాక్షా త్తుగా రేచుకుక్కకే పుట్టినచో దానివయ సేడాది దాటనిచోఁ దీసికొని రమ్మని పంపెను. వామనుఁడు వడలిపోయెను. మరు నాఁటి ప్రొద్దుటికి కుక్కను తెచ్చెను. పరాశరశాస్త్రి తన యింటికి సంబంధము లేకుండఁ బ్రహరీలోపల విడిగాఁ దాను జపము చేసికొను గదికి పూర్వము పంచాది లేదు. కుక్క వచ్చెడు నప్పటికి నా గది ప్రక్క వసారా దింపించుటయు

దానికి చుట్టును గోడ పెట్టించుటయు లోపల దృఢమైన కట్టు కొయ్య పాతుటయు, ఆ కుక్క నీళ్ళు త్రావుట కొక తొట్టెయు, పండుకొనుటకు మెత్తని గడ్డి పరపును, మెడకొక గొలుసును సర్వమును సిద్ధము చేసియుంచెను. కుక్క వచ్చి నంతటనే తానొక బెల్లపుగడ్డ తీసికొని కుక్కముందు వేసెను. అది తినలేదు. వామనునితోఁ దినుమని చెప్పుమనెను. వామనుఁడు చెప్పెను. అది తినెను. శాస్త్రి దానిని దీసికొనిపోయి దానిగదిలో దాని నుంచెను. ఇద్దఱును దానివద్దఁ గూర్చుండి ఏదో యేదో మాటాడుకొనిరి. తన యజమానులు వీరిద్దఱు నని కుక్క గ్రహించెను. దానికి విశ్వాసము కలిగెను. వామనుని కంటెఁగూడ శాస్త్రిగారే తన యజమానియని నాల్గు దినములు శాస్త్రియే దాని కన్నపానాదులు జరుపుటచేత పూర్తిగా గ్రహించెను. శాస్త్రి దానిని బట్టుకొనుటయు నోరు తెరచుటయు దాని నోటిలోఁ బండుకొనఁబెట్టికొనుటయు నిట్టి యాటలచేత దానికి విశ్వాసము పూర్తిగా కలిపించెను. ఇరువది దుంపల ధూమము దాని నాసా రంధ్రములలోని కెక్కించుట యెట్లో శాస్త్రి పూర్వము చూచెనుగదా! ఈకుక్క నిదురపోవలయును. మేల్కని యున్నప్పుడాధూమము నిది గ్రహించునా? ప్రయత్నము చేసెను. తొలుత నది స్వీకరించునట్లు కనిపించలేదు కాని తరువాత పందొమ్మిది దుంపల ధూమమును ముకుగోళ్ళతో నోటితో పానముఁ జేసెను. శాస్త్రి మిగిలిన దుంపయొక్క ధూమము వేఱొకచోట వీధిలోని యొక కుక్కనుఁ దెచ్చి దానిచేఁ బీల్పించెను. మఱునాఁడు వీధిలోని పది కుక్కల నొకచోట ప్రోగుచేసి వానిలో

నీ యేకకాష్ఠ ధూమపానము చేయించిన కుక్కను వానిలో వదలిపెట్టెను. ఈ రేచుకుక్కను మెడ గొలుసుతో వీధిలోనికిఁ దీసికొనిపోయి వదలిపెట్టెను. ఈ కుక్కయొక్క గంతున నన్నికుక్కలలోనున్న యా కుక్కనే యేటి దాని మెడ కసి క్కన కొఱికి దాని నెత్తురు పీల్చెను. వెను తిరిగి వచ్చెను. శాస్త్రి "వామనా! నే ననుకొన్నట్లు జరిగినది. దుంపలు వృథా కాలేదు. వాఁడీ చుట్టుపట్లకు రాలేఁడు. కాని రెండు స్థలములను రక్షించవలయునోయీ! అది చాల దుర్ఘటమైన ప్రయత్నము. ఏమగునో తెలియదు. ఈ కుక్కను నే నింకను స్వాధీనము చేసికొనవలయును. దీనికి నెత్తురు పీల్చుటయం దమిత వాంఛ. ఆ వాంఛకు తిరుగులేదు. ఆ వాంఛ తాను తీర్చికొనఁ గలిగిన ప్రదేశమునుండి దానిని మళ్ళించుట యసా ధ్యము. అట్టి రక్తము గలిగిన రెండు ప్రదేశములయందు దీని కీవాంఛ గలుగకుండ, గలిగినయెడల నిది వైముఖ్యము భజించునట్లు చేయవలయును. పరమేశ్వర నిర్మితమైన యీ లోకములోని పరిస్థితులు వానియంతట నవి యచ్ఛముగా దోషరహితముగా నుండవు. సర్వథా నిరపాయములుగా నుండవు. సూర్యదేవుఁ డున్నాఁడుగదా! ఆయన వెంట ఛాయ యున్నది. నా కప్పుడప్పుడు నవ్వు వచ్చును. బ్రహ్మ యెట్టివాఁడో సూర్యుఁ డట్టివాఁడు. తననుండి సముద్భవించిన సరస్వతిని బ్రహ్మ పెండ్లాడెను. తననుండి సముద్భవించిన ఛాయాదేవిని సూర్యుఁడు పెండ్లాడెను. ఇది పెండ్లియాడుట కాదు. వారు భార్యాభర్తలుగా నొక్కసారిగా కలసి సముద్భ వించుట. శివపార్వతుల సంబంధముకంటె నీ సంబంధము

మిపుల విశిష్టమైనది. శివుఁడు పార్వతి నంగీకరించినాఁడు. ఆమె తపస్సు చేసినది. వారి యిద్దఱి సంయోగము తపో లోకములందు జరిగినది. ఆ తపోమయమైన వివాహము సృష్టికి సంబంధము లేనిది. ఆ లక్షణము కొంత యున్నను సరస్వతీ విరించులయు, ఛాయాసూర్యులయు సంబంధము దానికంటె విలక్షణమైనది. వీరి సంబంధముయొక్క లక్షణము సృష్టియందున్న భావములయం దభివ్యాపించి, నీ వేభావము నైనఁ దీసికొని చూడుము, ఆ భావము సూర్యునివలెఁ బ్రకాశించు చున్నచో దాని వెనుక ఛాయ కనుపించును. ఆభావము బ్రహ్మవలెఁ బరమవైదికముగా నున్నచో లౌకికముగా వాగ్రూపముగా నుండును. వాగ్రూపముగా నుండునన్నచో వాక్కునకు వేదశాస్త్ర పురాణములు మాత్రమే నివాస స్థానములు కావు. బహుధా వ్యభిచరించుచున్న సర్వలౌకిక వాక్కు కూడ స్థానమే. ఏతద్దోషము నిత్య సన్నిహితమై వర్తించుచున్న వాగ్దేవి బ్రహ్మతో నున్నది. అనఁగా నేమియో తెలియునా? సర్వనాస్తికులు సర్వ దుర్జనులు, సర్వకుటిలురు, బ్రహ్మహత్యాపాతకులు నందఱును, వాగ్విలసన మున్నది. ఈ వాగ్విలసనము జీవునినుండి సముద్గారముఁ గాంచుచున్నది. ఆ జీవుఁడు దుష్ట సంస్క్రియాసంపుటి. ఆ సర్వసంస్కారము లను క్రియా రూపముగా పరిణమింపఁ జేయుటకుఁ జాలిన తెలివి జ్ఞానము. వెనుకనున్న బ్రహ్మపదార్థముయొక్క కాంతిచేత నీ జీవసంపుటి ప్రకాశించుటచేత ప్రతిబిం బించుటచేతఁ గలుగుచున్నది. చూచితివా! బ్రహ్మకు సరస్వతి భార్య యగుటలోని దోషము, సూర్యునకు ఛాయాదేవి భార్య

యగుటలోని దోషము. అనఁగా నీ సృష్టిగుణదోష సంకర మైనదని యర్థము."

౧౯

గిరివ్రజపురమున రాజసౌధములో రహస్యమందిరమున నొకనాఁటి మలుసంజవేళ వృద్ధరాజు నందివర్ధనుఁడును, రాజ స్థానీయురాలు వేదమరీచియు, వృద్ధమంత్రి మయూరశర్మయు, నజాతశత్రుఁడను పేరుగల యొక రాజకుమారుఁడును గూర్చుండిరి. అందఱును తలలు వాల్చి కూర్చుండిరి. అంతకు మున్నే యే రహస్యాలోచనమో జరిగినట్లు వారి యునికివలనఁ దెలియుచున్నది. అజాతశత్రుఁడు మాళవ రాజకుమారుఁడు. రాజవంశీయుఁడు కాఁడు. సుక్షత్రియ వంశీయుఁడు. అతని వయసు ముప్పదియేండ్లు. అతఁడు పదియేండ్లక్రింద మగధరాజవంశపు కొలువులో చేరెను. అతని తలిదండ్రులు చిన్నప్పుడే చని పోయిరి. పినతండ్రులు, పెదతండ్రులు, లేరు. జ్ఞాతు లతని సిరి సంపదలను కైవసముఁ జేసికొని యితనిని దేశమునుండి వెడలఁ గొట్టిరి. ఇరువదియేండ్ల క్షత్రియకుమారుఁడు ఖడ్గసహాయుఁడై దేశము వెడలివచ్చెను. అతని తాత తండ్రులు గొప్ప రాజో ద్యోగములలో నుండినవారు. అతనిని వెడల నడచిన రాజ బంధువులు రాజాశ్రయమునుఁ బలుకుబడియుఁ గలవారు. అతఁడు సామాన్యోద్యోగములోఁ దన దేశమున నుండ వచ్చును. కాని అంత గొప్ప యింటఁబుట్టి తాను సామాన్య

రాజసేవకునివలెనో సామాన్య రాజభటునివలెనో యుండు టకు మనసొప్పకొనక తనతండ్రి యదివఱకు వాడుచున్న వృద్ధాశ్వముపై తనచేతిలోని పదునుకత్తితో బయలుదేరి వచ్చెను. ఆనాఁడు సర్వవీరులు తమ బాహుపరాక్రమమును వెల్లడించి గొప్ప పదవులకు గొప్పస్థితికి రానెంచినవారు. మగధ సామ్రాజ్యము తమ యాశలకు దోహదప్రాయమని వీరుల కారాజ్య మొరిపిడి రాయియని గిరివ్రజపురము చేరు చుండిరి. ఈతఁడట్లే చేరెను. మయూరశర్మ దర్శనముచేసెను. మంత్రి రాజదర్శనము చేయించెను. కుఱ్ఱవాఁడు, స్ఫుర ద్రూపి, వెడద ఱొమ్మువాఁడు, కన్నుల తళతళ గలవాఁడు, మృదుమందహాసము కలవాఁడు, వినయవంతుఁడు నుత్తమ కుల సంజాతుఁడు, నిరాశ్రయుఁడు, నైన యీ యజాతశత్రు వును వృద్ధరాజు చూచి సంతోషించెను. తన కొలువులో నుంచికొనెను. తన శరీర రక్షణకు నియోగించెను. ఎవరి మీఁద నందివర్ధనుఁడు సర్వాశలు పెట్టికొని బ్రదుకుచుండెనో ఆ యేకైక దుహిత వేదమరీచి యెన్ని వార్తలు పంపినను వారణాసీ నగరముననుండి రాకపోవుటచే రాజు మనస్సు దుఃఖి తమై యామె స్థానమును సమాక్రమించు వ్యక్తిలేక యీ యజాతశత్రుఁ డాస్థానమును పూరించుటచేత నతఁడే కుమారుఁ డన్నట్లు మనసులో ననురాగమును నిడలఁ గ్రక్కు చుండెను. అ య్యజాతశత్రునకు రాజ్యముయొక్క సర్వ పాలన విషయములు సువ్యక్తము లగుచుండెను. అతఁడును మయూరశర్మయొక్క వాత్సల్యమునకు పాత్రుఁడై రాజునకుఁ గుడిబుజమై రాజ్యమునందు వేదమరీచి వచ్చినను సర్వాధి

కార మజాతశత్రుఁడే కొనసాగించుచున్నంత ప్రజలయొక్క యభిప్రాయములకు స్థానభూతుఁడై యుండెను. ప్రజలలో నెప్పుడు నిరుతెగలవా రుందురు. కొందఱ జాతశత్రుని యీ స్థితికి సంతసించెడివారు. మఱికొందఱతఁ డెవఁడో యాకాసి పోకాసివాఁడు వానికిని రాజ్యమునకు సంబంధమేమి ? యను కొనెడివారు. కోటలోని యతని ప్రవర్తన యతఁడే సర్వాధికారిగా నుండును. అతని యీ నడక నంగీకరించనివారు మంత్రులలో సేనాపతులలో మహోద్యోగులలో సగానికి సగముకలరు. పోయి వేదమరీచిని తెచ్చినదివారే. వేదమరీచి గిరివ్రజపురమునకు వచ్చి సుమారు రెండు మాసములైనది. ఆమెకుఁబట్టాభిషేకముఁ జేయవలయుననియు యువరాజస్థాన మామె యాక్రమించవలె ననియు నందివర్ధనుని తరువాత యామెయే తమకు రాణి కావలయుననియు నా పక్షమువారి యాశ. వారినాదన. వారి ప్రయత్నము. రెండవపక్షమువారు వేదమరీచి స్త్రీకనుక నామె రాజస్థానీయురాలు కాకూడదనియు, నామె యువతి యగుటచేత నామె పెండ్లియాడవలయును. ఆమె కడుఁపునఁ బుట్టిన మగశిశువు రాజ్యాధికారి కావలయుననియు, నీమధ్య కాలమున నామె మంత్రులసాయముతో రాజ్యవ్యవహారములు చూడవచ్చుననియు, నామెయే రాజుగా వ్యవహరించవలసిన యవసరములేదనియు, నామె వృద్ధురాలైనచోఁ రాజ్యము నరాజకమైనచో నప్పు డామె రాజువలెఁ బ్రవర్తించినచోఁ బ్రవర్తించవచ్చును. ఇపు డంత యవసరములేదు. ఆమె యిరువదియేండ్ల బాలిక. వృద్ధరాజుఁ బ్రతికియే యున్నాఁడు. ఆయన చాటుననుండి రాజకీయ వ్యవహారములు నేర్చి

కొనవచ్చును. కొన్నాళ్ళ కామెకు సర్వమును విశద మగును. తగిన యువకునిఁ బెండ్లాడినచో మగ సంతానము గలిగినచో నతనిపక్షమున తాను రాజ్యము చేయుచుండ వచ్చుననియు, వారు వాదించుచుండిరి. అందఱు నంగీకరించక పోయినను కొందఱుమాత్ర మజాతశత్రుఁడు వేదమరీచికి యోగ్యుఁడైన భర్తగా నుండుననియు నతఁడు సర్వరాజకార్య దక్షుఁడగుటచేత మగధరాజ్య సర్వరాజకీయ విషయ పరిజ్ఞాత యగుటచేత, సుశీలుఁ డగుటచేత, మృదుప్రకృతి యగుటచేత, ననన్యాశ్రయుఁ డగుటచేత నతఁడు వేదమరీచికి భర్త యగు టయే యెంతయో సమంజసమనియు తలంచుచుండిరి. వేద మరీచి యిరువదియేండ్ల స్త్రీ - బాల కాదు. ఆమె నెవ్వరికో యిచ్చి పెండ్లిచేయుట సుకరముకాదు. ఆమె యజాతశత్రుని యందు ప్రేమకలిగి వర్తించుటకు వారి యిరువురినడుమ ప్రేమ సమావిర్భవించుటకు రెండు నెల లేమిచాలును ? వేదమరీచి గిరివ్రజపురము వచ్చెడువఱకు నామె కజాతశత్రుఁడని యొకఁ డున్నాఁడని తెలియదు. అతఁడు తన తండ్రికి కుడిబుజముగా నుండెననియుఁ దాను వెళ్ళిన తరువాత తన తండ్రియొక్క రక్షణయందు తన తండ్రికిఁ జేయవలయు సాహాయ్యము నందుఁ దనకు మించిన పరిజ్ఞానముగల పరిచయముగల, చనవు గల యొక వ్యక్తి తన ప్రతిస్పర్ధివంటి వాఁడచ్చట యుండె ననియు నామెకుఁ దెలియనే తెలియదు. ఆమె వెళ్ళిన మొదటి దినముననే నితనినిఁ జూచి యాశ్చర్యపడెను. రక్త సంబంధము లేనివాఁడు, గొప్ప రాజవంశమునకు చెందని వాఁడు, యువకుఁ డొకఁడు మగధ సామ్రాజ్య చక్రవర్తిపద్ద

తద్వంశజుఁడైన సమీపబంధువుకంటె నెక్కువ పరిచితితో స్వాతంత్ర్యముతో మెలగుట తత్పరిచయ స్వాతంత్ర్యములు సహజముగా వెలయించఁదగిన మఱియొక వ్యక్తికి కంటగింపుగా నుండదనుటకు వీలులేదు. అట్టి భావములు వేదమరీచికి కలిగెను. కాని యజాతశత్రువు పరమ సుకుమారములైన మనోభావములయొక్క పరిజ్ఞానము కలవాఁడు. తన యునికిఁ వేదమరీచికి నసూయా జనకముగా కించిత్కోప హేతువుగా నుండవచ్చునని యతనికిఁ దెలియును. తొలినాళ్ళలోఁ దాను రాజు పిలిచినఁగాని వెళ్ళెడువాఁడు కాఁడు. వేదమరీచి యనుజ్ఞ యిచ్చినఁగాని రాజకార్యములఁ బరామర్శచేసెడి వాఁడుకాఁడు. ఆమెయే రాణియైనట్లు తాను భృత్యుఁడైనట్లుఁ బ్రవర్తించెడివాఁడు. కాని యతని మనస్సులో నప్పుడీరాజ్యము యొక్క సర్వవిషయ పరిజ్ఞాతయనియు, రాజునకు విశ్వాస పాత్రుఁడనియు, మంత్రికి వాలభ్యస్థానమనియు, నతనికిఁ దెలియును. వేదమరీచి క్రొత్తది. ఆమెకేమియునుఁ దెలియదు. సర్వవిషయములకు దనపై నాధారపడి యుండవలయును. ఆ యహంకారము మనుష్యుఁడైన వానికి నెంత తొలఁగించుకొందమన్నను సాధ్యమైనదికాదు. అన్నిఁటికంటె మానవుని యొక్క యాశ చాల విపరీతమైనది. సహజముగా నాశ యను నది యిచ్చటఁ బ్రవర్తింపఁవచ్చును. ఇచ్చటఁ బ్రవర్తింపగాదన్న వివక్ష లేకుండ మానవజాతియొక్క హృదయాంతరాళములయందు నెలకొనియుండు వస్తువు. యజ్ఞయాగాది క్రతువులు చేయుటవలననో, మహాకీర్తిమంతుఁ డగుటవలననో యుద్ధమునం దప్రతిహతశౌర్యుఁడై మగణించుటవలననో

యే రంభా సంభోగము కలుగునో తద్రంభా సంభోగమును నీచుఁడు దుర్బుద్ధికుటిలుఁడు ననామకుఁడైనవాఁడు కూఁడ వాంఛించును. పరమ సౌందర్యవతియైన యొక రాచకూఁతురు రథమునుండి యవరోహించుచుండును. తెరతొలఁగి యామె నిమేషకాలము పరిదృశ్యమానాకృతి యగును. వీథి నూడ్చువాఁడు దనినిమేషమున నామెవంక జూడకుండ నుండలేఁడు. ఇది స్త్రీపురుష సంబంధమైన పిపీలికాది బ్రహ్మపర్యంత మభివ్యాప్తమైయున్న లైంగిక దుర్భావనా విలసనము. అట్టి స్థితిలో నజాతశత్రుఁడు దాను సుక్షత్రియ వంశజాతుఁడై పదియేండ్లు రాజునకు నండగానుండి వ్యావహారికముగా నచటి సర్వ విషయములయందు తాను లేకుండ నవి కొనసాగుటకు సాధ్యము కాని పరిస్థితులలో నొక స్థితి యేర్పరచికొనియుండి తాను రాజవంశమునకుఁ జెందకపోయినను జెందినవానివలె వ్యవహరించుచు తన యచ్చటనున్న స్థితిచేత తక్కిన సర్వ విషయములు లేకున్నను సంపాదితములై భాసించుచున్నట్లుగా నుండె. వివాహయోగ్య వయస్క, సౌందర్యవతి, రాజకీయవిషయ పరిజ్ఞానహీనురాలు, జన్మతోమాత్ర రాజ్యాధికార యోగ్యభూమియైన బాలిక, యువతి, వచ్చినచో నామె యందతనికిఁ గోర్కి యుండదని యెట్లు చెప్పనగును? ఉన్న పరిస్థితులన్నియు వారిద్దఱికి సమాగమము కలుగుటకు భగవంతుఁడుద్దేశించినట్లే యేర్పడ్డవా యన్నట్లుండెను. తాను వీరుఁడు. యువకుఁడు. సర్వకార్యదక్షుఁడు. తన్ను మించి యోగ్యుఁడైన వరుఁడు వేదమరీచి కెట్లు దొరుకును? అతఁడిన్నాళ్లు వేదమరీచి పేరు విన్నవాఁడేగాని యామెను జూచినవాఁడు కాఁడు.

స్త్రీభావము చమత్కారముగా నుండును. సర్వస్త్రీలును పరమ సౌందర్యవతు లనియే యువకులు భావింతురు. తద్దర్శనా నంతరమున నెంతయోయనుకొన్నది యింతయు కాకపోవుట సంభవించును. అప్పుడు మనస్సు పెడమఱలును గాని తత్పర్యంతము ప్రతీక్షా సుకుమారముగానే యుండును. వేదమరీచి విషయమునందు తాదృక్ప్రతీక్షా సౌకుమార్యము రహస్యముగా దాచికొనియున్న యజాత శత్రునిదృష్టికి వేద మరీచి పరమసౌందర్యవతిగా భాసించెను. ఆమెసౌందర్యవతి కాదు. అతనికిఁ దెలివివచ్చినప్పటినుండియు తన దేశమునుఁ బరిత్యజించిపోవువఱకు జ్ఞాతులతోడి విరోధము. మహాధికారుల ద్వారములచుట్టు తిరుగుటయుఁ, దన బ్రతుకెట్లు గడలునని విచారించుటలు శత్రుమధ్యమున నుండుటచేత ధనుర్విద్యా ఖడ్గవిద్యాభ్యసనమును, రాజనీతినిఁ గూర్చి చదివికొనుటయు, మొదలైన వానితోడనే. స్త్రీలు, యువతులు సంగీతము, సుకుమారవిద్యలు యువతులతోడి విలాసములు తదనుకూల మధుర ప్రసంగములు మొదలైనవాని పరిజ్ఞానమే యతనికి లేదు. ఇచ్చటికి వచ్చినతరువాతకూడ నట్టి ప్రసక్తియే లేదు. పరిచారికలను మహానగరమునం దితరస్త్రీలనుఁ జూచుచునే యుండెను గాని వారి సౌందర్య విచారణ తానెప్పుడు చేయ లేదు. వచ్చినప్పటినుండియు వేదమరీచిమాట వినుచునే యుండెను. ఆమె వచ్చినతరువాత తన స్థితి యేమగునో యనుకొనుచుండెను. నడుమ నడుమ నిరాశుఁ డగుచుండెను. తదా తదా పునః పునరుదితాశుఁడు గూడ నగుచుండెను. ఏండ్లు గడచినకొలఁది తా నచట పాతుకొన్నకొలఁది నా

యాశకు దార్ఢ్యము సమకూరుచుండెను. వేదమరీచిని తాను ప్రేమించుచున్నానని యెవరితో చెప్పవలయును? తానచ్చట నుండుట యిష్టము లేని ప్రజలు గిరివ్రజపురమున నున్నారని యతనికిఁ దెలియును. తన యజమానుఁడైన నందివర్ధనునితో నాకు వేదమరీచి నిచ్చి పెండ్లిచేయుఁడు, మీ రాజ్యము నాకు దక్కును. నా కిమ్మని యడుగునా? భృత్యుఁడు యజమాను నిట్లడుగవచ్చునా? ఆ భృత్యుఁ డెంతటి విశ్వాసపాత్రుఁడైనను వానితో నెంత యవసరమున్నను వాఁడు మఱునిముసమున ఛిన్న శిరస్కుఁ డగును. మయూరశర్మతోఁ జెప్పునా? ఏదో పైకి రాతగిన పిల్లవాఁడన్న జాలి యా మహామంత్రి కున్నమాట నిజమే. క్షీరకుంభము నొక్కసారి విషకుంభమునుఁ జేసికొన్నట్లే తన ప్రేమ వేదమరీచితోఁ జెప్పవలయునా? ఆమె వయసులోనున్న స్త్రీ. ఆమె మన స్సెదివఱకే యే రాజకుమారునియందు లగ్నమైయున్నదో తెలియదు. తా నీమగధసామ్రాజ్యమున కుత్తరాధికారిణి. ఆమె వివాహము చేసికొనకుండ జీవితమంతయు వెడలఁబుచ్చవలయు ననుకొనుచున్నదేమో! తా నెవఁడు? తన కోర్కె యేమి? ఇట్టి స్థితిలో నజాతశత్రుఁ డుండెను.

ఇట్లుండఁగా రాజ్యమునందలి పెద్దలందఱు వేదమరీచి వివాహము చేసికొన వలయుననియు తత్సంతానమునకు రాజ్యార్హత కలుగుననియు భావింప నారంభించిరి. ఈ రెండు నెలలలో నా యభిప్రాయము బలిసి బలిసి మయూరశర్మతో వృద్ధక్షత్రియ వంశీయులు నున్న తాధికారులు నితరమంత్రులు గౌరవనీయులైన కొందఱు పౌరులు మాటిమాటికి విన్నవించుట

చేత మహామంత్రి రాజుతో మనవిచేయుటచేత రాజు తన కూతు నడుగకుండఁ దా నేమియు నా సందర్భమున ముం దడుగు వేయఁ లేనని చెప్పి యానాఁటి సాయంకాలమునఁ దానును మయూరశర్మయు వేదమరీచితో నీ విషయము మాటాడ వలయునని నిర్ణయించికొని యీ రహస్యాలోచనా మందిర మున సమావిష్టులైరి. అచట నజాతశత్రుఁ డుండవలయునా యుండకూడదా యన్న ప్రశ్నయు తొలుత సముద్భవించి నది. రాజునకు మయూరశర్మకు నిద్దఱకు నతనియం దభి మానము కలదు. కావున నతఁడించుమించుగా రాజవంశీయుఁ డన్నట్లే ప్రవర్తించుటచేత నామె యభిప్రాయము చెప్పుటలో నజాతశత్రువుయొక్క యచ్చటియునికి పెద్ద బాధాకరము కాదని యెంచి యాతనినిఁ గూడ నచ్చట నుండనిచ్చిరి. అతఁడు నచ్చట నుండుట మిక్కిలి వాంఛించినవాఁడు. తన యిన్నాళ్ళ కోరికకు వేదమరీచి మాటలలో నేదైన కొంత యాశసచుట కానుకూల్య ముండునేమో యన్న తహతహయే యతని మనస్సు నావరించియున్నది. ఆమె వివాహమున కంగీ కరించును. ఏ రాజకుమారునైనఁ దెచ్చి చేయుదురా ? ఒక వేళ రాజే వేదమరీచి యజాతశత్రుని నేల చేసికొనరాదను నేమో! ప్రసంగము లేదో యొక మార్గమునుఁబట్టి తన మీఁదకు మఱలునేమో ! రాజును మంత్రియు నిద్దఱు తన కనుకూలురే. ఈ యానుకూల్యమునుబట్టి వేదమరీచియు నంగీకరించవచ్చును. అంగీకరించినచో సర్వమును సులభమగును. ఎవఁడో రాజ కుమారునకు నీమె నిచ్చినచో వాఁడు వచ్చి వీరియింట నిల్లరిక ముండఁడుకదా ! ఆమె సర్వథా యిచటనే యుండుట పొసఁ

గదుగదా! భర్తవద్దకు పోవుచుండవలయును - వచ్చుచుండవలయును. అతనికీమె యందుఁ గలిగిన సంతానము మగధ రాజ్యమును పాలించవలయును. అతని స్వంత రాజ్యమునకు నధికారులెవరు? అతఁడు వేఱే వివాహము చేసికొని యా సంబంధమునకుఁ గలిగిన సంతానమును తనస్వంత రాజ్యమునకు రాజుగా నుంచవలయునా? ఇచ్చటనే యుండిపోయెడివాఁడు, తనకు వేఱే రాజ్యము లేనివాఁడు, వీరుఁడు, సుక్షత్రియుఁడైన వాఁడు వేదమరీచినిఁ బెండ్లియాడినచో సమస్యా పరిష్కారమగును కాని మఱియొక విధముగాఁ గాదు. ఈ పరిస్థితులలోఁ దనకంటె యోగ్యత కలవాఁడు మఱియొకఁడు లేఁడు. ఈ దృష్టితో నజాతశత్రుఁ డచ్చటికిఁ బెళ్లెను. వేదమరీచియొక్క వివాహ ప్రస్తావన రాజు చేసెను. వేదమరీచి తాను వివాహమాడ ననెను. ఆడకున్నచో నెట్లు? నీవున్నన్నినాళ్ళు రాజ్యమును పాలింతువు, నీ తరువాత రాజ్యమేమి కావలయును? అని తండ్రియడిగెను. ఆమె దానికి సమాధానము చెప్పలేదు. తండ్రియు మంత్రియు వివాహమున కభిముఖురాలవుకమ్మని యెంతయో బలవంతపెట్టిరి. ఆమె యేడ్చుచుఁ గూర్చుండెను. వారికర్థము కాలేదు. ఈ సన్నివేశము చిత్రశిఖండి వచ్చి వెడలిపోయిన మఱునాఁడు జరిగినది. తత్పూర్వమైనచో మఱికొన్నాళ్ళకైనచో నేమి జరిగెడిదో తెలియదు. ఆనాఁడు జరుగుటచేత నామె యేడ్వ నారంభించుటయు నామె దుఃఖకారణము తెలియక తండ్రి లాలించుటయు బతిమాలుటయు మొదలైన వెన్నియో జరిగెను. ఆమెకుఁ దండ్రి లాలన యెట్టిదో తెలియదు. ఈ నెలనాళ్ళనుండి తన తండ్రియొక్క లాలన

యామె నేమి చేసినదనఁగాఁ దన తల్లియే బ్రదికియున్నచో నామె తన్నెంత ప్రేమించి యుండెడిదో ఇంచుమించుగా పదు నేను సంవత్సరములుగా నిట్టి తండ్రియొక్క ప్రేమ వాత్సల్య ముల ననుభవించలేని దుర్దశయందు తానుంటి ననిపించెను. తాను మంచముపైనుండి నిదుర లేచినదా లేవలేదా యన్న విషయము ప్రతిదినము తండ్రివచ్చి కనుగొనుచుండెను. తల్లి కాల్యకృత్యములను నిర్వర్తించినదా, స్నానాదులైనవా, ఆమె కదికావలయు నిదికావలయును, ప్రతిక్షణము తాను తండ్రికిఁ గనిపించు చుండవలయును. తాను నడచుటయు, నవ్వుటయు తాను మాటాడుటయు సర్వము తన తండ్రికి పరమ వాత్సల్య సంజనకములైన విషయములుగా నుండెను. తాను ప్రక్క లేకుండ తండ్రి భోజనము చేయఁడు. తాను వచ్చుట యాలస్యమైనచో నన్నము ముట్టుకొనకుండ కూర్చుం డును. ఆ తండ్రియొక్క ప్రేమకు మొదలు తుదయని కనిపిం చుట లేదు. తా నిరువదియేండ్ల యువతి. తండ్రి తనను కౌఁగిలించుకొనును ముద్దాడును. తొడమీఁద కూర్చుండఁ బెట్టుకొనును. తాను రాజకార్యముమీఁద నెచ్చటికో పది యడుగులు పోవలసినచో "తల్లీ! వెళ్ళిరానా!" యని యడు గును. ఈ రెండు నెలలలో తన యొడలినిండ రత్నాభరణ ములను నింపెను. ఇరువదియేండ్లు పెట్టెలోఁ బెట్టి పూజించు చున్న చీరలు నగలు తనకు వశపఱచెను. ఆ చీరలు నగలు వానియొక్క సర్వ వృత్తాంతము తండ్రికిఁ గంఠపాఠముగా నుండెను. ఒక వంద చీర లున్నవి. ఏచీర యేరంగో, ఏచీర యంచెట్టిదో, ఏచీరకు రత్నములు కుట్టియున్నవో, ఆ రత్న

మాలు కట్టినపని మయూరమువలె నున్నదో, శుకమువలె నున్నదో? రాజహంసవలె నున్నదో, యంచు సర్పాకృతిగా నున్నదో, లతాకృతిగా నున్నదో యీయనకు నధ్యయన పరునకు వేదములలోని పనస లెంత జ్ఞాపకమో యంతి జ్ఞాపకము. నగలనుగూర్చి యంతే. తానొక చీర ధరించును. తానొక నగనుఁ బెట్టికొనును. ఇది కాదమ్మా అది యనును. దానిని వర్ణించును. ఆనాఁటి వారము చెప్పి యీవారమునందు నా నగయే ధరింపవలయునని, యీ చీరయే ధరింపవలయునని, తన తల్లి యట్లే ధరించుచుండెడిదని యిరువదియేండ్ల తరువాత నీనాఁడు తన తల్లి నానాఁడు తన తండ్రి యెంతగాఁ బ్రేమిం చెనో, యెంతగా నామెయే లోకమని బ్రదికెనో, తరువాతి తన బ్రదు కెంత తత్ప్రేమ సంబంధ భావనా పరమార్థ భూత ముగాఁ బ్రదుకుచున్నాఁడో వేదమూర్తికి నీ సర్వభావము ను నా తండ్రి ప్రేమయు కంఠదఘ్నములు, పుక్కిలింతలు, తల మునకలు నగుచుండెను. ఆ తండ్రిని తాను ప్రేమించుటయని యొక భావ మున్నదా! ప్రేమించుటయన్న యొక కార్యము జరుగుచున్నదా! ఆ తండ్రియే తానైనట్లుండెను. ఆయ నతో నిది చెప్పవచ్చును నిది చెప్పరాదన్నట్లు లేదు. అతఁడే తాను, తానే యతఁడుగా నున్నది. ఆయన తనీపని చేయు మని బతిమాలవలసిన యవసరమున్నదా? అతనిని బతిమా లుట వఱకు తీసికొని రాఁగలదా? అతఁడే బతిమాలినచోఁ దనస్థితి యెట్టిది? ఆయన చేత బతిమాలించుకొనుట యొక దోషమో కాదో తెలియదు గాని యట్లు జరుగుట తానోర్చి కొనలేదు ఓర్చికొనుట యన్నమాట కిచ్చట నర్థము లేదు.

ఒక యితరమైన శక్తి తనమీఁదకు వచ్చి వాలినపుడు దానిని సహించుట పేరోర్చికొనుట. ఇచ్చట తానొక వ్యక్తి. తండ్రి వేఱొక వ్యక్తి. ఆయన తన్ను బతిమాలుచున్నాఁడు. ఇట్టి పరిస్థితియే లేదు. ఆయన యడుగుటయు తాను చెప్పుటయు. అడుగకుండనే చెప్పవలయును. చెప్పవలయుట కాదు. చెప్పును. ఇట్టి స్థితి యుండఁగా వేదమరీచి మనస్సులోఁ దనతండ్రికి కాని, తన తండ్రియొక్క యీ ప్రేమకు యోగ్యముకాని, తనతండ్రియొక్క యౌదార్యానుభూతికగ్హతలేని, ఇంతి వాత్సల్యసముద్రాంభస్సులను నుక్కిరి బిక్కిరి గాకుండ, క్రొత్తది యనిపింపకుండ ననుభవించగల తనలోనున్న యే పరమశాంత రమణీయమైన జీవలక్షణము కలదో యా జీవలక్షణముకంటె భిన్నమైనది, పరకీయమైనది, యొక యణువై తనలో నేదో విజాతీయమైన వస్తు వున్నట్లు నిత్యమును భావించుచుండెను. ఆ విజాతీయమైన వస్తువు తన యున్కిని దాను నిలద్రొక్కుకొనునా? తన రహస్యమును దాను పాలించికొనునా? తా నీ ప్రేమ సాగరమునకు భిన్నముగా నుండునా? ఈ సముద్రము తరగలెత్తి దానిని ముంచదా? ఈ సాగరము ఫెడేలుమని దానినిఁ గొట్టి నచో నది బ్రద్దలుకాదా? ఇదిగో నే నిట్టిదానవని తనంతన తానువచ్చి సముద్రముతోఁ జెప్పికొనదా? ఇట్లున్నది వేదమరీచి మనస్సు. ఆయన బతిమాలుచుండెను. వేదమరీచి దుఃఖించుచుండెను. మయూరశర్మ కర్థముకాలేదు. అజాతశత్రుపు వనభిజ్ఞాత జీవలోక రహస్యుఁడై తల్లడిల్లి పోవుచుండెను. ఆ కూతుయొక్క దుఃఖోద్బణము దాని హేతువునేమైయుండునన్న విచారము లేని యచ్ఛమైన ప్రేమవాహిని సందివర్ధనుని

గుండెలోఁ బ్రవహించుచుండెను. ఆసమములో నాశ్వయుజ మాసపు సర్వకాలుష్యము, సర్వమాంద్యము, సర్వ సాంద్ర తయు, పడిసిపోయిన పరిలఘు తుషార సమాహారంభూతమైన తెల్లని మబ్బునుండి జాఱి నేలకుచేరని చినుకులయొక్క యచ్ఛ దనము కలిగిన జలబిందు సందోహ మధురమైన కాలువ యతని దుహితృప్రేమ. ఆకాలువలోని యొక్క నీటిలోని స్వచ్ఛత్వ మట్టిదనఁగా దానిలో నొక మాలిన్యము క్షాళితము చేయవలయునని పడలినవాని ప్రాణములు సవి నిజముగా ప్రాణములైనచో జివ్వన లాగును. ఆ క్కాలువలోని కొంత మేర యా కాలువకుఁ దెలియకుండ వేఱె పడియకట్టి యందు లోని విదితమై, పరప్రేరితమై, యనభిజ్ఞమై, యొకమాలిన్యము చేరినచో నా కాలువపొంగి ప్రక్కనున్న తన పడియనుఁ దన లోనికిఁ దీసికొనినపుడు మాలన్యమది యా కాలువయందు కలిసిపోవునపుడు కలిపినవాఁడెవఁడు? వాని ప్రాణములు జివ్వన లాగుట యనునది యెట్లుండును? ఆపడియ యట్టిది. దానికి స్వాతంత్రతలేదు. ఆ కాలువలోననే యెప్పుడైననుసరే కలువ వలయును. అమ్మా! నేనిచ్చట పడియకట్టితిని. నాలో నితర మైన కాలుష్యము సమకూడినది. నేను నీలో నెట్లుకలియు దును? నీవు పొంగివచ్చి నన్ను నీలో ముంచికొనకుము. అని కాలువతోఁ జెప్పగల యెఱుక పడియకు లేదు. పడియ ప్రచ్చి కౌఁగిలించికొన్నది. ఆ కాలువకు ఆపడియయొక్క మాలి న్యము తెలిసినది. తెలిసినదో తెలియలేదో మాలిన్య మానో కాదో దానితోఁ గలిసియే యా కాల్వ మరలఁ బ్రవహించు చున్నది. ఇంతకు పూర్వము ప్రొద్దుటివేళ పక్కలు విఱిచికొని

ప్రాతఃకాలపు టెండలు తెల్లదనమును దువాళించుచున్న మల్లె పూవులకాంతి విరజిమ్ముచు ప్రవహించుచున్న యా కాలువ యీ పడియ కలిసినమేర నా మల్లెపూవులయొక్క తొడిమల కాంతితో నుండెను. ఆ తొడిమలు వడిలినవి. నల్లపడినవి, కాని యా మల్లెపూవులకుఁ దనక్రింద నట్టితొడిమలున్నవన్న యభిజ్ఞయే లేదు. ఆ తొడిమల లక్షణము నందివర్ధన మహా రాజు తలవాంచి కూర్చున్నస్థితిలో నుండెను. మయూరశర్మ నివ్వెఱపోవుచుండెను. అజాతశత్రువు తానెదో, నూర్ధ్వలోకము లందుంటిననుకొన్నవాఁడు 'సీ! నీ కిక్కడ తావులేదుపో!' యని యింద్రుఁడు విదలింపగా నేలఁ బడఁబోవుచున్న త్రిశంకునివలె నుండెను. వేదమరీచి ముఖము నాపివేసెను. ఆమె కనుల నెంట నీళ్లులేవు. తత్పూర్వమునందు నామె యెంతదుఃఖమూర్తియో యిప్పుడంతటి యుదాసీనమూర్తి. ఆ రహస్యము తన నోటి నెంట వెలువడువఱకు నామె కూర్చుండలేకపోయెను. మాటాడలేకపోయెను. తండ్రివంకఁ జూడలేకపోయెను. ఆ రహస్యము తాను పట్టుకొనలేక యెప్పుడు తనకుఁ దెలియకుండ తన నెలికి సముద్భవించెనో యితరులకుఁ దెలిసిన విషయమయ్యెనో యా నిమేషమందే యామె హృదయ సర్వభారము తొలఁగిపోయి నట్లయ్యెను. తాను తన తండ్రియొక్క ప్రేమ ప్రవాహములో నేకదేశమని యనుకొని తా నామాట చెప్పెను. చెప్పిన తరువాతఁ దా నేకదేశ మగుమనో కానో యన్న సందేహము సముద్భవించెను. ఆ సందేహ సమయమునఁ దాను ప్రేమవాహినిలో లేదు. జలము వాహినీలక్షణము. తా నేకదేశమందు లేనపుడు తన నేత్రములయందు

జల ముద్భవిల్లుటలేదు. నీ వీవాహినిలో సిదానవే యని తండ్రి యన్నచో నప్పుడు మఱల నామె కన్నులవెంట నీళ్లు రావచ్చును. లేనిచోఁ దానొక యెడారి. అక్కడ వాన కూడ కురియదు. ఎంతలోతు త్రవ్వినను చెమ్మ యురుకదు.

అట్లు నల్వురును కూర్చున్నవారు కూర్చున్నయట్లు కూర్చున్న సేపెంతయో తెలియకుండ కూర్చుండి చివరకు రాజు లేచెను. ఆయన వెంట మయూరశర్మ లేచెను. మయూరశర్మకంటె ముందే యజాతశత్రుఁడు లేచెను. లేచి నిలుచుండనిది వేదమరీచి. ఆమె తలవంచికొనిలేదు. ఆమె కన్నులు రెప్పలు పడుచున్నవో లేదో తెలియదు. ఆ కన్నులలోఁ గాంతియున్నదో లేదో తెలియదు. ఆమెలోఁ బ్రాణమాడుచున్నదో లేదో తెలియదు. అది యొక పచ్చకర్పూరపు బొమ్మయేమో! నందివర్ధన మహారాజు కూతువంకఁ జూచెను. రాజు బొడ్డులో కైజారున్నది. అజాతశత్రు వేమనుకొనెననఁగా నందివర్ధన మహారాజు కైజారుతీసి కూతును పొడిచి చంపుననుకొన్నాఁడు. మయూరశర్మ కూతుతో మాటాడకుండ రాజు వెడలిపోవు ననుకొన్నాఁడు. రాజు వేదమరీచిని కౌఁగిలించికొనెను. అమ్మా! ఏడ్వుమనెను. అనన్ంతలో వేదమరీచి తండ్రి బుజముపై వ్రాలి యొక్కు పెట్టున నేడ్చెను. తండ్రి తొడిగిన యంగీ యతని వీపుమీఁద నెంత తడిసిపోయెననఁగా మహాగ్రీష్మకాలమున నొంటరిగా మండుటెండలో కాలినడకమీఁద పదియామడ నడచి వచ్చిన వాని యంగీ యెంత తడియునో యంత తడిసెను. అట్లు కౌఁగిలించికొనియున్న తండ్రి కూతులను మంత్రియు నజాతశత్రుఁడును

జూచుచుండిరి. మంత్రి కన్నులనిండ నీళ్ళుబికెను. అజాత
శత్రుని కన్నులలో నీటిబొట్టులేదు. ఆశ్చర్యము భాసించు
చుండెను. కొంతసేపటికి రాజిట్లనెను. "ఈరహస్యమచ్చట నెంత
మందికిఁ దెలియునో నాకుఁ దెలియదు. అచట నతనికొక్క-
నికే తెలియునను కొనుచున్నాను. తరువాత నా! పరమపావన
నగరమునఁ జిత్ర చిత్రములైన సన్నివేశములు జరిగినవనియు,
రాజు వ్యాధిగ్రస్తుఁడై పడియుండెననియు, భూతప్రేత పిశాచ
ముల కారాజ్యము తావలమయ్యెననియు వార్తలు వచ్చినవి.
అవి మీ యిద్దఱకుఁ గూడ తెలియును. అచట భూతప్రేత
పిశాచము లెందుకు స్థావరము చేసికొనవు. పోనిండు. ఇచట
నీ రహస్యము మన నలువురికే తెలియును. మహామంత్రీ! నీవు
నీవు కావు నేను, ఈ వేదమరీచి నీ కడుపునఁ బుట్టినచో
దాని తల్లిని నేను ప్రేమించినట్లు దీనిని నీవు ప్రేమించినచో
నిప్పుడు వచ్చి యీ కథయంతయు నీకీమె చెప్పినచో
నీవును నావలెనే యీమెను కౌఁగిలించుకొని యుందువు.
పెడ త్రొక్కుట యన్న యూహ నా కెట్లు రాదో నీకు నట్లు
రాదు. ఈ కుబ్జవాఁడు కలఁడు. ఇతఁడు నన్ను పదేండ్లు
సమాశ్రయించియున్నాఁడు. ఇతనికి నేనే తల్లినైతిని. నేనే
తండ్రి నైతిని. నేనే రాజునైతిని. నేనే అన్నదాత నైతిని.
ఇతని లౌకికమైన జాగ్రత్తయు చాకచక్యమును విశ్వాస పాత్ర
తయు నాకుఁ దెలియునుగాని వీని యాత్మలక్షణము నాకుఁ
దెలియదు. ఈ రహస్యము నితఁడు రక్షించునో రక్షించఁడో,
రక్షించఁగలఁడో రక్షించలేఁడో, ముందెట్లు జరుగునో, ఏది
యెట్లు పరిణామము పొందవలసి యున్నదో, అప్పటప్పటికి

సమకూడిన పరిస్థితులనుబట్టి తత్తత్కాలమందలి తత్త్వ్యవహారములను బహిష్కరించుకొనవలయునేగాని యిప్పు డిట్లు చేయవలయునని చెప్పుటకు వీలులేదు. నే నధికారినిగాఁ గనిపించుట లేదు. ఓయి మహామంత్రీ! నీకంటె బుద్ధిమంతుఁ డెవ్వఁడు? నీకంటె నీ సృష్టి రహస్య పరిజ్ఞాత యెవ్వఁడు? నీకంటె సర్వజ్ఞుఁ డెవ్వఁడు? నీకంటె సమదృష్టి యెవ్వఁడు? నీకంటె శాంతుఁడెవ్వఁడు? నీకంటె వైరాగ్యవంతుఁడెవ్వఁడు? నే నేమియుఁ జెప్పనక్కఱలేదు. అది యట్లు జరిగినది. ఎందుకు జరిగినది? మనకుఁ దెలియదు. పరమేశ్వరుఁడైన కాలము దాని నట్లు జరిగించినది. కార్తాంతికులునుఁ గాలజ్ఞులునుఁ జెప్పుచున్నమాటలు నీకును నాకునుఁ దెలియును. ఈ ప్రద్యోత వంశము నాతో నంతమగుననియు మఱి యేదో వంశము వచ్చి యీ రాజ్యము నాక్రమింతురనియు వదంతి కలదు. నే ననుకొంటినికదా నా యీ కూతు కడుపున నెవఁడో పుట్టును. వాఁడు రాజగును. వానిది వేఱే వంశమే కదా యనుకొంటిని. పరమేశ్వరుఁ డట్లనుగ్రహించలేదు. ఆయన యింకొకరీతిగా దయఁజూచినాఁడు. ఇప్పుడేమి జరుగునో మనము చెప్పలేము. వేదమరీచినిఁ బెండ్లియాడుమని నే నెట్లడుగుదును? నేను వృద్ధుఁడ నైపోయినాను. నాలో శౌర్యభావము పోయినది. వాఁడు నాకు దగ్గఱబంధువు. నేను పోయి కత్తి బుచ్చుకొని వానిని రెండుగా ఖండింతునా? ఖండించి యేమి ప్రయోజనము? ఈ నా కూతును కైజాసు పెట్టి పొడుతునా? పొడిచి నేను పొడిచికొనవలయును. ఈ రాజ్య మెవరో వచ్చి యాక్రమించనక్కఱలేదు. ఏ జీవుని

యొక్క సంస్కార విశేష మెట్టిదో మనకుఁ దెలియదు. భగవంతుఁ డెవనియందు దయా పరిపూర్ణుఁ డగునో వానికి భగవంతుఁడు కష్టములు తెచ్చి పెట్టును, అనైదికమైన యొక మాట యనుచున్నాను, పూర్వ మెప్పుడో యజమహారాజు ప్రేమతపస్వి. నేను మరియొక ప్రేమ తపస్విని. దానికి ఫలిత మిట్లే యుండును. ఆయన కొడుకు పుత్రవియోగముచేతఁ జని పోయెను. నా కూతురు పుత్రసంతాన యోగ్యతా విరహిత మైన వట్టి బీడై పోయెను. నేను నిష్క్రియుఁడను. దినములు గడువనిండు. అవి యెట్లు పరిణమించునో యట్లే పరిణమింప నిండు. మనము కదలవద్దు. మెదలవద్దు. తొణకవద్దు. ఉబుక వద్దు. వేదమరీచి వివాహమున కనభిముఖురాలన్న విషయమే సర్వజనులకుఁ దెలియవలయును. ఈ రహస్యము మన నలువు రకే తెలియును. ఈ రహస్యము మన నల్వురికిఁ గాక నింకొ కరికిఁ దెలిసినచో నజాతశత్రునివలన నది బయట కుబికెనని నేననుకొందును. ఆతనిని నేను కడుపులోఁ బెట్టికొంటిని. అప్పు డితఁడు నా కడుపునకు బయట వాఁడగును. పరమేశ్వరుఁ డెప్పు డెవనిచేత నేమి చేయించునో చేయించఁడో నాకు తెలియదు."

# ౨౦

వంకజాబిల్లికి శిశునాగునకు వివాహము జరిగెను. ధనవంతుల యిండ్లలోని పెండ్లిండ్లు తప్పకుండ మహావైభవముగా జరుగును. ఆ వైభవము వధూవరుల మనస్సులలో నుండునో యుండదో తెలియదు. బయటనున్న బాజాభజంత్రీలకు ముద్దు ముచ్చటలకు వధూవరుల యెడందలలో నున్న ప్రేమభావము మూలభూతమై యుండవలయును. ఆ ప్రేమయే ఇదిగాఁ బరిణమించవలయును. లేదా యా ప్రేమకు దీనికి సామరస్యముండవలయును. అట్టి సంబంధము లేకుండ వారి మనస్సులు వారి మనస్సులే. బయటి యుత్సవ ముత్సవమే యన్నట్లు జరుగును. వారి వివాహమట్లు జరిగెను. వివాహమైన తరువాత నొకనాఁటి రాత్రి శుభముహూర్తము చూచి వారిద్దఱి నొక సౌధమునందు నుండునట్లేర్పాటు చేసిరి. శిశునాగుఁడు వంకజాబిల్లితో మాటాడఁడు. పలుకరించడు. ఆమె వంకనే చూడఁడు. వంకజాబిల్లి యతనివంకఁ జూచును. పలుకరించదు. అతని దగ్గఱకుఁ బోదు. ఇట్లు దినములు గడువ నారంభించెను. రాత్రులును గడువ నారంభించెను. వారిద్దఱికిఁ బరస్పర సంబంధము లేదని పరిచారికలకుఁ దెలియును; వృద్ధక్షత్రియ స్త్రీలకుఁ దెలియును. చంద్రమతీదేవికిఁ దెలియును. ఇట్లే కాలము గడువఁ జొచ్చెను.

ఒకనాఁటి ప్రొద్దుక్రుంకు వేళఁ గాశీనగరమునకు సజాతి శత్రువు వచ్చెను. అతఁడు వచ్చుచున్నాఁడన్న వార్తయే

లేదు. నిజముగా నట్టివాఁడు వచ్చునపుడు మునుముందుగా వార్త రావలయును. కొన్ని గుఱ్ఱములతో కొందఱు పదాతులతో రావలయును. అజాతశత్రువు పలుచోట్లకు రాజుపక్షమున వెళ్ళును. రాజెంత పరివారముతో వెళ్ళునో యంత పరివారముతో వెళ్ళును. రాజెచ్చటికిని గదలఁడు. సర్వస్థలములకు నితఁడు రాజప్రతినిధిగాఁ బోవును. అందుచేత నతఁ డొంటరిగా వెళ్లుట యెవ్వరును చూచి యుండలేదు. అతఁడు వచ్చుచున్నచో మగధ రాజ్యమునం దంతటను రాజే వచ్చుచున్నాఁడని యనుకొందురు. అట్టి యజాతశత్రుఁడు తానొక్కఁడు గుఱ్ఱము మీఁదఁ గాశీనగరమునకు వచ్చెను. అతనిని మహానగర ద్వారపాలకులు లోనికి రానీయలేదు. అతఁడు తాను యువరాజుతో నొకవార్త చెప్పవలయుననియు యా వార్తను వేదమరీచి పంపించినదనియు వారితోఁ జెప్పి యీ సంగతి పోయి యువరాజుతో మనవిజేసి రండు. ఆయన యంగీకరించిన నే పోయి వార్త చెప్పెదననెను. వేదమరీచి పేరు సెప్పినంతనే వారతనినిఁ బోనిచ్చిరి. క్రమముగా నతఁడజాతశత్రుఁడని నల్గురైదుగురికిఁ దెలిసెను. మగధరాజ్యమునం దజాతశత్రువుయొక్క ప్రాధాన్యము చాలమందికిఁ దెలిసినదే. అందుచే నతనిని కొందఱు మిక్కిలి గౌరవించి యతనికి విడిది మొదలైనవి యేర్పాటు చేయుటకుఁ బ్రయత్నింప నారంభించిరి. అజాతశత్రువు తా నావార్త యువరాజుతో చెప్పి వెంటనే వెడలిపోవలయుననియు నారాత్రి యచ్చట నుండుటకు వీలే లేదనియుఁ జెప్పఁగా నతనిని శిశునాగుని వద్దకుఁ దీసికొనిపోవుటయే ప్రధానముగా భావించి శిశునాగుని

కడకు నతని రాకనుగూర్చి వచించుటకు వెళ్ళిరి. అజాతశత్రుఁ డిట్లొంటరిగా నేల వచ్చెను? అతఁడు గిరివ్రజపురము కోటయే యిల్లుగాఁ గలవాఁడు. అతనికి వేఱే దిక్కు లేదు. తల్లిదండ్రులు లేరు. మాళవదేశమునఁ బినతండ్రులున్నచో వారికి నితనికి సంబంధము లేదు. నేను పోయి నా తల్లి దండ్రులను చూచి వత్తుననిగాని మా దేశము వెళ్ళి వత్తుననిగాని యతఁడు రాజకొలువునందు సెలవు తీసికొనవలసిన యవసరము లేదు. నందివర్ధన మహారాజుతో నతఁడు తనకుఁ బది దినములు సెలవిప్పించవలయునని యడిగెను. రాజున కాశ్చర్యము వేసెను. ఏమి చేసెదవనెను. ఎక్కడికి పోయెద వనెను, అనారోగ్యముగాఁగూడ లేవుకదా! రాజకార్యములయొక్క బరువు నీ మనస్సునకు నోపరానిదిగానున్నచో నూరకే యుండుము. పది దినములు వానినిఁ బట్టించుకొనకుము. నీ యిష్టమువచ్చినట్లుండుము. నగర పరిసరములం దున్న పుష్పోద్యానములలో విహరింపుము. ఓయీ! నీకిచ్చట విహరించరాని స్థలమేమున్నది? పూర్వము నా మనస్సులో నున్నదానిని నీతోఁ జెప్పుచున్నాను. ఆ యూహ విఘటిత మైపోయినది. వేదమరీచి కిచ్చట నెంత యధికారము కలదో నీకు నంత యధికారము కలదు. ఈ రాజ్యము నీదియు, వేదమరీచిదియు ననుకొంటిని. ఇప్పుడట్లు కాలేదు. కాకపోయినంత మాత్రాన నీవు యథేచ్ఛముగా నిచట తిరుగుటకు నభ్యంతర మేమియు లేదు. నీ యాహారవిహారముల యొక్క స్వేచ్ఛకు వేదమరీచి యడ్డమురాదు. నీకు పదిదినముల సెలవెందుకో? మహానగరమును వదలిపోవుట యెందులకో?

అని యెంత చెప్పినను అజాతశత్రువు తన మనస్సు బాగుగా నుండ లేదనియు నూరకే దేశముమీఁదఁ దిరిగివచ్చినగాని తన మనస్సునకు శాంతి యేర్పడదనియుఁ జెప్పి రాజు నొప్పించెను. పది దినములలోఁ దప్పకుండఁ దిరిగి వత్తునని రాజతనివద్ద వాగ్దానముఁ దీసికొనెను. వేదమరీచితోఁ జెప్పి పొమ్మనెను. అజాతశత్రువు రాజుతో సరే యనెను. కాని యీతలకు వచ్చిన తరువాత వేదమరీచితోఁ జెప్పి వెళ్లుటకు తన మన స్సంగీకరించలేదు. అతనికి నందివర్ధనుఁడు తల్లియుఁ దండ్రియు దైవమును. ఆయనతో చేయుదునన్న పని యతఁడు చేయకుండ నుండుట యెన్నఁడును లేదు. వేదమరీచితోఁ జెప్పిపోదునని యాయనదగ్గఱ ననెను. అనునప్పు డాలోచించి యనలేదు. ఈతలకు వచ్చినతరువాత నది యాలోచించి యనలేదని యతనికిఁ దెలిసెను. అనకపోయినను జేయక తప్పదే. తనకు రాజు నందివర్ధనుఁడు కాని తత్స్థానము నందు వేదమరీచి లేదే. రాజనిన మాటలలో రెండు వాక్యములు తత్పూర్వమైనచో నతనిఁ దీసికొనిపోయి స్వర్గ లోకమునందుఁ గూర్చుండఁ బెట్టెడివే. ఇప్పుడామాటలు తన కధిక వ్యథాజనకములే యగుచున్నవే. అట్టి వేదమరీచి యిప్పుడు తనకు నెచ్చటికైనఁ బోవలసినచోఁ జెప్పిపోవలసిన స్థితిలో నున్నదా. అప్పుడుమాత్ర మట్టి స్థితిలో నుండదా? అజాతశత్రువు తాను వేదమరీచికడకే పోయెను. ఆమె కెదురుగా నిలుచుండెను. ఆమె రహస్యము నాఁడు సాయంకాలమున విన్న ముగ్గురిలో నితఁడొకఁడు. తరువాత మూఁడు నాల్గు దినములు గడచెను. ఈ నాల్గునాళ్ళలోఁ దాను

మయూరశర్మనుఁ జూడలేదు. తన కజాతశత్రువు గనిపించ లేదు. వారిద్దఱు నేమనుకొనుచుండిరో? మఱలఁ గలిసినప్పు డేమి మాటాడవలయునో యన్న స్థితిలో నున్న వేదమరీచి కెదురుగా నజాతశత్రువు నిలుచుండెను. ఇందుకు వచ్చితినని యతఁడుఁ చెప్పవలయునా? ఎందుకు వచ్చితివని యామె యడుగవలయునా? కొంతసే పిద్దఱు నొకరినొకరు చూచుకొను చన్లే యుండిరి. ఒకరినొకరు చూచుకొనుచుండిరి. చూచుచు చూచుచున్న యజాత శత్రుని కన్నులనిండ నీళ్ళు వచ్చెను. అతని కన్నీళ్ళు చూచుచున్న వేదమరీచి కన్నులనిండ నీళ్ళు పొంగి వచ్చెను. అతఁడు తన యూహాలనుఁ బట్టుకొనలేక పోయెను. అతని యొమ్ము నియమింపఁబడిన దుఃఖముచేత నుబుకుచుండెను, వ్రాలుచుండెను. ఆమెకూడ తన దుఃఖ మును నిలుపుకొనలేకపోయెను. ఇట్లైదాఱునిమేషములు జరి గెను. అజాతశత్రుఁ డిట్లనెను. శిశునాగుఁడు పెండ్లియాడి నాఁడు. తమరికిది తెలియునా? వేదమరీచి తెలియునన్నట్లు తలయూడించెను. అజాతశత్రు విట్లనెను. "తమ రతనినే ప్రేమించుచుంటిరా?" వేదమరీచి కాదన్నట్లు తలయూడించెను. వేదమరీచి రహస్యమేమో యజాతశత్రునకుఁ దెలియలేదు. అతనినిఁ బ్రేమించుటలేదు. ఇది యేమిసంబంధము? అతఁడీమె జీవితము నిట్లేల యధోగతిపాలు జేసెను? ఎందుకు చేసెను? మగధరాజ్యమున కీమె యొక్కతెయే వారసురాలు. ఈమె నిట్టి పాపక్లేశ సంబంధమున బిగించియుంచినచోఁ దానీ రాజ్యము నాక్రమించుకొనవచ్చునని చేసెనా? ఇది యేమి యూహ? ఇది యెవఁడో రాక్షసుఁడో పిచాచమో చేయ

వలసిన యూహ. అంతలో నజాతశత్రునకుఁ గోప మువికి వచ్చెను. ఇట్లనెను : "నాకు శిశునాగుఁ డాజన్మశత్రువు. అతనిని నేనో, నన్నతఁడో సంహరించినగాని యీ రాజ్యము నందు శాంతి లేదు. సమస్త భారతదేశమునఁ బ్రసిద్ధులైన కటారి కాండ్రలో శిశునాగుఁ డొకఁడు. నా పేరుకూడ గొప్ప కటారి కాండ్రలోఁ జెప్పికొందురు. నా తండ్రియాస్తి నా జ్ఞాతు లపహరించినపుడు పదేండ్లు నేవేళ యెట్టిదోయని యాయుధ విద్యలం దధిక పరిశ్రమఁ జేసితిని. అప్పుడు పలుమంది కటారి కాండ్రతో యుద్ధముచేసితిని. చాల గెలుపులు గెలిచితిని. మీ నాయనగారు నాయం దింతటి యనుగ్రహము చూపించ నిచో నా బ్రదుకు కటారిగాని బ్రదుకయ్యెడిది. ఈ పది యేండ్లు నాకు కత్తివిద్య యభ్యాసములో నుంచుకొనుటకే వీలులేక పోయినది. నేను పేదకటారికాఁడుగా బ్రదుకుట మాని వేసి యిచట రాజపురుషుఁడుగా బ్రదికితిని. నేను మఱలఁ గొన్నియేండ్లు దినదిన మభ్యాసముఁ జేసినచో నా తొలివిద్య నాకు వచ్చును. దానిని పదిరెట్లభివృద్ధిపఱచు కొనఁగలను. అట్లు చేసెదను. శిశునాగునితో నేను విరోధించి తిని. అతనికి నేను బలవచ్ఛత్రువను. నేను కాశీనగరమునకుఁ బోవుచున్నాను. ఆ యువరాజుతో నీమాట చెప్పివత్తును. ఈ మాట మహారాజుతోఁ జెప్పలేదు. తమతోఁ జెప్పి మఱియు వెళ్ళుమని నాయనగారన్నారు. మీరు రాజ్యాధికారిణీపదము నందున్నారు గనుక నేను మీ భృత్యుఁడను గనుక మీతోఁ జెప్పియే పోవుటకు నా మనస్సు నంగీకరింపఁ జేసితిని. అనఁగా వేసనురీచి యిట్లనెను : "ఓయి ! అజాతశత్రూ! నేను నిన్ని

న్నాళ్ళు గౌరవించితిని. ఏకవచన ప్రయోగము చేయలేదు. నేఁటినుండి నిన్ను గౌరవము చేయను. నీవనియే మాటాడుదును. నీవుకూడ నన్ను రాజ్యాధికారిణిగా చూడవద్దు. తమరు మీరు మొదలైన మర్యాద శబ్దములు వాడవలదు. నీవనియే వాడుము. దాని కంగీకరించినచోఁ దరువాత చెప్పెదను." అనఁగా నజాత శత్రువు తా నంగీకరించితి ననెను. అపుడు వేదమరీచి యిట్లనెను. "నీవు శిశునాగునివద్దకుఁ బోయి యతనికి నీకు విరోధమని చెప్పకుము. అది యిప్పుడే చెప్ప నక్కఱలేదు. అతఁడు రాజుకాఁడు. యువరాజు. నీవును యువరాజ స్థానమునందే యున్నావు. మీ యిద్దఱు సమానులు. వారి నగరమునకుఁబోయి నీవీ సంగతి చెప్పుట నీ మర్యాదకు నష్టము. కాని నీ విట్లును వెళ్ళుచున్నావుకదా! అతనితో నొక మాట చెప్పుము. వేదమరీచి పెండ్లి యాడఁబోవుచున్నది. నీతోఁ జెప్పిరమ్మన్నది. అన్నమాట చెప్పి వచ్చివేయుము. ఇది నా యాజ్ఞ. నేను నిన్నాజ్ఞాపించుటకు నాకున్న యధికారము నేను రాజు కూఁతురు నగుటకాదు. నీవు నన్ను నీవని పిల్చుటకు నీ విప్పు డంగీకరించితివే, ఆ చనవు కారణము." అని వేదమరీచి యనఁగా నజాతశత్రువు తన ప్రక్క వ్రేలాడుచున్న ఖడ్గము నొరనుండి తీసి వేదమరీచి పాదములపైఁ బెట్టి మఱలఁ దీసికొనఁ బోవుచుండెను. వేదమరీచి యతని మణికట్టు తనచేతఁ బట్టికొని యతని కన్నులలోఁ జూచెను. ఆ చూపులు విచిత్రముగా నుండెను. పైనుండి జలప్రవాహము కొండ యంచువఱకుఁ వచ్చెను. అది జలపాతము. క్రింద సామాన్యముగా జలపాతమగుచోట

నఖాత్రమై యుండును. ఒకానొక జలపాతము జరుగు స్థలమున నొక యెత్తైన మహాశిల యుండును. ఆ శిశిర జలస్తబకము రాతిమీఁదపడి శిథిలమై శీర్ణమై రాతిక్రిందికిఁ దొరలిపోవును. ఆ మహాశిలయొక్క చుట్టుననున్న ప్రదేశమంతయుఁ దటాక ముగాఁ గట్టును. ఆ తటాకాభమైన యా జలమునకు నడుమ నీ రాయి పైకెత్తుగా నుండును. మహాక్షేత్రములయందుఁ బుష్కరిణి యుండును. దాని నడుమ మండపమొకటి కట్టి యుండును. ఆ రాయి యా మండపమువలె నుండును. ఆ చుట్టుననున్న తటాకాభమైన జలము నదిగా దిగువకుఁ బ్రవ హించి పోవుచుండునుగాని లేనిచో నాశిలను ముంచి వేయును. ఆ ప్రవాహము సముద్రగామి యైపోవుచుండును. ఇచట నిలువయుండదు. నీరు పొంగదు. శిలను ముంచదు. ఆ శిలమీఁద నా శిశిర జలగుళుచ్ఛములు తపేలున పడు టయు, చిద్రుపలగుటయు, విరిసిపోవుటయు మాత్రమే నిత్యము జరుగుచుండును. ఆ స్థితి వారియుద్దతి దృక్ప్రసారమున భాసించెను. ఆమె చూపులు జలపాతమువలె నుండెను. అతని కన్నులు శిలవలె నుండెను. ఎంత శిలయైనను, ఎంత తజ్జలమును తనమీఁద నిలుపుకొనలేకపోయినను, తనమీఁద పడిన నా జలము నెంత చిద్రుపలు సేసినను తచ్ఛిలా ప్రదే శము నిత్యస్నపిత మగుచుండును. దానియొక్క యార్ద్రితకు మొదలును తుదయు లేవు. అజాతశత్రువు తన ఖడ్గమును తాను తీసికొని వెనుదిరిగి చూడకుండ నడలిపోవుచుండెను. వెనుకనుండి యొక సన్నని యేడుపు కూనరాగముగా నెవఁడో నేటఁ గాఁ డపహరించుకొనిపోయిన తన పిల్లలను వెదకి వెదకి

కనిపించక నిశావేళ తన గుహకువచ్చి ముంగాళ్లు చాచి దానిపైన తన తల యొరిగించికొని నిస్సహాయమైన స్థితిలో నుండి దుఃఖపడుచున్న తల్లి పులినోటి వెంట గర్జకానిది, యరపుకానిది, తా నరువవలయునని యనుకోనిది, వట్టి దుఃఖము తనంతట తాను తనకుఁ దెలియకుండఁ దన ప్రయత్నము లేకుండ యొక సన్నని ధ్వనిగా వెడలి వచ్చునట్లు వేదమరీచి గొంతులోనుండి వచ్చినది. ఆ ధ్వని యజాతశత్రుని శ్రవణగోచర మయ్యెను. మఱియొక్కఁ డైనచో వెనుదిరిగి చూచెడివాఁడే. అతఁడు చూడలేదు. ఏల యనగా నా ధ్వని వచ్చి యతని మనస్సులోనున్న కోపాగ్ని నినుమడింపఁజేసెను. ఆ సన్నని దుఃఖభారము తన పని తాను చేసి యతనిచేత వెనుఁదిరిగి చూడనీయలేదు.

అజాతశత్రుపు శిశునాగుని యనుజ్ఞకొఱకుఁ జాలసేపు ప్రతీక్షించి యుండవలసివచ్చెను. చివరకు రమ్మని యాజ్ఞయైనది. శిశునాగుఁడున్నది వంకజాబిల్లియొక్క సౌధము. అచ్చట శిశునాగుఁ డుండఁగా నెవ్వరును శిశునాగుని వద్దకుఁ బోయి యేమియుఁ జెప్పరు. ఈ వచ్చిన యజాతశత్రుపు యొక్క మగధరాజ్యమునందలి ప్రాముఖ్యము నెఱిగినవారు వీని వార్త చెప్పక తప్పదనుకొనుచు చెప్పవలయునా వలదా యనుకొనుచుఁ దొలుత మహారాణి యనుజ్ఞ కావలయును. ఆమె యంగీకరించినఁగాని చెప్పుటకు వీలులేదు. వేదమరీచి పంపిన వార్త వెంటనే చెప్పవలయుననియు వెంటనే వెడలిపోవలయునని యజాతశత్రుఁడు కూర్చుండెను. పోయి రాణితోఁ జెప్పిరి. రాణి యాలోచించెను. ఏమి వార్తయై యుండును?

పరాశరశాస్త్రికి వార్తఁ బెట్టెను. ఆయన వచ్చెను. యువరాజు నకును యువరాణికిని సంబంధములేదని సర్వజనులకుఁ దెలి యును. పరాశరశాస్త్రి యాలోచించెను. ఇంతకన్నఁ జెడి పోవునది లేదుగదా! ఆవార్త యెట్టిదో తమకుఁ దెలియదు గదా! ఎట్టిదైననేమి? ఆ వార్తాబలమువలన శిశునాగుని మనస్సు మాఱునేమో! మాఱనిచో నష్టములేదు. మాఱి నచో లాభమేగదా? అని శాస్త్రియు రాణియు నూహించి యజాతశత్రునకు శిశునాగుని దర్శనముఁ జేయించిరి. అజాత శత్రుఁడు తాను శిశునాగునితో మాటాడుచున్నప్పు డచ్చట నెవ్వరు నుండరా దనెను. అందఱు వెడలిపోయిరి. శిశునాగుఁ డజాతశత్రు నెఱుఁగడు. అతఁడు వచ్చి తన్నుఁ జూచునని దౌవారికుఁడు చెప్పఁగా శిశునాగుఁడు విని యూరకుండెను. అజాతశత్రువు వచ్చెనన్నమాటయే శిశునాగుఁ డెఱుఁగఁ డన్నట్లు యువరాజు తలవంచుకొని కూర్చుండెను. అజాత శత్రున కర్థముకాలేదు. అందఱు పోయిన తరువాత నజాత శత్రుఁ డిట్లనెను. "నన్ను వేసమరీచి పంపినది. నేనచట రాజోద్యోగిని. నీతో నొకమాట చెప్పుమన్న" దనఁగా శిశు నాగునకుఁ గోపము పొరలి వచ్చినది. బొడ్డులోని కైజారు తీసెను. కన్నులు విప్పి యజాతశత్రునిపంకఁ జూచెను. అజాత శత్రుఁడు నవ్వెను. ఇట్లనెను. "నేను నిన్ను నీవనుటకు నధి కారము వేసమరీచి నాకిచ్చినది. ఆమెను నేను నీవనియే వ్యవహరింపవలయునని యామె కోరినది. అందుచేత నేను నిన్నుఁ గూడ నీవనవచ్చును. ఇంకను మనసులో నంతటి గౌర వము మిగిలియున్నదా? గౌరవమునకును నీకును సంబంధ

మేమి? నా చేతిలో ఖడ్గ మున్నది. మనమిద్దఱము యుద్ధము చేయుటకు నాకభ్యంతరము లేదు. ఇది నీ రాజ్యము. నన్ను పట్టించి చెఱలోఁ బెట్టించెదవా? పది దినములలో మగధ సైన్యములు వచ్చి నీ సైన్యములకు నామరూపములు లేకుండ చేయును. ఓయీ! మగధరాజ్యము నపహరింపవలయునని కదా నీ యూహ. నీవు నన్నిట్లుఁ జెఱలోఁ బెట్టినచో నా యూహ మొదటనే త్రుంచికొనిపోవును. ఆగఁగల యోపిక యున్నచో నాగుము. వేదమరిచి నీతోఁ జెప్పుమన్న మాటలు రెండున్నవి. అవి చెప్పి నేను వెడలిపోవుదును. ఈలోపుగా నేను నీతో చెప్పవలసిన మాటలు రెండున్నవి. అవి చెప్పిన తరువాతగాని వేదమరిచి చెప్పిన మాటలు చెప్పను. నా పేరజాతశత్రువు. పేరే కాదు. నేను నిజముగా నజాతశత్రువను. నా తండ్రి యాస్తి దొంగిలించిన వారితోకూడ నేను శత్రుత్వముఁ బూనలేదు. నీ యొక్కని మూలమున నేను జాతశత్రువనైతిని. ఒక్కటియే మాట. నీకుఁ బరమ విరోధి యొక్కఁడ గిరివ్రజపురమున నున్నాఁడని మరచిపోకుము. వానిచేతిలో నీవో, నీచేతిలో వాఁడో చావవలయును. నీవు భారతదేశమునందుఁ బ్రసిద్ధి వహించిన కటారికాండ్రలో నొకఁడవు. అట్టి కటారికాండ్రను గుఱించిన వార్తలు నీవుఁ గూడఁ దెలిసికొనుచు నున్నవాఁ డవైనచో నా పేరును నీవు వినియుండవచ్చును. వీఁడు నీకు నట్టివిరోధి కాదు. వేదమరిచి నీతోఁ జెప్పుమన్న మాట యేమనగా నదియొక్కటే మాట. ఆమెయొక్క వివాహము సిద్ధమైనది. ఆమె పెండ్లి చేసికొనఁ బోవుచున్నది. నీతో నీమాట చెప్పుమన్నది." అని యజాత

శత్రువు చరచర నడచిపోయెను. రాజద్వారము దాటెను. నగరద్వారము దాటెను. దుర్గద్వారము దాటెను.

శిశునాగుఁడు కొంతసేపట్లు కూర్చుండెను. కొంతసేపు మహాగ్నివలె మండెను. కొంతసేపు విపరీతముగా నవ్వెను. ఇంతలో నతనికి వంకజాబిల్లి కనిపించెను. ఆమెను హఠాత్తుగా కౌఁగిలించికొనెను. విపరీతముగా ముద్దాడెను. తగులఁబడి పోయిన మన్మథుఁడు మఱల బ్రతుకువేళ దహనవేళా దశా పరిణామము వెనుకకుఁ దిరిగి మఱల నా దశలనుఁ బొందినగాని రూపము కట్టుట జరుగనిచో భస్మమైన దశకుఁ బూర్వము ధూమదశ. తత్పూర్వదశ జ్వాలాదశ తత్పూర్వదశ సాగ్ని కాష్ఠదశ. ఇట్లు వెనుక వెనుకకు దశలు నిర్మించుకొన్నచో భస్మదశకు వెనుకనున్న ధూమదశయు, దాని వెనుకనున్న యగ్నిమత్కాష్ఠదశయు నీరెండు దశలునుఁ గలిసి మన్మథుఁడు పునరుజ్జీవింపఁ బోవుచున్నట్లు భాసించెను.

## ౨౧

తరువాత నాలైదేండ్లకు మయూరశర్మ చనిపోయెను. చనిపోయిన తరువాత నందివర్ధనుడు నేనుమాత్ర మెందుకు బ్రతికియుండవలయు ననుకొనెను. ప్రజలలో రాజు తరువాత రాజ్యమెవరు చేయవలయునన్న ప్రశ్న మిక్కిలిగాఁ దీవ్రత వహించెను. నందివర్ధనున శాసంగతి తెలియును. అజాత

శత్రుఁడును వేదమరీచియు వివాహమాడినచో యీప్రశ్న సన్నగిల్లిపోవును. ప్రజలు వేదమరీచిని రాణిగా నంగీకరింతురు. వారి సమస్య ఁంతియు - వారికి సంతానముకలుగును. ఆ సంతానమున కుత్తరాధికారము కలుగునన్న యాశమీఁద నిలిచియుండును. కాని వారిద్దఱు వివాహమాడుట యెట్లు? తన కూఁతును వివాహమాడుమని తా నజాతశత్రునితో నేమని చెప్పును? ఈ రహస్యము తెలిసినది నలుగురే. తెలిసినది నలుగురన్న పేరేగాని నలుగురు నొక్కటియే. అయినను శరీరములు భిన్నములగుటచేత నలువు రనుకొనక తప్పక వచ్చెను. ఇప్పుడు ముగ్గురే. తానుగూడ మరణించిపచో నా యిద్దఱే యగుదురు. ఆ యిద్దఱిమధ్య నీ రహస్యము. రహస్యమేకాదు.తన యూహయెంతవఱకు ఫలించునో తనకుఁ దెలియదు. తా నిది నోటితో ననెడిదికాదు. సూచనగా నజాతశత్రునితో నాస్త్రీండ్లక్రిందనే చెప్పెను. ఒక బాలిక యున్నది. ఆమె కేమియుఁ దెలియదు. ఒక కుత్సితుఁడామెను వంచించెను. ఆ బాలిక జీవితమేమి కావలయును? ఆ పాపము నకు నా బాలిక యెంతవఱకు బాధ్యురాలు? బాలికయైనప్పుడు కూడ నూహయు సుఖాశయు నుండునే కదా? లోకజ్ఞానము లేనప్పుడే పసివాండ్రుగా నున్నప్పుడే వయసు రాఁబోవు సంధి కాలమునందే జీవికి సహజమైన సుఖాశ యుండును. అది సహజమైన విషయము. దాని ఫలితములు పెద్దనైన తరువాత లోకమునుబట్టి చిత్ర విచిత్రములుగా నుండును. లోకజ్ఞానము లేనప్పుడొక పనిచేయును. లోకజ్ఞానము కలిగిన తరువాత దాని ఫలితము ననుభవింపవలసి వచ్చును. అజ్ఞానదశలో

బాలదశలో జరిగిన కొన్ని సన్నివేశములకు పెద్దయైనతరువాత జ్ఞానదశలోఁ జేసిన కార్యములకు నామానిసి యెంతవఱకు బాధ్యుఁడుగా భావింపఁబడునో యంతవఱకు బాధ్యుఁడుఁగా వానికి గూడ బాధ్యుఁడుగా భావింపఁబడుట న్యాయ్యముకాదు. ఇందులో నొక భేదమున్నది. వాఁడు పసివాఁడే. వానికి బుద్ధి రాలేదు. వాఁ డవివేకముతోఁ జేసినపనికి వానిని బాధ్యునిఁ జేయుచున్నాము. అనఁగా జీవుఁ డొక్కశరీరమునందుఁ బ్రవేశించి నంతనే వాఁడొకవ్యక్తి. వాఁడు వాఁడు – ఆశరీరములో జరిగిన సర్వకార్యములకును వానికిని సంబంధము – ఆ రెంటికి నవినాభావ సంబంధము. ఈ విషయముకూడ మానిసి యొక్క పూర్వజన్మ సంస్కారము; దానిని బట్టి వీఁడు జన్మించుట, వాని జీవిత మంతయు దానిమీద నాధారపడి యుండుట, నిర్ధారితమగుచున్నది. దీని యర్థమేమనగా నొక క్రియ జరుగుటలో జరుగుటకే ప్రాధాన్యముగాని యది యెందుకు జరిగిన దనుటకుఁ బ్రాధాన్యము లేదు. ఆ క్రియకు కర్త వాఁడు. కర్తృత్వము వానియం దున్నది. కర్తృత్వ జ్ఞానము వాని కున్నదా లేదా యన్న ప్రశ్న లేదు. వాఁడు పసివాఁడైనను వాని నా కార్యమునకుఁ గర్తగా లోకమెంచుట వలన తత్కర్తృత్వాభిమానము వాని జీవ లక్షణమునం దున్నదని లోక మంగీకరించుచున్నది లోకము జీవుని నంగీకరించు చున్నది. లోకజ్ఞానము క్రమముగా వచ్చును. రాదు. కర్తృత్వ జ్ఞానము జీవనిష్ఠమై యున్నదన్నమాట. అయ్యో! వానికి లౌకిక జ్ఞానము కుదురకముందే వానియం దీ కర్తృత్వము నారోపించుట న్యాయము కా దనగా లోకజ్ఞానము

కుదురకముందే వానియందు సౌఖ్యభావన దుఃఖభావనయు నున్నదిగదా! వాఁడు భావించు సౌఖ్యము వానికి లోకజ్ఞానవము రాకముందే భావించుచున్నాఁడుగదా! లోకమునందు చేసెడి కార్యములకు సుఖదుఃఖములు ఫలితములు. కార్యమునందలి కర్తృత్వాభిజ్ఞానము తెలియకముందే తత్కార్య ఫలితమైన సుఖాశ యెట్లు కలిగినది? ఇది ప్రశ్న. అందుచేత జీవుఁడు తాను చేసెడు పనికి తాను బాధ్యుఁడు. వాఁడు తెలిసి చేయ వచ్చును. తెలియక చేయవచ్చును. అనఁగా లోకమునందు కర్మకుఁ ప్రాధాన్యమున్నదని యర్థము. ఇట్టి స్థితిలో వేదమరీచి యందు దోషము లేదని చెప్పుట యెట్లు? ఉన్నది. తత్కర్తృ త్వము తజ్జీవగతమై యున్నది. అది బాల్యదశ. అందుచేత నామెను దూషింపరాదన్నచో బాల్య యౌవన కౌమారములు శరీరదశలు. శరీరమునకున్న యీ దశలనుబట్టి జీవుఁడు వర్తించునా? జీవుఁడు తానెప్పుడు శరీమును స్వీకరించెనో దానికి సహజమైన దశలను దత్తత్కాలములయందుఁ జేసిన కార్యము లను సర్వము నంగీకరించెననియే యర్థము.

ఇట్టి యాలోచనలతో నందివర్ధనుఁడు తరువాత రెండు మూఁడేండ్లలోఁ జనిపోయెను. తండ్రి చనిపోయినంతనే రాజ్య మున కుత్తరాధికారి యెవరన్న ప్రశ్న మఱియును బలిసెను.

ఒకనాఁ డజాతశత్రుఁడు వేదమరీచివద్దకు వచ్చెను. "నీవు వివాహము చేసికొనక తప్పదు. లేనిచో ప్రజ లూరకుండ" రనెను. వేదమరీచి:- ఎవరినిఁ జేసికొమ్మందువు? అజాతశత్రువు:- నీ యిష్టము వచ్చినవానిని. వేద:- నా కిష్ట మెవ్వరిమీఁదను లేదు. అజా:- నీవు చేసికోవలసిన యవసర

మున్నది. వేద:- చేసికొందును. ఎవరిని? అజా:- మఱల నదే ప్రశ్నయా? ఎవరినినో యొకరిని? వేద:- అట్లైనచో నిన్నే చేసికొందును. నీవు చేసికొందువో లేదో నాకు తెలియదు. నన్నుఁ బెండ్లియాడుటకు నీ వొక్కఁడవే తగుదువు. ఇది పెండ్లి కాదు. పెండ్లి కాదని యెవనికిఁ దెలియునో వాఁడే తగును. ఇది పెండ్లియని యెవఁ డనుకొనునో నేను వానిని పెండ్లి చేసికొనుట సంభవించదు. నేనట్టి వానిని వివాహ మాడినచో వాని భవిష్యజ్జీవితమును నాశనముఁ జేయుటయు ప్రజలను మోసగించుటయు జరుగును. కనుక నన్ను నేను మోసగించుట ప్రజలకొఱకు చేయవలయును. నాతోపాటు నాయందు దయగలిగి నాయందొక ప్రేమయుండి వాని జీవలక్షణము, నా జీవలక్షణము సమానమైననై యభారతీయమైన యొక ప్రేమభావము కలిగియుండి, నేను నన్ను మోసగించుకొన్నట్లే మరియొకఁ డెవఁడో నా కొఱకుఁ దన్నుఁ దాను మోసగించుకొన నెంచినవాఁ డున్నచో నేను వానిని వివాహమాడెదను. ప్రజలు తృప్తులగుదురు. కాలము గడచును. పదేండ్లు గడువవచ్చును. ప్రజలు నాకును సన్నా రీతిగాఁ బెండ్లాడిన వానికిని సంతానము గలుగుననియు వాఁడు రాజ్యమున కధికారియగుననియు ననుకొనుచుందురు. ఆయాశ మీఁద పది పండ్రెండేండ్లు జరుగవచ్చును. పాతికయేండ్లు జరుగవచ్చును. మేమిద్దఱము కలిసి యొక పిల్లవానిని దత్తతఁ జేసికొనవచ్చును. వాఁడు రాజ్యాధికారి యగును. నా పాపము నాతోడను, నన్నట్లు ప్రేమించినవానితోడను నశించి పోవును. నన్నట్లు పెండ్లాడెడువాఁ డెవఁడు? అజాతశత్రూ!

"మనస్సు చాల చిత్రమైనది. ఒక పాపకార్యము పాపకార్యముగా నొకప్పుడుగా భాసించి మఱియొకప్పుడు భాసించదు. తారయుఁ జంద్రుడును సంసారముఁ జేసిరి. ఆ తారకన్న బుధుని చంద్రునికిచ్చి తెచ్చికొని బృహస్పతి మరల తారను తన యింటిలోఁ బెట్టికొనెను. అట్లే నా రహస్య మెఱిగిన వాఁడు నన్ను మాగధప్రజల మీఁదగల ప్రేమతో నాయందు గల సానుభూతితో నిప్పుడు వివాహమాడి రేపు ప్రొద్దున నే నిట్టిదానినని తెలిసి కూడ నాయందు కామభావము కలిగి నాయందు సంతానముఁ గనవలయునన్న వాంఛ కలిగ్గి నచో నేను దానికంగీకరించను. నే నతనికి భార్యగా నుందును. పెండ్లి చేసికొందును. నాకు నతనికేమియు సంబంధము లేదు. ఒక్క గదియందే పరుందుము. ఏక శయ్యాగతులమైనను కావచ్చును. కాని మా యిద్దఱకుఁ శరీరసంబంధమనునది యుండనే యుండదు. పాతికయేండ్లు ముప్పదియేండ్లు గడచిన తరువాతఁ బ్రజలకు మత్సంతానమునం దభిలాష కలిగినచో మేమిద్దఱ మెవనినో దత్తత చేసికొందుము. ఈ నియమము లంగీకరించి నన్నెవఁడు వివాహమాడును. ఎవ్వఁడు నాడఁడు" అనగా నజాతశత్రువు "ఎవఁడో యొక్కఁడు వివాహమాడి తీరవలయును. లేనిచో నీ మగధరాజ్య మేమగును ?" అనఁగా వేదమరీచి "ఈ మగధరాజ్యమేమి కావలయునన్న దిగులు వేనికి గలదో వాఁడే పెండ్లియాఁడును." అనెను. అజాతశత్రువు "సరే! నేనే పెండ్లియాడుదును. నీ నియమములన్నియు నే నంగీకరించితిని. శిశునాగునితో నే నెప్పుడు తిరిగి విరోధము పెట్టికొంటినో అప్పుడే నాకుఁ దెలియును. అంతటి విరోధము

నా కతనిమీఁద నెందుకు కలిగెను? ఈరీతి పాపము సంభవించని వేదవరీచిని నేను ప్రేమింతును. అట్టి వేదవరీచిని ప్రేమించుటఁగా నామెనుఁ బెండ్లాడుటకు నీతఁ డడ్డుతగిలెను. ఇతఁ డాసుఖమునుండి నన్ను బహిష్కరింపించెను. అందుచేత నతనిమీఁద నేను విరోధము పట్టితిని – వేదవరీచీ! ఇదియొక చమత్కారము. తండ్రియున్నాఁడు. అతనికిఁ బెద్దయాస్తి యున్నది. అతఁ డాస్తినంతయుఁ బాడుచేసెను. కొడుకు దరిద్రుఁడైనాఁడు. వీని చిన్నతనములోననె యాతండ్రి చని పోయెను. వీఁడు బ్రదికియున్నన్ని దినములు నా తండ్రికి శ్రాద్ధము పెట్టుచునే యుండెను. ఆ తండ్రి నెఱుఁగఁడు. అతఁ డితని కపకారి. ఆ తండ్రికి శ్రాద్ధమెందుకుఁ బెట్టవలయును? అతఁడు తండ్రియన్న భావ మున్నది. ఆ భావముచేతఁ బెట్టు చున్నాఁడు. అట్లె నేను నీవు నాకు భార్యవై యుండెడిదాన వన్న భావముచేత శిశునాగునితో విరోధము పెట్టికొంటిని. చూచితివా? యెట్లున్నదో – ఇప్పుడు నీవు భార్యవుకావు. నేను భర్తనుకాను. మన యిద్దఱి యీ సంబంధము మన మిద్దఱము కలిసికొనకమునుపే తెగిపోయినది. తెగిపోకముం దీభావ మున్నదా? ఉన్నదో లేదో తెలియదు. అట్టిభావము పుట్టుటకు వీలులేని సమయములో మనము కలిసికొంటిమి. కలిసికొన్న సమయములో నట్టిభావము పుట్టుటకు వీలులేదని నాకుఁ దెలియదు. ఆభావము నాకుఁ గలిగినది. ఈ భావము యొక్క బలము చూచితివా యెట్టిదో? అది కలుగనే కలుగ కూడని పరిస్థితులలోఁ దత్పరిస్థితుల పరిజ్ఞానములేక కలిగిన తద్భావమునుగూర్చి యొక బలవద్విరోధ మేర్పడుట దానికిఁ

గారణము నిజముగా నేమందువు ? ఈ మగధరాజ్యమునకును నాకును నేమియు సంబంధము లేదు. మీ నాయనగారు నన్ను గాలికిఁ గొట్టకొని పోవుచున్నవానిని తెచ్చి యొకచోట పాతి పెట్టి నీళ్ళుపోసెను. ఇది యభిమాన హేతువు. నే నింకేమి చెప్పుదును ?"

అనఁగా వేదమరీచి "ఐనచో మన వివాహ మెంత తొందరగా జరిగినచో నంత మంచిదిగదా ? ప్రజలకు మన యం దధిక విశ్వాసము కలుగును. మగధరాజ్యముమీఁద నీ కధికార మిదివఱకే గలదు. ఆ యధికారమునకుఁ గంటగించు కొనువారు నేటినుండి యే మాటయు ననుటకు వీలులేదు. నీవే రాజ వగుదువు. నీవు వేఱే పెండ్లిఁజేసికొని సంతానము కనవలయునని నీకున్నచో ఆ సంతానమునకు రాజ్యమురాదు. మనమిల్లేయుండి చివరకు దత్తతఁ జేసికొన్నచో నొక యేఁబది యేండ్లలో నిది పరిష్కరింపఁబడును." అనెను.

అజాతశత్రువును వేదమరీచియుఁ బెండ్లియాడుదురన్న వార్త గిరివ్రజపురమంతయు వ్యాపించుటకు రెండుదినములు పట్టలేదు. ఊరంతయు మాఱుమ్రోగిపోయినది. మేళ తాళములతో నానకదుందుభులతో కాహళారవములతో దిశ లన్నియు మాఱుమ్రోగిపోయినవి. ఆఱేండ్లుగా నీ వివాహము జరుగునని యెదురుచూచిన పలుమంది సంతసించిరి. మన కిష్టము లేకపోయినను నీ వివాహ మెప్పుడో జరుగక తప్పదని యనుకొన్నవారు శిరఃకంపము చేసిరి. వారి మనః పంకము మఱియు బిగిసెను. అజాతశత్రు వేదమరీచీ వివాహము శిశునాగునకుఁ దెలిసెను.

# ౨౨

ఈ వార్త శిశునాగునకుఁ దెలిసినప్పుడు తన కొడుకుతో నాడుకొనుచుండెను. ఆ కొడుకున కాఱేండ్ల వయస్సు. వాని పేరు కాకవర్ణుడు. గుణనిరూపణము చేసిపెట్టిన పేరుగాని యూరకే పెట్టినది కాదు. పిల్లవాఁడు కాటుకనలుపు. రాజ వంశములో నట్టివాఁ డెట్లు పుట్టెనో యెవ్వరికినిఁ దెలియదు. తల్లి యప్సరః స్త్రీ. అట్టి స్త్రీ గర్భమున నింత కురూపియైన బాలుఁ డెట్లుదయించెను? తండ్రినిఁబోలి పుట్టె ననఁగా తండ్రి నలకూబరుఁడు కాకపోవచ్చును. జయంతుఁడు కాకపో వచ్చును. నలమహారాజు కాకపోవచ్చును. నకులుఁడు కాక పోవచ్చును. ఎట్టివాఁడు. రాజలక్షణము మొగమునఁ దాండవించుచున్నవాఁడు. సర్వభూకాంత చక్రవర్తి కాఁదగిన లక్షణములు గలవాఁడు. కాకవర్ణుఁడు కాకపోయెనా, పిల్లవాని కన్ను లాకర్ణాంతములు. ఆ నేత్రములయొక్క కాంతివలన పరమ వికారమైన వాని మొగము దర్శనీయముగానే యుండును. మొగమును చూచుటతోడనే యొక వెగటు తోచును. కాని యా రాజకుమారుఁడు కన్నులను విప్పి నీవంకఁ జూచినచో నాఱేండ్ల పిల్లవాఁడు నీ వంక నొక మహారాజు చూచినట్లు చూచును. పిల్లవాఁడు మహారాజు కాదు. అందుచేత నీకు వానియం దొక యనురాగము పుట్టును. అందమైన పిల్లవాఁడే యనిపించును. తరువాత

నీ వనుకొందువుకదా! అంత అందపు వికారియైన బాలుఁ డుండఁడు. కాని వాని కన్ను లేమి కన్నులు! సర్వ భారత దేశమును పరిపాలించు కన్నులు అనుకొందువు. ఆ పిల్ల వాని యందం దంతేకాదు. వాని శరీరావయవములయందుఁ జక్రవర్తి లక్షణములు గనిపించును. పిల్లవాని కాలేండ్లే కాని వాని తెలివితేటలు వాని ఠీవియు వాఁడు మాటాడెడి లక్షణ ములను వాఁడు చూచుటలోని గాంభీర్యమును సర్వప్రజలకు నతఁడు సర్వ భారతదేశ చక్రవర్తి యగు ననిపించును. అట్టి కొడుకుతో శిశునాగుఁ డాడుకొనుచుండెను. పిల్లవాఁ డెప్పు డును తండ్రివద్దనే యుండును. వంకజాబిల్లికిఁ గాకవర్ణునిమీఁద ప్రేమ యున్నదో లేదో చెప్పలేము. ఆమె యీ సుతుని కన్నప్పటినుండి తత్పూర్వపు వంకజాబిల్లికాదు. తత్పూర్వ మున వంకజాబిల్లి ముద్దరాలు. మాటాడెడికాదు. ఆమె కేమియు నక్కఱలేదు. ఏది యెట్లైనను సరే. తానట్టి కెందుకువచ్చెనో యామెకుఁ దెలియదు. పిల్లవానిని కన్న తరువాత పురుషుడు వెళ్ళినతరువాత వంకజాబిల్లి పరాశర శాస్త్రినిఁ బిలపించెను. ఆయనతో నిట్లనెను. "శాస్త్రిగారూ! ఆ గురువు నన్నిచ్చటికి నాల్గు దినములకుఁ బంపించుననగా నాలో నేడో ప్రవేశించినది. నా తెలివితేటలన్నియుఁ బోయి నవి. నా పట్టుదల యంతయుఁ బోయినది. ఈ పిల్లవాఁడు నా గర్భమునం దుదయించినాఁడు. ఈ పది దినములనుండి నేను పూర్వపు వంకజాబిల్లి ననుకొనుచున్నాను. ఇప్పుడు నాకున్న తెలివి యీ కడచిన సంవత్సర మంతయు దేని చేతనో సమావృతమై యుండెను. ఈ పిల్లవాఁడు తొమ్మిది

నెలల క్రింద నా కడుపున బడలేదు. తత్పూర్వమే కొన్ని నెలల క్రిందఁ బడినట్లున్నాఁడు. వాఁడు బయలుపడినాఁడు. నా ప్రాణము తేలిక యిచ్చినది. నా ప్రాణము తేలిక యిచ్చుటగాదు. నా జీవము తేలిక యిచ్చినది. ఈ పిల్లవాఁడెవ్వఁడో? వీఁడు నా గర్భములో నెట్లు ప్రవేశించినాఁడు? పన్నెండు పదుమూఁడు నెలలు కడుపులోనుండి నా జీవలక్షణమున కింత బరువెట్లు కలిపించినాఁడు? వీఁడు నాబిడ్డయేనా? ఈ యువరాజునకు నాకు సంబంధమేమి? నాయాత్మమీఁద నా కదుపులేనప్పుడు నా శరీరముమీఁద నా కధికారము లేనప్పుడు నేను శిశునాగునకు భార్యనైతిని. అతనికి నేను సంతానముఁ గంటిని. నేను నిజముగా నతనికి భార్యనగుదునా? వీఁడు నాకు సంతానమగునా? ఓయయ్యా! ఇది చాల సూక్ష్మముగా నున్నది. శిశునాగుఁడు నాకు భర్తగాఁడు. అవిజ్ఞాతమైన యొక మనోదశయం దనుస్యూతముగా నున్న శరీరముయొక్క యప్పటి యిప్పటి యొకటే యునికిచేత నతఁడు భర్త యనిపించుచున్నది. ఇతఁడు కొడుకనిపించుచున్నాఁడు. నన్నేమి చేయుమందురు?" అనఁగాఁ బరాశర శాస్త్రి పకాలున నవ్వ నారంభించెను. యువరాజు భార్యకుఁ గోపమువచ్చెను. పరాశరశాస్త్రి యిట్లనెను. "అమ్మా! కోపముఁ దెచ్చికొనకుము. నా నవ్వునకు హేతువు వేఱే కలదు. నిన్నగౌరవ పరచుటకాదు. నీవు చెప్పిన మాటలలోని సర్వార్థము నీ మాటలలోననే యున్నది. పెదవి కదపి మాటాడి యెఱుఁగని నీవు నాతో నిన్నిమాటలు మాటాడితివి. అసలు నీకు తెలివితేటలు కలవో లేవోయని సందేహము కలి

గించుచున్న నీ మాటలలో నీ వివేకము పరమ నిశితమైనదని తెలియుచున్నది. ఇంతటి వివేకవంతురాలవుగనుకనే నీ జీవ లక్షణము సందంతటి వివేకమున్నది గనుకనే వాఁడు నిన్ను నీ జాగ్రదవస్థయందు నావేశించలేక పోయినాఁడు. నీ నిద్రావస్థయందు నిన్నుఁ బ్రతారించినాఁడు. ఓసి తల్లీ! నాకు విచారించఁగాఁ బరమేశ్వరుఁడు దేని నెట్లు నడపవలయునని భావించునో యది యట్లు నడచును. ఆ నీ కుత్సితుఁడైన గురువేమియుఁ జేయలేఁడు. జయద్రథుఁ డేమియుఁ జేయలేఁడు. పరాశరశాస్త్రి యంతకుముందుఁ జేయలేఁడు. ఒక ప్రవహించుచున్న నదికి దారిలో నొక పర్వత మడ్డుతగిలెననఁగా నా ప్రవాహము ప్రక్కగా తిరిగి యిఁకొకచోటి పొలమును సస్యవంతములనుఁ జేయవలసిన గీత వ్రాసి యుండుటవలన నాపర్వత మడ్డువచ్చినది. ఒక వరుసగానున్న పొలముల కాయోగ్యత లేదు. ఈ పర్వతముల కెగువనున్న పొలములకు, ఆ పర్వతమునకు దిగువఁ బెడగానున్న పొలములకు నా యోగ్యత కలదు. నీవింత వివేకవంతురాల వగుట నాకున్న బరువు తొలఁగినది. మీ యత్తగారి యాత్మభారము తగ్గినది."

నాఁటినుండి వంకజాబిల్లి యువరాజు భార్యకాదు. చంద్రమతీదేవికంటె నధికురాలయ్యెను. రాజభవనమున శిశునాగుని మాటకు విలలేదు. పరాశరశాస్త్రికి దిక్కులేదు. ఆనాఁడు పరాశరశాస్త్రితో నిట్లు మాటాడిన వంకజాబిల్లి నాలుగేండ్లు గడచునప్పటికిఁ బరాశరశాస్త్రినిఁ బిలిచి "శాస్త్రిగారూ! మీరీపని నిట్లు చేయవలయు"నని చెప్పుచుండెను. కోడలు గీచిన గీటు చంద్రమతీదేవి దాటలేదు.

తదాది మఱల శిశునాగునకు వంకజాబిల్లికి సంబంధములేదు. శిశునాగుఁడామెయొక్క దయను సంపాదింపవలయునని చేసెడు ప్రయత్నముల కవధిలేదు. శిశునాగునివంక నామె కన్నెఱ్ఱచేసి చూచును. శిశునాగుఁడు వణకిపోవును. తానెందుకు వణకిపోయెనోయాలోచించుకొనుశక్తికూడ శిశునాగునకు లేకపోయెను. శిశునాగుని మాయ సమావరించి యుండెను. వంకజాబిల్లిలో నుండి మాయ వినిర్గమించెను. ఆ యచ్ఛమైన వివేకముముందు కలుషితమైన యీ వివేకము నిలువలేకుండెను. శిశునాగుఁడును కాకవర్ణుడును నిరంతర మెడఁబాసి యుండలేని తండ్రికొడుకులు. కాకవర్ణునకుఁ దల్లిమీఁదఁ బ్రేమయే లేదు. రాజవంశమర్యాదగాఁ బరిచారకులు కాకవర్ణుని తీసికొనిపోయి తల్లికిఁ జూపించివత్తురు. అదియొక యాచారము. ఆచారము నిర్వహింపఁబడును. నలువురు చూచి యేమైన ననుకొందురేమోయని వంకజాబిల్లి కొడుకును ముద్దాడును. ఒక్కొక్కపుడు యువరాజును తన సౌధమునకు రమ్మని వార్తబుచ్చును. ఆయన వచ్చును. అతఁడొక్కొకపుడు నిశాభాగమంతయు వంకజాబిల్లి సౌధమునందే గడపును. ఇద్దఱు నొక గదియందే యుందురు. వారికి సంబంధము లేదు. ఈసంగతి యెవ్వరికినిఁ దెలియదు. తెల్లవారలు వారిద్దఱు మేల్కొనియే యుందురు. ఆమె యేదో యేదో మాటాడును. ప్రాతఃకాలమున నెఱ్ఱని కన్నులతోఁ గనిపించు యువరాజును వంకజాబిల్లియుఁ బరిచారికలకుఁ గలిపించెడు నంతభ్రాంతి నిజమైన కామినీ కాముకులునుఁ గలిపించరు. రాజ్యము చిన్నదికాని యది సామ్రాజ్యమైనచో సర్వ భారతదేశమునకు వంకజాబిల్లి పట్టమహిషి యైనచో

నాతెయొక్క వివేకమునకు రాజ్యమునందు నెలయింపఁజేయ వలసిన ధర్మమునకు సరిపోయెడిది. శిశునాగుఁడు వంకజాబిల్లి ముందు పిట్ట. శిశునాగుని మనస్సులోమాత్రము నేదోయొక కోపము, నొక ప్రతీకారవాంఛ, నిత్యసన్నిహితమై యున్నట్లు భాసించుచుండును. ఆతని కన్నులలోఁ గాంతియున్నది. మాలిన్యమున్నది. ప్రేమ యున్నది. ద్వేషమున్నది. అధికార మున్నది. నిస్సహాయత యున్నది.

వేసమరీచి పెండ్లివార్త శిశునాగునకుఁ దెలిసెను. ఆ వార్త చెప్పినదెవరు? వంకజాబిల్లి. వంకజాబిల్లి యేందుకు చెప్పినది? ఆమెకిది తెలియు నిది తెలియుదన్న విషయము లేన ట్లున్నదే! ఆమె యీ విషయము నూహింపగల దీ విష యము నూహించలేదన్నట్లులేదే. శిశునాగుఁడు వంకజాబిల్లి వంక మొగిలులోని జాబిల్లివలెఁ జూచెను. ఆమె యిట్లనెను. "మన వివాహ మెట్టిదో ఆ వివాహమునట్టిదే. మన వివా హమున కీపిల్లవాఁడు ఫలితము. ఆ వివాహమునకిట్టి ఫలితము కూడ నుండదు. కారణమేమియో తెలియునా? నేను నీవలె నా గురువుయొక్క మాయాగ్ని ధూమమును బుద్ధిపూర్వక ముగా ననుభవించినదానను గాను. నీవా ధూమపానము చేసితివి. వాఁడు కితవుఁడై యా ధూమపానము నాచేత నా నిద్రలోఁ జేయించెను. వారిద్దఱును ధూమపాన సంబంధము లేనివారు. వారికి శతవిధముల సంబంధమే యుండదు. ఉన్నను సంతానము కలుగదు. నీగురువు రాఁడు. ఆ గురువుయొక్క స్థానమును నేనే వహించుచున్నాను. నేను నీచేతనే యా ప్రతీ

కారము చేయించెదను. నీ జీవితముయొక్క పరమార్థ మా ప్రతీకారమేకదా."

అనఁగా శిశునాగుఁడు నివ్వెఱపోయి నిలుచుండెను. ఆఱేండ్లనుండి తనకేమియు నర్థముకాని యీ భార్య యిప్పు డర్థమయ్యెను. ఆగురువు పిశాచము. ఈమె దేవత. తన్ను పిశాచ శిష్యునిగానే పాలించుట కీమె నిశ్చయించెను.

## ౨౩

కాకవర్ణునకు పదుమూఁడేండ్ల వయస్సు వచ్చినది. ఆతఁడప్పటికే యాజానుబాహుఁడు. వ్యూఢోరస్కుఁడు. వృషస్కంధుఁడు. పరిచిత వ్యాయాముఁడు. అశ్వారోహణ విద్య నేర్చినవాఁడు. శిశునాగుఁ డతనికిఁ దన నేర్చిన ఖడ్గ విద్యయంతయు నేర్పెను. ధనుస్సు చేఁబూని లక్ష్యమును భేదించుటలో నతని గుఱియు, నతని నేర్పును పూర్వజన్మ సంస్కారాత్తములుగాని నేటి జన్మలో నేర్చినవికావు. అతఁడు యుద్ధవీరుల ప్రశంసా పాత్రము, సవయస్కులైన రాజపుత్రుల కసూయా హేతువుగా నుండెను. అతఁడు కాఁబోవు రాజు కనుక నసూయకు స్థానము లేదు. కాని యతఁడు సామాన్య రాజపుత్రుఁడైనచో జీవితమునందలి బలవద్విరోధము లేర్పడుటకు యోగ్యమైన యాయుధ విద్యాకౌశల మతని కేర్పడెను. వంకజాబిల్లి కొడుకునుఁ బ్రేమించును. ప్రేమించదు. ఆమె కొడుకును ముద్దాడుట యెన్నడునుఁ జేయలేదు. అతని కేండ్లు

వచ్చిన కొలంది తల్లియుఁ గొడుకును మాటాడుటయే లేదు. ఇకెప్పుడో యొకసారి పండుగలవేళ - పబ్బములవేళ నూత్న వస్త్ర ధారణములవేళ తన విద్యాప్రదర్శనమునందు ప్రశంసలు పొందినవేళ తండ్రియు నాయనమ్మయు వృద్ధక్షత్రియులును వానినిఁ బోయి తల్లికి నమస్కారముచేసి రమ్మందురు. అతఁడు వెళ్లును. పాదాభివందనము చేయును. తిరిగి వచ్చును. అతఁడెందుకు వచ్చి పాదాభివందనము చేసెనో కూడ యామె పట్టించుకోదు. ఆ కొడుకుతో నొక్కమాట మాటాడదు, కాని యా కొడుకు నొక్కమాట యనదు. అతని పరాక్రమాదులను గూర్చి యతని విద్యానైపుణ్యమును గూర్చి తానెవ్వరి నడుగదు, గాని యెంతమంది వచ్చి యెన్నిసార్లు చెప్పినను వినుచునే యుండును. ఇదివఱకు నేను విన్న సంగతియే యని కూడ యనదు. కుమారునకు మఱి యైదేండ్లు వచ్చినఁ గాని యౌవరాజ్యపదమందుటకు తగిన వయస్సు రాదు. అయినను సర్వ విద్యానిపుణుఁడైన తన కొడుకు నేఁడే యువరాజు కావచ్చును. ఈ కోరిక అమె హృదయాంతరాంతరములలో నున్నది. ఆమె యేమి యూహించుచున్నదో బ్రహ్మదేవునకుఁ దెలియదు. వంకజాబిల్లి వయస్సిప్పుడు ముప్పది సంవత్సరము లుండవచ్చును. పదియేండ్లనుండి యామెకా రాజనగరమున జరిగిన పరిస్థితులలోఁ దెలియని దేమియు లేదు. తత్పూర్వము జరిగినవియు నన్నియుఁ దెలియును. ఆమె కెన్ని తెలియునో యితరులకుఁ దెలియనే తెలియదు. ఒకప్పుడు దత్తగారి వద్దనుండి, మఱియు నొకప్పుడు చిత్రశిఖండి వద్దనుండి, పరాశరశాస్త్రినుండి, నాగు శ్మశానములసదుమ కాపుండి

వింధ్య పర్వతములకుఁ బోయి దుంపలు త్రవ్వి తెచ్చిన యా నలుపురినుండి, ప్రత్యేకముగా నా నలువురిలోని వామనుని నుండి, బాల్యమున శిశునాగునిఁ బెంచిన దాదినుండి, రాత్రు లందు శిశునాగుని యింటి ముందు మేల్కొనియున్న రాజభటు లనుండి, దౌవారికులనుండి యామె నేర్వని సంగతిలేదు.

ఒకనాఁడు వంకజాబిల్లి తన మామగారి నద్దకుఁ బోయెను. ఏకాంతముగాఁ బోయి యామె మున్నెన్నియో సార్లు జయద్రథునితో మాటాడుచుండెను. జయద్రథుఁ డామెను విశ్వసించినంత మఱి యెవ్వరిని విశ్వసించఁడు. ఆనాఁడు జయద్రథునితో నిట్లనెను. "నీవీరాజు శరీరములో నింకెన్నాళ్ళుందువు?" జయ:- రాజెన్నాళ్ళు బ్రతికియుం డునో యన్నాళ్ళుందును. వంక:- రాజిదివఱకే చనిపోయెను. నీవు వదలి వెళ్ళినంతనే రాజు చనిపోవును. జయ:- ఆసంగతి నీకెట్లు తెలియును? వంక:- నీవాయన శరీరములో నుండి విడిచి యొక గడియసేపు దూరముగా నుండుము. నీకే తెలి యును. జయ:- నేను మాటాడకుండ నూరకున్నపుడు రాజు తాను తానుగా మాటాడుచుండెనుగదా. అపుడు బ్రతికి యున్నట్లే లెక్క. వంక:- అట్లుకాదు, ఒక యింటిలో దీపము పెట్టుదుము. ఒక కొంత ప్రదేశము మాత్రము ప్రకాశము గలిగియుండుటకుఁ బెట్టుదుము. ఆ వెలుఁగు తత్ప్రదేశ మునకు వెలిగానున్నచోటఁగూడఁ గనిపించును. రాజు రాజుగా వ్యవహరించు చున్నాఁడనఁగా నీ చైతన్య మాశరీరములో నున్నది. ఆ వెలుఁగున్నది. నీవు నీపని చేయ నపుడు రాజుయొక్క శరీరమునందు నీ వెల్గు భాసించు

చుండును. జయ:- నేను పరమేశ్వరుండనన్న మాట. వంక:- ఎంతమాట యన్నావు. పరమేశ్వరునితోడి విరోధంపడి గదయ్యా యిట్లైతివి. పరమేశ్వరునకు నీకంటె యధికశక్తి కలదని యొప్పుకొనుచున్నావు. తీవ్రమైన విరోధము చేతనైనను హిరణ్యకశిపాదులవలె భగవంతునితోడి సాయుజ్యముం బొందవచ్చును. నీ వీ శరీరమును వదలి పోలేవు. పోయినచో నెచ్చట నుందువు? ఉండుటకు వీలులేక నీ విచ్చట నే కూర్చున్నావు. నిన్ను చూచినచో నాకు జాలి యగుచున్నది. జయ:- నన్ను చూచి జాలిపడు వ్యక్తి నీ వొక్కతెవే. వంక:- ఒక పురుషుం డిచ్చటికి రావలయు ననియు వానిలో నీవు ప్రవేశింపవలయుననియు రాజప్పుడు చనిపోవు ననియు నీవు శిశునాగునకు గురువవై మగధరాజ్యముమీంద దండెత్తించి యా రాజ్యమును నీవు వశపరచుకొనవలయు ననియుం బెద్ద యెత్తు లెత్తితివి. పరాశరశాస్త్రి నీ సర్వప్రయత్నమును వ్యర్థపరచెను. కాని నీ ప్రయత్నము వ్యర్థము కాలేదు. ఏ పరమేశ్వరునకు నీవు విరోధివో ఆ పరమేశ్వరుండు నీ వేది కోరుచున్నావో యది సంఘటించుటకు తనంతట తానే యన్నియు సమకూర్చినాండు. ఇప్పుడా పురుషుండు రానక్కఱ లేదు. నీవు వానిలోం బ్రవేశించనక్కఱ లేదు. శిశునాగుండు మగధరాజ్యమును దండెత్తంబోవుచున్నాండు. ఆ పురుషుండు నా గర్భమునందు ధూమమునుం బ్రవేశపెట్టినాండు. అది కాకవర్ణుండుగా జన్మించినాండు. ఈ కాకవర్ణుండు మగధ సామ్రాజ్యమునకుం జక్రవర్తి యగును. వీనిసంతానము మగధరాజ్యమును పాలించును. కాకవర్ణుని వంశము మూండు

వందల యిరువదియేండ్లు పాలించును. మఱియుఁ దరువాత నిట్టివారే మఱల రెండువందల యెుప్పదియేండ్లు పాలింతురు. అనఁగా నింక నాలువందల యేండ్ల వరకు నీ వాంఛ యవిచ్ఛిన్నముగా సాగునని యర్థము. ఈ యాలువందల యేండ్లు నొక నాస్తిక మతము విజృంభించును. శూన్యవాదము వృద్ధి పొందును. నీవు పదుమూఁడువందలయేండ్లు చేసిన తపస్సు ఫలించును. జయ:- నీ కెట్లు తెలియును? వంక:- తెలిసికొన్నచో తెలియును. మధురానగరమున నొక బ్రాహ్మణుఁడున్నాఁడు. ఆయన కాలజ్ఞానము కలవాఁడు. మహా పండితుఁడు. పరాశరశాస్త్రిని బంపించి యాయననుఁ బిలిపించితిని. ఆయన నాకివి యన్నియుఁ జెప్పెను. జయ:- ఆయన కెట్లు తెలియును? వంక:- ఆయన కాలజ్ఞానము కలవాఁడని చెప్పితిని గదా! జయ:- కాలజ్ఞానమనగా నేమి? వంక:- మ్లేచ్ఛవిద్యలు కావు. మత్స్యపురాణము వాయుపురాణము, భవిష్యపురాణము మొదలైన గ్రంథములు మన దేశమునందు యుగ యుగములుగా నున్నవి. ద్వాపరాంతమునందు వ్యాస మహర్షి వానిని మరల గుంఫించెను. ఆ గ్రంథములు తొలినాఁటినుండి కొన్ని బ్రాహ్మణ వంశములయం దున్నవి. ఆ వంశము వారు వానిని పరంపరగా రక్షించుకొనుచు వచ్చుచుండిరి. ఈ దేశములో సర్వవిద్యలు సృష్ట్యాదినుండి నేటివఱకు నట్లే రక్షింపఁబడుచు వచ్చుచున్నవి. కొన్ని బ్రాహ్మణ కుటుంబములు, కొన్ని క్షత్రియ కుటుంబములు, కొన్ని వైశ్య కుటుంబములు, వారి వారి కనూచానముగా పరంపరగా వచ్చుచున్న యనేకములైన విద్యలను రక్షించుచున్నవి.

ఈ కాల జ్ఞానమునకు సంబంధించిన పురాణములు కొన్ని బ్రాహ్మణవంశముల సొత్తు. ఈ బ్రాహ్మణుడట్టి వంశములలో నొకవంశము వాడు. ఆయనకు సృష్ట్యాదినుండి సృష్ట్యంతమువఱకు స్థూలముగా నెప్పుడెప్పు డేరాజు లెచ్చటెచ్చట పాలింతురో, ఏ వంశము మాఱి యే వంశము వచ్చునో, ఆ వంశములో నెంతమంది రాజులెన్నెన్ని సంవత్సరము లొక్కొక్కఁడు పాలించునో, ఆ వంశపు రాజులందఱు కలిసి యెన్ని యేండ్లు పాలింతురో వారి నామధేయము లెట్టివో సర్వమును తెలియును. జయ:- అతనికిఁ దెలియున దేమున్నది? గ్రంథములలో వ్రాసియే యున్నదంటివికదా! వంక:- ఔనయ్యా! కొన్ని పురాణములలో వ్రాసియున్నది. భాగవతములోఁ గూడ వ్రాసియున్నది. జయ:- నీ కొడుకు కాకవర్ణుఁడు కదా! అతని కుమారుని పేరేమి? వంక:- వరుసగా నందఱిపేర్లు చెప్పుమందువా? నీకుఁ గావలసినది చెప్పెదను. నా కుమారుని మునిమనుమఁడు బింబిసారుఁడు. వానికాలములో నీ కోరిక పూర్తియగును. సర్వ భారతదేశమును భగవంతుఁడు లేఁడను సిద్ధాంతము వ్యాపించుటకుఁ దగిన యొక మహాపురుషుఁడు బింబిసారుని కాలములో నుదయించును. ఆ బింబిసారుని కుమారుఁ డజాతశత్రుఁవు. అప్పటి నుండి సుమారైదువందల యేండ్లు మగధరాజ్యము నాస్తికులే పాలింతురు. అప్పటికి కొంత మార్పుగలుగును. నీకు సరిగా లెక్క గావలసినచో శ్రీకృష్ణదేవుఁడు చనిపోయిన దినముననే కలి ప్రవేశించెను. కలి ప్రవేశించిన తరువాత నేఁటికి పది నొకండు వందల యేఁడేండ్లు గడచినది. అనఁగా యుధిష్ఠిర

యుగములో పదునొకొండు వందల నలుబది మూఁడేండ్లు గడచి నది. మగధరాజ్యముయొక్క- చరిత్రముఁ బూసగ్రుచ్చిన ట్లా బ్రాహ్మణుఁడు చెప్పఁగలఁడు. మగధరాజ్యము తొట్టతొలుత బార్హద్రథులది. వారి పూర్వుని పేరు కురువు. అతనినుండి యేఁడవవాఁ డుపరిచరవసువు. ఎనిమిదవవాఁడు బృహద్రథుఁడు. పదునేఁడవవాఁడు, జరాసంధుఁడు. అతనినే కృష్ణ భీమార్జునులు పోయి వధించిరి. జరాసంధుని కొడుకు సహదేవుఁడు. అతఁడు మహాభారత యుద్ధమున వధింపఁబడెను. అతనికొడుకు సోమాధి. ఆ రాజులిరువది యిద్దఱు. వారిలో చివరివాఁడు రిపుంజయుఁడు. యుధిష్ఠిర యుగములో వేయి యాతేండ్లు గడచిననాఁటికి రిపుంజయుని రాజ్య మంతరించి ప్రద్యోత వంశము గిరివ్రజపురమున రాజ్యముచేయ నారంభించెను. ప్రద్యోత వంశములో నైదుగుర రాజులు. వా రైదుగురును నూటముప్పది యెనిమిదేండ్లు రాజ్యము చేసిరి. చివరివాఁడు నందివర్ధనుఁడు. ఈ యేడాదితోఁ ప్రద్యోతవంశ మం రించును. శిశునాగవంశము మగధరాజ్యాధికారమును సంపాదించును. వీరు పదిమంది. వీరు మూఁడువందల యిరువదియేండ్లు పాలింతురు. అనఁగా యుధిష్ఠిర యుగమునందు పదునేనువందల నాలుగేండ్లు వచ్చువఱకు నీ శిశునాగవంశము మగధరాజ్య చక్రవర్తిపదమునం దుండునని యర్థము. జయ:- ఇంత రహస్యము నాతో చెప్పుచున్నావే. వంక:- ఓయీ! నీ శక్తి యుడిగిపోయినది. నీ శక్తి కాలమునందు సంక్రమించినది. నీ వీ రాజ శరీరమునందు వదలి పోయినచో నీ కాశ్రయము లేదు. పైగా నీ జీవ

శక్తిలోని తీవ్రత్వము సన్నగిల్లినది. నీవే యాలోచించు కొనుము. నేను పరమేశ్వరుడనా యని యడిగితివిగదా? నీవు పలుచబడిపోయితివి. నీవలనఁ గాఁదగిన పని యేమియు మిగులలేదు. నీకో నాకే కొంచెము పని యున్నది. పదునాలుగేండ్లు రాజశరీరమున చాల నిరకట పడితివి. నీకు విముక్తి నిత్తును. నేను చెప్పినట్లు చేసినచో విముక్తి వచ్చును. జయ:- నాకు విముక్తి యక్కఱలేదు. ఐనను నాకెట్లు విముక్తి సంపాదింతువు? వంక:- ఏ పురుషుఁడు వచ్చినచో నీవు వాని శరీరములోఁ బ్రవేశింపనెంచితివో వాని నిచ్చటికిఁ దెత్తును. వాఁడిచ్చటికి రాకుండ పరాశరశాస్త్రి యష్టదిగ్బంధనము చేసెను. ఆ బంధనము తొలఁగించెదను. జయ:- నీకది చేఁగాదు. వంక:-నాకుఁ జేతకాకపోవుట కాదు. నీకుఁ బరాశరశాస్త్రియనఁగా నున్న భయమటువంటిది. జయ:- అతఁడన్నచో నీకు భయము లేదా? వంక:- ఆయన యన్నచో నెవ్వరికిని భయ మక్కఱలేదు. జయ:- అతఁడు చనిపోయెనా? వంక:- నీవు నేను చెప్పినట్లు చేసినచో, చేయుదువన్నచో నతఁడు చనిపోవునట్లు నేను చేయఁగలను. అతఁడు చనిపోయినంతనే యతఁడు చేసిన దిగ్బంధనము వదలిపోవును. జయ:- నీవు చండ ప్రచండుఁడవు. పదుమూఁడేండ్లనుండి చూచుచుంటినికదా? నీవేమి చేయుమందువో చెప్పుము. వంక:- ఆ పురుషుఁడు వచ్చును. నీ వాపురుషునిలోఁ బ్రవేశింపుము. మా మామగారు చని పోదురు. శిశునాగుఁడు రాజగును. ఆయనచేత నేను మగధ రాజ్యముమీఁద దండయాత్ర సాగింపింతును. నీ వాపురు

షునిలోఁ బ్రవేశించినతరువాత నీవు మగధరాజ్యమున కేగుము. ఇప్పుడా రాజ్యమున కధికారిణి వేదమరీచి. ఆమెకు భర్త కానిభర్తయొకఁ డున్నాఁడు. వానిపే రజాతశత్రువు. వాఁ డెంతచెప్పినచో వేదమరీచి యంత చేయును. నీవు వారిద్దఱను నీ వశములోఁ బెట్టికొనవలయును. వేదమరీచి యెంత చెప్పునో యజాతశత్రు వంత చేయునట్లు మార్చ వలయును. మేము దండెత్తి వత్తుము. సర్వము మా కను కూలముగా వేదమరీచిచేతఁ జెప్పించ వలయును. నీ వంగీక రించినచో నిన్ను గిరివ్రజపురముసకుఁ బంపించెదీ నాఁడు పవకములోనున్న సర్వమైన యంశములు నీకు బోధింతును. అట్లు చేసినచో నీ వేయేండ్ల తపస్సు ఫలించును. నీ వెత్తిన పది పదకొండు జన్మల సారాంశము సిద్ధించును. జయ:
తరువాత నేను నిన్ను మించిపోయినచో నీ వేమి చేయుదువు?
సంక:- తరువాత నీవు నన్ను మించిపోలేనట్లు చేసియే నిన్ని చ్చటి నుండి పంపింతును. జయ:- నా కర్థముకాలేదు.
వంక:- ఓయి! జయద్రథా! నీవు వేయేండ్లు భగవంతుని సాధించవలయునని యెత్తిన ప్రతి జన్మయు మ్లేచ్ఛ విద్యలే నేర్చితివిగాని వైదిక విద్యలు నేర్వలేదు. వైదిక విద్యలలో నున్న శక్తి మ్లేచ్ఛ విద్యలలో నెచ్చట నుండవచ్చును? వెలుఁగునకున్న ప్రకాశము చీకటి కుండునా? చీకటిలో నొక వస్తు వింకొక వస్తువుగాఁ గనిపించును. ఆ వస్తు వది యని తెలియకుండ ప్రతీకార మెట్లు చేయనగును? చేసిన ప్రతీకార మన్యవస్తువునకు సంబంధించును. అసలువస్తు వట్లే యుండును. అందుచేత వైదిక జ్ఞానమునకున్న వెలుఁగు మఱియొకదానికి

లేదు. జీవుఁడు సామాన్యముగాఁ బ్రయాణము చేయు చుండును. ఒకానొక జీవునియొక్క కామక్రోధములు పట్టరా నంత యుండి వాఁడు పిశాచముగా మాఱును. సృష్ట్యంతము పిశాచముగా నుండఁడు. వందయేండ్లు రెండువందలయేండ్లు - తరువాత వాని పిశాచ లక్షణము గాలిలో కలిసిపోవును. నీ జీవ శక్తిలోనున్న బలము తగ్గిపోయినది. నీ వింక కొన్ని నెలలే యిట్లుందువు. ఈ లోపుగా నీ యిష్టమైనది యీపని. నాకీ సాహాయ్యము చేసిపొమ్ము. జయ:- నీ మాటలు నా యనుభవమునకు తగులుచున్నవి. సరే.

## ౨౪

ఆ మరునాఁడు పంకజాబిల్ల పరాశరశాస్త్రినిఁ బిలిపించెను. ఆయనవచ్చి యెదురుగాఁ గూర్చుండెను. నమస్కారముచేసి తన పని తాను చేసికొనుచుండెను. అంత పరాశర శాస్త్రియు నేమియనుటకు వీలులేదు. ఆమె యేదో రాజ కార్యములనుఁ జూచుచుండెను. అట్లు నిమగ్నురాలై యుండి నడుమ నడుమఁ బరాశరశాస్త్రితోఁ బ్రసంగ మారంభించెను. పంక:- శాస్త్రిగారూ! ఇందుమతీదేవి చనిపోయినపుడజ మహా రాజు ప్రయాగక్షేత్రమున త్రివేణీ సంగమమునఁబడి చనిపోయి నారని చెప్పితిరిగదా! అట్లు మరణించినవారు తా మే కోర్కెతో మరణింతురో యాకోర్కె వారికి మఱుజన్మలో సిద్ధించునని మనవారు విశ్వసింతురు. నాకు మోక్షమునందు మిక్కిలి

కోరికయున్నది. నేను త్రివేణీ జలములలోపడి మరణించవలయు నని యున్నది. పరా:- శాంతం పాపం. తల్లీ! యిది యేమి కోరిక? మఱియుఁ ద్రివేణీ సంగమమునందు మోక్షవాంఛతోఁ బడి చచ్చినచో మోక్షమువచ్చునన్న నమ్మకములేదు. లౌకికమైన వాంఛతో, నధికవిద్యలు సముపార్జించ వలయునన్న వాంఛతో, ననంతభోగము లనుభవించవలయునన్న వాంఛతో మరణించినచో నవిమాత్రమే సిద్ధింపఁగలవు. వంక:- అట్లనా అండి. నా బ్రతుకు చూచితిరికదా! నాకు మగఁడున్నాఁడు. మగఁడుకాఁడు. కొడుకున్నాఁడు. కొడుకుకాఁడు. తండ్రి యున్నాఁడు. తండ్రి మున్నెన్నఁడో కాఁడు. నేను లేనిచో నీ రాజ్యమేమయ్యెడిదో? నేను బరువు మోయలేకుండ నున్నాను. నాకు మోక్షమొక్కటియె కావలయును. తమరికి మఱు జన్మలో నసాధ్యములైన విద్యలు సాధించవలయునన్న కోరిక కలదు. నాకదియు లేదు." అని వంకజాబిల్లి తనపనులు తాను చూచుకొనుచుండెను. పరాశరశాస్త్రి "తల్లీ! నీయాజ్ఞయట్టి దైనచో నట్లే చేసెదను. నీ నోటినుండి వచ్చినమాట నా కాజ్ఞవంటిది. నేనుండి ప్రయోజనము లేదు. నే నీరాజవంశ మును రక్షింపవలయునని యిన్నాళ్ళనుఁ బ్రయత్నము చేసి తిని. నీవు వచ్చిన తరువాత నాలుగ్గై దేండ్లు గడచినంతనే నా యవసరము లేదని నాకుఁ దెలిసినది. సర్వభారమును మోయఁ గల రాణివి నీ వుండగా నాతోఁ బ్రయోజనమేమికలదు? నన్నె ప్పుడు పొమ్మన్నచో నప్పుడు పోదును. వంక:- అయ్యో! శాస్త్రిగారూ! అవి యేమిమాటలు? నేను మిమ్ము త్రివేణీ సంగమములో నురుకుమంటినా? పరా:- కాదుతల్లీ! ఉరుకు

దును. ప్రస్తుతము నావలన ప్రయోజనము లేదు. అధికవిద్యలు సంపాదించి మఱల నన్నెన్ని యేండ్లకు జన్మించు మందురు ? చెప్పినచో జన్మింతును. అప్పటికి నేను మఱల జన్మించవల యును. నాకిట్టి సిద్ధులు కావలయునన్న కోర్కెతోఁ త్రివేణీ సంగమమున నురుకుదును.” అనఁగా వంకజాబిల్లి పకాపకనవ్వి “శాస్త్రిగారూ! నేను మీకు శిష్యురాలను. మీరు చెప్పినట్లు చేయవలసిన దానను నేనుగాని, నేను చెప్పినట్లు మీరు చేయ వలసిన పనిలేదు. పైగా మన శక్తులు మఱి యేఱువందల యేండ్లవఱకు పనిచేయవు. అప్పటికిఁగదా మీరుగాని నేను గాని తిరిగి జన్మమెత్తవలసినది? ఇప్పటికి కలియుగ మారంభమై పదునొకండువందల యేబదిమిదేండ్లు గడచినది. ఇంక నేడు వందల పదియేండ్లు గడచినఁగాని వైదికమతమునకు మఱల సౌజ్వల్యము రాదు. ఈ యేడువందల యేండ్లింతే. మనము పుట్టినచో మఱల నప్పుడు పుట్టవలయును. అందుచేతఁదొందర లేదు. పరా:- అట్లుకాదమ్మా! నీ సిద్ధాంత మొకఁ డున్నది కదా! జీవుఁడొక కోరికతో భూతప్రకృతిలో నుండుచుఁ దిరుగుటకూడ యొక తపస్సుచేయుటయే యన్న సిద్ధాంతము. అట్లింత తపస్సుచేసినచో జన్మించినప్పటి ఫలితమంత దృఢ ముగా నుండును. నేను పెద్దవాఁడ నైపోయినాను. చిన్నప్పుడు నేను నేర్చిన తుచ్ఛమంత్రములచేత నేను మూఁడుసార్లు వివాహమాడినను ముగ్గురు భార్యలును మరణించిరి. రెండవ భార్యకు కలిగిన సంతానముకూడ నశించెను. నేను పట్టి మొండికట్టెవలె నున్నాను. ఆర్షమంత్రములు నేర్చికొని లోక మున కుపయోగపడుచు నా పాపమును పరిక్షాళనము చేయు

టకై యొకవిధమైన జీవితమును గడపుచుండఁగా నీ రాజ వంశమునకు నొక యాపద వచ్చెను. మఱలఁ దుచ్ఛమంత్ర ములలోనికి దిగితిని. నా యవసరమిప్పుడు లేదు. సూర్యుఁడు వెలుఁగుచుండఁగా దివ్వెటీ లెందుకమ్మా! నీవు వద్దనినను నేను పోవుటకే నిశ్చయించుకొన్నాను. వంక:- తమరు వెళ్లుట నాకేమియు నిష్టము లేదు. మీరు వెళ్ళినచో నాకు గురువధ చేసినంత పాపము కలిగించిపోవుదురు. ఈ యూహ నేను మీ కందిచ్చినట్లైనది. పరా:- ఎబ్బెబ్బే! కానే కాదు. నే నిది వఱకే యనుకొనుచుంటిని. రేపే బయలుదేరి పోవుదును." అనఁగా వంకజాబిల్లి లేచి నిలుచుండెను. ఆమె కన్నుల వెంట రెండు నీటిబొట్లు పడెను. పరాశరశాస్త్రి "తల్లీ! నాకొఱకు దుఃఖపడవలయునా" యనెను. వంకజాబిల్లి "స్వామీ! నేను మిమ్మాపలేను. మీ ప్రకృతి నాకుఁ దెలియును. మీరు వెళ్ళకముందు నాకేదైనఁ జెప్పి పోవలసినది యున్నచోఁ జెప్పి పొండు." అనఁగాఁ బరాశరశాస్త్రి నవ్వి "ఓ యమ్మా! నీ వెంతటిదానవు! రాజ్యములు నిర్వహింపఁగలవు. భర్తను, కొడుకును నిరాదరింపఁగలవు. వారి యభ్యుదయమునుఁగూర్చి యాలోచింపఁగలవు. పాలింపఁ గలవు. గురువునకు మర ణోపదేశము చేయఁగలవు. ఆ గురువు చనిపోవుచున్నాఁడని దుఃఖింపగలవు. పిశాచములకు మోక్షమిప్పింపఁగలవు. అనంతకాలము నందలి కొన్ని ఖండములను పాలింపఁగలవు. రేపు ప్రొద్దుట నీవును నీ కుమారుఁడును నీ భర్తయు నా పూరి గుడిసెకు రావలయును. నేను చెప్పెడిదేమో చెప్పిపోయె దను." అని పరాశరశాస్త్రి వెడలిపోయెను.

మఱునాఁడు ప్రొద్దున్న వంకజాబిల్లియొక్క యాజ్ఞ ననుసరించి శిశునాగుఁడును కాకవర్ణుఁడునుఁ బరాశరశాస్త్రి యింటికిఁ బోవుచుండిరి. కాకవర్ణుఁడు తండ్రితో నిట్లనెను. "నాయనగారూ! మన మొక బ్రాహ్మణుని యింటికిఁబోవుట యేమి? ఆయన మనయింటికి రావలయునుగాని" అనఁగా శిశునాగుఁడు "నాకుఁ దెలియదయ్యా! మీయమ్మగారు మనయిద్దఱి నచ్చటికి రమ్మనివార్త పంచినది. మనము వెళ్లుచున్నాము." అనఁగాఁ గాకవర్ణుఁడు "తమరియాజ్ఞ మాయమ్మ పాలింపవలయునుగాని యామె యాజ్ఞ తమరు పాలించుట యేమి?" యనెను. శిశునాగుఁడు మాటాడలేదు. ఇద్దఱునుఁ బరాశరశాస్త్రి యింటికి వెళ్ళిరి. వంకజాబిల్లి పూర్వమే యచ్చట నుండెను. భర్త వచ్చినంతనే వంకజాబిల్లి లేచి నిలుచుండెను. తండ్రి కొడుకులు కొంత దూరముగానే యున్నారు, శిశునాగుఁడు కొడుకు చెవిలో నిట్లు చెప్పెను. "చూచితివా! మీ యమ్మగారికి నే నన్నచో నెంత గౌరవమో! ఆమె యేపని చేసినను నీ నా క్షేమమును కోరియే చేయును. ఆమె యాజ్ఞను నిరాకరించరాదు." అనెను. అదివఱకే శిశునాగ, కాకవర్ణులకు నచ్చట రెండు పీఠములు వేయఁబడి యుండెను. వారిద్దఱు వచ్చినప్పటినుండియు నొక కుక్క యదేపనిగా మొఱుగుచుండెను. ఆ కుక్క యెచ్చట నున్నదని చూడఁగా నదియొక పెద్దగది. అది యొక్కటియే గది. దానిచుట్టును కొంత విడిప్రదేశ మున్నది. చుట్టును ప్రాకారపుగోడ యున్నది. ఆ గదిలో నొకమూల పెద్ద యినుప కంబము నాటఁబడియున్నది. దానినుండి యొక దృఢమైన గొలుసు

వ్రేలాడుచుండెను. ఈ కుక్క యా గొలుసునకు బిగింపఁబడి యుండెను. ఆ కుక్క పెద్ద యెత్తైనదికాదు. పొట్టిది కాదు. మొగమును వదలిపెట్టినచో నూఁకుక్కవలె నుండెను. మొగము మాత్రము పులిమొగమును కుక్క మొగమును కలిసియున్నది. ముట్టె కుక్కమూతివలె ముందునకుఁ ద్రోసికొని వచ్చెనో దాని కన్నులును దాని కోరలును సింహపు కన్నులు సింహపు కోరలు. ఆ శ్వానము వీరిద్దఱి వాసన వాకిఁటిలో నుండి వచ్చినప్పటినుండి యఱవ నారంభించెను. వీరు కనిపించి గొలుసు లాగికొనుచుండెను. దానినిఁ బట్టుకొనుట కష్టముగా నుండెను. పరాశరశాస్త్రి నడుమ నడుమ యేదో పెదవులాడించుచు దానినోటికేదో యందిచ్చుచున్నాఁడు. అది తాత్కాలికముగా శాంతించుచున్నది. తండ్రి కొడుకు లచ్చటి కేగుసరికి నచట నొక్క ప్రొయ్యి దానిపైన నొక మూకుడు. ప్రొయ్యి మండుచున్నది. రెండు చెఱకుగడ లచ్చట నున్నవి. వానినుండి రసముతీయుట కొక యంత్ర మేర్పఱుపఁబడి యున్నది. పెద్ద యంత్రముకాదు. క్రింద నొక బండరాయి యున్నది. దానిపైన నేదైన నూరినచో నా రసము క్రిందఁబెట్టిన పాత్రలో పడుటకు రాయిమీఁద పల్లముగాఁ జేయఁబడి యున్నది. వేఱే గుండ్రాయి యున్నది. పరాశర శాస్త్రి తండ్రి కొడుకు లిద్దఱినిఁ బిలిచి తాను చెప్పినట్లు దయ చేసి చేయవలసినదని ప్రార్థించెను. శిశునాగుఁడు పంకజాబిల్లి వంకఁ జూచెను. ఆమె కనులు వాల్చి తన యంగీకారమును సూచించెను. ఇద్దఱు చెరియొక చెఱకుగడను తీసికొనిరి. కుక్కకు వాసన చూపించిరి. కుక్క పెడమొగము పెట్టెను.

పరాశరశాస్త్రి మఱల పెదవులాడించుచు కుక్క మొగమును ఇక్షుఖండముల వైపునకు మఱలించెను. అది మూచూచెను. తండ్రి కొడుకు లిద్దఱు వరిచెఱకుగడను వారు ముక్కలు ముక్కలుగా నరికిరి. ఎవరి ముక్కలను వారు గుండ్రాతితో నారాతిమీఁద మర్దించి యిక్షురసమును విడివిడిగా రెండు పాత్రలయందు సేకరించుకొనిరి. ఒకరి తరువాత నొకరు తమ తమ యిక్షురసములను మూకుడులో పోసి వంట చేసిరి. ఇక్షురసము కాగుచుండఁగాఁ బరాశరశాస్త్రి యది బెల్లపు గడ్డ యగుటకు కొంత సున్నము వేయించెను. ఆ రెండు వంటకము లగునటకు ప్రొద్దు తిరిగెను. యువరాజును వంక జాబిల్లియుఁ గాకవర్ణుఁడును ప్రొద్దుటినుండియు భోజనము చేయలేదు. వాకిటిలో రాజభటులు నిలుచుండియుండిరి. వంట పూర్తియైనతరువాత రెండు రసములను రెండు చిన్ని చాపలలో నచ్చులుగాఁ బోసిరి. ఆ రసము బిగిసి యెండి యచ్చుగా కట్టుటకు చాలసేపు పట్టెను. అవి చల్లఁబడుటకుఁ బరాశరశాస్త్రి శైత్యదోహద ప్రక్రియలు నెఱపెను. అపట సూర్యుఁ డస్తమించుచున్నాఁడు. ఇచ్చట బెల్లము చల్లఁ బడినది. రాజభటులు నాల్గు దివ్వటీలు లోనికిఁ దెచ్చిరి. తొలుత శిశునాగుఁడు తన బెల్లపుటచ్చును కుక్కముందుఁ బెట్టెను. కుక్క తాకలేదు. కాని మొఱుగుట మానివేసెను. పరాశరశాస్త్రి బెల్లపుముక్క త్రుంచి కుక్క నోటి కంది మ్మనెను. కాకవర్ణుఁడు "కుక్క కఱచునేమో! తండ్రిగారినీ కఱచినచోఁ గత్తితో దానినిఁ బొడిచి చంపుము" అనెను. పరాశరశాస్త్రి "బాబూ! అది మన కుపకారము చేయఁ

బోవుచున్న కుక్క. మనము దానిచేత పని చేయించుకొనఁ బోవుచున్నాము. రాజు భృత్యులచేత పని చేయించికొనును. వాఁడు కుటిలుఁడు కావచ్చును. వానిచేత మన పని చేయించి కొని, తరువాత వానిని సంహరించినచో సంహరింపుము. ఇది రాజనీతి" యనెను. కాకవర్ణుఁడు మఱల మాటాడలేదు. శిశునాగుఁ డందిచ్చిన బెల్లపు ముక్కను కుక్క స్వీకరించెను. దానికిఁ బ్రొద్దుటి నుండియు నాహారము లేదు. దానికి డొక్క మాడుచుండెను. కొంత బెల్లము శిశునాగుఁ డందిచ్చినది శ్వానము స్వీకరించిన తరువాత కాకవర్ణుని వాకముకట్టిన బెల్లపు టచ్చులో నుండి కాకవర్ణుని చేతఁ గూడఁ బరాశరశాస్త్రి కుక్క కందింపించెను. కుక్క స్వీకరించెను. తరువాత కుక్క కానాఁటి యాహారమును శాస్త్రి తెప్పించెను. వంకజాబిల్లి యా యాహారమును తాను పెట్టెను. కొంత మాంసము, సేరు పాలు, నివి దాని యాహారము. మొదట వంకజాబిల్లి యాహారము నందీయఁబోఁగా శ్వాన మంగీకరించలేదు. పరాశరశాస్త్రి దూరముగాఁ గూర్చుండి నవ్వుచుండెను. కుక్కకుఁ దెలిసెను. నేఁటినుండి దన కాహారమిచ్చెడిది యీ మెగాని శాస్త్రిగారు కాదని.

అంతయునైనఁ దరువాత శాస్త్రి వారిమువ్వురిని కుక్క కందుబాటులో నున్న మేడలో దిరుగుచుండుడని చెప్పెను. ఆ కుక్క వంకజాబిల్లి తనసన్నిధికి వచ్చినప్పు డూరకుండుచుండెను, గాని తండ్రి కొడుకులు దగ్గఱకు వచ్చినప్పుడెల్ల గుఱ్ఱుమనుచుండెను. అన్నప్పుడెల్ల శాస్త్రివారిని తమచేతులలో నున్న బెల్లపుగడ్డల నందించుచుండుడని చెప్పెను. రాత్రి రెండు

జాములైనది. అప్పటికిఁ దంత్రి కొడుకులు దగ్గఱకు పోఁగా నా కుక్క గుఱ్ఱు మానివేసెను. వారు ముగ్గురును యథేచ్ఛముగా కుక్కవద్దకుఁ బోవచ్చును. శిశునాగునిచేత శాస్త్రి దాని మెడ పట్టెడ యూడఁదీయించెను. శాకవర్ణుని చేత బిగింపించెను. ఇట్లు నాల్గైదుసార్లు చేయించెను.

ప్రొద్దుటినుంటి నక నక లాడుచున్న కడుపులతో నా ముగ్గురును కుక్కను వెంటఁ దీసికొని రాచనగరునకుఁ బోయిరి. కుక్కను వంకజాబిల్లి తన సౌధములోఁ గట్టి వేసెను.

మఱునాఁడు ప్రొద్దున వంకజాబిల్లి పరాశరశాస్త్రి యింటికి వచ్చెను. ఆ యిల్లు పాడుపడి యుండెను.

## ౨౫

గిరివ్రజపురమున జరాసంధుఁడు చండీపూజచేయుచు సర్వరాజులను జయించి వారినిఁ దీసికొని వచ్చి దినదిన మొక్కొక్క రాజును దేవికి బలిగా సమర్పించునప్పటినుండియు నా మహానగరమున శాక్తేయులు, బైరాగులు, పాషండులు, కాపాలికులు మొదలైనవారు వచ్చి యచ్చట నుండుట యుంచుమించుగా నప్పటి పన్నెండు వందల యేండ్లనుండి యాచారము. రాజభవనమునకు దగ్గఱగా నొక సత్రము న్నది. అది వీరి మఠము. ఇది యంతఃప్రాకారములో నుండును.

బహిః ప్రాకారములో నంతకంటె పెద్దమఠ మున్నది. అంతః ప్రాకారములో నుండెడు బైరాగుల సంఖ్య నాలుగైదువంద లుండును. బహిః ప్రాకారములోని సత్రమువారి సంఖ్య కొన్ని వేలుండును. అప్పుడప్పుడు కొందఱు రాజులు సన్యాసుల నందఱను సైనికులుగా మార్చుటయుఁ గలదు. ఆ బైరాగు లకు రాజ్యమే యన్నముఁ బెట్టును. వారందఱు మహానగర మున యథేచ్ఛముగాఁ దిరుగుచుందురు. వారు భిక్ష మెత్తు దురు. వారికి బిచ్చముఁ బెట్టుట తత్పౌరుల విధి. అది యొక మర్యాద. వాకిలికి వచ్చిన బైరాగినిఁ బొమ్మనరాదు. వారి కన్నము రాజుగారి సత్రములోనే పెట్టుదురు. వారికిఁ జిలుము మొదలైన యభ్యాసము లుండును. వానికి ద్రవ్యము కావల యును. అందుచేత బిచ్చ మెత్తుదురు. అంతః ప్రాకారము లోని శాక్తేయులు బిచ్చమెత్తరు. వారు రాచఠీవి నెఱపు దురు. వారు ధరించెడు దుస్తులే తళతళ లాడుచుండును. ఉదారాకృతులై పుష్టిగల శరీరము గలవారై కావి రంగు పట్టు బట్టలు శరీరములయందు భాసింపఁగా దీర్ఘములైన జటలు భుజములయం దుదరములయందు నల్లత్రాచులవలె వ్రేలా డఁగా వారు సర్వజనుల గౌరవమును చూఱఁగొనుచుం దురు. అచ్చటి శాక్తేయులును, పాషండులును, పెరసన్యాసు లను రానీయరు. వారిసంఖ్య పెరుగనీయరు. క్రొత్తగా నొక సన్యాసి వారిలోనికి వచ్చెననఁగా నా సన్యాసి మహామహి ముఁడని యర్థము. అచటి కాపాలికు లతని శక్తులకు లొంగి పోయిరని యర్థము! అట్టి సన్యాసి యొకఁడంతఃప్రాకారమున రాజభవనమునకు సమీపముననున్న సత్రములోనికి వచ్చెను.

రాజభవనమంతయు గుప్తమన్నది. అతని మహిమలనుఁగూర్చి వేయిమంది చెప్ప నారంభించిరి. అన్నిఁటికంటె నతఁడు ప్రస్తుతము రాజ్యము చేయుచున్న ప్రద్యోత వంశపు ప్రథమ సంపాలుఁడైన ప్రద్యోతుని గుఱించి నాఁటి మంత్రియైన మునికుని గుఱించి తత్పూర్వ ధరాపతియైన రిపుంజయుని గుఱించి రిపుంజయుని భార్యయైన మాహేశ్వరిని గుఱించి వందలు వేలు కథలు చెప్పఁగలఁడు. ఆ కథలన్నియు జరిగిన నూటముప్పది యేండ్లు మాత్రమే గడచెను. ఆ కథలు చాలమందికి తెలియును. ఆ కథలు గిరివ్రజపురమున విస్మరింపఁబడ లేదు. ఆ కథలలోని సూక్ష్మ సూక్ష్మాంశము లితఁడు చెప్పును. అతనికి రాజభవనములోనున్న ప్రతిమూలయు తెలియును. ఈవార్త వేదమరీచికి సందఁగా నామె యావోగిని తనవద్దకుఁ బిలిపించికొనెను. ఆ చావడిలో నా మూల నా వస్తువున్నదని యతఁడు చెప్పును. అంతఃపురములోఁ బదిగదు లున్నచో నేగదికి గవాక్షము కలదో నేగవాక్షము క్రిందగా త్రాఁడు వేసికొని యొక తాడిలోతున పర్వతము మీఁదికి పూర్వ మెవఁడో లంఘించెనో యతఁడు చెప్పును. అతఁడు చెప్పిన సర్వ ప్రదేశములు నతఁడు చెప్పినట్లే యున్నవి. అతఁడు వేదమరీచి క్రమముగా దినదినము సాయంకాలముల పిచ్చపాటి మాటాడుకొనుటకు తత్పూర్వకథాశ్రవణముచేత వినోదపడుటకు ప్రధానసాధన మైనాఁడు. అతనికి వేదమరీచియొక్క సర్వ వృత్తాంతముఁ దెలియును. అజాతశత్రుని సంగతి తెలియును. ఎప్పుడెప్పుడేమేమి జరిగినవో సర్వము నతఁడు చెప్పఁగలఁడు. వేదమరీచి యతనితో నేకాంతముగా నున్నప్పుడు

వేదమరీచి శిశునాగుల రహస్యమే యతఁడు నెల్లడించెను. అతనికిఁ గాశీనగర రాజ్యమున రాజభవనమున జరిగిన వార్తలు సూక్ష్మాంశములతో తెలియును. వేదమరీచి కతఁడు గురువై పోయెను. ఏపని చేయవలసినను వాఁడు చెప్పవలయును. చేయవలయును. అజాతశత్రువునకు వానియందు తొలుత నిరాదరణ, తరువాత నప్రత్యయము, తరువాతఁ గోపము, మఱియుఁ దరువాత వాని నేమిచేయుటకు వీలులేక వానినిఁ బరిహరించుటయు, నింకను దరువాత వేదమరీచితో వాఁడు దుష్టుఁడు మోసగాఁడు కితవుఁడు దుష్టశక్తులు గలవాఁడు వానివలన రాజ్యమున కపకారము జరుగును వానినిఁ బరిహరించుమని చెప్పుటయు నామె యంగీకరింపక పోవుటయు, క్రమక్రమముగాఁ దానెంత చెప్పినచో నంతచేయు వేదమరీచి వాఁడు చెప్పినది చేయుటయు, తాను రాజని సాగుచున్న యాజ్ఞా మర్యాదలు సన్నగిల్లుటయు వేదమరీచియే రాణి, తన నడుమ నామె నడుమ వివాహము జరిగిన యెనిమిదేండ్లకు పూర్వము తానెట్టి భృత్యుఁడో నేఁడు నట్టి భృత్యుఁడే యయినట్లు భాసించుటయు, మఱియు మాటాడినచోఁ దమ వివాహము వివాహము కాదని తనకు నామెకు సంబంధమే లేదని ప్రజల నిన్నాళ్లు తాము మోసగించితిమని యీ వార్త ప్రకృతి జనులకు సైన్యాధిపతులకు నామె విస్పష్టముచేయునో యన్న భయము కలిగించునంత నిరాదరణము తనయందు వేదమరీచి నెఱపుటయు జరిగెను. ఒక్క యీ సన్యాసి విషయమునఁ దక్క తక్కిన సర్వ విషయములయందుఁ దానే రాజు. తానే ప్రభువు. తన మాటకెదురు లేదు. తన యిష్టము

వచ్చినట్లుఁ జేయవచ్చును. కాని యీ యోగి తా ననుకొన్న దానికంటె వేఱైనది చెప్పినచోఁ దన మాట యేమియు సాగదు. సాహసించి తాను వానికి వ్యతిరేకముగాఁ బ్రవర్తించినచో వేదమరీచి స్వయముగా వచ్చి తాను చేసిన పనిని కాదని యింకొకరీతిగా చేయించును. ప్రజలు నుద్యోగులు నధికారులు సైనికులు సర్వజనులు వేదమరీచి చెప్పిన మాట యందే యధిక గౌరవము చూపింతురు. ఆమెకు భర్తయగుట చేతఁ దాను రాజుగాని తను నిజముగా రాజుకాఁడు. తా నొక పెద్ద రాజుయొక్క కొడుకు గూడ కాఁడు. భృతి కొఱకు కడుపు చేతిలో పట్టుకొని యిరువది యేండ్లక్రింద వచ్చిన వాఁడు. ఇచ్చట నాశ్రయము దొరికినది. తక్కినపుడు రాజుగానే యుండును. గడ్డు సమస్య వచ్చినపుడు యవసరమైన వ్యవహారము వచ్చినపుడు ముఖ్యమైన రాజకార్యము వచ్చినపుడు సర్వాధికారులు వేదమరీచి మాటకే వలకట్టుదురు. అది యీ యెనిమిదేండ్లనుండియు జరుగుచునే యున్నది. ఇప్పుడది కొంత సుంకు తేలినట్లు గనిపించెను. కాని సర్వరాజ్య వ్యవహారములు నా యోగి చెప్పినట్లు చేయవలసినదికూడ వేదమరీచి యజాతశత్రునితోఁ జెప్పియే చేయును. తనంతటఁ దాను జేసినచోఁ బోనిమ్ము. కొన్నిఁటినిఁ దనచేతఁ జేయించును. కాశీనగరమున వృద్ధరాజు చనిపోయెను. చంద్రమతీదేవి వేదమరీచిని వచ్చి చూచిపొమ్మని వార్త పెట్టెను. అజాతశత్రుఁడు వేదమరీచినిఁ బొమ్మనెను. అచ్చటి రాజ రహస్యములు తెలిసికొని రావచ్చునని యతని యూహ.

ఆ యోగి వేదమరీచి వెళ్ళుటకు వీలులే దనెను. వేదమరీచి వెళ్ళలేదు. తమ యిద్దఱి దాంపత్యము నిజమైనది కాదని కాశీనగరములోఁ దెలియునని యీ యోగి చెప్పెను. శిశు నాగుని భార్య వంకజాబిల్లి చండప్రచండురాలు. ఆమె మగధరాజ్యమును కైవసముఁ జేసికొనుటకుఁ బ్రయత్నించు చున్నదని తనకుఁ దెలిసిన వార్త యజాతశత్రుఁడు చెప్పెను. అట్టి దేమియు లేదని యోగి చెప్పెను. కాశీనగరములో రాజభవనమున జరిగిన సూక్ష్మ సూక్ష్మాంశములు తెలిసిన యోగికి నజాతశత్రునికి వచ్చిన వార్తలకంటె నెక్కువ తెలి యును. అజాతశత్రుఁ డొక్కదినమున వచ్చి వేదమరీచితో నిట్లనెను. శిశునాగుడును వాని భార్యయు మన దేశము మీఁదికి దండెత్తి వత్తురు. నాకు విస్పష్టముగాఁ దెలిసిన దనెను. యోగి పకాలున నవ్వెను. "కాశీనగర మెంత? వారి సైన్య మెంత? మగధసామ్రాజ్య మెంత? సామ్రాజ్య సేనయెంత? శిశునాగుఁడు దండెత్తి వచ్చుటయేమి? అజాత శత్రునకు మతిపోయినది. వృద్ధరాజు చనిపోఁగా బంధుత్వ మర్యాదగా వచ్చి చూచి పొమ్మన్న రాజవంశములోనుండి తమమీఁదికి దండయాత్ర వచ్చునా?" యని యోగి యనఁగా నతని మాటలలో సామంజస్య మెక్కువ భాసించెను. ఇట్లు గడచుచుండెను. అజాతశత్రునకు యోగికిని బద్ధవిరోధ మన్న ట్లుండెను. ఒకనా డజాతశత్రుఁడు వేదమరీచి లేనపుడు యోగి యొంటరిగా కొలువుసావడిలో కూర్చున్నపుడు పోయి యోగితో నేవో యడ్డదిడ్డాలాడి కోపముతో నౌచిత్యముకూడ పాటించక కత్తి దూసెను. ఆ యోగి యెచ్చటెనుండెలాగెనో

యొక ఖడ్గమును లాగికొని కూర్చున్నవాఁడు మోకరించి యొకవిలక్షణమైన యెదుపుతో నజాతశత్రుని చేతిలోని కత్తిని దూరముగా విసరెను. తక్కిన కాపాలికులు దృఢశరీరులు మల్లురవంటివారు. ఇతఁడు శవప్రాయుఁడు. అతని యొడలిలో నోపిక యున్నదియో లేదో యన్నట్లుండెను. వానికిఁ దెలిసిన యీ ఖడ్గవిద్యలలోని యొక మెలకువకు నజాతశత్రుఁడు తల్లక్రిందైపోయెను. వీఁడు వట్టి యోగికాఁడు. పూర్వ మితఁ డెవఁడో మహాయోద్ధ. రాజనీతి ధురంధరుఁడు. ఇరువది యేండ్లనుండి తాను మగధరాజ్యమున ప్రధాన రాజకీయ వ్యవహర్తయై సర్వరాజ్యముల యందలి వార్తలు సంగ్రహించినవాఁడు. ఎచ్చటెచ్చటి రాజనీతి విశారదులు, ఖడ్గ విద్యా నిపుణులు, తమ దేశములనుండి వెడలిపోయినవారు, పరస్థలములయందు నివసించుచున్నవారు, వారి యందఱి చరిత్రయు నజాతశత్రునకుఁ దెలియును. ఇతఁడు వారిలో నెవ్వఁడును గాఁడు. వీఁ డెవఁడు? వీని వయస్సెంత? ఇతఁడు రెండు మూఁడు వందలయేండ్లనుండి జీవించుచున్నాఁడేమో? తత్పూర్వపు కటారికాండ్రలో నొకఁడేమో! ఇన్నియేండ్లు బ్రదికిన వారు కలరు. అజాతశత్రుఁ డేమిసేయును? తలవంచికొని తన కత్తితీసికొని వెడలిపోయెను. ఆసంగతి యోగి వేదమరీచితో చెప్పునేమో యని యజాతశత్రుఁ డనుకొనెను. నాల్గు దినములు గడచినను వేదమరీచి తనతో నీ ప్రస్తావన సేయలేదు. ఆ యోగి చెప్పకేపన్నమాట. వాఁడంత గడుసరి. తానన్న చో నేమియు లెక్కచేయనివాఁడు. వీఁడు తనకును మగధరాజ్యమునకును సంబంధము లేకుండఁ జేయుటకు వచ్చినాఁడు. వేద

మరీచిని మోసము చేయుటకు వచ్చినాఁడు. ఆలోచించఁగా వీని శిశునాగుఁడు పంపించి యుండును. శిశునాగునకు వీఁ డెక్కడ లభించెను ? అజాతశత్రునకు కర్ణాకర్ణిగా లీలగా గాలి వార్తలు కొన్నివచ్చెను. కాశీనగర రాజకుటుంబమును పరాశరశాస్త్రియన్న యొక మంత్రవేత్త కొన్ని భూతప్రేత పిశాచ శక్తులనుండి రక్షించుచున్నాఁడన్నవార్త. వీఁడొక భూతము. వీఁడొక ప్రేతము. వీఁడొక పిశాచము. వీనిని రాకుండఁ బరాశరశాస్త్రి కాశీనగర రాజ్యము రక్షించెను. వీనికి శిశునాగున కేమిసంబంధము ? అజాతశత్రున కేమియు సంతు పట్ట లేదు. ఇట్లుండఁగాఁ గాశీనగరమునుండి వార్తలు వచ్చుచునే యుండెను. వృద్ధరాజు చనిపోయిన తరువాత శిశునాగునకుఁ బట్టాభిషేకము జరిగెను. శిశునాగుని కుమారుఁడు పదుమూఁడేండ్ల వాఁడట. వానికి యౌవరాజ్య పట్టాభిషేకము జరిగెను. దానికి దీనికిని రమ్మని గిరివ్రజపురమునకుఁ బిలుపులు వచ్చెను. సంద్రమతీదేవికి వేదమరీచిని చూడవలయునని చాల యున్నదట. వేదమరీచి తన చిన్నప్పుడు కాశీనగరముననే పెరిగిననట. ఆమెనుఁ జూడవలయునని వంకజాబిల్లి కెంతయో యున్నదట. ఆమె సామ్రాజ్యాధికారిణియే కావచ్చును. మేము పేదవారము కావచ్చును. బంధుత్వ మున్నదికదా ! వచ్చి చూచి పోవలయునని నిష్ఠురములతోడి వార్తయు వచ్చెను. అజాతశత్రువు వేదమరీచి నచ్చటికిఁ బొమ్మనును. యోగి వలదనును. నీవు సామ్రాజ్యాధిపత్యము కలదానవు. వారికి నిన్నుఁ జూడవలయునని యున్నచో వారే వత్తురు. నీవు వెళ్ళినచో వంద యేనుఁగులతో వేయి గుఱ్ఱాలతోఁ

బోవలయును. వారు వచ్చినచో పాతిక యేనుఁగులతో మూఁడు నాల్గు వందల గుఱ్ఱాలతో రావచ్చును. వారు వచ్చుట మీకు మర్యాదగాని మీరు వెళ్ళుట మీకు మర్యాద కాదనెను. అజాతశత్రునకింకొక సందేహము కలిగెను. ఈ యోగి వేదమరీచికేదో మందు పెట్టెనో, మంత్రోపదేశము చేసెనో, మైకము క్రమ్మించెనో వేదమరీచి మొగము చూచినచోఁ దొలుతటి కళ లేదు. తొలుతటి వివేకము లేదు. తొలుతటి యుత్సాహము లేదు. తొలుతటి సౌందర్యముకూడ భాసించుట లేదు. తాను నిస్సహాయుఁడుగా నున్నాఁడు.

ఇట్లుండఁగాఁ జంద్రమతీదేవియు వంకజాబిల్లియు శిశునాగుఁడు బయలుదేరి వేదమరీచిని చూచుటకు వచ్చుచున్నారని వార్తవచ్చెను. వారు నలుబది గజములతో నాల్గువందల గుఱ్ఱాలతో వేయిమంది భటులతో వచ్చిరి. దుర్గద్వారము తన యనుజ్ఞ లేకుండ తెఱువరాదని యజాతశత్రుని యాజ్ఞ. వారు ద్వారమువద్ద నెంతోసే పుండిరి. లోన నజాతశత్రునకు వేదమరీచికి పెద్ద వాగ్యుద్ధము జరిగెను. వేదమరీచి స్వయముగాఁ దాను దుర్గద్వారమువద్దకుపోయి తలుపులు తీయించి వారినిఁ దెచ్చెను.

౨౮

బంధువులవలె చూచి పోవుటకు వచ్చిన శిశునాగుని కుటుంబము పదునేను దినము లుండవచ్చును. నెలనాళ్ళుండ

వచ్చును. రెండు నెలలు గడచినవి. వారు వెళ్ళెడి జాడ కనిపించలేదు. దిన దినమొకొక్క చమత్కారము జరుగుచుండెను. ఎవఁడో మాగధుఁడైన యుద్యోగికి శిశునాగుని వెంట వచ్చిన యొకానొక పురుషునకు సన్నవాగ్వాదము జరుగును. మాగధుఁడు వీని నగౌరవ పఱచును. వేదమరీచి యొక్క యాజ్ఞచే నా మాగధుఁడు తొలఁగింపఁబడి వీఁడా యుద్యోగమునందుఁ బ్రవేశించును. రెండు నెలలలో గిరివ్రజపురమునందలి ప్రధానములైన దుర్గరక్షణకు ముఖ్యమైన యుద్యోగములన్నియు కాశీనగర సైనికులలో నెవ్వరికో యొకనికి వచ్చినట్లు కనిపించెను. అంతఃప్రాకారమున మాగధుల బలముకంటె శిశునాగుని సేనయొక్క బలము మిక్కిగాలినుండెను. అజాతశత్రుఁ డొకనాఁడు వేదమరీచితో నెంతయో ప్రయత్నముచేసి యేకాంతత్వము సంపాదించికొని యీ పరిస్థితి యంతయుఁ జెప్పెను. ఆమె యతనిమాటల నంగీకరించలేదు. వారంతగానున్నచో నింకొక రెండు నెల లుందురు. వారిదారిని వారు పోదురు. అంతఃప్రాకారముననున్న దుర్గమును వారు వశము చేసికొందు రందము. వారు బయటికి వెళ్ళవలదా? బహిఃప్రాకారముననున్న సర్వసేనలు మనవే. మాగధసైన్యము లక్ష యున్నది. వారేమి చేయఁగల రనెను. దిన దినమునకు నజాతశత్రునకుఁ గ్రొత్తక్రొత్త వార్తలు వచ్చుచుండెను. మాగధసైన్యాధిపతులలోఁ గొందఱకుఁ గొందఱకు పడుట లేదు. వారును వారునుఁ బోరాడుకొనుచుండిరి. నందివర్ధనుని మహారాజుగా విశ్వాసముతోఁ గొలిచిన పెద్దపెద్ద సేనాపతులు, మహామంత్రులు, సంహరింపఁబడుచుండిరి. ఒక్కొక్కప్పుడు

తులాయుద్ధములు, ఒక్కొక్కప్పుడు రహస్యముగా జరిగిన మరణములు. వేదమరీచి లోనుండి కదలదు. అజాతశత్రువు నగరమంతయు తిరిగెడివాఁడు. అతనికొక విషయము సంపూర్ణముగాఁ దెలిసెను. పూర్వము తాను నగరమునందు వెళ్లుచోఁ దనకు రాజమర్యాదలు జరుగుచుండెడివి. ఇప్పుడు జనమందఱు తూష్ణీంభావమును వహించినట్లు కనఁబడుచున్నారు. రహస్యచారులవలనఁ దనకుఁ దెలిసిన విషయమేమనగా వేదమరీచితనకు భార్యకాదనియుఁ బ్రజలను మోసగించుటకు నజాతశత్రు వీ నాటక మాడెననియు వారిద్దఱు భార్యాభర్తలే యైనచో నీపాటికే మగధరాజ్యమునకుఁ జక్రవర్తి కాఁదగిన సంతానము కలిగెడి దనియు నజాతశత్రుఁడు దుర్మార్గుఁడు, మోసకాఁడు, వేదమరీచిని తన చేతిలో పెట్టికొని యాడించుచున్నాఁడు మొదలైన వార్తలు ప్రతిదినము నజాతశత్రునకు వచ్చుచుండెను. ఇంతటి ప్రచార మెవరు చేయుచున్నారు? శిశునాగుని సేన వేయిమంది వచ్చెను. అతని యేనుఁగులే ద్వారరక్షణసేయుచుండెను. అతని గుఱ్ఱములే మహానగరమునందు సంచరించుచుండెను. మాగధసైన్యముయొక్క యధికారము మహానగరమునందు కనిపించుట లేదు. మాగధసైన్యమునందు సేనాపతులెవ్వరునుఁ బూర్వపువారు కారు. శిశునాగుఁడే రాజ్యము తనది యన్నచో నెవ్వఁడు నోరెత్తుటకు వీలులేదు. తిరుగుబాటన్నది జరుగదు. సైన్యాధిపతులు మాటాడరు. వచ్చి శిశునాగునిఁ జక్రవర్తిగా నంగీకరించి వేడికోళ్ళు పెట్టికొందురు. రెండు నెలలలో రాజ్యమంతయుఁ దాఱుమాఱై పోయెను. ఈ నీతియంతయు శిశునాగునిది కాదని యజాత

శత్రునకుఁ దెలిసెను. ఈనీతి యంతయు వంకజాబిల్లిది. మఱియు నజాతశత్రున కొకటి దెలిసెను. వంకజాబిల్లినిఁ జూచినచో నీ మాయాయోగికి భయము. వంకజాబిల్లి యొక్క ప్రతిభ సాగిననాఁడు మొదట మాయయోగి రాజ నగరమున నెచ్చటనో పేరు లేకుండ నివసించుచుండెను. ఒక ప్పుడు మాయయోగి తాను సత్రములోనికిఁ బోదునన్నట్లు వంకజాబిల్లి నివారించినట్లు వేదమరీచియు నేమియుచేయ లేనట్లు పరిచారకులనుండి యజాతశత్రువు దెలిసికొనెను. వంకజాబిల్లికి వేదమరీచిమీఁద నంత యధికార మెట్లువచ్చెను?

ఇంక నొకదినమున నజాతశత్రునకు మఱియొక వార్త దెలిసెను. అజాతశత్రువు తాను వేదమరీచిభర్తకాఁడని ప్రజలలోఁ దెలిసిపోవుటచేత వేదమరీచినిఁ దానేదో మాయోపాయమున సంహరించి రాజ్య మపహరింప నేదియో కుట్ర పన్నుచున్నాఁ డనియు, శిశునాగుఁడు దుర్గమునందుండుటచేత నతనికది సాధ్య మగుటలేదనియు, జనము చెప్పికొనుచున్నట్లుగా నతఁడు వినెను. ఈ విడ్డూరమేమి? తాను వేదమరీచిని సంహరించుట యేమి? శిశునాగుఁ డడ్డుపడుట యేమి? తన కర్థము కాలేదు. అజాత శత్రువు శిశునాగునివద్దకుఁ బోయెను. "ఏమయ్యా! నేను వేద మరీచినిఁజంపి రాజ్య మపహరింపఁ జూచుచున్నానా.? నీవు వేదమరీచి కాత్మబంధువవా? ఈవార్త నెవరు పుట్టించిరి? పదు మూఁడేండ్లనుండి నేను నీతో బలవద్విరోధము వహించి యున్నాను. ఆ విరోధము కొనసాగించుకొనవలసిన యక్కఱ నేఁడు వచ్చినది. ఈ యపనింద నీవు నామీఁద వేసినావు. కత్తితో సమాధానము చెప్పు"మనెను. శిశునాగుఁడు నివ్వెఱ

పోయెను. నే నట్టినింద. నారోపించ లేదన్న చోఁ బౌరుషహీన మైనమాట. మాటాడకుండ నూరకున్న చోఁ దా నట్లుచేసి నట్లంగీకరించుట. అవునో కాదో యితఁడు తనకు బలవచ్ఛత్రువు. అతనిమీఁద తనకు శతృత్వములేదు. తనమీఁద వాని కున్నది. వాఁ డెప్పుడో చెప్పెను. ఇప్పుడు చెప్పు చున్నాఁడు. వానితోఁ గత్తియుద్ధము చేయవలయును. శిశు నాగుఁ డిట్లనెను. "చివరకు నీవును నేనును మిగిలితిమి. నీవు వేదమరీచికి భర్తవుకావు. నీవు లోకమునుఁ బ్రతారించు చున్నావు. నీవన్న హేతువుచేత కానిచో నీయందలి యీ దోషముచేత శిక్షార్హుఁడ వగుచున్నావు. నిన్ను సంహరింతును." అనెను. అజాతశత్రు విట్లనెను. "ఓయీ! నీవు మహా పాపివి. కలిపురుషుఁడు నీయందుఁ బ్రవేశించినాఁడు, నిన్ను వధించి యీ కలిదోషమును నివారింతును." ఇద్దఱు నొకరి నొకరు దూషించికొని యుద్ధమునకు సిద్ధపడిరి. అప్పుడచ్చటికి వంకజాబిల్లి వచ్చెను. ఆమె యిట్లనెను. "మీరిద్దఱు రాచ సావడిలో యుద్ధమాడుదురా? తులాయుద్ధము చేయుటకుఁ దగిన గరిడీ ప్రదేశము లున్నవి. చేసినచో నచ్చట చేయ వలయును. దుర్గాంతః ప్రాకారము నంటికొని పట్టణము లోనికిఁ బ్రవేశించుటకు వీలైనచోట నా గరిడీ స్థలమున్నది. రేపు రాతిరికి మీ రిద్దఱు యుద్ధమాడ వచ్చును. తులాయుద్ధ మునందు మధ్యవర్తు లుండవలయును. ఆ మధ్యవర్తి ఖడ్గ విద్యా నిపుణుఁడై యుండవలయును. వేదమరీచి గురువైన యోగి గొప్ప ఖడ్గవిద్యానిపుణుఁడు. నాకుఁ దెలియును. అతనిని మధ్యవర్తిగా నుంచుదును. రేపురాత్రికి మీరు యుద్ధము

చేయుదురు." అని వంకజాబిల్లి వెడలిపోయెను. శిశునాగుఁ డామెవంక నివ్వెఱపోయి చూచుచుండెను. అజాతశత్రుఁడు వంకజాబిల్లిని సంహరించవలయు ననుకొనెను. ఆమె యాటదియై పోయెను. కాదని యతఁడామె మీఁదికి కత్తిదూసి పోయినచో శిశునాగుఁ డడ్డమువచ్చెను. తా నేరాజవంశము యొక్క యుప్పు తిని తన శరీరమునుఁ బోషించుకొనెనో యా రాజవంశముయొక్క రాజధానియైన నగరములో రాజకుటుంబము నివసించు నిండ్లలో రాజులు సుఖించిన సావడులలో వారి పవిత్రాత్మలు విహరించుచున్న స్థలములోఁ దానొక యాటదానిమీఁద కత్తి దూసిపోవుటయు, మఱి యొకనితో నచటఁ గత్తి యుద్ధమాడుటయునా — అజాతశత్రువు వెడలి పోయెను. అతఁడు తన రాజభవనమునకుఁ బోయెను. ఇన్నాళ్లు నతఁడే రాజు. ఈనాఁడు కాదన్నట్లు తోఁచెను. ఒకరో యిద్దఱో సేవకులుండిరి. తక్కిన వారెవ్వరు లేరు. అచటనున్న యిద్దఱునుఁ గ్రొత్తవారు. వారు తాను చెప్పిన పనులు చేయుట లేదు. తన్ను బయటకు పోనిచ్చుట లేదు. రాణిగారి యాజ్ఞ లేదనుచున్నారు. రాణి యెవరు? వేదమరీచియా? వారినడిగెను. ఎవరురా రాణి? వేదమరీచియేనా? వారు సమాధానము చెప్పలేదు. కత్తిదూసి వారిని వధించుటకుఁ బోయెను. వారు పాఱిపోయిరి. కొంచెము సేపటిలో వంద మంది సైనికులు వచ్చిరి. ఆ సేనాధిపతి యిట్లనెను. "అయ్యా! రేపురాత్రి మీరు కత్తి యుద్ధము చేయవలసినవారు. అంత వఱకు మిమ్మిచ్చటనుండి కదలనీయవద్దని మా రాణిగారి యాజ్ఞ. మా రాణిగారెవరో మీకు తెలియవలయునా? ఆమె

పేరు వంకజాబిల్లి. మీ మీఁద పెద్ద యభియోగము కలదు. మీరు వేదమరీచిని సంహరించితిరి. మీకు నిజముగా శిరశ్ఛేదము చేయవలయును. రేపు మీరు శిశునాగునితో యుద్ధము చేయుదురు. మీరు గెలిచితిరేని రాజ్యము మీది. వేదమరీచిని సంహరించిన మీకు రాజ్యము వచ్చుట న్యాయ్యము కాదు. న్యాయ్యమని యున్నచో శిశునాగుఁడే మిమ్ము సంహరించును. మీకుఁ దగిన శిక్ష జరుగును. అనవసరముగా సేవకులనుఁ జంపఁబోకుడు. మిమ్ము మర్యాదగాఁ జూచుచున్నాము. మఱల నిట్టి వార్త వచ్చినచో మిమ్ముఁ జెఱసాలలో నుంచఁబడిన వానివలెఁ జూడవలసి వచ్చును.”

అనఁగా నజాతశత్రువునకుఁ బ్రాణములు పైపైఁ బోయెను. అతనికిఁ దెలిసెను. వేదమరీచినిఁ జంపివేసిరి. ఆ చంపినవాఁడు తానని యప్రతిష్ఠ పుట్టించిరి. ఈ కల్పన విచిత్రముగా నున్నది. తా నెంతటి నిస్సహాయుఁ డై పోయినాఁడు. అయ్యో! వేదమరీచీ! నిన్ను గుఱించి యేమనుకొనుటకును నాకుఁ వీలు లేదు. నీవు నా భార్యవు కావు. నా రాణివి. నీ పెంద్రిడి యందలి గౌరవముచేత నీ రాజ్యము రక్షించుచు ననుకొన్నాను. ఛీ ఛీ! ఈ మగధ దేశమునందలి ప్రజలు ప్రజలు కారు. వీరు మనుష్యులు కారు. పశువులు. రాజద్రోహులు. కృతఘ్నులు. ఈ రాజ్యమున కిట్టి కావలయును.

మరునాఁడు రాత్రి కత్తియుద్ధము జరుగు వేళవఱకు రెండు దినములు నొక్క రాత్రియు సాహసమును నిద్రయు లేని యజాతశత్రువు తాను చెప్పికొట్టి వీరవేషమును వేసికొని కత్తిఁ బుచ్చుకొని తన వెంట నిద్దఱు రక్షకభటులు వచ్చుచుండఁగా

గరిడీశాలవద్దకుఁ బోయెను. అచట శిశునాగుఁడు యుద్ధము నకు సిద్ధముగా నున్నాఁడు. యోగి ఖడ్గమును చేతబూని నిలుచుండి యున్నాఁడు. వంకజాబిల్లి గరిడీప్రదేశమున యొక్క యంచున నిలుచున్నది. ఆమె ప్రక్కన నొక కుక్కయున్నది. ఆ కుక్కయొక్క మొగము మహాభయంకరముగా నున్నది. ఆకుక్క యోగివంకనే చూచుచున్నది. దానిమెడ గొలుసు దున్సినచో యోగిమీఁదఁబడి వాని గొంతునెత్తురు పీల్చు నన్నట్లున్నది. అజాతశత్రువు వేఁతేమాట లేదు. వెంటనే శిశు నాగునిమీఁదకు దూకెను. ఇద్దఱును కత్తియుద్ధ మారంభిం చిరి. అజాతశత్రువు నిత్యఖడ్గ విద్యాభ్యాసము చేసెను. కొడుకునకు నేర్పుచున్న శిశునాగుఁడుకూడ నభ్యాసమున కొఱవడి యుండలేదు. వా రిద్దఱొకరి నొకరు సాధించికొన వలయునని బిట్టుప్రయత్నము చేయుచుండిరి. శిశునాగున కీయుద్ధ మెందులకు జరుగుచున్నదో తెలియదు. అజాతశత్రుని యొక్క మనస్సు పట్టరానంత కోపాగ్నిచేత దందహ్యమాన ముగా నున్నది. అతనికిఁ బ్రతుకవలయునన్న యాశ లేదు. బ్రతికి ప్రయోజనము లేదని తెలియును. ఒకవేళ శిశునాగునిఁ దాను సంహరించినను వెంటనే కత్తిపెట్టి పొడిచికొని చచ్చిపో వలయునని వచ్చెను ఆపని నిన్ననే చేసెడివాఁడు. వందమంది సైనికులువచ్చి సేనాపతి తనతో నట్లుమాటాడినపుడు వా రందఱను తన కత్తి వాదరకు బలులు పెట్టెడివాఁడు. ఆ నంద మంది తనముందు నిలువలేరు. నేఁటి యీ కత్తి యుద్ధము కొఱకు నిన్నఁ దా నట్లు చేయ లేదు. అంతటి యజాతశత్రుని ముందు నెంతటివాఁడైనను శిశునాగుఁడు నిలువలేఁడు. శిశు

నాగుఁడు దెబ్బలుతినుచునే యుండెను. శిశునాగుని యొడల నెత్తురు స్రవించుచునే యుండెను. రెన్నాళ్ళ యుపవాసము చేత నజాతశత్రుఁడు కుబుసము విడిచిన త్రాచువలెనుండెను. మఱి యొకగడియఁకూడ శిశునాగుఁడు నిలువలేఁడు. వంక జాబిల్లి యిద్దఱి నాగుఁడనెను. ఇద్దఱు నాగలేదు. ఆమె పోయి నడుమ నిలుచుంద మనుకొనెను. అజాతశత్రుఁడు తన్ను సంహరించునని తనకుఁ దెలియును. అందుచేతఁ దాను నడిమికి పోరాదు. ఆమె మఱల నిట్లఱచెను. "ఓయీ! అజాతశత్రూ! ఈ శిశునాగునితో నీకేమి విరోధము? చెప్పి మఱల కత్తిని విసరు" మనెను. ఆ కేకకు నజాతశత్రుఁడు నిలచిపోయెను. అతఁ డిట్లనెను. "ఇతఁడు వేదమరీచిని చిన్నప్పుడు మోసము చేసెను. ఆమె జీవితమును నాశనము చేసెను. అది విరోధమునకు మూలకారణము. రెండవదియు మిక్కిలి ముఖ్యమైనదియు నేమనఁగా నేను వేదమరీచిని సంహరించి యీరాజ్యము నపహరింప నెంచుచున్నానని వదంతి పుట్టించి రాజువలెనున్న నన్ను యీకోటలో భృత్యునికంటె కనాకష్టముగాఁ జేసినాఁడు. అది ప్రస్తుతకారణము. ఇంక రావయ్యా శిశునాగా!" అనఁగా వంకజాబిల్లి "ఓయి పిచ్చివాఁడా! నీ వేది ముఖ్యకారణ మనుచున్నావో అది చేసినది నేను. నాకు ఖడ్గవిద్య రాదు. నా పక్షమున నీయోగి నీతో యుద్ధమాడును" అనుటయేమి, శిశునాగుఁడు తొలఁగుటయేమి, యోగి కత్తి పుచ్చుకొని బరిమీఁది కురుకుటయేమి, యా యోగిముందు తాను నిలువలేనన్న విషయ మజాతశత్రుని మనస్సులో మెఱుపువలె మెఱయుటయేమి, యోగి వచ్చుచునే కొట్టిన

కత్తిదెబ్బను తా నొడ్డుకొనుటకు తనకుఁ బ్రాణములు కడఁబట్టినంత పని జరుగుటయేమి, యొక్కసారి యయ్యెను. ఆ యోగి యజాతశత్రునితోఁ లీలగా యుద్ధమాడుచుండెను. ఏ లిప్తలో నైనను తా నజాతశత్రుని సంహరింపఁ గలఁడు. అజాతశత్రునియొక్క యాయుస్సును వాఁడు లిప్తలిప్తగాఁ బొడిగించుచు వచ్చెను. అజాతశత్రున కొక్కయూహ తోఁచెను. వాఁడు తన్ను సంహరింపక పూర్వము వంకజాబిల్లిని సంహరింప వలయునని. వానిని తప్పించుకొనుట మిక్కిలి కష్టము. తన కీయూహ కలిగినదని వానికిఁ దెలియక మున్నే యాపని చేయవలయును. ఎంతసేపటికి తనకు వాని దెబ్బలు తట్టుకొనుటయే కష్టసాధ్యముగా నున్నది. వీఁడు శవమా వీని శరీరములో నింతటి శక్తి యెక్కడిది? వీఁడేదో పిశాచము. ఇదంతయు నా పిశాచశక్తి. ఒక దెబ్బ తాను తప్పించుకొనెను. అపుడు యోగి కత్తి నేల వ్రాలెను. అజాతశత్రువు వంకజాబిల్లిమీఁది కొక్క లంఘనము చేసెను. చేసినంతలో నతఁ డాశ్చర్యపోయెను. తన కత్తి దెబ్బకు వంకజాబిల్లి తన చేతిలో నింతసేపు కనిపింపని ఖడ్గముతో నాదెబ్బ నొడ్డుకొనెను. "ఓయీ! నాకు తెలియును. నీవు శిశునాగునితో యుద్ధము చేయుచుండి నామీఁదికి రావు. యోగితోఁ జేయుచున్నప్పుడు వానిని నీవేమియుఁ జేయలేవు. ఆ కోపము మఱియొకనిమీఁదికి మళ్ళును. ఆ మఱలుట నామీఁదకాక మఱి యెవరిమీఁద మఱలును" అనుచు నామె యజాతశత్రుని కత్తి దెబ్బల నొడ్డుకొనుచుండెను. ఇంతలో యోగి వచ్చి యజాతశత్రుని సంహరించెను.

# ౨౮

మఱునాఁడు గిరివ్రజపురమంతయు నట్టుడికినట్లుడికిపోవుచుండెను. ఎవరినోట వినినను "అజాతశత్రుఁ డింతదుర్మార్గుఁడా? వానికిఁ దగిన శిక్ష జరిగెను. వేదమరీచిని చంపి తాను రాజ్యమపహరించెను. ఎంత నాటక మాడినాఁడు? లేనిచోఁ దినుటకు తిండిలేని యాగమ్మకాకిని వీనిని వేదమరీచి పెండ్లియాడునా? ఆమెను మోసము చేసినాఁడు. మన మదృష్టవంతులము గనుక వేళకు శిశునాగుఁ డిచ్చట నున్నాఁడు. లేనిచో నతఁడే రాజయ్యెడివాఁడు. ఆకాసి - పోకాసి వాఁడు వానికిని మన రాజ్యమున కేమి సంబంధము?" అన్నమాటలే సర్వత్ర వినిపించుచుండెను. వేదమరీచియొక్క శవము పట్టపు గజముమీఁద పూవులతో రత్నాలంకారములతో మేళతాళములతో ఊరేగింపఁబడుచుండెను. అజాతశత్రుని శవము దాని వెనుకనే వచ్చుచుండెను. ఎఱ్ఱని పూవులు గుడ్డలు పొడిచేసిన బొగ్గుతో గీయఁబడిన గీతలుగల యొక శకటముమీఁద నతని శవము వచ్చుచుండెను. గాయములకు వేసికొనిన పట్టీలతో శిశునాగుఁడు పట్టపు గుఱ్ఱముమీఁద వచ్చుచుండెను. కత్తులు కటారులు పూని ముందు నాల్గువందలమంది సైన్యము నడచుచుండిరి. వెనుక నాల్గువందలమంది నడచుచుండిరి. పవలంతయు నీ యూరేగింపు సాగుచునేయుండెను. సాగినంత మేర వేదమరీచికి జోహారులు నజాతశత్రువునకు శాపములు

శిశునాగ మహారాజునకు జయ, మగధసామ్రాజ్య రక్షకునకు జయ, భావి మగధసామ్రాజ్య చక్రవర్తికి జయ! యన్న నినాదములతో నూరేగింపు సాగెను. ప్రొద్దుక్రుంకు నప్పటికి ప్రజలయొక్క హృదయాంతరాళములయందు తమ చక్రవర్తి శిశునాగుఁడన్న ముద్ర వేయఁబడెను. అది తొలఁగింపరాకుండ నుండెను.

ప్రొద్దు క్రుంకెను. చీఁకట్లు వచ్చెను. మహానగర మెంతయు విషాద భావముచేత దానితోఁ గలిసియున్న సంతోషభావముచేత సగమటు సగమిటుగా నుండెను. రాత్రి ప్రొద్దుపోయినది. వంకజాబిల్లియొక్క యాజ్ఞచేత నంతః ప్రాకార ద్వారమును బహిః ప్రాకార ద్వారమును తెఱవఁబడి యుండెను. అచట ద్వార రక్షకులకు నాజ్ఞ యీయఁబడెను. యోగి వచ్చినచో నతనినిఁ బోనీయవల యును. తరువాత నొక వేటకుక్క వచ్చును, దానినిఁ బోనీయ వలయును. ఆ తరువాత రెండు ద్వారములును బంధింపఁబడ వలయును.

రాత్రి రెండు జాములు దాటెను. సర్వజనులు నిద్రించు చున్నారని చెప్పుటకు వీలులేదు. ఆ రాత్రిపూట నా మహా నగరమున నిద్రించినవారెవ్వరు? వంకజాబిల్లి యోగివద్దకు వెళ్లెను. యోగి వంకజాబిల్లిని చూచి లేచి నిలుచుండి "ఏమి చేయుమందు"వనెను. వంకజాబిల్లి మెడ గొలుసుచేత పుచ్చి కొన్న కుక్కతోడనే వెళ్ళెను. యోగికి దూరముగా నిలు చుండెను. యోగి మఱల నిట్లనెను. "అబ్బో! నీ వెంతటి దానవు? అజాతశత్రుఁడు నీపై కుతుకుతునని తెలిసినదానవు.

నా వద్దకు కుక్క లేకుండ వత్తువా? నేను కొంతదూరము పోయిన తరువాత కుక్కను వదలిపెట్టుము. అన్ని ద్వారములు తెఱచియుంచితి ననుకొందును. నేను నడచి పోవలయును. నేను దుర్గబహిర్ద్వారము దాటిపోయితి నన్నప్పటి వేళకు కుక్కను వదలిపెట్టుము. తొందరపడి వదలిపెట్టకుము. నే నెచ్చట నున్నను శ్వానము రాఁగలదు. అది వాసననుఁ బట్టి గదా వచ్చును!" అనఁగా వంకజాబిల్లి యిట్లనెను. "ఓయీ! నీవిట్టి భ్రాంతిలో పడెదవని నాకుఁ దెలియును. నీవు జయద్రథుఁడవు. ఈ శరీరమునకు నీకును సంబంధములేదు. ఈ శరీర మెవనిదో తుచ్ఛుఁడైనవానిది. ఈ కుక్కకు వాని శరీరము వాసనగాని నీ వాసన దానికి తెలియదు. నీవు కోటయొక్క బహిర్ద్వారము దాటిపోయిన తరువాతనే కుక్కను వదలిబెట్టెదను. నీవొక్క పని చేయవలయును. వీఁడు మిగులరాదు. కుక్క మిగులరాదు. నీ వెట్లు చేయుదువు?" అనఁగా జయద్రథుఁడు కుక్క పీని కంఠమునందలి నెత్తురు పీల్చుచుండఁగా నేను దానిని కత్తితో పొడిచి చంపెద ననెను. వంకజాబిల్లి యిట్లనెను. పొరపడకుము. ఇది క్లిష్టమైన కార్యము. నీ యాత్మను నీవు వేఁడే తీసికొనిపొమ్ము. ఇంక నీవు మఱలజన్మ నెత్తవు. ఎత్తెడు వాంఛను విసర్జించుము. చనిపోయెడు వేళ నీ కాయూహ స్థిరముగా నున్నచో నీవు మఱల జన్మింపవు. స్థిరము చేసికొనిపొమ్ము. ఈ కుక్క నిస్సంశయముగా చావవలయును. జ్ఞాపక ముంచికొమ్ము. దీని మాంసము తినెడి కాకులు గ్రద్దలు రామబంధువులు నెట్టివగునో తెలియదు. దానిని మన మాపలేము. నెళ్ళుము." అనఁగా యోగి తాను

బయలుదేరి కోట బహిర్ద్వారము దాటి పోవుచుండెను. వెనుకనుండి ప్రళయకాలకుపిత శంకరాపరావతార కాలభైరవ కంఠ విగళిత కహకహారావ బంధురిత మంథర విచిత్ర భౌ భౌ మహారావములు వానికి వినిపింపఁజొచ్చెను. తన్మహారావముల చేత వాయువీధులు తల్లడిల్లి పోవుచుండెను. ఆకాశము దద్దరిల్లి పోవుచుండెను. వృక్షపత్రముల సందులలోనున్న యాకాశ మునకు మిక్కిలి నిరకటమయ్యెను. అంధకార బంధురిత వియన్మధ్యమున చెదురుగాఁ దిరుగుచున్న తీతువుల కూతలకు తద్విశ్వకద్రూ భౌ భౌ మహారావములు పౌనఃపున్యము లయ్యెను. దివాంధముల కూతలకు నా భౌ భౌ మహారావము లామ్రేడితము లయ్యెను. అవి కొండలు. ఆ కొండలు తన్మహా ధ్వానములకు ప్రతిధ్వానము లిచ్చుచుండెను. ఆ యోగి గిరివ్రజపుర పర్వతములలో సందు గొందులందుఁ దప్పించు కొనుటకుఁ బ్రయత్నించుచుండెను. అతఁడు దారినఁ బడిపో యినచో కుక్క వానిని నిముసములో సంహరించియుండును. అతఁ డెంత మెలికలు తిరిగినను కుక్క వానినిఁ బట్టికొననే పట్టికొనెను. ఆ కుక్క నోటినుండి రెండు ధ్వను లొక్క పెట్టుగా వచ్చెను. ఒకటి యది నెత్తురు పీల్చుచున్న ధ్వనియు, రెండవది డొక్కలో నెవఁడో పొడువఁగా నోటివెంట వచ్చిన మరణబాధా సూచక ప్రథమకంఠరావమును.



నాలుగవ నవల "నందోరాజా భవిష్యతి"



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B151 |
| పుస్తకం పేరు | ఘుంఘురూ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 343 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI |
| లేని పేజీలు | 1 TO 4 |
| తయారు చేసినది | Prathyusha |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూపినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |